జ్యేష్ఠ 'కాపాలి' సహిత

సాహిత్య కృషీవలురైన

"సోదర వంశానికి"

సమర్పితము.

# Gandhiji Adugu Jadallo

( In the Path of Mahatma Gandhi )

By
George Catlin

Translated By
K. Laxmana Swamy

KALAHASTI THAMMA RAO & SONS,
Samskritandhra Book - Depot ( Estd. 1882 )
RAJAHMUNDRY. (*Andhra - India*)



విశ్వకవి రవీంద్రుడు, విశ్వజనీనుడు గాంధీజీ.

ముంచుతట్టు—కలకత్తా కల్లోలం మధ్య గాంధీజీ.

# గాంధీజీ అడుగు జాడల్లో



కృతి

డాక్టర్ జార్జి కాట్లిన్

అనుకృతి

శ్రీ కాళహస్తి లక్ష్మణస్వామి

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్రబుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి

సర్వ స్వామ్యములు
ప్రకాశకులవి
ద్వితీయ సంస్కరణ
ముద్రణ
రాజేశ్వరి ప్రెస్
బైండింగ్
రాజేశ్వరి బైండింగ్ వర్క్సు
ముఖచిత్రం : : :
శ్రీ పార్వతీశం
ఖరీదు
పది రూపాయలు

# అవతారిక

ఆంధ్రభాషలో ఇటువంటి జీవితచరిత్ర లేదు. విషయం— మహాత్మా గాంధీ ప్రవృత్తి. లక్ష్యం—అహింసాత్మక మహా మానవతా స్థాపనము. రచయిత జార్జి కాట్లిన్ సోషలిష్టు, అంతే కాక జిజ్ఞాసువు కావడంవల్ల గ్రంథబాహుళ్యంలో ఉదాత్తయోచన కనబడుతుంది. ఈ గ్రంథం వినోదంకోసం వ్రాసింది కాదు.

హిట్లర్ స్టాలిన్‌లవల్ల రక్తపాతంతో తడిసిపోయిన పాశ్చాత్యలోకం విడిచి, అహింసాత్మక లోకశ్రేయోవిధానం గ్రహించవలెనని తీవ్రతపనతో గ్రంథకర్త భారతదేశం పర్యటన చేసి, క్షేత్రాలు దర్శించి, మేధావులను చూచి, విజ్ఞానకేంద్రాలలో వివిధ విషయాలు గ్రహించి భారతీయాత్మగా వెలుగుతున్న బాపూజీని సమీపించినాడు. గ్రంథంలో నగంవరకూ భారతీయ సంస్కృతీవైభవం స్థాలీపులాకంగా కనబడుతుంది. భారతీయ సంస్కృతి యెడ కాట్లిన్‌గారి సానుభూతి అపారం.

సామాన్య జీవితచరిత్రలవలె కాక ఈ గ్రంథం ఆధ్యాత్మిక రాజకీయ మానవీయ వ్యక్తిత్వ పరామర్శ, మానవోపయోగం కోసం నిశితంగా సుందరంగా రచనచేసి గ్రంథకర్త కృతకృత్యుడైనాడు. ఆయన దృష్టిలో మహాత్ముడు ఏసుక్రీస్తు! ఆయన పూలదారిలో నడవలేదు. కంటకవికీర్ణ మార్గాల నడచినాడు. బాధలు వరించినాడు. తపస్సుచేసి అహింసావ్రతం అనుష్ఠించినాడు. ధర్మం, సత్యం, అహింస త్యాగంకోసం జీవితాలు అంకితంచేసి అర్పించేవాళ్ళు తక్కువ. వారి చరిత్రలే లోకానికి కావాలి. వారు చూపిన వెలుగుదారులే మనకు శాశ్వతాలు.

లక్ష్మణస్వామి ఇటువంటి ఉదాత్త రమణీయ గ్రంథాలే అధికంగా వ్రాయవలె నని ఆశీర్వదిస్తున్నాను. లలితకళలకూ, తత్త్వశాస్త్ర విషయాలకూ సంబంధించిన ఘట్టాలలో అనువాదకుడు నాతో గోష్ఠి చేసిన తదుపరి రచన సాగించినాడు. ఈః వర్ధిష్ణువు యోచనావిలసితాలయిన గ్రంథాలే విరివిగా ఇట్లా అనువదించినా సంతోషమే. గ్రంథం స్వతంత్ర రచనవలెనే సాగించినందుకు భావానువాదకుని మెచ్చుకొనవలెను.

సాహితీ సమితి
25 మార్చి 1952

తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు.



# కృతజ్ఞత

కోరినదే తడవుగా వ్యాకృతికి అనుమతిచ్చిన ప్రొఫెసర్ జార్జి కాట్లిన్‌కు కృతజ్ఞతాభివందనాలు. ఈ సందర్భంలో సమాచార సేకరణలో సాయపడిన ఇండియాలో బ్రిటీష్ ఇన్‌ఫర్‌మేషన్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జె. టి. మఘేస్‌కు; శ్రద్ధతీసుకొన్న హైకమీషనర్ సర్ ఆర్చిబాల్డు నైకూ, అనువాద ఏర్పాట్లలో తోడ్పడిన కర్టిస్ బ్రౌన్ లిమిటెడ్—అంతర్జాతీయ ప్రచురణ సంస్థ, దాని డైరెక్టర్ శ్రీబెట్టీ ఫెర్గుసన్‌కూ నా హృదయపూర్వక నమస్కృతులు.

ఆనక అనువాదంలో అన్నివిధాల ఆసట-బాసటగా నిలిచి అవతారిక సహితం అందచేసిన మాన్యశ్రీ కృత్తివాసులవారికి కృతజ్ఞుణ్ణి. పోతే ఈ గ్రంథంమీద తమతమ అభిప్రాయాలూ అభిభవాలూ (వేరుకరపత్ర రూపంలో అచ్చవుతోంది) వ్రాసి ఇచ్చిన దేశీయ ప్రముఖలకు, పత్రికలకు ఏటికోళ్లు.

గ్రంథం చివర అవ్యవధి కారణంగా అనుక్రమణిక ఈ సంస్కరణలో చేర్చజాలనందుకు చింతిస్తున్నాను. వచ్చే ముద్రణలో తప్పక జతపరుస్తాను.

ఇక గ్రంథ మూల్యం మదించే బాధ్యత యావత్తు పఠిత లోకానికి మిగిలిచాను.

జై హింద్
అనుకృతికారుడు

# నివేదన

మనకు సంబంధించిన మహాసమస్యా సమాధానం అన్వేషించే నిమిత్తం ఈ గ్రంథరచన సాగింది. ఈ కాలంలో మానవుడు ఏ ధర్మం ఆచరించి జీవయాత్ర గడపాలి? ఈ గ్రంథం స్వీయ చరిత్ర యాత్రికుని దినచర్య, లేదా భారతదేశంలో నేను చేసిన అన్వేషణ అవుతుంది. విశాల దేశకాల భావాలలో ఒక యాత్రికుడు గాంధీ మహాత్ముణ్ణి దర్శించి, తన అన్వేషణకు ఆ మహాత్ముడు ఏలాటి సమాధానం చెబుతాడో ఈ గ్రంథం విలువ కడుతుంది. అందుచేత ఇది తప్పనిసరిగా కొంతవరకూ బాపూజీ జీవిత సింహావలోకనం అవుతుంది.

తత్త్వశాస్త్రం రెండురకాలు. ఒకటి మానవతా సంబంధం లేని తార్కిక శాస్త్రజ్ఞాన సమన్వయం. రెండోది మానవతా సంబంధమైన తత్త్వజీవిత సమన్వయం. ఇలాటి కళామయ జీవితం ఎలిజబెత్తురాణి కాలానికి పూర్వాపరభాగాల్లో ఆంగ్లేయుడు గడిపేవాడు. ప్రస్తుతం అతడు వైజ్ఞానిక జీవితం గడపడం మానివేశాడు. ఈ గ్రంథం జీవితానికీ తత్త్వానికీ ముడిపెడుతుంది.

మానవునికి జగత్తునుగురించీ తననుగురించీ కొంచెం తెలుసును. మానవుడు ధీరుడై యోచన చేయవచ్చును. అప్పు డతనికి తన జీవితంలో ప్రముఖమైనది ఇతరులకు కూడా మానవోత్సాహం కలిగించవచ్చును. తాను తాత్త్వికు డవుతూంటే అతని అనుభవంకూడా తాత్త్విక మవుతుంది. తన జీవితాన్ని 'ఫాస్టు' మహాకావ్యంగా రచనచేసిన 'గేటే' జర్మన్

కవీశ్వరునివలె, తిరిగి రచన చేయాలి. అందుకే తత్త్వశాస్త్రాల్లో కల్లా గేటే కవీంద్రుని 'ఫాస్టు' ఉదాత్తరమణీయ తత్త్వమై వెలసింది. ఈ విషయం థామస్‌మాన్ తిరిగి మనకు జ్ఞాపకం చేసినాడు. విశ్వజనీనమైన ఫాస్టు మహాకావ్యంలో బహుశా కొంతభాగం మానవుని అన్వేషణ. ఏ స్వీయచరిత్ర అయినా కొంతవరకూ అహంకారంనుంచి ముక్తమవుతుంది.

1892 లో ఆంద్రూగైడ్ తన జర్నల్సులో, కళోపాసి "గతజీవితాన్ని వివరించడం కన్న, ఎలా వివరిస్తాడో అలాగే జీవించి తీరాలి" అని రాశాడు. మహాత్ముని జీవన చరిత్రలో ప్రధానమైనదీ విశ్వజనీనమైనదీ 'సత్యసాధన' అదే ఆయన గ్రంధనామం.

నేటి ప్రపంచంలో నాకు మోహనదాస్ కరంచంద్ గాంధీ జీవితమే అతిముఖ్యమైంది. గాయకుడయిన ఆల్బర్టు స్క్వైట్జర్, జపాను ప్రవక్త టొయోహిటో కగావాల జీవితాలూ కొంత వరకు ప్రసిద్ధాలు. హిట్లర్ స్టాలిన్ జీవితాలు నవ్యపంథాలో నడిచినవి. నా గ్రంథం లోకానికి అర్పించేందుకు కారణం: నేను పొందిన అనుభవం అన్యులుకూడా బహుశా పొందుతారనే ఆశ!

కొంతకాలానికి ఈ తాత్త్విక స్వీయచరిత్ర సమగ్రంగా రచన చేయాలని నా కోరిక. ప్రస్తుతం అవకాశాలను బట్టి లోకోత్తర మహర్షి దర్శనార్థం యాత్రికుడనై స్వయంగా చూచిందీ గ్రహించిందీ ఈ గ్రంధరూపంగా వెలువరించాను.

కృతికారుడు

# నమస్సులు

భారత కేంద్రప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృత్‌కౌర్, నవచైనా నాన్‌కింగ్‌లో సుప్రసిద్ధుడైన భారత రాయబారి సర్దార్ కె. యమ్. ఫణిక్కర్‌కూ, నా రాత ప్రతిని శ్రద్ధతో పరిశీలించినందుకు కృతజ్ఞతాపూర్వక నమస్సులు. శ్రీమతి ఆగాథా హారిసన్, శ్రీయుత హెన్రీ పోలక్ దయతో ఈ గ్రంథంలోని ద్వితీయ తృతీయ కాండలను సరిచూసి సవరణలుచేసి, అంతకంటే అమూల్యములైన అనేక సలహాలొసగి తోడ్పడినందుకు వారికి నేను సదా కృతజ్ఞుణ్ణి. కాగా లండన్‌లో ప్రాచ్య సంస్కృతి సంబంధమైన గ్రంథాలయ (ది స్కూల్ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్, లండన్) పర్యవేక్షకుడికి నేను బహుధా ఋణపడి ఉన్నట్లు చెప్పక తప్పదు.

—జార్జి కాట్లిన్



డాక్టర్ హార్ట్రి హాట్లిన్—పీటర్ లాంబ్డా శిల్పం

# విషయం

# చిత్రాలు

# అధ్యాయం 1

1933 సంవత్సరం సెప్టెంబరు నెలలో ఒక విమానం జర్మన్–ఫ్రాన్సు సరిహద్దుల్లో దారితప్పి లీప్‌జిగ్‌హాల్ విమానాశ్రయం చేరింది.

ప్రఖ్యాత పత్రికావిలేఖరి హెన్రీ నోయల్ బ్రెయిల్సుఫర్డు జబ్బుతో ఉండటంవల్ల నేను ఆయనకు బదులుగా లీప్‌జిగ్ కేంద్ర న్యాయస్థానంలో ల్యూబి, డిమిట్రావ్, టోర్గలరులు రీచ్‌స్టాగ్ భవనాన్ని దగ్ధం చేయడంవల్ల, వారి విచారణకు విమానంలో వెళ్లి హాజరైనాను. అది ఆకురాలు కాలం. ముసురుగా వున్న సంధ్యాసమయం. జర్మనీలో మధ్యమతరగతి ప్రజానీకంతో నిరుత్సాహంగా కనపడే పట్టణం చేరాను. విఖ్యాత వైదేశిక విలేఖరులు జాన్‌గంథర్, ఎ. జె. కమింగ్స్, సార్‌వీన్ ప్రభృతులు దేశాలవారీగా న్యాయస్థానంలో హాజరైనారు.

లీప్‌జిగ్‌లో కమ్యూనిస్టు త్రయాన్ని విచారణచేస్తున్నారు. తీవ్రమయిన కుటిలక్రోధమూ, పరహింసా హిట్లర్ ఎంత ఆచరించినా, జర్మన్ న్యాయస్థానం ఒక్కడికి మాత్రం మరణ శిక్ష వేసి పేరుతెచ్చుకొన్నది. అంతకుపూర్వం చాలా కాలం క్రిందటే డిమిట్రావ్ రష్యా చేరుకున్నాడు. ఆ తర్వాత స్వస్థాన

మయిన బల్గేరియాకు ప్రముఖవ్యక్తిగా, మహా మంత్రిగా అయినాడు. నేను అతన్ని 1935లో లెనిన్‌సమాధివద్ద చూశాను. "నేను న్యాయస్థానంనుంచి తప్పించేదాకా ఎదురు చూడము?"ని గోరింగ్ దర్జాగా బెదరింపుగా అనకముందే డిమిట్రావ్ జర్మనీ విడిచి పారిపోలేదు. బోల్షవిక్ డిమిట్రావ్‌వలె గోరింగ్ అంత అదృష్టవంతుడు కాడు. ఈ కేసులో హింసాపథము అపకీర్తి పాలయిన మరణశిక్షతో సమాప్త మవుతుంది.

1933 సంవత్సరంలో జర్మనీలో జాతీయ సోషలిస్టు పక్షం రకరకాల పద్ధతులతో భయోత్పాదక పరపీడల వల్ల అధికారానికి వచ్చి పాతుకున్నది. రాజకీయవేత్తలుకు రాజకీయాలు ముఖ్యం. సామాన్య ప్రజలకు కడుపుకన్న రాజకీయాలు ఎక్కువకావు. అయినా సామాన్య ప్రజకూడా నలుగురితోపాటు కలిసి హిట్లరును అధికారానికి తెచ్చారు. అప్పటికీ కొందరు ఆయనను వ్యతిరేకించక పోలేదు. సైనికులు గోధుమరంగు చొక్కాలు వేసుకొని, సైనిక సంగీతానికి అనుకూలంగా నడుస్తూ వుంటే, అలాంటి ప్రదర్శనచూచి ప్రజలు దేశభక్తిగా తల పోసినారు. 'వెర్సైల్సు అన్యాయాలు' నిరాయుధ జర్మనీ స్థితి, జర్మనీకన్న అధికంగా తుపాకులూ, సైనికబలం రష్యావారికి వున్న విషయం వీధుల్లో గోడలకు కాగితాలు అంటించారు. దాని వల్ల జనసామాన్యం తమ దేశస్థితి జ్ఞాపకం చేసుకొన్నారు.

పదమూడేళ్ల తరువాత మరణశిక్షలు చూడడానికి మళ్లీ హాజరయినాను. 1946 లో న్యూరెంబర్గులో చిన్న కోర్టుగదిలో

కూర్చున్నాను. గోరింగ్, రిబెన్‌ట్రాఫ్ ప్రభృతుల్ని విచారణ చేస్తున్నారు. గాలరీలో కూర్చున్న నేను అందర్నీ బాగా పరకాయించాను. అదివరకు అధికారంలోవున్న గోరింగ్‌ను చూశాను. అతను ఆ రోజుల్లో బరువయిన విమానదళాధికారి దుస్తుల్లో హుందాగా వుండేవాడు. ఇప్పుడూ అవే దుస్తులు. కాని ఆ నాటి అలంకారాలు లేవు. అయినా ఒకవైపు తిరిగి ఠీవిగా కూర్చొని ఇంకా అధికారం చలాయిస్తున్నట్టే తోటిఖైదీలను చూస్తున్నాడు.

ఫ్రెంచి ప్రాసిక్యూటరు మహోపన్యాసంలో స్వేచ్ఛా సంరక్షణం, స్వేచ్ఛను నాశనం చేసిన ఎన్నిక విధానాన్నీ, ప్రజాస్వామ్య విరోధుల్నీ ఖండించినాడు. దురదృష్టవశాన కాకతాళీయంగా జనరలు ఛార్లెస్ డిగాల్ ఆ సమయంలో వచ్చి పత్రికలకు సందేశమిచ్చాడు. జాతీయ జీవితానికి జాతి శక్తి ఎప్పుడూ ఆధారమనీ, అంతర్జాతీయ సహజన్యాయ చట్టాలకింద నరహంతకుల విచారణ ధర్మబద్ధం కాదని సమర్థించినాడు. రష్యాదేశీయ న్యాయమూర్తులు స్థిరంగా కూర్చున్నారు. ఫ్రెంచి ప్రాసిక్యూటరు శాసనబద్ధంగా నేరారోపణ ఖైదీలమీద చేస్తున్నప్పుడు న్యాయమూర్తులు చెవులుదొరపెట్టుకున్నారు. గోరింగ్ ఆరు మిలియనుల యూదుల్నీ, స్టాలిన్ రెండున్నర మిలియన్ల కులాకులాలనూ హింసించలేదూ? రంగురంగుల ప్రకటనల్లో కొద్దిగా ఆయుధాలు ధరించి జర్మనీ సరిహద్దుల్లో విస్తారమైన రష్యాసేన చూచినవాళ్లు తెల్లబోయి వాళ్లే మళ్లీ కనపడుతున్నారని కొందరు అనుకొన్నారు.

మిస్టర్ సింగర్స్ పట్టణ శిలాశకలాల మధ్య సైనికులూ, ప్రజలూ, స్త్రీ పురుషాదులూ నశించినచోట న్యూరెంబర్గు కోర్టు లీప్‌జిగ్ న్యాయస్థానంకన్న దయారహితంగా ఉంది. సాక్ష్యం మహా దారుణంగా ఉంది. ముగ్గురుతప్ప యావన్మందీ దోషులని ఋజువైంది. రిబెన్‌ట్రాపును ఉరి తీశారు. అతన్ని ఉరి తీయ డానికి పదిహేను నిమిషాలు పట్టింది. అతను మరణించాడని అధికారరీత్యా తెలియచేశారు. స్వశక్తిమీద నమ్మకం అతిగా ఉన్న గోరింగ్ ఆత్మహత్య చేసుకొన్నాడు. విజేతల న్యాయా నికి, మిత్రమండలివారి ధర్మానికీ, కెల్లాగు ఒడంబడికతో సత్యం స్థాపించినవారి న్యాయానికీ గోరింగ్ మసిపూసినాడు! దుష్కర్మ పరిపాకంలోకి వచ్చింది. హింసకు విపరీతంగా ప్రతిహింసా ఫలము, ప్రతిహింసాద్వేషము, ప్రతిద్వేషమూ పరంపరగా వస్తవి.

న్యాయస్థాన సభ్యులు, ఉద్యోగులు, వారితో ఫ్రెంచి వాడూ ఉరిశిక్షలు అవుతూవుంటే కళ్లారా చూచి సంతోషించి జలసా చేసుకొన్నారు. ద్రాక్షారసం హాయిగా తాగినారు. మానవ మారణ మహోత్సవంలో వారు కులాసాగా విందు చేసు కొన్నారు. నేనూ తక్కిన వాళ్లతోపాటు తిన్నాను. మధువు సేవించాను. మిత్రమండలివారు ఈలోగా ముందు రాబోయే యుద్ధం గురించి వేరే సంభాషణలు జరిపినారు—ఎంత సమయో చితంగా ఉంది? ఎందుకని అంటారా హింసాపూర్వకమైన కర్మ ఇంకా పరిపక్వం కాలేదు.

అప్పుడు నాలో ఇలా అనుకొన్నాను—“నేను (పాస్టు) యాత్రికునిగా బయలుదేరుతాను. నా జీవితంలో నలభై ఏళ్ల ధార

పోసి ఇటు శాన్‌ఫ్రాన్సిస్కోనించి సిమ్లావరకూ, అటు మాడ్రిడ్ నించి మాస్కోవరకూ శాంతిలో, విప్లవంలో, యుద్ధంలో యాత్ర కొనసాగించాను. ఆ సువిశాల ప్రపంచంలో స్త్రీ పురుషులను. ఆచార వ్యవహారాలను, రాజకీయాలను క్షుణ్ణంగా ఆకళించుకొన్నాను. కాని ఏ కొద్ది తావుల్లోనో తప్ప శాంతి కానరాదే ? ఎటు చూచినా రక్తపాతం, పట్టపగలు దోపిడి, దురన్యాయం, దుర్నీతి, దుర్భిక్ష, అధికారవాంఛ స్త్రీ పురుషుల భోగలాలస— ఇవి వినా నే కోరిన శాంతి మృగ్యం! మానవకోటి యావత్తూ గాఢ సుషుప్తిలో పడిపోయినట్లుంది. కాబట్టే లక్షలాది ప్రజలు దారుణమారణహోమంలో మాడిపోయారు. ఇట్టిఅంధతమస్సులో అల్లాడిపోయే వాళ్లను గాంచి విచారిద్దాం—"

"ఈ సమయంలో శాంతి అనే అమృత సందేశాన్ని లోకానికి ఏభై ఏళ్లనుంచీ అందజేయడమే కాక, తత్ సాధన సిద్ధాంతాలైన సత్యాహింసలకు డెభ్భైఏళ్ల జీవితాన్ని అంకిత మొనర్చి అనవరతమైన కృషి సలుపుతున్న భారతీయ తపోనిధి-బాపూజీ నాకు ఆశాజ్యోతిగా కనిపించాడు. ఆయన ఒక్కడే నా ప్రశ్నకు సమాధాన మివ్వగలవాడు. కాబట్టి మహాత్ముని దర్శనం చేసుకుంటాను. ఐతే దారిలో ముందుగా రోం నగరంలోని క్రైస్తవ మతాచార్యుడు—పోపుకు శ్రద్ధాంజలి ఘటించి ప్రయాణ మవుతాను—కేవలం ప్రాగ్దేశాన్ని దర్శించటమే కాక పాశ్చాత్య ప్రపంచం ఇచ్చే సందేశం ఏమైనా ఉందా ? ఏమీ లేదా ?-రాజనీతిలోనూ అధికారంలోనూ కుళ్లూ అవనీతితప్ప !"

# అధ్యాయం 2

సెప్టెంబరు 1946 లో రోం నగరానికి వెళ్లే ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరినాను. రోంలో ఎండకు తాళలేకపోయినాను. ఆ మహా నగరంలో వస్తువుల ధరవరులు విపరీతంగా ఉండడంవల్ల చాలా బాధపడ్డాను. సాంఘిక ప్రజాస్వామిక వర్గంవారితో, క్రైస్తవ ప్రజాస్వామిక పక్షంవారితో సంభాషించి, వారి కష్టసుఖాలు తెలుసుకొన్నాను. క్రైస్తవ మతాచార్యుని ఉద్యోగి నన్ను సాదరంగా చూచి ఆతిథ్యం నా కొసగినాడు. ఇంతకన్న విశేషం లేదు. ఎండ వేడిమిలోనూ మార్పులేదు. నా అభ్యుదయకాంక్ష సెంట్‌పీటర్ మందిరోపరిభాగంవలె ఘనమై నిరాడంబరమై సామాన్యంగా వున్నది.

ఒకనాడు హోటలు పోర్టరు, నౌఖరు కుర్రవాళ్లు అటూ ఇటూ తారసిల్లుతున్నారు. పోప్ మతాధికారి వాటికన్ నగరం నుంచి పచ్చనిబట్టలు కట్టుకొన్న వార్తికుడు నా కొక లేఖతెచ్చి ఇచ్చినాడు. చాలా శ్రమపడి పోప్ పయస్ మతాచార్యుని వాస భవనానికి వెళ్లవలెనని గండోల్ఫో కోటకు అప్పియను మార్గాన మోటారు ఎక్కినాను.

ప్రయాణంలో కొన్ని చిక్కులవల్ల ఆలస్యమవుతుంది. మేము పర్వతాగ్రాన వున్న గండోల్ఫో కోట చేరుకొన్నాము. కోటకు ఎదురుగా ఆల్బన్ సరోవరం నీలంగా అందంగా కనబడు

తున్నది. సరస్సు చుట్టూ అగ్నిపర్వత ముఖం! లాటియం ఉదయవేళ సువర్ణ సుందరంగావుంది. మేము పోపు మందిరానికి వెడుతూవుంటే సూర్యుడు నిరాడంబరంగా వున్న జనపదంలో ఇళ్లమీద వెలుగుతున్నాడు. కోటలో కొంత ఆలస్యమయింది. ఎలివేటరుమీద పై యంతస్తుకు వెళ్లడానికి ఒక నిమిషంపట్టింది. పై అంతస్తులో మంచి సొగసైన సెలూనులు తీరుగా వున్నవి. ఎంతమంది ఉద్యోగులనో సేవించి చాలా సేపు పడిగాపులు పడ వలసి వస్తుందనుకొన్నాను. ఇక్కడే పొరపాటు నాది. దర్శ నార్థం వచ్చేవారి సంఖ్య తక్కువ కావడంవల్ల సామాన్యంగా పోపు కోటలో అతిథుల్ని ఆహ్వానించడట! పదినిమిషాలు పడుతుందేమోనని అనుకొంటూ వుండగా ద్వారం తెరువబడింది. చిన్నగదిలో ఉన్నాను. అక్కడే కుర్చీలో తెల్లగులాబీ కాంతితో వున్న ఒక వ్యక్తి టేబిలు దగ్గరగావున్న ఉచితాసనం మీద కూర్చోమని తెలియ చేసినాడు.

పన్నెండవ పోప్ ఫొటో తీయించుకోడానికి ఇష్టపడడు. ఆయన ముఖాన ఎముకలు కనబడుతున్నాయి. సులోచనాల వెనక నేత్రాలు ప్రసన్నంగా లేవు. ముఖాముఖీ ఆయనను దర్శించాను. నేను భావన చేసిన వ్యక్తికీ ఈయనకూ చాలా వ్యత్యాసంవుంది! ఆయన ఏ భావభంగిమా ప్రదర్శించలేదు. తెచ్చిపెట్టుకొన్నతీవి, భీష్మించుకోడం ఇలాంటి లక్షణాలు ఆయన దగ్గరలేవు. అందుకే నాకు ఆయన నచ్చాడు. ఆయనలో రూజువెల్టు లౌక్యం, చేతి నాజూకు, మనిషిలో సున్నితం, దయారసంతో వెల్లివిరిసే నేత్రాలూ మనల్ని ఆకర్షిస్తవి. ఆయన చేతి వేలున తళతళలాడే

నీలంపు టుంగరం ముద్దుపెట్టుకోడానికి మనం వంగినప్పుడు ఆయన మనకు మానవ కారుణ్యంతోనూ, మహా చక్రవర్తి వలెనూ తోస్తాడు. ఇప్పటికీ మరిచిపోలేను!

నాగరకత మానవుడికి పైఆర్భాటంకిట్టదు. కళాసాంకేతిక వాదాల్లో కూడా మానవుడు లలితమైన నిరాడంబరమైన అభిరుచినీ ప్రయోజనాన్నీ కూడా అపేక్షిస్తాడు. అతను మొదటవేసే ప్రశ్న ఇదే: "ఏమిటి ప్రయోజనం?" "మనం ఎందుకు సమానంగా ఉండకూడదు?" ఆచార వ్యవహారాలూ చదువు సంధ్యలూ వేషభాషలూ ధర్మాచరణమూ సాగవలసిన జీవితంలో తరుచుగా నాగరక మానవుడు ముఖ్యంగా గాఢసత్యాన్ని విశ్వసిస్తాడు. కాని అతను నిరాడంబరత్వం గౌరవమూ అనన్యం చేస్తాడు.

నేను బల్లమీద మోచేతులు ఆన్చి భారతదేశపు స్థితిగతులు, క్రైస్తవులుపడే కష్టసుఖాలు, సెంట్ థామస్ చర్చ్ సంప్రదాయానికి చెందినవాళ్ల జీవితాల్ని గురించీ చర్చ చేయదలచినాను. పోప్‌కూ నాకూ మధ్య ఏ సింహాసనమూ అడ్డురాలేదు. ఇరవై నిమిషాలు గోష్ఠి చేశాము. ఆయన నన్ను ఆశీర్వదిస్తూ మూడు ప్రార్థనాగేయాలు నాకు బహూకరించినాడు. ఆ కానుకల్లో ఒక కానుక బాపూజీకి (భారతదేశం) తీసుకొనిపోదలచినాను. కాథలిక్ క్రైస్తవమత రాజకీయాలు, లోకంలో చెలరేగే చర్చి రాజకీయాలూ విమర్శించాలంటే అన్ని రాజకీయాలవలె సమయోచితంగా బాధ్యతాయుతంగా సమీక్ష చేయాలి. కాని నాకు ప్రపంచ రాజనీతితోనే ఎక్కువ సంబంధం వుంది. నా ప్రశ్న ఇదే పదేపదే వేసేది—సమాధానం దీనికే కావాలి.

"కత్తికి కత్తి బదులు చెబుతూ, హింసాత్మకంగా ప్రపంచాధిపత్య సంపాదన పరమాశయం కాకుండా, దానిస్థానే ఎక్కడైనా మానవుడు పశుబలంతో నడపబడుతున్న ప్రపంచరాజ్యాన్ని ఎదుర్కోడానికి నవ్య సాధనం కనుకొన్నాడా?" ఇదే ప్రశ్న.

పీటరు అనుయాయి అయిన పన్నెండవ పోప్ పయసు నిలువబడి బాహువులు సాచి ఆశీర్వచనం ఇస్తూవుంటే, ఆయన గదిలో సూర్యుడు ఆల్బన్ సరోవర జలాలమీది నుంచీ, లాటియం కొండలనుంచీ శుభ్రకిరణాలు ప్రసరింపచేస్తూ ఉండగా నేనా తావు విడిచినాను. అది నా తుది స్మృతి!

క్వాడ్రా ఫాంటేన్ పుణ్యతీర్థంలో రాజవీధి ప్రార్థనా గేయాలతో ముఖరిత మవుతూవుంటే, శాంటా మేరియో సొప్రా మినర్వాలో చల్లని తావులు ధ్యాన యోగానికీ ఆటపట్టులు! లీప్‌జిగ్‌లో నా మనసులో చెలరేగిన సమస్యలకూ, న్యూరెంబర్గులో కొంతవరకూ సమాధానం వచ్చిన సమస్యలకూ, సంపూర్ణ సమాధానం ప్రశాంత పుణ్యక్షేత్రాలల్లో లభిస్తుంది.

# అధ్యాయం 3

రెండు రోజులు వ్యవధిగా ప్రయాణానికి ఏర్పాట్లు చేయించాను. వంగదేశం రమ్మని నాకు ఆహ్వానం కేబులుద్వారా వచ్చింది. ఈ 1947 మార్చి నెలలో ఇంగ్లండులో వించెస్టరులో ఇంకా మంచు జడులుగా కురుస్తూనే ఉంటుంది. ఇక్కడ తాపంగా ఉంది. నా సందేహాలు తీర్చుకొనేటందుకు విమాన ప్రయాణం ఆరంభించాను. ఈయేడు ఇది రెండోసారి ప్రాగ్దిశ ప్రయాణం.

విశాలమైన దీర్ఘమైన ఎడారిమీద ఎగిరిన తరువాత సంజ చీకటి దట్టమవుతూ ఉండగా ఈజిప్టు చేరినాము. ఆ రాత్రివేళ విమానంనుంచి కిందికి దీపపు వెలుగు ప్రసారితమైంది. కార్తేజి, సిరీన్, హిప్పో నగరాలు దాటిపోయినై. అక్కడ అగస్టీన్ క్రైస్తవ భక్తుడు జన్మించి 'కన్ఫెషన్స్' అనే ఉద్గ్రంథమును రచించాడు. హిందూదేశానికి వెళ్లే వాయువిమానం ఒకప్పుడు ఏటవాలుగా ఒకప్పుడు నిలువుగా భూప్రదక్షణచేస్తూ కిందికి రివ్వున దిగడానికి ప్రయత్నిస్తూంది. కెయిరో నగరకాంతి సమీపమవుతున్నది. వెడల్పుగాఉన్న నల్లని రిబ్బన్‌లాగ దారిమధ్యలో నైలునది కనపడింది. కొంతసేపటికి విమానం కిందికి దిగింది. ఇంతలో నురుగలుకక్కే ఉత్తరంగాలను లేపుతూ ప్రశాంత నైలునదీ నీలోదకాలను భేదించుకొంటూ చిన్నబోటు ఒకటి ప్రయాణీకులను

ఎక్కించుకోటానికి ఒడ్డుకు వస్తూంది. నేడు మా పక్కలు దానిలోనే వేయాలి. ఆ ప్రదేశంలో సైనిక శాసనరీత్యా షెప్పర్డు హొటలుకు టాక్సీలోపోయి సరిగా రాత్రి 10 గంటలు దాటక ముందే కాఫీ—ఫలహారాలు పుచ్చుకురావాలి. అలా పోలేని వాళ్లకు ఈజిప్టు దేశీయుడైన అతికాయుడు కాఫీ తెచ్చి ఇవ్వ డానికి సిద్ధంగా ఉన్నాడు. రాత్రి నిద్రపోయినాము.

తిరిగి ఉషస్సుకు ముందుగానే మళ్లీ విమానయానం సాగించాము. సినాయ్ కొండలమీద సూర్యోదయం అవుతున్నది. నిర్దాక్షిణ్యమైన ఎర్రని మరుభూముల్లో సూర్యుని రక్తకాంతి ప్రసరించింది. పవిత్రభూమి అయిన పాలస్తీనా మీదుగా ఎగిరి నాము. అప్పటికి మా ప్రాతఃకాల అల్పాహారం అయిపోయింది. పారసీకంలో ఉన్న బహ్రాయిన్ ద్వీపానికి సాయంకాలం భోజ నానికి చేరాలని తప్పనిసరిగా విమానం వేగంగా పోవలసి వచ్చింది. కొంత దూరంలో మృతసముద్రపు ఉత్తర తీరాన ప్రసిద్ధమైన జోర్డన్‌లోయ పూర్తిగా దాటిపోతున్నప్పుడు షేక్ స్పియరు కవీంద్రుని జన్మస్థానమయిన స్ట్రాట్‌ఫర్డ్ అవన్‌లాగ ఉన్నది. సుదూర పర్వతశ్రేణిమీద సూర్యుని అరుణారుణ రంజిత మేఘాలు మనోజ్ఞముగా ఉన్నవి. ఆ ప్రదేశం చూస్తే ఏ జెరూసలేమో పర్వతాల వెనక వున్నదని ఆశ్చర్యపోవచ్చును. లేదా హెర్మన్‌దాకా చూడవచ్చును. గిల్‌బోవా కొండలు కన పడతవి. రాజపుత్రుడైన సాల్‌పుత్రుని శవంమీద దేవిడ్ విలపించినప్పుడు కూడా మంచుజడులు కురిసేవేమోనని ఎవరి కయినా ఆశ్చర్యం కలగవచ్చును.

సంజనుంచీ ఉషస్సువరకూ, బాగ్దాదునుంచి కాబూలు వరకూ 'అరేబియన్ నైట్స్ ఎంటర్టైన్మెంట్స్' అనే విచిత్ర మైన రంగురంగుల తివాచీ ఎంత మెల్లగానో ప్రయాణంచేసింది. గంటకిందటే నైలునది అదృశ్యమైందో లేదో, అప్పుడే ప్రాచీన మయిన యూఫ్రటీస్ మహానది మా కంట పడుతున్నది. ఈ యూఫ్రటీసు ప్రాంతంలోనే కొన్ని యుగాలకిందట మహా ప్రళయం సంభవించిందట. విమానం ఎత్తునుండి కిందికి కన్ను చూడగలిగితే, అంతమేర ఇరాన్ దేశ ఖర్జూరపు చెట్లనూ, దారులనూ ఆవరించిన హరితకాంతి వెల్లువగావుంది. ఖర్జూరచెట్లమధ్య రేఖాగణితరీత్యా గీయబడినట్టు చతురస్రాకార ప్రదేశాల్లో పెంకుటిళ్లు కానవస్తున్నవి. భూమి పరిభ్రమిస్తున్నట్టు ఆ చెట్ల మధ్య హరితకాంతి జలము వరదలై పారుతూంది. అదొక చిత్ర దృశ్యం!

విమాన ప్రయాణము మార్గం చరిత్రను విశదీకరిస్తూ అయోమయం చేస్తూ వుంటుంది. కొద్ది గంటల్లోనే మెంఫీస్, బాబిలోన్ విడిచిపెట్టాము. సూర్యకాంతి విమానం మీద ప్రసరిస్తున్నది. ఈ విమానం పశ్చిమాకాశాన కిందటి రాత్రి సిల్హౌటీలాగ వుండి, ప్రాచీన అహిగు ప్తదేశపు స్ఫింక్స్ పక్షిగా తోచింది. పారసీక సింధు శాఖవైపు విమానం పోతున్నది. ఇక్కడ అరేబియా దేశపు ఎర్రని కాలిన ఇసుక, మలమల మాడుతున్న కొండలూ కనపడుతవి. పర్వతాగ్రాల మీద దీర్ఘ చతురస్రాకారాలు గోచరమై మానవ నివాసాల్ని తెలియచేస్తవి. ఇటువంటి అత్యుష్ణ మండలంలో కూడా మానవజాతి నివాసం కల్పించుకొని, కొండలమీద చిన్న కాలువలుగా తవ్వి మంచు

పోగుచేస్తారు. ఈ ప్రాంతాలు జీవనేచ్ఛకు దోహదంగా లేవు. అయినా ఇక్కడా మానవజీవితం సాగుతూనేవుంది. అరేబియాకు అభిముఖంగా ఇరాన్ దేశపు తీరరేఖ, పారసీక పర్వతశ్రేణులు మండుటెండలో తళతళలాడుతూ ప్రయాణీకులకు శత్రువులై కనపడతవి. ఎవరైనా భూతలానికి దిగితే నలభైయెనిమిది గంటల్లో ఎండవేడిమికి నశిస్తారు. చరిత్రారంభ కాలంలో సిందుబాదు ఎంతటి ధైర్యశాలి కాకపోతే నిర్జనమైన సముద్రతీరాన సాహస ప్రయాణం చేశాడు! చిత్రమైన కొండలమీద విచిత్రమైన అయస్కాంతా కర్షణవల్ల లోహాలతో వున్న నావలు అకస్మాత్తుగా ఛిన్నాభిన్నమైపోయిన తావుల్లో సిందుబాదు సాహసయాత్ర సలిపినాడు. సైరస్ కొంతకాలం పరిపాలించాడు. షిరాజ్‌లో కవులు కావ్యగానాలు చేశారు. ఈ దారినే అలెగ్జాండర్ వీరవిజేత, వీరపుంగవుడు ఇసకందరూ భారతదేశం మీద దాడీ చేశారు. అప్పటికి ప్రపంచం తరుణస్థితిలో వుంది.

అంతేకాదు విమానయానం చేస్తున్న నేనుకూడా సాహస యాత్ర చేస్తున్నాననే ఉత్సాహంతో వున్నాను. యుద్ధాలవల్ల శుష్కమై, స్వదేశం రక్తపాతంలో మునిగి తేలుతున్నప్పుడు విడిచి వస్తున్నాను. ఉత్తర యూరోపు విడిచి సూర్యప్రభాభాసం అధికంగా ఉండే తూర్పుదేశాలకు వస్తున్నాను. బహుశా ప్రాచీనమైన నా సందేహానికి నవ్యమై ఉజ్జ్వలమైన సమాధానం లభిస్తుందేమో! రాజకీయపక్షాలు ఉన్నతికోసం పాకులాడే లాలసనుంచీ, అల్ప విషయాలనుంచీ, ప్రాపంచిక సంక్షోభంనుంచి కనీసం ఈనా భావాలు తాపోపశమనం కలిగిస్తవి. మహోన్నత భావంతో ఉన్న వాయువు పీల్చడమంటే శాశ్వత సత్యపూరిత స్వచ్ఛతర

ప్రపంచవాయువు పీల్చడమన్న మాట ! వినయవైరాగ్యాలు పరమ దోషాలుగా పరిగణింపబడే ప్రపంచంనుంచి, చరిత్ర విజయాన్ని సహించి క్షమిస్తున్నదని చెప్పిన హిట్లర్ ప్రపంచంనుంచి, వినిర్మల ప్రశాంత సత్యపూరిత భావోత్తేజక వాయువు సేవించ డము ఎంతహాయి ! నేనుకూడా (పాస్టు) అదే ప్రశాంతికోసం, అంతర్ముఖ శాంతి ప్రకాశంకోసం అన్వేషిస్తున్నాను.

మిట్టమధ్యాహ్నం బహ్రాయిన్‌లో ఒక కుటీరమందు ఫలహారం తీసుకొన్నాము. విమానంనుంచి చూస్తే పారసీక సింధుశాఖలో చిన్నచిన్న ద్వీపాలు కోడిగుడ్లలాగ ముత్యపు చిప్పల్లాగ కనబడతవి. కిరసనాయిలు నూతుల అధిపతి అయిన షేక్ భవనోపరి భాగాలు దూరాన కానవస్తున్నవి. వాటికికొంచెం దూరంలో చేపలతో మెరిసిపోయే సముద్రం. సముద్రానికి అవతల ఎడారి కానవస్తూంది. ఆ ఎడారిముందు మన ప్రపంచ నాగరికత ఏపాటిది !

అసురసంజవేళ కరాచీలో దిగినాము. సిమెంటుగోడలతో వున్న రెండంతస్తుల విశ్రాంతి భవనం మమ్మల్ని ఆహ్వానించింది. పత్రికా విలేఖరులు మాతో చర్చించటానికి వచ్చారు. అక్కడే పొదల్లో ఎర్రని మందారం కనపడింది. నా కిటికీకి ఎదురుగా భారతీయ కుటుంబాలవారు వుంటున్న ఇంటి పెరడున్నది. పెరట్లో రాళ్లమీద బట్టలు ఉతుకుతున్నారు. ఐర్లండులోవలె మేకలు పిల్లలచుట్టూ తిరుగుతూ గంతులేస్తున్నవి. అయితే ఈ దేశంలో వేడి అధికం కావడంవల్ల పిల్లలు చాలామంది దిగంబరులుగా వుంటారు, అదే సమయంలో మూడు గ్రద్దలు

ఆకాశంలో ఎగురుతూ ఆహారానికి సమయం కనిపెడుతున్నవి. కరాచీ వాతావరణమంతా పాశ్చాత్యపద్ధతిలో వుంది. ఇక్కడ ఓడరేవు వర్తక వ్యాపారాలకు చాలా అనుకూలంగా వుంది. తటాకాల్లో కావలసినన్ని మొసళ్లున్నవి. అప్పుడప్పుడు ప్రజలు ఏ కుక్కలనో మొసళ్లకు తిండికింద అర్పిస్తూవుంటారు. ఇది వారికొక వేడుక. అంతేగాని వాళ్లు ఒకరిగొంతు కొకరు కోయరు.

ఐనా కరాచీతో నాకు నిమిత్తంలేదు. ఇంకా నేను చాలా దూరం ప్రయాణం చేయాల్సివుంది. మింగు-మంచూ ప్రభువుల బహిష్కృత నగరం, బంగారుపెంకు కప్పులతో మెరిసే నగరం పెకింగ్ వరకూ వెళ్లాలి. సింధుప్రాంతం విడిచిపెట్టాలి. ఒకప్పుడు అలెగ్జాండరు ఇక్కడే సాహసంగా దండయాత్రచేసి తక్షశిలవద్ద స్మారకచిహ్నం మనకు వదలి వెళ్లినాడు. యవన పదాతిసేనలు నడిచివెళ్లిన దారి ఇప్పటికీ స్మారకచిహ్నం దగ్గిర చూడవచ్చును. గంగాస్రవంతినీ, హిందూ సనాతన ధర్మానికి పట్టుకొమ్మగా వున్న వారణాసినీ, కొచ్చిన్ నుంచి కన్యాకుమారి వరకూ వ్యాపించివున్న దేవాలయాలనూ దర్శించాలి. సెంట్ జేమ్సు రీతిగా జరిపే సామూహిక ప్రార్థన వినవలె. సారనాథంలో బుద్ధుడు పద్మాసనంలో కూర్చున్నచోట కూర్చోవలె—కొత్తఢిల్లీ మందిరంలో మహ్మద్-ఆలీ-జిన్నాతో భోజనం చేయాలి. నవ్యాసియా జనన సందర్భంలో జహ్వార్‌లాల్ నెహ్రూ పండితుణ్ణి అభినందించాలి. ఆతర్వాత కొల్లాయిగట్టి పర్ణశాలలో అర్థనగ్నమూర్తిగా, బోసినవ్వుల మహాత్ముణ్ణి దర్శించి నా ప్రశ్నలకు సమాధానం పొందాలి.

# అధ్యాయం 4

విమానం అవతరించేటప్పుడు ఢిల్లీలో ప్రాసాదోపరిభాగాల మీదా, గోరీరమీదా, మొగలాయీల రమణీయ శిల్పకళాశోభిత మందిరాలమీదా, సర్ ఎడ్విన్ లూటిన్స్ మూలంగా పరిఢవిల్లిన నవీన శిల్పాలమీదా చంక్రమణాలు చేస్తుంది. అలహాబాదు వరకూ విమానయానం సాగించాను. అక్కడనించి జనసమ్మర్దం అధికంగా వున్న చిన్న స్టేషనులో రైలు ఎక్కానాను.

స్టేషన్ ప్లాట్‌ఫారంమీద రకరకాల మానవకోటి! వారిలో కొందరు పొడుగు లాగులు తొడుక్కొని చొక్కాల అంచులు లాగులో ఇముడ్చుకొన్నారు. కొందరు కాంగ్రెస్ జాతీయ దుస్తులు వేసుకొన్నారు. నిజానికి జాతీయ వేషధారణం అట్టే నాకు కనపడలేదు. కొందరు తెల్లని సుర్వాలు తొడుక్కొని నల్లని షేర్వాణీలు ధరించారు. మరికొందరు గావంచాలు కట్టుకొని, గడ్డాలు దువ్వకోకుండా వున్నారు. కాని ఒకే తీరుగా చిక్కని రంగుల చీరలు ధరించిన స్త్రీలు నాకు బాగా నచ్చినారు.

రైలు అలహాబాదు పరిసరాలు విడిచి పంట కళ్లాలలో నుంచీ, గంగానదికి ఉత్తరాన వనాల్లోనుంచీ వెడుతూ వుండగా చీకటిపడింది. గంగాయమునలు ఇసుకపర్రలమీద ప్రవహించినై,

రాత్రి పెద్దమంటలు కనపడినవి. అవి ఏమిటని విచారించగా పొలాల్లో ఆకూ అలమూ ఎరువుకోసం తగలపెట్టుతున్నట్లు తెలిసింది. అక్కడక్కడా రైలు ఆగుతూ వున్నది. రైల్వే అధికారులు హరికేన్ లాంతర్లతో హడావిడిగా తిరుగుతున్నారు. పల్లెజనం కిక్కిరిసిన రైలుదిగి చేలగట్టున కాలిబాటలో గొంతెత్తి పాడుకొంటూ వారి కుటీరాలకు పోతున్నారు. ఎవరూ గాన ముఖరితమయిన భారతదేశ వర్ణనంచేయరు. గానంలో ఆనందం కన్న జీవనదుఃఖమే గోచర మవుతుంది.

చివరికి ఎలాగో రైలు కాశీ చేరింది. టాక్సీలు ఎక్కడా లేవు. గుర్రపుబండివాడు సామానులు బండిలో పెట్టినాడు. పల్లె వలె కనపడే సందుల్లోంచి మంచి హోటలుకోసం వెడుతున్నాను. తరువాత కొంత సేపటికి కంటోన్మెంట్ హోటలుకు వెడుతున్నా నని తెలుసుకొన్నాను. అది పాతకాలపు యూరోపియనుల హోటలు. అక్కడ బండి దిగగానే తలపాగ పెట్టుకొన్న ఒక నౌకరు వచ్చి నాకు బస ఏర్పాట్లన్నీ చేయబడినట్లు చెప్పినాడు.

మరునాడు ఉదయం ఈస్టరు పండుగ. ఇంగ్లండులో టూటింగ్‌బెక్, వర్జీనియావాటర్ మొదలయిన పల్లెతావులలో ఆదివారంకన్న ఈ ఆదివారం విశిష్టంగా వుంది. ప్రాతఃకాలం వుడకపెట్టిన మాంసం గుడ్లూ కాఫీ సేవించాను. హోటల్లో ఫలహారం పుచ్చుకొనేగదిలో రాగిరేకులమీద 'లండన్‌ప్రకటన' వేటదృశ్యాలు సొగసుగా చెక్కబడినవి. గోడమీద ఆ రోజు తయారుచేసే వస్తువుల జాబితాలో 'చాంపేన్, తళతళ మెరిసే ద్రాక్షపానీయం అయిదు రూపాయలు' అన్న మాటలు బాగా

కనపడినవి. భాష భారతీయాంగ్లము. ఈ గదికి అవతల డ్రాయింగ్ గది వుంది. భారతదేశపు బల్లలు, వాటిమీద పువ్వుల అద్దకాల గుడ్డలూ పరిచివున్నవి. అద్దకాలు పరిచిన పెద్ద సోఫాలున్నవి. హోటలు అజమాయిషీ ఒక ఆస్ట్రేలియా వనితది. వరండాలోంచి చూస్తే పుష్పవాటిక ఒకటి వివిధ మొక్కలతో పచ్చికతో అందంగా కానవస్తుంది. సమీపాన పల్లెటూరి చర్చి వుంది. ప్రార్ధనవేళ తెలుపుతూ గంటలు మోగుతున్నవి. నౌకర్లు 106 డిగ్రీల అత్యుష్ణం భరించలేక గదిలో నేలమీద పరున్నారు. హోటలులో అవకతవకలు లేకపోలేదు. పూర్తిగా ఆంగ్లేయపద్ధతి కనపడదు. స్నానాలగదికి ప్రక్కనే నవీన ఆసనాలంకృతమైన మరుగుదొడ్డి వుందిగాని, నీటిని సరఫరాచేసే అనుసంధానం లేకపోవడంవల్ల ఆసనాలుండి లాభమేమిటి? మైల పాకీవాళ్లు చేతులతో తీసివేస్తారు. ఇక్కడ 19 శతాబ్దపు ప్రశాంతికి ఏ టెలిఫోనూ భంగం కలిగించడం లేదు.

తోటలో పువ్వులన్నీ నాకు అపరిచితాలే! నా పడకగది వరండాముందు అందమైన పువ్వులతో బొగన్‌విల్లీలు మెరుస్తున్నవి. తోటలో పావంచాల దగ్గిర పెద్ద గడ్డంగల పాముల వాడు తలకు పాగా చుట్టుకొని హడావిడిగా సర్ప ప్రదర్శనకు ఉపక్రమిస్తున్నాడు. వాడిదగ్గిర కొన్ని మట్టి మూకుళ్లున్నవి. వాడు బొట్టి నోటపెట్టి శ్రావ్యంగా నాగస్వరం ఆలాపిస్తూ ఒక మూకుడు యెత్తేసరికి కోరలు పెరికివేయబడిన త్రాచు బుసలు కొట్టుతూ గొడుగు చువ్వలాగ ఉవ్వెత్తుగాలేచి పడగవిప్పి పాట వింటోంది. మరొక చట్టీమూత తీసేసరికి విషంలేని రెండు

గోధుమ(త్రాచు పిల్లలు నేలమీదికి భీకరంగా విసురుగా వచ్చినై. వాటి పొడవు అడుగున్నర. పాములవాడు వాటిని చాతుర్యంగా ఆడించి ప్రేక్షకులకు మహా ఉల్లాసం కలగచేసాడు. నా దగ్గిర చిల్లర లేదన్నాను వాడితో-లాభసాటిగావుండే తావుకు గిరుక్కున తిరిగి వెళ్లిపోయినాడు.

'క్లార్క్ హోటలు-' ఎవరీ క్లార్కు? హోటలు నడిపే శ్రీమతికీ తెలియదు. ఆవిడ కొడుక్కూ తెలియదు. బహుశా ఇక్కడ కిందటి శతాబ్దంలో సిపాయీల స్వాతంత్ర్య యుద్ధం పూర్తిఅయిన తరువాత ఎవడో దేశదిమ్మరిగావున్న ఆంగ్లేయుడు ఈ హోటలు పెట్టివుంటాడు. పద్ధతంతా భారతీయంగానేవుంది, భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులకు అభిరుచి కలిగించే రీతిగా హోటలు కన్నులపండువుగా అలంకృతము చేయబడినది. అందుకే గోడల చిత్రాలున్నవి. సుఖంగా కూర్చుని తాగటానికి వీలుగా కుర్చీలు అమర్చబడినాయి. కాశీ నేతబట్టలవల్ల ప్రదర్శన ప్రదేశంవల్లా మేము ఇంగ్లండులో కాదు హిందూదేశంలో వున్నామని తెలిసింది. నిజంగా వారణాసిలో వున్నామా? ఊహూఁ సైనిక స్థావరంలో వున్నాము. ఇంగ్లండు కాని ఇంగ్లండులో వున్నాము. ఇక్కడ శీతోష్ణాలు మినహాయిస్తే!

ఈస్టరునాడు నా కర్మకలాపం నిర్వర్తించాను. భారతీయుడు అనర్గళంగా ప్రార్ధనచేశాడు. ప్రపంచ ఖ్యాతిపొందిన కాశీ నేత పనివాళ్ళను చూద్దామని నిశ్చయించుకొన్నాను. నాకు సహాయంగా కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ప్రసిద్ధుడైన పురాతత్వ శాఖాధ్యాపకుడు వచ్చివున్నాడు. ఆయనా నేనూ కలిసి

జనసమ్మర్దమైన పురమధ్యము ప్రవేశించినాము. రాజవీధిలో రెండంతస్తుల భవనాలున్నవి. కిటికీలులేని పెట్టెలవంటి షాపులు వీధిమీదికి వున్నవి. షావుకారు సర్కులమధ్య బాసిపిటా వేసు కొని కూర్చున్నాడు. శీతలపానీయం లభిస్తుందేయోననే ఆశతో నాతోవున్న ప్రొఫెసరును హెచ్చరించినాను.

ఈ కోరిక తీరడం నేను అనుకొన్నంత సులభసాధ్యం కాదు. భారతదేశంలో పానీయశాలలు, రెస్టరెంటులు. మధు శాలలు చాలా తక్కువ. సిమ్లా వాతావరణం షెల్టెన్ హాం మోస్తరుగా వుంది. స్థానికంగా అక్కడి మహిళలు కాఫీ సేవిస్తూ వుంటారు. వారి ఫేషనులు అందచందాలు అతి నవీనం. ఆడవాళ్లు పచ్చగడ్డిమీద బంతులతో ఆటలాడతారనీ, పోలో ఆడతారనీ ఎవరూ అనుకోరు. ఇంతకూ మేము చల్లని పానీయంకోసం ఒక చీకటికోణం ప్రవేశించాము. అక్కడ నాటురకపు బల్లలున్నవి— భోజనం మాత్రం పెడతారని గ్రహించాను. మళ్లీ ప్రయత్నించి కృతకృత్యులం అయినాము. కొంతమంది పానీయం సేవిం చేందుకు వచ్చినవారు మాకు దయతో దారి ఇచ్చినా, పానీయ శాల మెట్లమీదనే నిలవవలసి వచ్చింది. యజమాని డబ్బు తీసుకొనేచోట కూర్చొని వున్నాడు. మంచుగడ్డ తీసి గోనెలో వేసి, సుత్తెతో ముక్కలుగా కొట్టినాడు. తర్వాత గాజుగ్లాసులో ఆ ముక్కలువేసి చిక్కని పసుపుపచ్చ ద్రవం పోసి కలిపి ఒక ఆహూతునికి ఇచ్చాడు. అది షర్బత్ ఎంత మాత్రం కాదు. బ్లాక్ పూల్ అట్లాంటిక్ మహానగరాల్లో ఉపయోగించే పానీయమే మంచుతో కలిపినాడు. సీసామీద కాగితం కనపడలేదు. నా అను

మానం ప్రకారం అది పాశ్చాతుల్ని చవకరకంగా అనుకరించి తయారుచేసిన పానీయం అయివుంటుంది. కోతినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లు ఏ దుకాణంచూచినా పాశ్చాతుల్ని గుడ్డిగా అనుకరించినట్టు కనపడుతుంది.

పిమ్మట విశ్వేశ్వరాలయానికి వెళ్లే పక్కవీధిలో ప్రవేశించాము. అదొక ప్రపంచం. నెమ్మదిగా చిన్న షాపుమెట్లెక్కి పైఅంతస్తుకు వెళ్లినాము. దుకాణం యజమాని దర్జాగా సంతకాల పుస్తకం తెచ్చి మాకు చూపినాడు. అందులో "ఎడ్వర్డు పి. ఎడ్వర్డ్ విండ్సర్, ప్రిన్స్ఆఫ్ వేల్సు" వగైరా ప్రముఖుల సంతకాలు వున్నాయి. నేను యజమానికి ఇలా సలహాఇచ్చాను-ఇది అమూల్యమయిన సంతకాల పుస్తకం, ఎవరయినా కాజేస్తారేమో భద్రంగా ఉంచకపోతే?" అన్నాను. తర్వాత షావుకారు మమ్మల్ని కూర్చోబెట్టి బేళ్లకొద్దీ ఖరీదైన సిల్కులు చూపినాడు. కాస్త శీతలపానీయం లేదా షర్బత్తు లభిస్తుందేమోనని ఆశతో ఎదురు చూస్తూ కూర్చున్నాము. గుడ్డలు కొనవలసిన అగత్యం లేదు. యజమాని రకరకాల సిల్కులు బంగారు జరీగుడ్డలు మాకుచూపి "లండన్, పారిస్, న్యూయార్కుల్లో వీటిని ప్రదర్శనార్థం పంపుతున్నాం" అన్నాడు.

ప్రసిద్ధ మొగలాయీ చక్రవర్తుల్లో ద్వితీయు డయిన బాబరుచక్రవర్తి తనచే ఓడిపోయిన భారతీయుల్ని గురించి ఇలా అన్నాడట—"వారి వీక్షణములు ప్రసన్నములు కావు. వారిలో సాంఘిక చైతన్యం, ఉపజ్ఞానైపుణ్యాలుకానీ లేవు. చేతిపనుల్లో అందం, ఆకారం, సమత్వం పిన్నాణముూలేవు."

కాని చక్రవర్తి తన ప్రజల విషయంలో న్యాయంగా మాట్లాడ లేదు. నెహ్రూ, పాటియాలా మహారాజులవంటి వారి చూపులు ఎలా వుంటున్నా, దేశీయమయిన వృత్తి నైపుణిలో బాబరు అన్నట్లుగా విపరీత వ్యత్యాసంలేదు. ఈ విషయం ఋజువు చేయాలీఅంటే గుప్తకాలీన శిల్పాలు, అజంతా గుహా కుడ్య వర్ణ చిత్రకళ చాలవూ? ఈ వసనము రక్తవర్ణంతో పసిండి అంచుల మిలమిలలతో సుందరంగా వుంది. వెనుకకు తిప్పితే మేలిమి బంగారు పంటమీద అరుణకాంతి కమ్మినట్టు సొగసుగా వుంది వస్త్రము. చేతితో నేసిన బట్ట; తయారు చేయడానికి కొన్నివారాలు పడుతుంది. హిందువుల పవిత్ర కాశికానగరిలో నేత పనివాళ్లంతా ముసల్మానులే. ఈ వృత్తి నైపుణ్యం ఒక కుటుంబం రహస్యంగా ఉంచుతాది. ఆ కుటుంబం గతించిననాడు ఆ కళావిన్నాణ రహస్యం కూడా వారితోపాటు అంతరించవలసిందే. కన్నులు మిరుమిట్లు గొల్పి ముద్దులు మూటకట్టించే సిసలైన కళావైదగ్ధ్యం ఇక్కడే ఈ కాశికానగరి మగ్గపు నేతలోనే వుంది. ఇట్టి రహస్య వృత్తులే భారతదేశంలో వ్యాపార సరళిలోకాక కులధనంగా గౌరవించబడుతునై. నిజానికి భారతీయ సంఘవ్యవస్థకు ఆధారం కుటుంబమేకాని ప్రభుత్వం కాదు. అందువల్ల కుటుంబాల్లో ఎంతవైవిధ్యం వుంటుందో, ఉత్పన్నమయిన భారతదేశపు సరుకులలోనూ అధిక వ్యత్యాసం కనపడుతుంది — ఒక ప్రమాణం ఏర్పాటు చేయనప్పుడు నేత పరి[illegible]లోనే ముఖ్యంగా అద్దకం బాగావుంటే నూలు బాగుండదు. బొంబాయి యంత్రాల్లో తయారయ్యే వాటిలో

అభివృద్ధి కనపడదు. అయితే కాశీలో మాత్రం పరిస్థితులు అనుకూలించడంవల్ల వర్తకులు సుందర వస్తువులు విక్రయించ గలుగుతున్నారు.

రాజప్రతినిధి భవనంలో కూడా చూడని, తెరలకు పనికి వచ్చేవీ, పరుపులమీద పరచుకోడానికి వీలయ్యే తానులుచూస్తూ వుంటే నా మనసులో ఒక ప్రశ్న నిలిచిపోయింది. ఇవన్నీ కొనేవారెవరూ ?—మహారాజుల భోగపత్నులూ, కోటీశ్వరుల భార్యలూనా ? రెక్కలమీద బ్రతికేవాళ్లు కళాసృష్టి చేయగల వాళ్లూ ఏమికొనగలరు ? అందమయిన వస్తువులు అవి దంతపువి అయినా, బంగారు జరీబట్టలయినా ఉపయోగించి నప్పుడు నాగరకతేకదా ? మానవకోటి నేర్పుతో రూపొందించిన అంద మయిన వస్తువులు ధనాఢ్యపోషకులు కొని పోషించి సర్వ మానవ సౌఖ్యానికి దారిచూపుతారా ? టాల్‌స్టాయ్ సవాన రొలాలు, గాంధీజీ అల్పభోగాలు దర్పాలు తృణప్రాయంగా చూడమన్నారు. గాంధీజీ దృష్టిలో తాజమహలు కార్మికుల కృషి ఫలమని, నీతివేత్తగా ఆయనను గూర్చి నెహ్రూ పలికినాడు. కాని విశాల గంభీర దృక్పథంలో పరికిస్తే, గేటేవంటి మహా మహుని దృష్టిలో, సంపూర్ణంగా భోగాలతో తులతూగుతూ సంకీర్ణ నాగరకజీవనంలో మానవులు జీవించ గలిగితే గాంధీజీ దృక్పథం సరియైనదేనా ?

యుగయుగాలనుంచీ పనివాళ్ళు కోటీశ్వరుల్ని భోగలాల సుల్ని చేయడానికి సిద్ధపడినారు. కోటీశ్వరులకు ధనార్జనలో ప్రీతి కలిగించి వాళ్లను కుబేరులుగా తయారుచేసినది పనివాళ్లే!

హస్తనైపుణ్యం తెలియజేసే అందచందాలయిన వస్తువులన్నీ సంచితం చేయడంలో నాకు ఆనందంలేదు. ఈ అందచందాలయిన వస్తువులు ఏ చర్చిలోనో దేవాలయంలోనో లేక ఏ మ్యూజియం లోనో వుంటే నాకు అపరిమితానందం. (ఇక్కడ బాబరు కొంత వరకూ స్వపక్షంలో నిజం చెప్పినాడేమో!) ఎందుకంటే, ముక్కారు ముద్దినుసు ఇలా ప్రలోభం కలిగించినా, భారతీయుల మందిరాలు ముఖ్యంగా ధనాఢ్యుల ప్రాసాదాలు చూస్తే ఎక్కడా రసజ్ఞతా కళాభిరుచీ గోచరించవు. మహారాజుల స్వభావంకూడా రాజ ప్రాసాదాన్ని అవకతవక వస్తు సముదాయంతో మ్యూజియంవలె అరణ్యమయం చేస్తారు. ఈ సందర్భంలో చీనావారిలో వేరు లోపాలు ఎన్నివున్నా వారిలో నిర్దుష్టమైన సారళ్యంతోపాటు చక్కని అభిరుచికూడా వుందనే నా అభిమతం. అయినా నా నేత్రద్వయం కాశీ పట్టుబట్టలమీదికీ, షాపుల్లో వర్తకులమీదికీ ప్రసరించి 'భారతీయులకు సహితం విశిష్టమైన కళాభిరుచి వున్నదని' స్పష్టం చేసినవి.

# అధ్యాయం ౫

కాశీలో గంగాస్నానం చేయవలెనని నేను రాలేదు. కేవలం కాశికానగరిని దర్శించాలని వచ్చినాను. గంగను వీక్షించడానికి తగిన సమయం పున్నమినాటి పండువెన్నెల. అదే సలహా యిచ్చాడు హిందూ విశ్వవిద్యాలయాధ్యాపకుడు కూడా. కాశికా నగరం హైందవసంస్కృతికి పట్టుకొమ్మ కావడంవల్ల వీక్షించాలనే జిజ్ఞాస నా మనసులో గాఢంగా పాతుకొంది.

నా మిత్రుడు ఓమ్‌ప్రకాశ ఘోష్, నేనూ కలసి ఒక నావ అద్దెకు తీసుకొన్నాము. మేమూ పడవకళాసూ సంధ్యావాలగానే వెన్నెలలో నీలపు అలలు ఉప్పొంగి వరదలై ప్రవహించే గంగా స్రవంతిలో పయనం ఆరంభించాము. ఘోషు పక్కా కాంగ్రెస్ వాది. అతను ఆ మహాసంస్థకు తన జీవితం అంకితం చేసినాడు. మేము సంధ్యవేళ భోజనం చేస్తున్నప్పుడు అతను నాతో ఇలా చెప్పినాడు—'తనకు ప్రతినిత్యమూ సకాలానికి చరఖామీద ఎంతోకొంత దారంతీయడం విధికృత్యమట, ఆయన ఎల్లప్పుడూ చేతికి ఇమిడే టైపుమిషనువంటి చిన్న పెట్టిచరఖా ఒకటి వెంట ఉంచుకొంటాడు. అంతేకాదు ఆయన స్వయంగా తీసిన రెండు చిలపలు నాకు కానుకగా సమర్పించినాడు. చిలపలు ముతకగా వున్నా అంతఃకరణ ధర్మాన్నిబట్టి ఆచరించిన కృషి కనుక అది విలువైన కానకే! కొంతకాలం రాజకీయ ఖైదీగా కృష్ణజన్మ

స్థానంలోను, మరికొంతకాలం మహాత్ముని ఆశ్రమంలోను ఘోష గడిపినాడు. ఆయన చాలా పెద్దమనిషి. ఆయన మనసు భావోద్రేకానికి లోబడక గుణసామ్యావస్థలో వుంటుంది. ఆయన భావాలు నాకు నచ్చినవి కనుకనే కలిసిమెలిసి వుండగలిగినాను. మా ఇద్దరికీ పరిచయం ఏర్పడిన తరువాత ఆయన హృదయం మహోదారమైందని గ్రహించాను.

ముగ్గురితో మా పడవ వెన్నెలతో వెలుగుతున్న ఆకాశం కింద భారతీయ పుణ్యవాహినిలో ప్రయాణం చేస్తున్నది. గంగా పావనజలం జీవన రక్షగానూ, దేహాలు చాలించిన సనాతన హిందువుల కళేబరాలూ స్వీకరిస్తూ వుంటుంది. గంగాజలం వెచ్చగా బురదగా వాసనగా వుంది. పవిత్ర గంగావాహిని ఇక్కడ అంత వెడల్పుగా లేదు. కొంచెం దిగువగా నది దాట డానికి పడవల వంతెన ఒకటి వున్నది. యాంగ్ట్సీకియాంగ్ నదివలె అతి ఘనంగా లేదు. బ్రహ్మపుత్ర కలిసినచోట గంగ వలె కాశీగంగ గంభీరంగా లేదు.

రాత్రి రేఖలు స్ఫుటంగా ఉండవు. వెన్నెలరేయి కావడం చేత మా పడవకు అభిముఖంగావున్న నదీతీరము, కాశీరాజావారి విశాల రాజభవనమూ దూరంగా వున్నట్టు తోస్తున్నవి. దక్షిణ తీరంతో మాకు నిమిత్తంలేదు. ఉత్తరతీరం యావత్తూ రాజేంద్రుల దివ్యమందిరాలతో కిక్కిరిసి వున్నది. ఆ మందిరాలలో మిక్కిలి తెల్లగా అత్యున్నతంగా నేపాల ప్రభువుల మందిరం వెన్నెలలో ధగధగా మెరిసిపోతున్నది. లాసాలో దలైలామా 'పొటల' మందిరం కూడా ఈ మందిరం ముందు ఇంపైనది కాదు.

గ్వాలియరు మహారాజు భవనం సమీపంలోనే వుంది. అదంతా ఎఱ్ఱరాతి కట్టడం. గంగా ఘట్టంవైపు భవనద్వారాలు ఉన్నతమైనవిగా ఏర్పర్చబడినవి. నదిమీద దొంగతనంగా వెళ్లే ప్రయాణికులమీద పన్ను వసూలు చేయవలెననే ఉద్దేశ్యంతో కాక, గ్వాలియరు ఇందూరు మొదలయిన రాజేంద్రులు కేవలం భక్తికొద్దీ రాజమందిరాలు గంగాతీరంలో నిర్మించుకొన్నారు. గ్వాలియరు ఘట్టందగ్గిరే కాబోలు భావావేశంతో రచనచేసే ఫ్రాన్స్ దేశీయుడైన పియర్రీ లోటీ అందంగావున్న కన్యలను చూసి తన బ్రాహ్మణ గురువు చెప్పిన ప్రథమోపదేశము "సర్వైక్యత" అనగా తానూ అందమైన పడతులూ, సుందర వస్తువులూ అన్నీ ఏకమే అన్న భావము మననం చేసినాడు. అయ్యో! వికృత వస్తువులన్నీ,—భీకరమయినవీ, రక్తసిక్త కాళీమాయీ అన్నీ అంచరూ యదార్థమే; ఇవన్నీకూడా ఏకమే! నేడుకూడా కాళీమాతకు రక్తమూ మేక శిరస్సులూ అర్పణ చేస్తూవుంటారు. ఎంతవైవిధ్యము వున్నప్పటికీ హిందూమతంలో ఏకత్వమనే వేదాంత తత్వభావం అగ్రగణ్యమైనది. అద్వైత హిందూ ధర్మవాహిని మానవ కంకాళభరిత విశుద్ధ గంగా వాహినివలె ఘనమై విస్తారమై పాపపుణ్యాలను అతిక్రమించి పోతున్నది.

హిందూ ధర్మంలోని బ్రహ్మము, పారసీకార్యులకు జొరాస్టర్ ప్రవక్త చెప్పిన ఆర్మజ్డ్ కాదు. ఆర్మజ్డ్ యుగాల తరబడి అహ్రిమునితో వెలుగుకోసం యుద్ధం చేసినాడు. మిల్టన్ కవీంద్రుడు దేవదానవ యుద్ధం వర్ణించినాడు. ఆయన 'పారడైస్

ది లాస్ట్' అన్న మహా కావ్యలో సైతాను భగవంతునితో సమరం జరుపుతాడు. పరబ్రహ్మ నైతికవిధుల్ని శాసించే టటువంటిన్నీ పాపాచరణం చేసిన ఇశ్రాయేలును దండించేటటు వంటిన్నీ జెహోవా దేవుడు కాడు. పరబ్రహ్మ సగుణమై సృష్టి స్థితి లయకారకుడై బ్రహ్మ విష్ణు మహేశ్వర పదవాచ్యు డవుతున్నాడు. పరబ్రహ్మ అంటే సర్వత్రా వ్యాపకమైన తత్త్వము. సమస్తములో అంతర్యామిగా వున్నాడు. సర్వాన్నీ అతిక్రమించినాడు. పరబ్రహ్మమే నేను, నీవున్నూ సమస్త మున్నూ. యుష్మత్ అస్మత్ ప్రత్యయాలు పారమార్థిక స్థితిలో కల్పితాలు మాత్రమే. పరబ్రహ్మమనేది శాశ్వత సత్యము. మాయ ఆయనకు వశమైన శక్తి. సగుణ బ్రహ్మము జగదుపాదాన నిమిత్తకారణము. శాంకర వేదాంతమతంలో వివర్త కారణము.

హిందూధర్మంలో విశ్వవిస్తృతమయిన అజ్ఞానం గుర్తించి సైతాను రూపంగావున్న అజ్ఞాన ప్రసక్తి తీసుకొని రావచ్చునా? (భయంకరుడయిన ఆర్మజ్ద్ ప్రసక్తి?) బాధాత్యాగములు, రక్తపాతం వుంటూనే వుంటవి. అయితే విశ్వసృష్టి మానవోపయోగం కోసం కాదు. విశ్వజనీన ధర్మం మానవ కల్యాణాన్ని పురస్కరించుకొని ఏర్పడిందికాదు. పరతత్త్వానికి మానవ శ్రేయస్సుతో సంబంధం లేదు. సైంట్ జాన్ వక్త్రాగ్రణికి తోచిన హేతు విలసిత జ్ఞానధార పరబ్రహ్మకాదు. హేతుజ్ఞానాన్ని పరతత్త్వం అతిక్రమించింది. ఆరంభంలో బ్రహ్మ శబ్దరూపంగా వుంది. అది ప్రణవము. పరతత్త్వము మనోవాక్కులకు అతీతము.

శబ్దానికీ అతీతమే. అది ఆరంభంలో అవ్యక్తము. బ్రహ్మము ఓంకారమే. సర్వవిషయ వృత్తికీ, జగదాభాసకూ వెనక అధిష్ఠానమైనది బ్రహ్మ. అది చలనరహితం. బ్రహ్మ సాకారమై సగుణమై విశ్వసృజన సందర్భంలో సర్వశక్తివంతుడు సర్వజ్ఞత్వాది విశిష్ట లక్షణాలు కలవాడు. కాని, కేవల తత్త్వభావనలో బ్రహ్మము నిరాకార నిర్విశేష చిన్మాత్రము.

నాలో నేను అనుకొన్నాను—' పరమేశ్వరుడు బ్రహ్మ, యాదార్థ్యము. మానవుల పురుషార్థాలను బట్టి యోచించినా ఈశ్వరుడు యదార్థము. అయితే పరబ్రహ్మ పురుషార్థాలకు అతీత తత్త్వము. కాళివలె బ్రహ్మభీకరమై కరాళమైనది. బ్రహ్మకు మృత్యువు కూడా వణకిపోతుంది.' 'మృత్యోర్ధావతి పంచమ ఇతి' అని శ్రుతి నిర్వచిస్తుంది. రష్యనులు, రసపుటిన్ అనుయాయులు ఇదేవిషయం ఉద్ఘాటించారు. పుణ్యపాప ద్వైత బుద్ధిని నిరసిస్తూ తార్కిక హేతుజ్ఞానాన్ని అద్వైతవాదాన్ని పురస్కరించుకొని రష్యనులు కూడా వేదాంతతత్త్వాన్నే ఉటంకించినారు—' అని

హిందూ ధార్మిక దృక్పథంలో అన్యమత సహిష్ణుత అత్యధికంగా ఉన్నది. సహిష్ణుతకన్న త్యాగశీలము మహోన్నతమైనది. బుద్ధభగవానుని సహిష్ణుతను కూడా అతిక్రమించిన అంగీకారమది. పాపమనేది క్షణికమూ నిజమూ అయితే, బ్రహ్మమూ యదార్థమే! అప్పుడు మోక్షసాధన ఎందుకు? పాపాతిక్రమణకు కర్మసన్యాసం ఏల? ఏది ఇంతకన్న అవినీతి? తరంగరహితమై గంభీరమై వరదలై ప్రవహించే గంగా స్రవంతి వలె నా భావన విరాజిల్లినది.

భగవంతుని పవిత్ర వాతావరణం నిజంగా ఎంత అద్భుతం! ఆహార నిద్రాది భోగాలకు అతీతుడై యోగి పరమేశ్వర సర్వాంతర్యామిత్వము అనుభవిస్తాడు. "పాషాణాన్ని లేవనెత్తు; అక్కడ నన్ను తప్పక చూస్తావు, వృక్షాన్ని చీల్చు; నేనక్కడ ఉన్నాను." అనే ఆర్యోక్తివలె ఎక్కడ చూచినా పరమేశ్వర పవిత్ర సన్నిధానమే! అది అద్భుతం!—కాని భయోత్పాతం కాదు. అది అజరూపమయిన పాన్ (ఒక దేవతారూపం) కాదు. అది కాళీమాయి కాదు. కళోపాసకులు సహేతుకంగా తామస రాక్షస ప్రవృత్తిని అజరూప ప్రకృతి దేవతగా 'పాన్' గా భావించినారు. క్షణభంగురాలయిన మేలి తెరల వెనుక సత్యమున్నది. అది బుద్ధికి అతీతశక్తి మాత్రమే కాదు. అయితే హేతుజ్ఞానవిలసిత శ్రేయోదాయక యదార్థ్యమది. క్రైస్తవ హఠయోగం (మైస్టిసిజమ్) యూదీయ ఇస్లామియ యోగ మర్మమువలె విశిష్ట శుభదాయక శక్తినే నిశ్చయం చేస్తున్నది. వాసనా కామరహిత కర్మాచరణమునకూ ప్రాకృతిక శక్తికీ, యాదార్థ్యానికీ విలువ ఉన్నది. సర్వశక్తిశాలి శుభంకరుడయిన పరమేశ్వరుడు సర్వశ్రేయోదాయకుడు. ఇదే విశ్వాసమూ ప్రణిధానమునూ.

బ్రహ్మానుభవాన్నిబట్టి అజ్ఞానపాపాల బాధాకరాలు. గేటే జర్మన్ కవీంద్రుడు అజ్ఞానపాపాలను ఆత్మానుభవ నిరోధకాలని చెప్పినాడు. యదార్థమని తోచేదాన్ని ఆభాస అంటారు. ఆభాసే "రియలిజం" (యదార్థవాదం) అని మానవులు అంటారు. బుద్ధికి నిశ్చయజ్ఞానం కలగనంతవరకూ ఆభాస నిజమనే

తోస్తుంది. కానీ, కేవల యదార్థం "రియలిజమ్" కాబోదు. అజ్ఞానం వ్యతిరేక ధృవప్రవాహం. క్షయం, ఆభాస అదేమాయ. (వ్యావహారిక ప్రపంచదృష్టి కలిగిన మనకు మాయ యదార్థంగానే ఉంటుంది. మాయగా తోచదు) పరమేశ్వరుడు మాయను వశంచేసుకొన్నవాడు. వశీకృత మాయాశబలిత బ్రహ్మ జగత్తును సృజించాడని అంటున్నాం. జగద్రూప పరిణామం జరుగుతున్నా పరమేశ్వరుడు పరిణామ క్షయాలకు విలక్షణుడు అతీతుడూ అయి ఉన్నాడని మనం గుర్తించాలి.

హిందూ సిద్ధాంతాన్ని బట్టి జగత్తు ప్రవాహం వంటిది. ప్రవాహరూప క్షణిక జగత్తులో శాశ్వతమయిన సత్యార్థం ఉంది. బ్రహ్మసద్రూపం, అది త్రికాలాబాధ్యం. పురుషార్థాలకు అతీతం. ఈజిప్టు, గ్రీకుదేశీయుల తత్వశాస్త్రాన్ని బట్టి శాశ్వతమయినదే విలువ అయినది. అట్టివిలువయినదే శాశ్వతమయినది. ఈతీరుగా డ్యూటరోమీ 33 అధ్యాయంలో ఇలా లిఖింపబడింది. "విశ్వంలో మానవ శ్రేయోదాయకాలైన విరాట్ పురుషుని శాశ్వత బాహువులు ప్రసారితాలైనవి." ఒకానొక జెసూట్ పండితుడు 'క్రైస్తవ మతధర్మ ప్రతిపాదిత స్వారాజ్యము భారతీయ వేదాంత తత్వాధారంమీద నిర్మాణం కాగలిగినది. భారతీయ సిద్ధాంతం యవన తత్త్వంమీద స్థాపన చేయడానికి వీలయ్యేదే (?)' అని అన్నాడు.

ఏమైనా ఏ సిద్ధాంతాలయినా ఆదినుంచీ పరంపరాగతంగా వస్తున్నా సత్య ప్రతిపాదకాలే. భారతీయులకు శివుడు బ్రహ్మలో ఒక అంశ. ప్రపంచలయం బ్రహ్మకు ఆరోపించినప్పుడు శివుడవుతున్నాడు. విశ్వస్థితి చెప్పినప్పుడు విష్ణువు. విశ్వ సృజన

కాలంలో నిర్గుణ బ్రహ్మ సగుణ బ్రహ్మగా చెప్పుకొంటాము. పాశ్చాత్య సిద్ధాంతంలో అఖిల సృష్టికారకుడు రాక్షస ప్రవృత్తిని సృజించినాడు. సృష్టికర్తతో రాక్షస తామసికవృత్తి దురహంకార గర్వంతో సంఘర్షణ చేస్తుంది. సనాతన హిందువుకూడా ఇలా చెబుతాడు—'ఎవరయితే మానవుడై వానర వ్యాఘ్ర ప్రకృతుల్ని ఆరాధిస్తూ వ్యవహరిస్తాడో, వాడు జన్మాంతరంలో ఏ కపిగో వ్యాఘ్రమో కావడం తప్పదు. కర్మానుభవం తప్పదు. పాపాచరణకు ప్రతిఫలం నరకానుభవం. ఆ అనుభవం లలాట లిఖితం. ప్రత్యవాయం వల్ల దండన అనుభవించాలి. పాపమూ దండనా ఉంటవి. ప్రత్యగాత్మసారం అంటే ఏమిటి? ప్రేమే ప్రత్యగాత్మసారం. ప్రేమే ఆనందం. ఉపనిషత్తులు కూడా అలాగే చెబుతవి. ఆనందం వల్లనే సర్వభూతసృష్టి జరిగినది. ఆనందం వల్లనే సూర్యాది గ్రహనక్షత్ర కోటులు చరిస్తున్నవి. ఆనందమే ఆత్మతత్వం. పరిణామ వికార వికారములనూ, విష్ణు శివత్వాలనూ మించిన పరతత్వం అదే! ఓం ప్రకాశ ఘోష 'బాపూజీ దృష్టిలో భగవానుడు ఆనంద స్వరూపుడని, ప్రేమ స్వరూపుడని ' నాతో పలికినాడు. (అంటే ఏమిటని అడిగినాను)

ప్రవాహం పోటుగావుంది. నిశ్శబ్దంగా మేము గంగా ప్రవాహాన్ని అనుసరించి ప్రయాణిస్తున్నాం. మందిరాలు కొన్ని వెన్నెలవలె పాలరాతివి, కొన్ని రక్తరంజితమైనవీ ఒకొక్కటే చూస్తూ క్రమక్రమంగాముందుకుసాగిపోతున్నాము దేవాలయాలు ఎర్రనివిమానాలతో కొన్ని బంగారు పూతతో, కొన్ని స్వర్ణగోపురాలతో హైందవ శిల్పం ప్రకటిస్తున్నవి. దేవమందిరాలలో

నదీతీరాన వెన్నెలలో కాశీ స్వర్ణ దేవాలయం స్పష్టంగా కన్నులు మిరుమిట్లు గొలిపేటట్లు కానవస్తోంది. ఆలస్యంగా నదీ ఘట్టాలకు స్నానానికని వచ్చిన స్త్రీ పురుషులు నుదుట తిలక రేఖలతో కనపడుతున్నారు. మా పడవ కలాసు నొసటకూడా అటువంటి బొట్టే ఉన్నది. కొందరు వైష్ణవ సాంప్రదాయ రీత్యా నామాలు తీర్చినారు. మరి కొందరు శైవ సాంప్రదాయకులు విభూతి ధరించారు. సృష్టి స్థితి లయకార కారణభూతమైన శివుని త్రినేత్రము పగిది అక్కడి వనితలంతా ఔదల రక్తరంజితమైన చక్కని సింధూర బిందువు దాల్చినారు. తీరమున ప్రజ్వరిల్లే భీష ణాగ్ని తేజస్సులో మానవ శరీరాలు స్పష్టంగా కనపడుతున్నవి. కుక్కాకారం కూడా కానవస్తున్నది. నేను నాలుగు అగ్ని హోత్రాలు లెక్కవేశాను. కొందరు చితుకులతో ఖంగారుగా ముందుకూ వెనక్కూ పరుగెడుతున్నారు. కొందరు నిస్తబ్ధులై నిలబడి ఉన్నారు. ఆమంట లేమిటోకావు—శవదహన జ్వాలలు! ఇదే కాశికానగరీ శ్మశానవాటిక.

పట్టణం పొలిమేరవరకూ మేము వెళ్లినాము. తదుపరి నెమ్మదిగా వెనక్కు తిరిగినాము. మా పడవవాడు పడవ వెనక్కు పట్టించి వడివడిగా తెడ్డు వేస్తూ ప్రవాహానికి అభిముఖంగా పోనిస్తున్నాడు. నా మిత్రుడు మహాత్ముని గురించీ, జననమర ణాలను గూర్చి మాట్లాడుతున్నాడు. మళ్లీ శ్మశానవాటికా తీరం చేరినాము. ప్రతి రాత్రి శవాలు భస్మం కాకపూర్వమే పవిత్ర గంగోదకంలో తోసివేస్తారు. ఆ జలమే భారతదేశ సస్యాభి వృద్ధికి కారణం అవుతున్నది. మేము తిరిగి పడవలో ప్రయాణం

చేస్తున్నప్పుడు తొమ్మిది చితాగ్నులు చూచాను. పేర్చిన కట్టెల మీద శవ దేహాలను స్పష్టంగా చూచాను. క్రమక్రమంగా మృత శరీరాలు దగ్ధమవుతున్నవి. నా మిత్రుడు ఆ దృశ్యాన్ని చూపుతూ డాంటేకవి కావ్యంలో నరక దృశ్యం గూర్చి ప్రస్తావించినాడు. అయితే ఈ శ్మశానాన్ని దుష్టులనిమిత్తం ఏర్పర్చబడినది కాదు. 'కాశ్యాంతే మరణాన్ముక్తిః' అని అంత్యకాలంలో గంగాతీరమున దేహత్యాగం చేయాలని ఎన్నో జీవాలు సిద్ధ మవుతవి.

'దరిద్రులుకూడా కాశీలో దేహయాత్ర చాలిస్తే పునర్జన్మమందు వారు సుఖంగా వుంటారా' అని నేను వింతగా ఆలోచిస్తున్నాను. బహుశా దరిద్రులు పాదచారులై అహోరాత్రాలు వీధుల్లో దిమ్మతిరిగి కాశీలో పుణ్యం మూట కట్టుకొంటారేమో! రాత్రివేళ వీధుల్లో మెట్లమీద ఆవులూ ముష్టివాళ్లూ మిత్రులవలె పడివుంటారు. వాళ్లందరికీ పుణ్యం వస్తుందా—కాశీ నివాసంవల్ల?

# అధ్యాయం 6

పడవకళాసు ఈసారి ప్రవాహానికి ఎదురుగానే కొంచెం నెమ్మదిగా పడవ పోనిస్తున్నాడు. అటు నా స్నేహితుడు భావనా ప్రవాహంలో కొట్టుకొని పోతున్నాడు. ఇటు నా తలంపులు చూస్తే దరిద్రులూ ఆవులనుగురించి పోతున్నవి. భారతీయులు గోపూజ గోసంరక్షణం చేస్తారు. ఈ సందర్భంలో వారి దృక్పథం పాశ్చాత్యులకు బోధపడడం కష్టం. గాంధీ మహాత్ముడు కూడా గోరక్షణ విషయంలో అంత పట్టుగా ఎందుకు వున్నాడో, హిందువులు గోరక్షణ విముఖులయిన ముసల్మానుల్ని ఎందుకు సహించలో పాశ్చాత్యుడికి సులభంగా బోధపడదు. ముసల్మానులు గోవధచేసి మాంసాశనంచేసే ప్రవృత్తికూడా తెల్లవాళ్లుతెలుసుకోలేరు. మహాత్ముడు మాంసాహారులపట్ల ఉద్రిక్తుడై నరమాంస భక్షణలాగ భయోత్పాతంగా వర్ణిస్తాడు. చైనాలో ఆవు నున్నగా తళతళలాడుతూ వుంటుంది. కాని భారతదేశంలో గోవు అంత ఆకర్షణీయంగా వుండదు. అది బక్కచిక్కి సాధువై హిందువుల జాలి చూరగొంటుంది. భారతీయులు గోపూజ చేసినా పశువుల ముక్కులకు తాళ్లుపోసి బరువైన బండ్లు లాగిస్తూ సాంకేతిక విజ్ఞానం తెలియని విపరీతమైన అజ్ఞానం ప్రకటిస్తారు. ఇటువంటి స్థితిలో పాశ్చాత్యులకు భారతీయుల దృక్పథం సుబోధంకావటం చాలా దుర్లభ విషయం.

కాని కరంచంద్ గాంధీజీ ఇలా రాసినారు—"అనేక విధాల గోమాత మన జన్మకారణమైన ధాత్రికన్న మిన్న. మన మాత రెండేళ్లపాటు మనకు పాలిస్తుంది. మనం పెరిగి పెద్ద వాళ్లం కాగానే మాత మనసేవకు ఎదురుచూస్తూ వుంటుంది. గోమాత మననుండి ఏమీ కోరదు—కేవలం కాస్త గడ్డి—గాదం వినా."

గోవు జీవనైక్యాను సంధానానికి ఒక సంకేతం. సమస్త మయిన ఉనికిలో ఐక్యతకూ గోవు సంకేతం. తమ హక్కుల్ని రక్షించుకోలేని, కోరలేని సాత్వికులైన అమాయకులు గోవుల్లాంటి వారే. కనుక సాత్విక గుణాన్ని గోరూపం తెలియ చేస్తుంది. ఫెడరిక్ నీషే అనే జర్మన్ తత్త్వవేత్త "గోవులు, స్త్రీలు, క్రైస్తవులున్నూ" అంటూ అందర్నీ ఏకంచేస్తూ ఒకానొక రసవత్తర ఘట్టంలో వ్రాకుచ్చినాడు. భారతదేశం పర్యటించిన వారు మండుటెండలో పచ్చిక బయళ్లలో గోవుల్ని మేకల్నీ చూస్తారు. ఆర్యులు గోవులనే వాహనాలుగా చేసుకొని వాయువ్య దిశగా భారతదేశం ప్రవేశించారని స్పష్టంగా చెప్పవచ్చును. ఆర్యులు గోక్షీరంవల్ల జీవించారు. గోవులే లేకపోతే వారు చనిపోయేవారే. ఇందులో సందేహంలేదు.

అలాంటప్పుడు భారతజాతికి గోవు పూజార్హము కావడంలో ఆశ్చర్యం ఏముంది? భారతీయతకు గోమాత పవిత్ర చిహ్నం. ప్రజాసామాన్యంలో గోవుపట్ల వున్న పూజ్యాభావం అత్యధిక మైంది. గోవు పృథివీసమానము. అది విశ్వధారిణి. గోవును భావసంకేతంగా గ్రహించినప్పుడు హేతువుకు తావు లేనేలేదు

అంటారు గాంధీజీ. గోవును కేవల ఒక 'వస్తువు'గా అర్థం చేసుకోమనడం హిందువును అగౌరవించడమే అవుతుంది. సనాతన యూదుణ్ణి పందిమాంసం తినమని బలవంతం చేసినంత అపచారం.

ఆంగ్లేయులకు సింహం ఎలా జాతీయచిహ్నమో, అలాగే గోవు భారతీయతకు సాంకేతమని మనం తెలుసుకున్నాము. ఇక్కడ ఆంగ్లేయుల జాతీయ చిహ్నం సింహమైనంత మాత్రాన అది వీరావేశంతో ఘర్జిస్తూ వీధుల్లో తిరిగే జంతువు కాజాలదు కదా! అది కేవలం సామ్రాజ్య ప్రతిపత్తి సూచించే గుర్తు. అలానే గోవు భారతీయతకు, హిందువుల సాత్విక, ధార్మిక బుద్ధికీ నిదర్శనము వంటిది. భారతీయ దృష్టినిబట్టి ధర్మం నాలుగుపాదాల నడవవలె. అనగా ధర్మస్వరూపాన్ని గోరూపంగా భారతీయులు భావనచేస్తారు. ఆ గోవు వారికి పరమ పవిత్ర మయినదే కాని సామాన్య వస్తువు కానేరదు. ఆర్యులకు గోవే మూలధనం. పాడిపంటలకు ఆధారం గోవు. సస్యాభివృద్ధికి కూడా గోవు సంకేతం. గోవుపట్ల క్రైస్తవం ఉదాసీనంగా వుంది. అది ఆ మతానికి లోటేనా? సర్వజీవ జగత్తులో ఐక్యత పాశ్చాత్యులు దర్శించక విస్మరించడం లోటు కాదా? ఈ సందర్భంలో ఆల్బర్ట్ స్విట్జరువంటి భూతదయాపరుడు 'లోట'నే అంటాడు.

మా పడవ తీరానికి వస్తున్నది. వెన్నెలగావున్నా వరద లయిన ఆవలితీరం అస్పష్టంగా కనిపిస్తుంది. పడవల రేవు దగ్గర మెట్లు అస్తవ్యస్తంగా, ఎగుడు దిగుడుగా వున్నవి. దేవాలయాలు కొన్ని నదిలోపల వున్నవి. ఆ గుళ్లూ గోపురాలూ నీటిలో సగం మునిగిపోయిన నల్లని ఏనుగుల్లాగ వున్నవి.

భారతదేశంలో నవీనమైన కట్టడాలు ఎంత అద్భుతంగా వున్నప్పటికీ వాటి ప్రక్కనే పురాతన శిధిలాలను కూడా వుండనిస్తారు. ఆ దృశ్యం భారతీయులకు చిన్నతనం కలిగించదు. ఇటీవలనే ప్రాచీన శిధిలాలను ఉద్ధరించే ప్రయత్నాలు జరుగుతున్నవి. భారతదేశం స్వాప్నిక జగత్తులో వుంటూ, భౌతికానికి దూరమయింది.

భారతీయులకు పవిత్ర గ్రంధం భగవద్గీతలో ఇలా ఉల్లేఖింప బడింది—

"చంపేవాడు, చంపబడేవాడూ లేరు. తాను చంపబడుతున్నట్టు తలచేవాడు, చంపుతున్నానని అనుకొనేవాడూ శుద్ధ అజ్ఞానులు. ఆత్మ అచ్ఛేద్యము"

"నదులు సముద్రములో సమ్మిశితమగు తీరుగా అతను శాంతి పొందుతాడు. కోరికలు అతని శాంత్యానుభూతిలో ప్రవేశంపొంది విచలించవు. అతను చలింపడు."

"ఎవడయితే కోరికలు విడిచి, సర్వకామనలకూ దూరమై నిస్స్వార్థుడై నిరహంకారుడు అవుతాడో, వాడు శాంతిసుఖం అనుభవిస్తాడు."

"సర్వసముడైనవాడు కర్మఫలం అపేక్షించక శాశ్వత సుఖం పొందుతాడు. ముక్తుడు కానివాడు కామబద్ధుడై కర్మఫల సంగి అవుతాడు."

"ఓ గుడాకేశా! నేను సర్వ జీవాల్లో అంతర్యామిగా వున్నాను. సమస్త జీవుల ఆదిమధ్యాంతములూ నేనే."

"నేను సమస్తాన్ని కబళించే మృత్యువును. పరిణామానికి నేను కారణ భూతున్ని"

"మోసకారుల తంత్రం నేను. అద్భుతాల్లో అద్భుతం నేను. నేనే విజయమూ దృఢసంకల్పాన్నీ, సత్యవ్రతుల సత్యం నేను."

"ఎవడయితే రాగద్వేష దుఃఖ కామ వాసనారహితుడో, పుణ్య పాప వర్జితుడో, వాడే నాకు ప్రేమాస్పదుడు."

"సర్వకర్మలూ నాకు అర్పణ చేసి, ఆత్మనిష్ఠుడవై, ఆశాపాశంనుంచీ దురహంకారం నుంచీ ముక్తుడవై యుద్ధ మొనర్చుము."

"నేనే నీవు. తత్త్వమసి. ఇదే జ్ఞానం."

నేనే నీవయినప్పుడు ప్రస్తుతం నేనూ నీవూ ఒకేచైతన్య మయినప్పుడు నేను నిన్నెందుకు బాధించాలి లేక హింసించాలి? సర్వభూతాలూ ఆధ్యాత్మికంగా ఒకే సత్త అయినప్పుడు, సర్వ జీవాంతరాత్మగా నేను వున్నప్పుడు ఏ ప్రాణికోటినీ నేను పీడించ కూడదు కదా! మరి జీవకోటి యావత్తూ ఏకమైన చైతన్యంగా భావించేటప్పుడు, హింసకారకుడూ హింసితుడూ ఒకే ఒక వస్తు వయితే, సర్వైక్యతలో ఇది పుణ్యమూ ఇది పాపమనీ నిరూ పించడమెట్లా? హంతకుని చేతిలో ఖడ్గముంటుంది, హత్య కావించబడేవాడు గగ్గోలు పెడతాడు. ఆ సమయంలో ఒకరిమీద ఒకరు నేరారోపణ చేసికోలేరు. అలాంటప్పుడు సర్వైక్యత సిద్ధాంతానికి కట్టుబడవలసినవా డెవడు, కట్టుబడేవా డెవడు?

హిందూ తత్వవిచారణ చేసేప్పుడు ఈ విషయం మళ్లా ప్రస్తావన చేస్తాను. గంగా ప్రవాహంలో ఒక జలకణం నుంచి మరో జలకణాన్ని వేరుచేయడం ఎలాగ? ఈ అసీమ జగత్తులో

పుణ్యపాప విభేదం కనుక్కోవడం ఎలాగ? కేవలం భేదమే వుంటుందా? కీర్తి అపకీర్తులు లేవా? ఫలానుభవమే కాని ప్రత్యవాయం లేదా?

నిద్రపోతున్న ముష్టివాళ్ల మధ్యనుంచి పడవదిగి బైట పడి నడిచినాము. 'గాంధీగారి దృష్టిలో యదార్థమైన మోక్షము సాధకుని అంతస్సులో వుంద' ని నా సహచర మిత్రుడు పలికె నాడు. అలాగే గౌతమ బుద్ధుడు అంటాడుకదా "ప్రియమిత్రుడా! వాసనాప్రేరితమైన ఈ హృదయాంతరాళంలో సృష్టి స్థితి లయాత్మక విశ్వమూ, జగల్లయ విధానమూ సమ్మిళితమై ఉన్నవి." అని.

మాకు పశ్చిమాన పడవలరేవు ప్రక్కగా ఆధునిక శిల్ప విన్నాణంతో గణేశుని విగ్రహముంది. భక్తి పారవశ్యములో మునిగితేలే భక్తుల తాళాలూ భజనలతో ఆ ప్రదేశం మారు మ్రోగుతున్నది. రేపు తప్పకుండావచ్చి ఈప్రదేశం పరీక్షించాలి. ఈ దేవాలయాలను గూర్చి మహాత్ముడు తప్ప అన్యులెవరూ ప్రస్తాపించలేదు. బహుశా నా దృష్టి సానుతాపమయమేమో కాని అక్కడ కావలసినన్ని చర్చిలున్నా ఒకదానికీ పేరు ప్రతిష్ఠలు లేవు.

నేను బసకు కారులో వెళ్లిపోవాలి. నా బసలో వరుం టాను. నా ప్రక్కనే సిమెంటుతో గచ్చు చేసిన స్నానాలగది వుంది. అందులో గుండ్రంగా తిరిగే వీవన వుంది. అంతా 18 వ శతాబ్దపు మధ్యమ తరగతికి చెందిన ఆంగ్ల సంసారస్త్రీ కాపరం చేసే పడక గదిలావుంది నా పడకగది. గోడల వేలాడే పటాల్లో వేట దృశ్యాలున్నవి. ఆ దృశ్యాలు డెబ్భైయేళ్లనుంచీ ఉంటు న్నటు నా అంచనా.

# అధ్యాయం 7

మండువేసంగి (ఏప్రియల్) సంధ్యవేళ కాశీలో ఒక మసీదు ప్రాంగణమందు తారట్లాడుతున్నాము. హిందూమతానికి గుండె కాయ అనదగు కాశికానగర మధ్యలో మసీదు గోళాకార శిఖరంతో విరాజిల్లుతున్నది. దాని విశాల ప్రాంగణంలో ఒక పురాతన వృక్షమున్నది. సాధారణంగా మసీదు ఆవరణలో తటాకం వుంటుంది. మసీదులు విశేషాలంకార శిల్పంతోవుండవు. వాటి అంతర్భాగాలు శూన్యంగా వుంటవి. మసీదులో ఒక ప్రార్థనా వేదిక వుంటుంది.

వారణాసిలో మసీదు మొగలాయీ చక్రవర్తి ఔరంగజేబు కట్టించినాడు. అనేకసార్లు ముసల్మానులు హిందూ దేవాలయాలను నాశనం చేశారు. శిధిల దేవాలయోద్ధరణం జరుగుతూవుంటే నాటి పాలకులు చూసీచూడనట్టు వూరుకొన్నారు. నేటికీ ఏ మసీదు పునాదులు చూసినా, గోడలను పరికించినా హిందూదేవాలయానికి సంబంధించినవే నని స్పష్టమగును. చివరకు ఒక హిందూదేవాల యాన్ని సర్వనాశనంచేసి ఔరంగజేబు కూడా మసీదుకట్టించాడు. నా హిందూ మిత్రుడు అన్నాడు : హిందువులు మసీదుల్ని అంతగా ధ్వంసం చేయలేదట. దానికి కారణం హైందవ ప్రతిభ అన్య సంస్కృతిని సమన్వయం చేసుకోడంలోనూ, అన్యులపై తమ ప్రభావం చూపడంలోనూ వుందట. కాని మధ్యయుగంలో

భారతావనిలోకి చొచ్చుకొచ్చిన ముసల్మానులు లెక్కలేనన్ని హిందూ దేవళాలను ధ్వంసం చేసినారు. దాని ఫలితమే కాశికా నగరి గంగాతీరాన కూడా కొన్ని మసీదులు ఆవిర్భవించినాయి. కాని వారి అసహిష్ణుతకు దేవాలయాలన్నీ పూర్తిగా తుడిచి పెట్టుకు పోలేదు. సరికదా మోడుబారిన మొక్క చిగిర్చి శాఖోప శాఖలుగా విజృంభించినట్లు శిధిల శకలాలనుంచి నవ్యాతినవ్య మైన గుడులూ గోపురాలూ అసంఖ్యాకంగా వెలసి విరాజిల్లు తున్నవి.

దేవాలయంలో అర్చన అయిపోయింది. అరగంటలో మమ్మల్ని తిరిగి రమ్మన్నారు. మేము అలాగే చేశాము. ముష్టి వాళ్లు భిక్షాటనం చేస్తున్నారు. పూవులు నివాళిగా అర్పించాలని దరిద్రులు ముష్టెత్తుతున్నారు. ఒక ఇంటి అట్టాలికలోంచి క్రిందుగా వున్న దేవాలయ ధ్వజస్తంభాన్ని గాలిగోపురాన్ని వీక్షించాము. పిమ్మట క్రిందికి దిగి ముష్టివాళ్లను తోసుకొంటూ గుడిదగ్గిరికి వెళ్లినాము. భక్తులు చాలామంది దేవాలయంలో సాష్టాంగ పడుతున్నారు. జనం కిక్కిరిసి పోయినారు.

ఈ దేవాలయం విశ్వేశ్వరునిది. నా పండిత మిత్రుడు ఇలా చెప్పినాడు. హిందూ ధర్మంలో ద్రావిడార్య సమన్వయం కనపడుతుందని. ఆర్యదేవతలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరు లకూ, ద్రావిడ దేవతలకూ సామరస్యం కలిగింది. ఈ దేవాల యంలో విశ్వనాధుడే శివుడు. హిందూ జిజ్ఞాస ఆర్య ద్రావిడ సమన్వయానికి పూనుకొని, నానా రూపాలతో వుండే దేవతా నీకానికి ఆధారంగా వున్న ఏకమయిన సద్రూపం తెలుసుకో వలెనని ప్రయత్నించి సాధించింది. ఆర్యులు చిచ్ఛక్తిని

ఆరాధించేవారు. ద్రావిడులు శక్తి ప్రతీకాలను ఏర్పరచుకొన్నారు. ప్రాచీనుల బుద్ధి భావప్రతీకాలను నిర్మించుకొనేది. సామాన్యులు కూడా భావ ప్రతీకాలను ఉపాసించేవారు. హిందువుల సహిష్ణుత అపరిమితం కాని, ముసల్మానులకు సహిష్ణుత ఏకోశానా లేదు. 'అల్లా' కు అపచారం జరిగితే వారెంతమాత్రం సహించలేరు.

విశ్వనాథుని విగ్రహం సందర్శించవలెననే జిజ్ఞాసతో ఆదుర్దాగా మిత్రునితో బయలుదేరాను. అతడు పూజారులతో మాట్లాడినాడు. నేను పరాయి జాతివాణ్ణి కనుక గర్భగుడిప్రవేశం ఆలోచించక మూడడుగులు దూరంగా నిలబడి స్వామి దర్శనం చేసుకొని చేతులు జోడించి నమస్కరించినాను. ఆలయంలో జనసమ్మర్ధం ఎక్కువగా వుంది. ముసిలీ ముతకా తోపిడిలో నలిగి పోతున్నారు. సంజవేళ అర్చన ఆరంభమైంది. మంగళ ఘోష వీనులవిందుగా లేదు. భక్తుల ఉద్రేకం మంగళ ధ్వనులతో తాండవించింది. నీగ్రోల కర్మకాండవలె తామసంగావుంది. గర్భ గుడి విశాల స్వర్ణకవాటాలు తెరిచినారు. జనం వెనక ఎలాగో వీలుచేసుకొని స్వామి దర్శనం చేశాను. తిరిగి పూజ రుద్రాభిషేకం జరుగుతున్నది. కొందరు బాహువులు చాపి సాలగ్రామం స్పృశించబోయినారు—శక్తిపాతంకోసం.

బహుకాలంనుంచీ హిందూధర్మం ప్రశంసార్హం కావడానికి ఏమిటి కారణం? అన్యసంస్కృతితో హిందూధర్మం సమన్వయమవుతూ వచ్చింది. రోమకమతంకన్న కూడా హిందూ ధర్మం సువిశాలమై అన్యమతసంస్కృతిని తనలో సరసంగా సమన్వయం చేసుకొన్నది. సహిష్ణుత ఉత్తమ గుణమని చెప్పడం సులభం.

రుద్రాభిషేక సమయంలో భక్తి భావోద్రేకం చూచిన తర్వాత నాలో నేను ప్రశ్న వేసుకొన్నాను. సహిష్ణుత ఎంతగా వుంటే ఉత్తమం? ద్వైతబుద్ధిగల ఔరంగజేబు దృష్టి సరియైనది కాదా?

గెరాల్డుహెర్డ్ తన 'ట్రెయినింగ్ ఫర్ ది లైఫ్ అండ్ స్పిరిట్' అన్న గ్రంథంలో సూక్ష్మదృక్పథంతో రాశాడు కదా "అనంతమైన పారమార్థిక జీవనమును అంతఃకరణం అనుభవించగల స్థాయిలో ఉన్నప్పుడు (సిగ్మండ్‌ఫ్రాయిడ్, డీ. హెచ్. లారెన్స్‌లు చెప్పినట్లు) ఆ మనసు భౌతిక కామవాసనకు దూరమై పరమాత్మతో ఐక్యం కావడానికి తపనపడుతూ, భేదభావమునకు కారణమైన స్వార్థాన్ని త్యజిస్తుంది. దీన్నే 'నికోడమస్ వాసనా ప్రవృత్తి' అంటారు. 'నికోడమస్ అన్వేషణ' అని కూడా అంటారు.

ఆయన ఇంకా ఇలా రాశాడు "ఆపరమాత్మతో పొందు కోరే జీవాంతకరణం ప్రవాహరూపమై నదివలె ఉండడానికి ఇష్టపడక అఖండమైన అనంతమయిన సముద్రంలో చేరి, సముద్రమై పోవలెనని తపిస్తుంది. అమరజీవనం కాంక్షిస్తుందే కాని నామరూప వ్యక్తిత్వం కోరదు, యథార్థ పారమార్థిక జీవనమే కోరుతుంది." ఈ మహా పురుషార్థాన్ని గ్రహించిన బుద్ధి తన పూర్వ బంధవిముక్తికై సాధన చేస్తుంది. ఈ స్థితిలో ఒక్కొక్క వ్యక్తి లక్ష్యప్రాయమయిన సౌందర్యం ప్రేమిస్తాడు. ఆ దివ్య సౌందర్యా రాధనతోపాటు ధర్మాచరణం నిష్ఠురమై సాధకుణ్ణి పరీక్షిస్తుంది. ఒక్కొక్క వ్యక్తి క్షణికములయిన అవాంతర ప్రయోజనాలతో కూడుకొన్న ప్రకృత్యుపాసన అది

హైందవమయినా యవనమైనా పరిత్యజిస్తాడు. యఫ్. యల్. లూకాస్ 'గ్రీకు కవితా సముచ్చయం' అనే గ్రంథారంభంలో "జగత్తు సుందరం, క్రూరం, మాయా మేయమూ అల్పమూ-(అఫ్రొడైట్, డైయోనిసస్, పాన్, సిలెసస్)-అయిన దానిలో సాధకుడు వయసుకాడు. ప్రతీకాలు యదార్థాలని నీ వెప్పుడయినా గ్రహించావా? ఈనాడు నీ ధర్మమూర్తులయిన దేవతలు వికాసం కోలుపోతారు. కాని మనం కవి లేఖినివలె, చిత్రకారుని కుంచెవలె ఇంకా యౌవనంతో రసికులమే." శివలింగం ధర్మ దేవతాదిక మూర్తుల సౌందర్యానికి బదులుగావున్న ప్రతీకంకాదు.

ఒకానొక సందర్భంలో లారెన్సు, హక్స్లీలు అన్నట్టు ఉపాసనలో కామవాసన క్రౌర్యమై మారి తన్మయతగానూ రసపు తత్వంగానూ పరిణమిస్తుందని బుద్ధిమంతులు గ్రహించగలరు. కాశీ విశ్వేశ్వరారాధనమే కాకుండా రక్తసిక్త కాళికోపాసన కూడా వుంది. కాముక లక్షణాలుగల విగ్రహాలు శక్తివంతాలు. వాటిని చూచి భావోద్రిక్తులై ప్రపంచానికి దూరమై విశ్వజనీనత అనుభ విస్తారు. యోని రూపమయిన పానవట్టమును పూజించడంలో విశిష్టమైన మానవత్వం యేదైనా వున్నదా? అని ప్రశ్న. సృజనేంద్రియాల రూపంలో వున్న సాలగ్రామ పానవట్టాల అర్చనలో మానవుడు మానవోత్తముడుగాను స్త్రీ స్త్రీరత్నముగానూ అవుతుందా? మానవిని భక్తికి శరీరమే ఆద్యమైన ధర్మసాధనం. తామసిక ప్రవృత్తులైన అహంకార క్రోధాలను స్ఫురింపచేసే ప్రతీకాలను ఆరాధన చేయడంకన్న శరీరమును ధర్మసాధనగా చేసుకోడం మంచిదే. ఏ ఉపాసన అయినా శరీరం ఆరోగ్యస్థితిలో

ఉన్నప్పుడే సాధ్యం. సాఫో కవియిత్రి అంటుందికదా "నేను ఏకాకినై నిద్రిస్తాను" అని. కాని సాహచర్యంకోసం విలపించడంలో కామవాసనా ప్రశంస ఎంతమాత్రం లేదు.

నాకు మార్గదర్శిగావున్న మిత్రుడు పురాతత్త్వ పరిశోధకుడు, అతడు నిరాశావాది. ఆయన కాశీ హిందూవిశ్వవిద్యాలయ పీఠంనుంచి వచ్చినాడు. ఆ పీఠానికి విఖ్యాత తత్త్వవేత్త శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు ఉపాధ్యక్షులు. ఆయన ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయంలో కూడా తత్వశాస్త్రానికి గురుపీఠం. కాశీ విద్యాపీఠం విశ్వేశ్వరాభిషేకమును నిర్లిప్తతతో, సహనంతో, జీవశాస్త్రీయ దృష్టితో వీక్షిస్తూ ఉంటుందనే అనుకొందాము.

నాలో నేను ఆశ్చర్య పడుతున్నాను: ఏమిటీ సహనభావమని? యరవాడ మందిరం నుంచి మహాత్ముడు ఇలా లేఖ వ్రాశాడు. "సహిష్ణుతలో ఉద్దేశ్యరహితమయిన భావము, అన్యమత విశ్వాసములు తన విశ్వాసంకన్న అల్పమైనదని. కాని అహింసాభావన అన్యమత విశ్వాసాలు వాటిలో లోటుపాటులు ఎన్ని ఉన్నప్పటికీ మనం గౌరవించాలనే బోధిస్తుంది."

గాంధీగారి శాంతిప్రియత తన సహనభావంనుంచి ఉద్భవించిందికాదా? క్రమశిక్షణాయుతమయిన అసహాయోద్యమంలో సహిష్ణుత ఉన్నదా? ఆ ఉద్యమంలో త్యాగశీలం వున్నమాట వాస్తవమే. కానీ, ప్రతికూల పరిస్థితుల పట్ల సహనం ఉందా? స్పష్టంగా మహాత్ముడు నాస్తికతను సహించలేనని రాశాడు. అలా అయితే అగ్రవర్ణాలవారు నిమ్నజాతుల యెడ ఏ సహన

భావం చూపుతున్నారు? సహనభావానికి వర్ణాశ్రమ వ్యవస్థలో తావున్నదా? గీత సహనభావం ప్రబోధిస్తుంది—సమస్తంలో ఏకత్వం ఉండటంవల్ల. గీత కర్మయోగం బోధిస్తుందా? స్వధర్మ నిర్వహణమే గీతోద్దేశ్యమా? కాగా, సహస్రాబ్దాల తరువాత అందరికీ గమ్యం ఒకటే అయితే స్వధర్మం ఆచరించవలసిన అవసరం ఏముంది? అని ప్రశ్న.

పుణ్యపాపాలు ఒకటేనా? తామస ప్రవృత్తుల్ని ప్రేరేపించే కాళికోపాసనమే మతమా? రసపుతత్వమునూ డయోనిసియస్ ఉపాసననూ, కాముక తన్మయతనూ, లింగయోని రూపంలో వున్న సాలగ్రామ పానవట్టముల అభిషేకాన్ని మతం ప్రోత్స హిస్తుందా?

భగవంతుని గూర్చిన ఈ జటిల సమస్యకు సమాధానం ఇచ్చేవా రెవరు? నామట్టుకు నేను (ఫాస్టు) కూడా సమాధానం ఇవ్వలేను. మెక్సికో దేశస్థుల తామసిక రక్తసిక్తాలైన మెనయిడ్ విగ్రహాలనూ, వామాచారాన్నీ చూచినాక నాకు రోత కలిగింది. ఈ దుష్ట వామాచార శాక్తేయులలో తామస కాముక ప్రవృత్తే అత్యధికం. ఇదేనా మానవ వ్యక్తిత్వంలోని శక్తి? ఈ దుష్ట వామాచారంలో ఆత్మశక్తి రూపుమాసి పోతున్నది. పోతే ఈ లింగయోనులవంటి ప్రతీకా లెందుకు?

"నికడమస్‌వలె ప్రతి మానవుడు తిరిగి మాతృగర్భంలో ప్రవేశించి జన్మించాలని కోరుతాడా? శిశువు నిద్రించాలని కోరు కొంటాడు. ప్రాణప్రదాయిని జగన్మాతని, నిర్వాణ సుఖదాయి ననీ, పద్మయోని; ఆనందస్థానంగానూ శ్రుతులు చెబుతున్నవి.

మానవు డెవడు ?—విజ్ఞానం, బుద్ధి, శక్తి కాక మానవు డెవడు ? మానవుడు పశువుల్లో ఒక ప్రకృతిగా సామాన్యులభావన. ఈ పశువృత్తే మానవుడి జీవశక్తి అవుతుందా? కాదు. పశుత్వము కాముకత్వమూ విజృంభించినప్పుడు మానవుడు ప్రాజ్ఞుడు కాలేడు కదా ?

రుద్రాభిషేక సందర్భంలో కామవాసన వున్నదనడం ఉచితం కాదు. భక్త్యావేశంలో మానవుడు ఆత్మోన్నతికి అభిషేకం చేస్తాడు. పద్మయోని సూర్యకాంతివల్ల సుందరరాగారుణ మవుతుంది. సూర్యకాంతి చైతన్యరశ్మి. చైతన్యమైన సూర్యోదయంవల్ల పద్మం వికసిస్తుంది. కేవల పద్మాన్నే కాక చైతన్య సూర్యోపాసన కూడా జరుగుతుంది.”

అన్నిటికీ సర్దుకొని పోయేవాడు ఇలా అంటాడు : “లింగాభిషేకం చేసేవాళ్లను, గోవును జగన్మాతగా ఉపాసించే వాళ్లను అసహ్యించుకోడం శ్రేయోదాయకం కాదు. నీవు ఎంత సేపూ భౌతిక విజ్ఞానంతో తల మునకలవుతున్న, శక్తి సముపార్జనలో వున్న పాశ్చాత్యదేశాలను చూచి మురిసిపోకు.” ఇలా అనేవాడు కేవలం మిధ్యావాది. సోత్కర్షకాదుగాని, నేనూ (ఫాస్టు) చాలా అనుభవాన్ని ఆర్జించుకున్న వాణ్ణి. వినయ విధేయతల్లో కూడా నేను ఎవరికీ తీసిపోను. పరమత విశ్వాసాలను తృణీకరించే వాణ్ణికాను. వాటిపట్ల నాకు ప్రత్యేకమైన ద్వేషం ఏమిలేదు. డయోనిసస్, డిమెటర్, అష్టరో, కాళీ, జగన్మాతోపాసనల్లోని తన్మయత్వాన్ని కూడా నేను గ్రహించే వున్నాను. ఆసిరిస్, ఇసిస్ దేవతలు మాత్రం సస్యాభివృద్ధికి కారకులు కావా ? అలాంటి ఉపాసనవల్ల మానవునిలో కౌటిల్యం క్షీణిత మవుతుంది.

సామాన్యుల దృష్టిలో మేరీ మేగ్డలీన్ పతిత. కాని ఆమె అంతరంగంలో భక్తి అధికం. కనుకనే ప్రభు సన్నిధానంలో హృదయార్పణచేసి ధన్యురాలయింది. మాగ్డలీనా భక్తి జర్మనుల సూర్యశక్తి ఉపాసనలకన్న మిన్నయైనది. వ్యక్తిగతంకాని తీవ్రశక్తికి మానవుని ప్రేమహృదయం ఆహుతి అవుతున్నది. రాక్షసుల్లో, భూతాల్లో శక్తివుంది. నాకు (ఫాస్టు) అపరోక్షానుభవం ఇక్కడ కనపడలేదు. ఆటవిక వామాచారాలు తప్ప, బ్రోకన్ కొండలమీద డ్రూయిడులనేవారి వనదేవతారాధనమూ, ఆటవిక నృత్యమూ ( గేటే కవీంద్రుని ఫాస్టు నాటకంలో ప్రథమ భాగం—21 దృశ్యంలో ) తదారాధకులకు సహజంగానే ఉంటుంది. కనుకనే అలాంటి ఉపాసనలు చేస్తారు.

అటుపిమ్మట నేను విశ్వేశ్వరాలయం విడిచి నా హోటల్లో సంజవేళ భోజనానికి సిద్ధమైనాను.

# అధ్యాయం 8

విశ్వనాధాలయానికి కొన్ని మైళ్ళదూరంలో, జనసమ్మర్ధమయిన కాశికా నగరోపాంతాన హిందూ విశ్వవిద్యాలయం వున్నది. మా మోటారు కదలడానికి వీలులేకుండా ఆబాలగోపాలం ఎదురైనారు. ఒంటెలు వ్యాపార సరుకుతో విపణివీధుల నుంచి బారులు తీర్చినవి. ఒకవైపున విశ్వవిద్యాలయ పుస్తక విక్రయ శాలలు వున్నాయి.

విద్యాపీఠం ఆవరణం సువిశాలమైనది. ఆవరణ ప్రవేశ ద్వారం దగ్గిర రేకు బోర్డుమీద విశ్వవిద్యాలయమనే అక్షరాలున్నవి. బోర్డు తుప్పుపట్టి సగం చెడిపోయి చూడ అసహ్యంగా వుంది. ఇక్కడివారు ఇట్టి అందవికార దృశ్యాలను ఎలా సహిస్తారో? ఈ దేశంలో విపరీతమైన రసికతా వ్యత్యాసాలున్నవి.

ఏమైనప్పటికీ కాశీ విద్యాపీఠ భారతీయ జీవనంలో విశిష్టమైనది. కాగా జగద్విఖ్యాత భారతీయ దర్శన చరిత్రకారులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు విద్యాపీఠానికి ఉపాధ్యక్షులుగా వుండటం విద్యాలయం మరింతా వాసిగాంచినది. పరిసర ప్రాంతాలలో దేవాలయ కోలాహలం ఉప్పతిల్లుతూ వుండగా కొద్ది మైళ్లలో సాత్విక సనాతనమూర్తి అస్పృశ్యు తత్వాచారుడైన

రాధాకృష్ణులు శాంతంగా విద్యాపీఠ కార్యకలాపాలు నిర్వహిస్తు న్నారు. ఆయన ఇచ్చే సందేశం ఏమిటి? కోటానుకోట్ల సామాన్య ప్రజానీకంతో, రాజాధి రాజులతో, వామాచార శాక్తేయులతో, మహాత్ముని ప్రేమమూలక మత సహనంతో వున్న భారత చరిత్రానికి, ఆయనచేర్చే అనుబంధం ఏమిటి?

1920 లో రాధాకృష్ణులు ప్రకటించిన 'కలికి' అనే గ్రంథంలో వారిదృష్టి విశద మయినది. అది సనాతన బ్రాహ్మణ విద్వాంసుని దివ్య రచనగా ఎంచవచ్చు.

ఆయన పాశ్చాత్య ప్రపంచ స్థితినీ సామాన్య పాశ్చా త్యుని బుద్ధినీ గ్రంథారంభంలో ఇలా ఉల్లేఖించినాడు "సర్వ లోపాలను సవరించి వేదనాశ్రువుల్ని తుడిచివేసినప్పుడు ధర్మ ప్రపంచావతరణకైన మన పరితాపము ప్రకృత ధర్మగ్లానిని తెలియ చేస్తున్నది. ఆస్తికతా నిరూపణచే ప్రమాణాలు మాకు కనబడటమూ లేదు, 'ఇడుగో ఈశ్వరుడు, అడుగో ఈశ్వరుడు' అని నిర్దేశింపనూ లేకపోతున్నాము. ఇలాంటి పరిస్థితులలో ఎవడయినా నిస్సహాయుడై భగవద్విశ్వాసం అవలంబించి నప్పుడు ఆశ్చర్య పడనవసరం లేదుకానీ, విచారింపవలసిన విషయం—అట్టివారి విశ్వాసం ప్రవాహ మగ్నుడైనవాడు గడ్డిపరకను చేత బూనినటువంటిది. వేదాంతులు స్వార్థపరులై ఏమి ప్రబోధించినా....ప్రాచీన దర్శనశాస్త్ర గ్రంథాలను నవీన రీతిగా వ్యాఖ్యానించటం ప్రాచీన సంస్కృతిపట్ల గౌరవాన్ని ప్రదర్శించడమే కాని చిత్తశుద్ధిని నిజాయితీని మాత్రం కాదు."

"అంతేకాక, పారిశ్రామిక యుగం మానవుల్ని ధనో పాశకులను చేసింది. వాస్తవానికి మనం ధనికుల మైనకొద్దీ మనం సూచికా వివరద్వారం నుంచి వెళ్ళిపోవలెను." బహుశా రాధాకృష్ణులు ఈ హెచ్చరిక పాశ్చాత్యఖండంలో నిరాశా వాదు లచే కావించబడే కుతర్కాన్ని ఉద్దేశించి చేసి వుంటారు.

అదే దృక్పథంతో రాధాకృష్ణులు ఇంకా స్పష్టంగాను, నిర్మాణాత్మకంగానూ యొనర్చిన సమీక్షను ఇలా పరికించండి. "ఒక కోతి బైసికిలు తొక్కడం నేర్చింది. గ్లాసుతో తాగటం నేర్చింది. పొగచుట్ట కాల్చటంలో అది దిట్ట. అయినా కోతి కోతే కదా! సాంకేతిక ప్రావీణ్యానికి నైతికాభివృద్ధితో నిమిత్తంలేదు"

మానవుడు సాంకేతిక ప్రావీణ్యంలో దేవదేవుడు కాక నిత్యజీవన వ్యవహారంలో వానరంగా ప్రవర్తించి నప్పుడు, మనము లక్ష్యాలు విషయం యోచించాలి. మన సాధనలు వక్రంగా ఉండకూడదు. లక్ష్యంలో లోటుపాటులు ఎలా నిర్ణయించడం! సహేతుకంగా బుద్ధిచేసిన నిర్ణయం అతి సంకుచితంగా వుంటుంది. పూర్ణమానవుడు మహా మానవత్వాన్ని దృష్టిలో వుంచుకొని విశాలమైన మహోదారమయిన సమాధానానికి రావాలి.

సర్ రాధాకృష్ణులు ఇంకా ఇలా రాశారు "మనం మత ధర్మ దూరులం కాలేము. మనము మానవప్రకృతిలో నానాత్వం అంగీకరించి నప్పుడు, అనేకరీతుల భగవంతుని కోసం మొర పెట్టుకోడం గ్రహించగలం. భావికాలంలో మతము అతివిశాలమై ధర్మచింతగల భావుకులకు సంపూర్ణ స్వేచ్ఛ ఇవ్వవలె. జీవిత ధర్మాను లక్ష్యం ఆనందంకాదు—శ్రేయప్రాప్తి"

"ధర్మ నిర్ణయానికి జీవితము అంకిత మొనర్చటం శ్రేయోదాయకం" ఆయన హిందువువలె ఇలా రాస్తున్నారు. "హింసను అనుసరించి తీరేది ప్రతిహింస. ఇది 'సత్యం' దాని సరస నిలవడానికి సావకాశంలేదు .. .......... ప్రపంచ శాంతి భద్రతలకు మహోన్నత మతాదర్శమే ఆశాదాయకమగు రాజకీయ సాధనంగా తోస్తున్నది." ఇటువంటి భావాలతో రాధాకృష్ణులు గాంధీగారే మానవజాతికి ఉపదేష్టగా ఉద్దేశించి ఇలా నిర్వచించారు. "సన్యాసులు మూర్తీభవించిన మానవాంతరాత్మలు. వారు సామాన్య మానవాళికి మార్గదర్శకులై పరమ పురుషార్ధ సాధనాన్ని మన స్మృతిపదానికి తీసుకొని వస్తారు.... ఇలాంటి ముక్తజీవులు సామాన్య ధర్మశాసనాలకు అతీతులు. యుద్ధంవల్ల ఉత్పన్నమయ్యే కష్టనష్టాలను వారు ముందుగానే గుర్తించి లోకాన్ని హెచ్చరిస్తారేకాని, శాంతిభద్రతల సంరక్షణకని రాజ్యరథాన్ని బ్రహ్మవేత్తలు స్వీకరించి శాసించరు."

సర్ సర్వేపల్లి భావాన్నే గాంధీజీ కూడా (16 సెప్టెంబరు 1927-యంగ్ ఇండియాలో) ఇలా వ్యక్తపరిచారు-"నా అహింసా సిద్ధాంతం తీవ్రమైన కర్మయోగానికి చెందినది. దానిలో పిరికితనానికీ, అలసత్వానికీ ఎంతమాత్రం తావులేదు. కనుకనే మొదట హింసా ప్రవృత్తిగల వ్యక్తి కొంతకాలానికి అహింసా ప్రవృత్తి గల వ్యక్తిగా మారుతాడనే ఆశజనిస్తుంది. కాని పిరికివాని విషయంలో ఇది చెల్లనేరదు. పోతే దుష్టశక్తుల దౌష్ట్యాలనుంచి అహింసద్వారా మనం ఆత్మరక్షణ చేసుకోలేనప్పుడు. పురుషులం కనుక యుద్ధమైనా చేసి ఆలుబిడ్డలనూ, ఇల్లువాకిళ్ళనూ కాపాడుకోవాలని నేనిదివరకే ఎన్నో సార్లు ఉల్లేఖించాను—ఉద్బోధించాను కూడా."

"ప్రపంచం కేవలం హేతుబద్ధం కాదు. జీవనంలో ఎక్కడో ఒకచోట హింసాప్రవృత్తికి తావున్నది. అలాంటప్పుడు మనం వీలయినంత తక్కువ హింసావిధానం అనుసరించవచ్చును. (యంగ్ ఇండియా 28 సెప్టెంబరు 1934)

రాధాకృష్ణుని తుది సందేశ మేమిటి? "ప్రపంచానికి అధిష్ఠానం సత్యం. సత్యం అంటే ఆత్మశక్తి. సత్యంకోసం అవసరంవస్తే జాతీయతనూ మాతృదేశాన్ని కూడా త్యాగం చేయాలి." అని ఆయన అంటాడు.

ఆయన గేటే కవీంద్రుని ఉదహరిస్తూ ఇలా చెబుతున్నారు- "నాగరకత అధోగతికి వచ్చేటప్పుడు జాతి విద్వేషం తీవ్రమయిన హింసాప్రవృత్తిగా ఉంటుంది. ఆ ద్వేషం అంతరించడానికి వీలుంటుంది—జాతీయ భావనకు అతీతులం కాగలిగితే సోదర మానవుల సుఖదుఃఖాల్లో మనం భాగస్వాములం కాగలం." ఒకమాటలో చెప్పాలంటే జాతులకు అతీతమైనది మానవత్వం.

రాధాకృష్ణులు ఇంకా ఇలా రాశారు "సత్యం కన్న ఈశ్వరుడు లేడు. ప్రేమ, అహింసా మూలముగానే సత్యానుభూతిని పొందాలి. చిత్తశుద్ధిలేనిదే సత్యస్వరూపాన్ని గాని, ప్రేమనుగానీ సాధించలేము. పరిశుద్ధాంతఃకరణమే పరమేశ్వర సాక్షాత్కారానికి దారితీస్తుంది. అహంకార నిర్ముక్తమయిన మహాకారుణ్యమే మహోన్నత మతధర్మం." ఈ విధంగా మహాత్ముని ఆచరణలను రాధాకృష్ణుడు నిర్వచిస్తున్నాడు. ఆయన మతంలో స్వాతంత్ర్యం, పరిశుద్ధాంతఃకరణం నుంచి బయలుదేరిన మహాకారుణ్యమే మహాత్యాగం.

# అధ్యాయం [illegible]

నాగపూరు, హైదరాబాదు మీదుగా దీర్ఘమైన రైలుప్రయాణం కొనసాగించి చివరికి బెంగుళూరు చేరటంతో నా దక్షిణభారత యాత్ర ప్రారంభమైంది. అది తీక్ష్ణమైన గ్రీష్మం. ఇటార్సీ స్టేషన్ ప్రయాణీకుల విశ్రాంతి గదిలో ఊపిరాడని తాపంతో ఒక రాత్రి వెల్లబోశాను. అయితే రైల్వే ఉద్యోగులు చూపిన అసీమ ఆదరణవల్ల కొంత తాపం ఉపశమించక పోలేదు. నాగపూరులో నాకు సరియైన సమాచారం చెప్పక పోవడంవల్ల బెంగుళూరులో ఒకరోజు ఆగవలసిందల్లా కొన్ని నిమిషాలకన్న ఎక్కువ ఆగడానికి వీలులేక పోయింది. సర్ తంబుచెట్టితో కులాసాగా మాట్లాడడానికి, విహారం చేయడానికి వీలులేక పోయింది. మైసూరు మహారాజా ఆతిథ్యం స్వీకరించే అవకాశం కోలుపోయినాను. తంబుచెట్టి నా కోసం రోజంతా ఎదురుచూచి మైసూరు వెళ్ళిపోయినాడు.

1947 ఏప్రిలు మధ్యలో నేను మైసూరు మలబారులను వేరుచేసే పశ్చిమ కనుమలు దాటి కొచ్చిన్ చేరినాను. ఇక్కడ హిందూ మహాసముద్రశాఖ రెండుగా చీలి కొచ్చిన్ ద్వీపాన్ని పరివేష్టించినది. ద్వీపానికి అభిముఖంగా దక్షిణ భూభాగాన

ఎర్నాకులం అనే కొచ్చిన్ రాజేంద్రుల రాజధానీనగరం వుంది. ఇది పూర్వం ఒలందులది (డచ్చివారిది.) తీరాన తెల్లరంగు వేసిన పడవలున్నవి. అవి చూపుకు తెల్లని ఇళ్లవలె ఎత్తయిన కప్పులతో విరాజిల్లుతున్నవి. వాటిని చూస్తుంటే వెర్మీర్ చిత్రం గుర్తుకువస్తుంది. తాటితోపుల్లో కొబ్బరితోటల్లో నీరు నిద్రిస్తున్నట్టున్నది. అక్కడక్కడా కన్ను చెదిరిపోయే పచ్చిక కానవస్తోంది. వ్యాపారం కోసం ఒకానొకప్పుడు ఇక్కడే బుడత కీచులు, ఒలందులు, ఆంగ్లేయులూ పరస్పరం సంఘర్షించు కొన్నారు. ప్రశాంతమైన వీధులు, సడీసవ్వడిలేని వాకిళ్లూ చూస్తుంటే కాలం తుప్పుపట్టినట్టు తోస్తుంది.

కొచ్చిన్ ప్రాచీనమైన పట్టణం. తూర్పుదేశాలలో విఖ్యాత క్రైస్తవమత ప్రచారకుడయిన సెంట్ ఫ్రాన్‌సిస్ జేవియర్ ఇక్కడే ఉండేవాడు. ఈ ప్రాంతంలోనే—మత సంప్రదాయ చరిత్రను బట్టి చూస్తే, సెంట్ థామస్ భక్తాగ్రణి కొంతకాలం ఇక్కడ ఉన్నట్టు తెలుస్తుంది. అతని మరణానంతరం మదరాస్ దగ్గిర సాన్‌థోం కెథిడ్రలు చర్చిలో ఆయన భౌతికకాయాన్ని పూడ్చిపెట్టినట్లు కూడా చరిత్రే చెబుతోంది. యూదీయుల రికార్డు లను బట్టి యూదులు భారతదేశంలో క్రీస్తుశకం ప్రథమ శతాబ్ది మధ్యలో అడుగు పెట్టిన తరువాత, నాజరేన్ అనే క్రైస్తవ సమాజాన్ని చూచినట్లు స్పష్టపడుతుంది. ఆ క్రైస్తవతెగవారే మలబారు సముద్రతీరంలో ఉంటూ ఋతుపవనాలు వీచేకాలంలో నౌకలమీద మహాసముద్రము తరించి రోమక సామ్రాజ్యంతో వ్యాపారం చేసేవారు.

ఆ తీరప్రదేశాన్ని పరిశోధిస్తే కొచ్చిన్‌లో 'శ్వేత' యూదుల సామూహిక ప్రార్థనా మందిరం తప్పకుండా కనపడుతుంది. ఆ మందిరానికి ఒకప్పుడు వేలాదిజనం ప్రార్థనకు వచ్చేవారు. క్రమేణా సంఖ్య వందలలోకి వచ్చింది. ఆ మందిరానికి అవతలే ఇథియోపియాలో మతంపుచ్చుకొన్న 'నల్ల' యూదుల సామూహిక ప్రార్థనాలయం ఉంది. వీరు ప్రాచీన మత విశ్వాసం నిలుపు కొంటునప్పటికీ, స్వచ్ఛమైన యూదీయ రక్తంకలవాళ్లు తమను నిరాదరిస్తున్నారని గోల పెడతారు. వారంతా ఇక్కడే సమాధి చేయబడ్డారు.

సామూహిక ప్రార్థనాలయం చిన్నదయినా సుందరమైన పుణ్యతీర్థం. ఇందులో ఇరవై శతాబ్దాలు గడిచిపోయినై. పూర్వం ప్రతినిత్యమూ ఈ మందిరంలో గోడలు హిబ్రూప్రార్థనతో మారుమోగేవి "వినవయ్యా ఓ ఇస్రాయెల్! నీ ప్రభువు భగవంతుడు ఒక్కడే. ఆయననే నీవు ఉపాసించ వలసింది."
(Shemah, Israel, AdOnai ElOhenu AdOnai echOd)

ఆ కాలంలో కేరళ పరిపాలకులు యూదుల వలసకు తగిన వసతులు కల్పించినట్టు చరిత్ర నిదర్శనలు చాలా కనపడుతున్నవి. క్రీస్తుశకం 319లో రవివర్మ చక్రవర్తి తన 36వ సంవత్సరం పరిపాలనాకాలంలో యూదులకు సౌకర్యాలు కల్పించినాడు. "పరమేశ్వరుడు ఒక్కడే!" అనే విశాలసందేశాన్ని ఒక వేపు లోకానికి ప్రవక్తలు ఇస్తూవుంటే ఇటు జీవులుమాత్రం శ్వేత యూదులనీ, కృష్ణవర్ణ యూదులనీ వేరువేరై త్యాగశీలంతో కలిసిమెలిసి ఒక్కచోటనే నివాసం చేయలేకపోతున్నారు కదా!

ఇంకా అది చాలకకామ్మోసు నాజీలవలె తమ రక్త సంబంధాలను గూర్చి వివాద పడతారు. ఒకే పరమేశ్వర సంతతివారైనా మానవులు సంకుచిత హృదయులుగా రూపొందు తున్నారు. ఏమైనా వర్ణవ్యవస్థతో వున్న భారతదేశంలో పరమేశ్వరుడు ఆస్తికులనూ నాస్తికులనూ అందరూ తన సంతానమే కనుక నిస్సందేహంగా ఉద్ధరిస్తాడని ఆశిద్దాం.

శ్వేత ఫ్రాన్‌సిస్కన్ చర్చిలో పోర్చుగీసు వాస్తవ్యుడయిన వాస్కోడిగామా సమాధి చేయబడినాడు. విడవలేక విడవలేక ఈ ఊరు విడిచినాను. ఉష్ణం అధికంగా వుండే భారతావనిలో కేరళం సమశీతోష్ణదేశం. ఇక్కడ జీవితం నిరాటంకంగా సాగిపోతూ వుంటుంది. రాజనీతి విశారదుల అడుగుల సవ్వడి వినపడని ప్రశాంత జీవితం కేరళ దేశీయులది. స్త్రీ పురుషులు తమ సంతానంతో కొబ్బరితోటల్లో సుఖజీవనం చేస్తారు. ప్రాచీన పాలకుల పురాతన ప్రాసాదంలో చిత్రశిల్పమూ, లతాలంకరణమూ ప్రకృతిని అనుకరిస్తూ వుంటవి. పాంపే నగరవాసులయిన రోమకుల శిల్పమువలె కేరళ చిత్రశిల్పంలో కూడా బూటకమైన మతావేశం తక్కువ. ఈ కేరళం ఈడెన్ వంటి స్వర్గధామమే అయినా ఇక్కడ కొన్ని క్రిమికీటకాలవల్ల జనించే శ్లీపదమనే వ్యాధి అత్యధికంగా వ్యాపించి వుంది. నేటి నవీన వైద్య సహాయంతో ఈ వ్యాధిని నిర్మూలించటం సాధ్యమే. కాని ఎందుచేతనో, ఒక వంక భారతీయ ధర్మానుసారం ఆయా ఋతువుల్లో పండగలూ పబ్బాలూ నెమ్మదిగా సాగిపోతూ ఉండగా, జీవనం సుఖప్రదమై పిల్లల వంశ పారంపర్యమైన వృత్తులు అవలంబిస్తూ ఉండగా, ఈ బోదవ్యాధి మాత్రం కేరళీయులను విడవకున్నది.

కొచ్చిన్ తరువాత దక్షిణంగా తిరువాన్కూరు సంస్థానం వుంది. ప్రస్తుతం నేను అక్కడికే వెళ్లాలి. తిరువాన్కూరు సముద్ర తీరం కయ్యలతో, ఉప్పు జేరులతో వుంటుంది. కయ్యలను కలుపుతూ పడవలు వెళ్లే కాలువలు చాలా వున్నవి. ఈ కయ్య లకూ, కాలువలకూ ఇరువైపులా కొబ్బరితోటలు అసంఖ్యాకం. కయ్యలు ఒకచోట సువిశాలములై సరస్సులవలె కనపడతవి. ఇక్కడ శీతోష్ణము మే నెలలో నిర్దాక్షిణ్యమైన గంగామైదానపు ఉష్ణంవలె వుండదు. కొబ్బరితోటలు, సముద్ర ప్రభావంవల్ల శీతోష్ణం చాలా సౌమ్యంగా వుంటుంది. అందుచేతనే కయ్యల్లో కళాసులు కొచ్చిన్ నుంచి తిరువాన్కూరు, త్రివేండ్రం అయి దారు రోజులు ఏకదాటిగా పడవలునడపినా ఆలసినట్టు కనపడరు. ఈ నాడు రైలుకన్న, విమానంకన్న అత్యద్భుతమైన మోటరు బోటువల్ల అతివేగంగా ప్రయాణం చేయవచ్చును. కాని నేనున్న కొద్దికాలంలో మూడురోజులు ధారాపాతంగా కురిసిన వర్షం ముప్పయి దుక్కులుంటుంది. దానితో ఏళ్లూవూళ్లూ ఏకమైవరదలు వుప్పొంగి, రాకపోకలకు వీలులేకుండా పుంతలన్నీ జలముతో నింపినాయి. ఆ సమయంలో ప్రయాణానికి అనుకూలమైనవి లాంచీ, విమానం తప్ప వేరే గత్యంతరంలేదు. నా దురదృష్టం కొద్దీ విమానయానం చేయవలసి వచ్చింది. తిరువాన్కూరు నుంచి కన్యాకుమారి అగ్రంవరకూ మాత్రమే మోటారులో ప్రయాణించాను. తత్ఫలితంగా చిరస్మరణీయమైన వల అల్లికల వలె వున్న కాలువలు కయ్యలూ క్విలన్ దగ్గర చూడ కలిగినాను. క్విలన్‌ను 'కొలం' అని మార్కోపోలో అనే యాత్రికుడు మిరియాలు విస్తారంగా ఎగుమతిచేసే పట్టణంగా పేర్కొన్నాడు.

నేను రెండు రోజులపాటు పడవలో ప్రయాణిస్తూ, అలల తాకిడివల్ల ప్రభవించే సవ్వడి వింటూ నాలో తెగని ఆలోచన లెన్నిటినో పరిష్కరించు కొందామని కలలు గాంచాను కాని పరిస్థితుల అననుకూల్యత, అవ్యవధి కారణంగానూ చివరికి నవీన ప్రయాణ సౌకర్యాలే సిద్ధమవటంవల్ల నా కలలు కలలుగానే ఉండిపోయినై, అనేకమంది నా భారతీయ మిత్రులు పట్టుమని రెండు గంటలసేపుగాన పడవ ప్రయాణం చేస్తే విపరీతమైన విసుగు పుట్టిస్తుందని సలహా లిచ్చారు. వీరికి ఎలా చెప్పటం?— కల్లోలితమై, కలుషితమై, శాంతి రహితమైన పాశ్చాత్య ఖండం నించి వచ్చినవాణ్ణి కనుక అత్యంత ప్రశాంతమైన శాంతిమయ జీవితానుభూతి పొందవలెనని నా మనసు ఆరాట పడుతున్నట్టు ఈ శాంత స్వర్గధామ నివాసులైన భారత మిత్రబృందానికి ఎలా నచ్చచెప్పను? ఈ గాఢమైన నా శాంతి ప్రలోభాన్ని అణచుకొని జీవరహితమైన ఒక వస్తు దర్శనశాలనించి మరొక వస్తు దర్శనశాల చూడాలని పరుగులెత్తను. నాకా ఇచ్ఛ లేనేలేదు. ప్రశాంత సరోవర తోయాలమీద పద్మం తేలియాడుతూ వుంటే చూస్తూ శాశ్వితమైన సుందరమైన కవిత్వం అల్లవలెనని నా ప్రగాఢ వాంఛ.

తిరువనంతపురం (త్రివేండ్రం) లో నేను మహారాజావారి అతిథిని. ఈ మహారాజావారు, వారి పూర్వులూ బ్రిటిష్‌వారికి గాని, మొగలాయీ చక్రవర్తులకు గాని తల వగ్గినవారు కారు. తిరువనంతపుర విమానాశ్రయం ఆకాశంనించి తిలకిస్తే తెల్లగా నవారువలె కొబ్బరితోటల మధ్య కాన్పిస్తుంది. కాని అదే లక్ష జనాభాగల తిరువాన్కూరు రాజధానీ నగరంవలె ఆ దట్టమైన కొబ్బరి తోపుల్లో స్పష్టంగా అగుపించదు. నగరగర్భంలో

పద్మనాభాలయం మసగ మసగగా అనుతుంది. నేను కిందకు దిగేసరికి విమానాశ్రయంలో నా కోసమే ఎదురు చూస్తున్న సంస్థానం తాలూకు మోటారుకారెక్కి రాజుగారి అతిథిగేయానికి వెళ్ళినాను. అక్కడ కొంతసేపు విశ్రమించినాను. తర్వాత తెల్లని పొడుగుపాటి అంగరకాలు వేసుకొని తలపాగాలు ధరించిన సేవకులు నా భోజనఏర్పాట్లు చేశారు. అతిధి గృహానికి అంతకుముందే ఆహూతుడైవున్న ఒక ఐరిష్ భూగర్భశాస్త్రజ్ఞునితో విందు కుడిచినాను. లండన్ క్లారిడ్జిహోటలు కేమాత్రం తీసిపోని భోజనమిది. విమానాశ్రయంలో తెల్లటి ఇసుక అమాయకంగా స్వచ్ఛంగాలేదు. కళ్లు మిరుమిట్లు గొలిపేటట్లు ప్రకాశిస్తున్న ఆ శ్వేత సికతాంతర్భాగంలో థోరియం (అనే యురేనియం మూలధాతువర్గంలోది) నిహితమైఉన్నట్లు గ్రహించాను. ప్రపంచ నాశనం అవలీలగా చేయడానికి సిద్ధమయ్యే శాస్త్రజ్ఞులకు, మేధావులకు, సామ్రాజ్య తృష్ణాపీడితులకు కావలసినంత థోరియం ఇక్కడ లభ్యమవుతుంది. ఈ సంస్థానంలో కమ్యూనిస్టు ముఠా భారతదేశంలో ఇతరప్రాంతాలకన్న అద్భుతంగా తయారయింది.

అణువుబాంబు విచ్ఛేదనా పరిశోధనతో మానవజాతి నిర్మూలనకు సదవకాశం ఇక్కడే ఈ సైకతంలోనే ఉంది. దీని నేపథ్యంలోనే కేరళదేశీయ ప్రశాంత వాతావరణం ఉన్నది. ఆ కొబ్బరి తోటలూ, కదళీవనాలూ, ఎర్రని మట్టిగోడల యిళ్లూ-వాకిళ్లూ, ఇళ్ళలో బోసిశరీరాల పసిపాపలూ, తెలివైన మనుష్యులూ, అనంత పద్మనాభాలయం, ఆలయ సమీపంలో బ్రాహ్మణ వాటిక, ఆ పుష్కరిణీ, మహోన్నతభావ విలసితాలైన రమణీయ శిల్ప సౌందర్యంతో శోభిల్లే దేవాలయోన్నత గోపురమూ విరాజిల్లుతున్నది.

# అధ్యాయం 10

తమిళ సంవత్సరాదినాడు నేను తిరువనంతపురంలో వున్నాను. మంత్రివర్గము నూతనరాజ ప్రాసాదంలో వున్న రాజేంద్రులను అభినందించ వలెనని వెళ్లినది. ప్రాతఃకాలం అల్పాహారం ఆరగించే నిమిత్తం నేను బట్టలు వేసుకొంటున్నప్పుడు ఇరవై యొక్కమారు ఫిరంగులు పేల్చినారు. ఫిరంగులు ఎన్నిసార్లు కాలుస్తారో ఆ సంఖ్యను బట్టి భారతీయ సంస్థానాధీశుల హోదా ప్రతిపత్తులు వెల్లడి అవుతాయి.

దుస్తులు మార్చుకొంటూ పూలచెట్లు చూచినాను. ఆ సమయంలో నీలిరెక్కలతో ఎగిరే పాలపిట్ట నాకు కనపడినది. పచ్చని పిట్టలు నల్లని ముక్కులతో ముద్దుగా కానవచ్చినవి. ఎంత సుందర సుమాలు! రజమల్లి పుష్పాలు హరితకాంతులతో అందాలు చిందుతున్నవి. నారింజవర్ణంగల అశోక సుమాలు మధుర సౌరభాలను నలువేపులా విరజిమ్ముతున్నవి. అన్నిటికంటే అగ్నిశిఖవలె జాజ్వల్యమానమయిన ఎర్రని సికవీర్య కుసుమాలు ఎంత ముద్దుగానో వున్నవి. కాని ఆ పద్మాలను దీక్షగాచూస్తే కళ్ళల్లో పుప్పొడిసోకి కళ్లు ఎర్రగా వాచిపోతవట. ప్రకృతిలో ఇట్టి గుణావగుణాలు సరిసమానం. అవగుణమయినా కొంచెం తక్కువగా వున్నప్పుడు మనుష్యులు గ్రహించవచ్చును.

తిరువాన్కూరు దివాను సర్ సి. పి. రామస్వామి అయ్యర్ మంచి అనుభవశాలి, అతి సమర్థుఋ. సంస్థానం చూచేందుకు ఆయన నాకు సహాయం చేశారు. డాక్టర్ వాసుదేవ పోడువల్ అనే పురాతత్త్వశోధకుడు నాకు మార్గదర్శిగా ఏర్పాటు కావించ బడినాడు. మేము మొదట త్రివేంద్రం ఊరిలోకి వెళ్ళాము. హఠాత్తుగా తోవలో ఒకచోట ఆగవలసి వచ్చినది. పోలీసులు మాకారు ఆపివేశారు—మహారాజావారి మోటారు రావడంవల్ల' పౌరులు నడుములదాకా వంగి జర్మన్ కైజరైట్ అభివందన లాగ ప్రణమిల్లారు. వారి స్వామిభక్తి 'న విష్ణుః న పృధ్వీపతిః, లాటిది. 1750 లో మార్తాండవర్మ ప్రభువు తన రాజ్యం పద్మ నాభస్వామికి అర్పించాడు. అప్పటినుంచీ తిరువాన్కూరు రాజేం ద్రులు అనంతపద్మనాభ దాసులని బిరుదు వహించారు.

ఆ తిరువాన్కూరులో ఒకభాగమే త్రివేంద్రం. శుభ్రమై విశాలమైన బాటలతో తెల్లని పాలరాతి భవంతులతో కొబ్బరి తోపులతో చాలా అభ్యున్నతి గాంచినది. ఆ నగరదృశ్యంచూచి నప్పుడు ఏ పసిఫిక్ సముద్రద్వీప గ్రామీణ దృశ్యమో, మలయా దేశీయ జనపదమో జ్ఞప్తికి వస్తది.

తిరువాన్కూరు పాలన పైతృకమై పరంపరాగతమై అభ్యుదయకరంగా వుంది. శాసనసభ్యురాలితో టీ సేవిస్తున్నాను. ఆవిడ ఇలాచెప్పింది-"సంస్థానంలో శాసనసభ్యురాళ్ళేకాక ఆడ పోలీసులు కూడా ఉండడం అభ్యుదయ సూచకం." మిగతా భారత దేశంలోకంటే ఇక్కడి ప్రజానీకంలో విద్య అధికం. అందుచేత తిరువాన్కూరు గర్విస్తుంది. ఉన్నతవిద్యా సౌకర్యాలు చక్కని క్షేత్ర పరిశోధనాశాలలూ వగైరా అశేషంగా వున్నవి.

వీటి అన్నిటికన్న అక్కడ భారతీయ ప్రశాంత సుఖ జీవన దృశ్యమే నన్ను ఆకర్షించింది. కయ్యలూ, కాలువలూ, కాలువల్లో పడవలూ, కాలవగట్ల కొబ్బరి ఆకులతో నేసిన కుటీరాలూ, తోపుల్లో ఎర్రమట్టి పుంతలూ ఎంతో అందంగా ఉన్నాయి. వానకురిసిన తరువాత పృథివీపరిమళం ఘ్రాణతర్పణం చేస్తుంది. ఇలాంటి ప్రశాంత ప్రదేశంలో శాశ్వితంగా స్థిరపడి జీవితమంతా హాయిగా కవిత్వం అల్లుకుంటూ గడపాలని నాకు కోరిక కలుగుతోంది.

జీవితం రెండు విధాలు. మొదటిది ప్రకృతి సహజ మయిన జీవితం. అది సరళమై, స్వభావసిద్ధమై ఎపిక్యూరియన్ గ్రీకులవలె ఉంటుంది. ఈజీవితవిధానమును రిచర్డు ఆల్డింగ్టన్, లింగ్‌యుటాంగ్ మహాశయులు వివరించారు. అంతరాత్మకు దూరంకాని ధర్మబద్ధ కర్మాచరణం రెండోరకపు జీవితం. ప్రపంచం దుఃఖదారిద్ర్య భూయిష్టం. దానికి కొబ్బరి ఆకుల కుటీరాల్లో దారిద్ర్యమే ప్రత్యక్ష తార్కాణం. ఆ కుటీరవాసులకు కావలసినది మరేమీ లేదని అనుకోడం పొరపాటు. ఈ కొబ్బరి తోటల్లో జీవితం సంతృప్తిదాయక సరళజీవితమని నిర్ణయం చేయగలమా? ఈ అభాగ్యుల జీవన దుఃఖాలు పరిష్కరించే వీలున్నప్పటికీ, నిర్లిప్తంగా ఎలా ఉండడం? వ్యక్తిగతంగా, సాంఘికంగా ఈ రెండు విధానాల్లో 'లోకశ్రేయము' ను సాధించాలి, దర్శించాలి. బహుశా గాంధీజీ దర్శనం చేసినప్పుడు నా సమస్య పరిష్కృత మవుతుంది. ఆయన పంథా మూడవది కావచ్చును. ఆ మార్గము ఎపిక్యూరియనుల ప్రకృతి సహజ జీవన విధానమూ కాదు, ఇమాన్యుయలు కాంట్ అనే జర్మన్

తత్త్వవేత్త ప్రతిపాదించిన నిష్ఠుర నిర్హేతుక కర్మవిధీ కాదు. మహాత్ముని సూచిత మార్గము సృజనాత్మకమై, ఫ్రాంసిస్, బొనవెంచర్ భక్తులవలె మహా కారుణికమైనది కావచ్చు.

తిరువాన్కూరు దేవాలయ శిల్పం రమణీయము. కాని సంస్థానంలో చర్చిలసంఖ్య అధికం. సంస్థాన జనాభాలో మూడు వంతులు జాకోబైట్లు. ఇక్కడే తోవప్రక్కన కార్మలైట్ మఠం ఉన్నది. పశ్చిమంగా కొట్టాయంలో ఫ్రాంసిస్ జేవియర్ మత ప్రచారం చేశాడు. తిరివెల్లిలో మిత్రునితో ఒకచర్చిలో ప్రవేశించాను. నా మిత్రుని తండ్రి విప్రుడు, తల్లి శూద్రస్త్రీ. చర్చి మందిరంలో గడ్డాలు పెంచుకొన్న భారతీయ కాథలిక్‌ను చూచాను. ఈ క్రైస్తవమందిరాల్లో క్రీస్తు భారతీయునివలె, ప్రాగ్దేశీయునివలె కనపడతాడు.

సంస్థానంలో ప్రయాణిస్తున్నాను. ఈ పర్యటనలో ముగ్గుర్ని కలపడంతో నాకు చాలా విషయాలు తెలిసినవి. ఒక బ్రాహ్మణోత్తముడు నాతో ఇలా అన్నాడు. 'బ్రాహ్మణ మతంవల్ల వర్ణ వ్యవస్థ వచ్చిందన్నాడు. జీవితానికీ మతానికీ సంబంధం ఎక్కువగా లేదు. ప్రజలకు దేవాలయాలంటే శ్రద్ధ లేదు. వర్ణాశ్రమ ధర్మమే ప్రధానం. మంచి చెడుగుల భేదాన్ని నిర్జించి ఆ వెనుకే వర్ణాశ్రమ ధర్మాన్ని నిర్దేశించే ద్వంద్వభావ పూరితమైన గీత మాకు ఒక శాపంవంటిది' గోష్పాదమంత శాఖవున్న విప్రుడు సాంఘిక వ్యవస్థవిషయంలో ఇలా ప్రస్తావించాడు-' సంఘం ఒక శరీరము. శరీరంలో ఐక్యత వుంది. శిరస్సు, భుజాలు, గర్భం అన్నీ వ్యష్టిగా పనిచేస్తూ సమిష్టిగా ఆరోగ్యం కలిగిస్తవి. అలాగే వర్ణ వ్యవస్థద్వారా

సంఘ శ్రేయస్సు కలుగుతుంది.' ఇది చారిత్రక భావము. అగ్రిపా కిథారూపంగా అభివర్ణించాడు.

తిరువాన్కూరు సంస్థాన ప్రజల కష్టసుఖాలు తెలుసుకొన్నాను. వాళ్లు కొబ్బరికల్లుతీసి తాగుతారు. అది మహా ఘాటయిన మద్యం. సంస్థానం మద్య విక్రయం అంగీకరించింది. ఆ సురాపానులైన అభాగ్యులు ఏమైనాకానీ, అది రాజకీయవాదులకు మాత్రం మంచిదే—వసూలుచేసిన పన్ను కూడా కల్లువాసన వేస్తుంది కాబట్టి. కర్షకులు మద్యం మస్తుగా సేవిస్తారు. వ్యాధులు కూడా గ్రామాల్లో అధికం. వైద్యసేవకు సాల్వేషన్ ఆర్మీవారు గ్రామగ్రామాలకు సైకిళ్లమీద వెడతారు. వారు నవీనమైన చికిత్సాలయాలు కూడా కొన్ని స్థాపించారు. అవి సంస్థాన చికిత్సాలయాలకన్న బాగున్నవి. చాలామంది వైద్యసహాయానికి గ్రామాంతరం నుండి వస్తారు. నా మిత్రుడు ఒక చికిత్సాలయం చూసి వస్తూన్నప్పుడు 'క్రైస్తవ మతశక్తి బాధను గ్రహిస్తుంద' ని అన్నాడు.

మేము ప్రయాణంచేస్తూ చాలా జనసమ్మర్దమైన గ్రామాలు చూసినాము ఈ గ్రామాలే భారతదేశానికి పట్టుగొమ్మలు వంటివి. నేను పర్యటించిన మేరలో చాలా చోట్ల కుటీర పరిశ్రమలు విరివిగా వుండటం గమనించాను. దారిద్ర్యం ఇతర ప్రాంతాలకన్న ఇక్కడ తక్కువ. మానవకోటి వృద్ధికావడమేకాని ప్రపంచంలో భౌతిక జీవనప్రమాణం వృద్ధిఅయ్యే సూచనలు చాలా తక్కువ. భారతీయులు, చైనీయులూ, సోవియటు పేదకార్మిక రైతాంగం జనాభా వృద్ధికావడమే కాని జీవనప్రమాణం పెరగలేదు.

ఇంగ్లండు అమెరికాలలో జీవనప్రమాణం, భౌతిక విజ్ఞానం బాగా అభివృద్ధి చెందింది. విద్యాసముపార్జన, రేడియోలు, యంత్ర సాధనలు, 'అధిక జీవనప్రమాణం' మొదలయిన భౌతికావసరాలు వృద్ధిచేస్తే, లంకాషైరులో ఉన్నటువంటి విద్యనే, ప్రజలకు ఇష్టములేకపోయినా నేర్పాలని విద్యాధికుల ప్రోద్బలంతో ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. కార్మికులు అధిక వేతనాలతో తృప్తిలేక ఇంకా హెచ్చుకోరుతారు. వ్యవసాయ పరిశోధన, సంస్కరణల విషయంలోనూ అంతే.

కుటుంబభారం వహించే యజమాని నౌఖరీ చేస్తున్నప్పుడు అతని జీతపురాళ్ళమీద భార్యాపిల్లలూ ఆధారపడతారు. ఆర్జన అధికమై నాలుగురాళ్లు వెనక వేసుకోగలిగితే పొలమో, పుట్రో కొనుక్కుంటాడు. భౌతికావసరాలు లేనిపక్షంలో కుటుంబానికి రేడియోలు, గ్రామఫోనులూ ఎందుకు? అవన్నీ ఇంట్లో ఉంటేగాని నాగరకతా సంస్కృతికాదా? ఇప్పుడు ఏర్పడిన సమస్య మానవులకు సుఖం కావాలా, అధికారశక్తి కావాలా? అలాకాకపోతే చికిత్సాలయాలూ, ఉన్నతవిద్య కావాలా? అదీకాకపోతే ఆత్మజ్ఞానులు, నిష్కాములైనవారు చూపే శ్రేయోమార్గం ప్రజానీకం అనుసరించవలెనా?

ఒకదేశ ప్రజలలో అధికార శక్తులకై తపన అధికమైతే ఫాసిష్టులవలె వీరి అధికారకాంక్ష, రాజ్యసంపాదనలో, వీలయితే తారకాకోటిని జయించడంలో, మానవతారహిత రాక్షస నియంతృత్వంలో మగ్న మవుతుందా? లేక మానవ కాంక్ష ప్రబలమై పంచవర్ష ప్రణాళికలు యుద్ధశాంతుల సంధిసమయంలో నిర్మించి

ప్రభుత్వ శాసనానికి లొంగివుండే వైజ్ఞానిక వేత్తలచే అపార కేంద్రీకృత భౌతికసంపదను కూడగట్టుకొని ప్రపంచరాజ్యాక్రమ ణకై సోవియట్ హిట్లరీయ జిగీషగా పరిణమిస్తుందా ? అలానూ కాకపోతే అధికారతృష్ణ శాశ్వత భగవదారాధనను పురస్కరించు కొని అంతులేని మానవ కర్మకాండగా పరిణమిస్తుందా ; పరాగ్వే దేశంలో జెసూట్లమోస్తరుగా ? మరి అదీకాకపోతే తిరువా న్కూరులోవలె మానవులు జీవిస్తారా ?

ఇక్కడ పసిపిల్లలను అర్ధదిగంబరులుగనో, దిగంబరులు గనో తిరుగుతుండటం చూస్తాం. దారిద్ర్యం చేతనేనా వారు అలా తిరిగేది ? కాదు. అది తలిదండ్రుల ఇచ్ఛాధీనమేగాని, దారిద్ర్యం ఎంతమాత్రం కాదు. అదేమి కర్మమోగాని మార్కెట్‌లో కావలసినంత భారతీయ మిల్లుగుడ్డలూ, చేనేత గుడ్డలూ, పాశ్చాత్య జవళి బట్టలూ దొరుకుతూ వుంటే-ధనికులే (కొనుక్కోగల తాహతు గలవారే) కాస్త గావంచాగుడ్డ చుట్ట పెట్టుకొని వీధుల్లో తిరుగాడుతూ వుంటారు. ఇకపోతే ఫకీర్లు, సన్యాసులమాట చెప్పనే అక్కర్లేదు—వారు రష్యన్ దొకోవ్ బోరులలాగ సర్వ దిగంబరులు. నేను తోవలో ఇద్దర్నో ముగ్గుర్నో ఇలాటి దిగంబర సన్యాసుల్ని చూశాను. నా మిత్రు డంటాడుకదా 'వాళ్లు భక్త్యావేశంలో ఒళ్ళుమరిచి నిజంగా ఉన్మత్తులే అయినార' ని. నిజమేకావచ్చు, వారివల్ల మరేమీ హానికూడా లేకపోవచ్చు. కానీ, ఆ దృశ్యం గాంచే వారికి, ముఖ్యంగా స్త్రీలకు రోత, సిగ్గూ కలిగిస్తాయని మనం గ్రహించాలి.

తిరువాన్కూరులో గ్రామాలు పచ్చికతో వనాలతో సుందరంగా ఉంటవి. కాని పంజాబులో, సంయుక్తప్రాంతంలో, ఎక్కడ చూసినా దుమ్ము—ధూళీ ప్రత్యక్షం. కొంత సేపటికి మేము సూచీంద్రం వెళ్ళినాము. ఇక్కడ త్రిమూర్తి దేవాలయం ఉన్నది. త్వరలో రాబోవు స్వామి రథోత్సవానికై ఏర్పాట్లు జరుగుతున్నవి. ఆనాడు రథంమీద దేవుణ్ణి ఊరేగిస్తారు. దేవాలయ పుష్కరిణి రమణీయంగావుంది. పుష్కరిణీ మధ్యలో మంటపం కనపడుతుంది. సహజంగా ప్రతిదేవాలయ ఉన్నత గోపుర సమీపంలోను విశాలమైన పుష్కరిణి ఉంటుంది. ఇది ఆగమప్రోక్తము. హిందూమత సుందరాచారము. అయితే జీర్ణదేవాలయాలు మాత్రం బహిర్దేశాలుగా ఉపయోగపడుతూ వుంటవి. నేపిల్సులో పురాతన శిధిల మందిరాల గతి అంతే! కన్యాకుమారి సమీపంలో ఒక చిన్న దేవాలయం అత్యద్భుత శిల్పసంపదతో ఉట్టిపడుతుంది. అది 10వ శతాబ్దినాటి చోళ శిల్పము, పూజాపునస్కారాలులేక సంస్కారహీనమై వున్నా గుడిలో ప్రవేశించాము. గర్భాలయంలో శివలింగమే వుంది. కాని అది చాలా శిధిలావస్థలో వుంది

చివరకి కన్యాకుమారి చేరుకొన్నాము. ప్రయాణీకుల బంగాళాలో హాయిగా భోజనం చేశాము. కన్యాకుమారి అగ్రాన కాథలిక్ చర్చి కనపడింది. అక్కడ బెస్తలు క్రైస్తవం స్వీకరించారు. ఫ్రాన్సిస్ జేవియర్ మిషను వారు మత ప్రచారకులు. వర్ణాశ్రమ వ్యవస్థలో అధోగతిన పడిపోయినవాళ్లు క్రైస్తవం పుచ్చుకొంటూ ఉండేవారు. దిక్కుమొక్కూలేని చిన్నవాళ్లు అగ్రం దగ్గిర సముద్రంలో కనపడ్డారు. వాళ్ళను చూడటం నాకు చాలా

సంతోషం. సముద్రతరంగాలు అగ్రానికి సోకుతున్నవి. అరేబియా సముద్రంలో తిరిగే పడవలు ఎర్రని తెరచాపలతో త్రిభుజాకృతిలో స్పష్టంగా దిక్చక్రంమీద అందంగా కనపడుతున్నవి. చైనా పడవ క్షితిజరేఖ దగ్గిర అస్పష్టంగా కనపడుతున్నది. జాన్ పెన్నికీ అనే ఒకాయన సింహళ బౌద్ధక్షేత్రం వెళ్లినప్పుడు చాలా ఆనందం అనుభవించాడు. అతనిలాగే నేను కూడా భారతదేశాటనం చేసి ప్రాగేశంలో ఆధ్యాత్మికానుభూతి పొంది, పశ్చిమ దేశాలకు అందించవలెనని పరమార్థ తత్త్వం అన్వేషిస్తున్నాను.

# అధ్యాయం 11

తిరుగు ప్రయాణంలో విశేషాలు లేకపోలేదు. త్రివేండ్రం వచ్చే దారిలో తిరువాన్కూరు ప్రభువుల ప్రాచీన ప్రాసాదం చూసినాము. నవీన రాజప్రాసాదము రాజధానీనగర మధ్యలో మిక్కిలి సొగసుగా ఉంది. ఏ నేపాలీయ, బర్మీయ శిల్పశైలినో ఆభవనం నా స్మృతికి తెస్తుంది. మందిర గవాక్షములు దారు నిర్మితాలు. పద్మనాభపురంలోని ప్రాచీన మందిరం 16 శతాబ్దినాటిది. నేనూ పోడువల్ మందిర సోపానములు ఎక్కినాము. ప్రభువుల శయనాగారం చూసినాము. నిగనిగలాడు శయనమందిర కుట్టిమము, భారతీయుల దారు శిల్ప విదగ్ధమును వెలారించు సుందర గవాక్షములూ, కవాటములూ, డచ్చివారిచ్చిన విశాల పర్యంకము చూస్తే ఆ శయనాగారం 17 వ శతాబ్దినాటి ఆమ్స్టర్డం జ్ఞాపకం వస్తుంది. దేవతామూర్తుల జీవితాలు గోడలపై చిత్రితములయినవి. కొన్ని మూర్తులు విశాల వక్షోజాలతో, ముఖములు గర్భములూ కృష్ణవర్ణముతో, హస్తములు రక్తవర్ణముతో మనోజ్ఞంగా చిత్రించబడినవి. అభ్యుదయ సూచకమైన స్వస్తిక చిహ్నాలతో, శంఖతావళాలతో మూర్తులన్నీ అలంకరింప బడినవి. తిరువాన్కూరు మొదలు హాంగ్‌చౌలో బుద్ధుని వక్షందాకా స్వస్తిక్ చిహ్నాలు గోచరిస్తూనే ఉంటవి.

గదులకు వెలుపల పొడవైన ఆవరణ చీకటిగా వుంది. అక్కడ గాంచిన ప్రాచీన కాంస్య దీపికలు యవన దీపాలను జ్ఞాపకం చేస్తవి. మందిరావరణలో తళతళలాడే విశాల ప్రదేశాన దేవదాసీలు నాట్యం చేసేవారట. మందిరావరణం మఠము వలె ప్రశాంతమై నాకు ఆనందం కలిగించింది. స్తూపాకృతివంటి పై కప్పుపై చిన్న గోపురం వుంది. గోపురంలో ప్రాచీన స్పెయిన్ దేశపు గడియారం గంటలు గంభీరంగా కొడుతూ 'టోలెడో' మఠమువలె వుంది. ఎంత ప్రశాంత వాతావరణం! కాలం శాశ్వతత్వమూ సమరసమైనది. రాజమందిరానికి వెలుపల కొబ్బరితోట దృశ్యం పసిఫిక్‌సముద్ర సుగంధ ద్వీపమువలె, స్వర్గఖండంవలె వుంది. కాని ప్రాసాదావరణంలో గంభీరత, ప్రశాంతతలే నాకు రసానందం కలగచేసినవి.

కాలము, శాశ్వతత్వముల పరిణయము భారతీయ శిల్పములో మృగ్యం. భారతీయ శిల్పములో సృష్టిస్థితి లయాల భావన, భావోద్రేకం, మాయ వ్యక్తమవుతవి. కాని శాంతముద్ర గోచరంకాదు. బౌద్ధశిల్పంలో హెచ్చుగా శాంతరసం దర్శించి అనుభవించ వచ్చును. శివతాండవంలో అశాంతి, ఔద్ధత్యమూ అపరిమితము, లలితకళలు నిరాకార నిర్విశేష పరతత్వమును వ్యక్తంచెయ్యలేవు. కళలకు పరబ్రహ్మ అతీతము. పాల్ భక్తుడు ఇలా అంటాడు—"నిర్గుణ నిరాకార పరతత్వము, సాకార సగుణ ప్రతి బింబంగా భావిస్తాము." హిందూ ధర్మముకన్న బౌద్ధము ప్రతీకశిల్పంద్వారా అధికమైన శాంతిసందేశ మిచ్చింది. ముసల్మానుల మసీదులు, క్వాకరుల ఆరామములు, కాధలిక్కుల మఠాలద్వారా కూడా కాస్త శాంతి సందేశం ప్రసారమైంది.

విష్ణుమూర్తి నాభి కమలాసన స్థితుడైన బ్రహ్మను భారతీయ శిల్పము రూపొందించింది, అదొక విచిత్ర భావన. ప్రతీకములో భావన సులభంగా బోధపడదు. భావలాలిత్యకన్న శిల్పంలో శిల్పి విజ్ఞాన బుద్ధిసీమలే ఎక్కువగా కనపడతవి. సహజ సౌకుమార్యము కన్న సందేశ పరాయణత్వం అధికము. శివుడు పరతత్త్వము, ఆ పరమ శివుడు సర్వ జీవాంతరాళంలో సాక్షిభాస్యుడై చిద్రూపుడైనాడు.

పోడువల్ నాకు వస్తుప్రదర్శనాలయంలో బుద్ధదేవుని కాంస్యమూర్తిని చూపించినాడు. దేవతామూర్తితో బుద్ధుడు కాముక సంబంధంలో ఉన్నప్పటికీ శాంతముద్ర విగ్రహంలో కనపడుతున్నది. ఈ విగ్రహంలో యదార్థమైన బౌద్ధశిల్పంలోని శాంతభావన కానీ, చైనీయుల నర్మహాసము కానీ లేదు. ఇట్టి శిల్పి మౌఢ్యం నాకు నచ్చలేదు.

సంధ్యాసమయానికి కొంచెం ఆలస్యంగా తిరువనంతపురం చేరినాము. మర్నాడు ఉదయం మహారాజావారు నాకు కబురు చేసినారు. వెంటనే కారులో బయలుదేరి వెళ్లినాను. రాజావారి నవీనమందిరం ప్రాచ్యపాశ్చాత్య శిల్పరీతుల సమ్మేళనంలో ఉంది. మహారాజు, ఆయనతల్లి, సోదరి సాదరంగా నన్ను ఆహ్వానించినారు. ఈ రాజసింహాసనం మాతృ పరంపరాధికారంలో వుంది. రాజావారి తల్లి ఎక్కువసేపు నాతో గోష్ఠి చేసింది. మహారాజు ఇండియాలోనే విద్యాభ్యాసం చేసినా, ఆంగ్లేయ పబ్లిక్ స్కూలు వాతావరణంలో చదువుకొన్న తీరు కనబరిచినారు. ఆయన యువకుడు, తెల్లని దుస్తులు వేసుకొన్నారు. చక్కని సంస్కారం

పొందినవారు. సవినయంగా "అవును" "కాదు" అంటూ నా మాటకు ముక్తసరిగా సమాధానం ఆయన చెబుతూ వచ్చాడు. భారతదేశంలో అత్యధిక ప్రజ్ఞావంతుడయిన సర్ సి. పి. రామస్వామి అయ్యర్ తిరువాన్కూరు రాజావారి ప్రధానామాత్యులు.

నవీన రాజ్యాంగ రచన సిద్ధమైంది. కాంగ్రెస్ వ్యతిరేక వర్గామోదం కూడా అది పొందుతుంది. తిరువాన్కూరు ప్రభువు వర్ణాశ్రమ వ్యవస్థను లక్ష్యం చెయ్యక దేవాలయాల్లో హరిజనులకు ప్రవేశం ఇచ్చినాడు.

1936 ప్రకటనలో ఇలా ఉన్నది—"మన హిందూ ధర్మములోని పరమ సత్యమును, సర్వ సమత్వమును, సహనశీలమును గ్రహించి దేశకాలానుసారముగా ఆచారవ్యవహారములు పరివర్తనము చెందుతున్నవి కనుక, దేవాలయ ప్రవేశ విషయంలో కొంతమంది సనాతనుల అవరోధములు తీసివేసి హిందువు లందరికిని దేవదర్శనావకాశము ఇవ్వబడినది." ఇక్కడ 'హిందువులకే' అని అనడంవల్ల హిందూ మతాంతరులకు దేవదర్శనంలేదు. ఇదేవిధంగా దక్షిణాఫ్రికాలో క్రైస్తవ పూజామందిరంలో గాంధీగారు నల్లవారు కనుక ప్రవేశించే వీలు లేక పోయింది.

మహాత్ముడు వర్ణాశ్రమ వ్యవస్థకు ప్రతికూలుడు. సర్వమత సమత కోరేవాడు కనుక వర్ణ భేదము అంగీకరించడు. హరిజనులకు దేవాలయప్రవేశం లభించేసరికి ఆయన సంతోషం అపరిమితం. తిరువాన్కూరు మహారాజా ప్రకటనను గాంధీజీ పూర్తిగా బలపరిచినారు. హిందువుల దృష్టిలో హరిజనులు అస్పృశ్యులయితే, చైనావారి దృష్టిలో తెల్లవారు అవర్ణులు.

అందుకే మహాత్ముడు సవర్ణసంఘం విడిచి హరిజనులతో నివసించేవాడు. 1937 లో ఆయన తిరువాన్కూరు వచ్చినాడు. ఆనాడు హరిజన పత్రికలో ఆయన సంపాదకీయంలో ఇలా వ్రాసినాడు.

"అస్పృశ్యత హిందూధర్మంలో విపరీతంగా వున్నది. ఏ హిందువయినను తన్నివారణకు యత్నించిన, సంస్కార ప్రియులు హర్షింతురు. మొదట సనాతన హిందువు లతనిని కొంత బాధపెట్టుదురు........కొన్ని సంవత్సరముల క్రిందట వైకంగ్రామములో దేవాలయ వీధివెంట హరిజనులు నడచిన సవర్ణ హిందువులు వారిని బెదరించేవారు. కాని నేడు దేవాలయం లన్నీ హరిజన ప్రవేశమునకు తెరువబడినవి. సవర్ణులతోపాటు హరిజనులకూ దేవదర్శనావకాశము లభించింది."

తిరువాన్కూరులో వైకం వద్ద మహాత్ముడు ఇలా చెప్పినాడు —"నేను తరుచుగా చెబుతున్నాను. అస్పృశ్య సోదరులను దూరముగా ఉంచుటవల్లనే మన దేవాలయములు అపవిత్రములై పోయినవని. ఇది నా విశ్వాసం."

క్రైస్తవమత కేంద్రమయిన కొట్టాయములో మహాత్ముని భాషణ మిది—"కొట్టాయం తిరువాన్కూరు క్రైస్తవానికి అటపట్టు. అసంగతి నాకు తెలును, వారికీ నాకూ అదృశ్యమయిన వీడని సంబంధ మున్నది."

క్రైస్తవులలో చాలామంది హిందూధర్మం మానవకోటిని మోసగించే నిమిత్తం ఏర్పడిన మూఢ విశ్వాసంగా తలచరని నేను ఎరుగుదును. ఏధర్మప్రభావ ఫలితంగా చైతన్య, రామకృష్ణ, వివేకానందులు, శంకరులు ఉద్భవించారో, ఆ హిందూ ధర్మం

మూఢ విశ్వాసం కాదు. నా వ్యక్తిగతమైన అభిప్రాయరీత్యా ప్రపంచంలో ప్రధాన మతసత్యాలు యదార్థములు. మతధర్మాలు సమానములు. అందుకే, కేవల క్రైస్తవునివలె నేను బైబిలు పఠించవలెనని యత్నించినాను. కేవల ముసల్మానువలె కొరాను చదివినాను. ఈ పవిత్ర గ్రంథములలో గల శ్రేయమును గ్రహించుటలో నే నేమాత్రం ముందువెనుక లాడలేదు."

"లక్షలాది స్త్రీపురుషులు గుమికూడిన సభలలో నాకు తెలిసినంతవరకూ హిందూధర్మ సారమును గురించి ఉపన్యసించినాను. ఈశోపనిషత్తులో ఒక సరళమయిన మంత్రమున్నది. త్రిమూర్త్యాత్మకమయిన పరమేశ్వర వర్ణనమే ఆ మంత్రార్థము. పరబ్రహ్మ సర్వవ్యాపకుడని మంత్ర తాత్పర్యము. ఆయన సర్వవ్యాపకుడు కనుక నీ సొత్తేమియు లేదు. నీ శరీరము నీది కాదు. సర్వమూ పరబ్రహ్మమే."

"ఈ మంత్రములో విశ్వజనీన మానవ జీవన సౌభ్రాతృత్వము గోచరించు చున్నది. ఈ మంత్రములో మానవుని అచంచల విశ్వాసము, పరమేశ్వరుని గుణములు మానవబుద్ధికి తోచినవన్నీ కనబడుచున్నవి. సంపూర్ణ సమర్పణము మానవ కోటి యెడ భగవానుగ్రహము మంత్రములో గోచరమవుతున్నది. పరబ్రహ్మ సర్వవ్యాపి కనుక భూతలాన మానవులందరూ సమానులే. ఈశోపనిషత్తువల్ల నాకు సర్వమానవ సమానత్వముపట్ల ప్రగాఢ విశ్వాసము ప్రబలినది. ఈ అఖండార్థము గ్రహించినప్పుడు వారు నిరంతర మానవసేవకై జీవితములను సంపూర్ణముగా అంకితం చేయవలెను."

"నేను హిందూధర్మములోని కొన్ని మూఢ విశ్వాసము లను మరుగుపర్చి అన్నీ నాకు తెలిసినట్లు ప్రవర్తింపను. యదార్థము మాటలాడుటకు ముందు వెనుకాడను. అస్పృశ్యత హిందూధర్మములో ఒక మూఢాతి మూఢ విశ్వాసమే! కానీ, హిందూమతములో మూల సత్యమునకు అస్పృశ్యత విరుద్ధం గనుక అది హిందూధర్మానికి సంబంధించదని నా తలంపు."

"మన మందరమూ తెలిసీతెలియక భూతలాన మానవ కోటి శాంతి అభ్యుదయాలను సాధించవలెనని యత్నిస్తాము. కాని అట్టి శాంతాభ్యుదయములు వివిధ మతములవారిలో లేదని నా మనోనిశ్చయము. దీన మానవకోటిని ప్రార్థనాశీలముతో సమీపించిననాడే మనకు యదార్థమైన శాంత్యాభ్యుదయములు గోచరిస్తవి. ఇదే క్రైస్తవులకు నా సందేశము"

ఎక్కడో మహాత్ముడు హిందూధర్మాన్ని గురించి ఇలా ప్రసంగము చేసినాడు—"ప్రతి విగ్రహమును పాదాదికేశ పర్యంతము వర్ణించెడు పురోహితుడు విగ్రహములన్నీ ఈశ్వరుడే అని చెప్పలేదు. అలా చెప్పకయే దేవాలయములన్నీ జీవ పర మాత్మానుసంధానానికి ఉపయోగపడు పలు వంతెనలను భావము నేను గ్రహించే రీతిగ పురోహితుడు చేసినాడు. మన మానవ కుటుంబములోని వారందరూ తత్త్వవేత్తలుకారు, అవాఙ్మనస గోచరుడైన నిరాకారుని ధ్యానించుటకు మన మనస్సు తృప్తి పడదు. సాకారమైన పరమేశ్వరుడు మనకు గోచరించవలెనని ఆరాటపడును. సాకారమయినది అది గ్రంథమేకానీ దేవాలయమే కానీ ముఖ్యంగా మందిరంలో ప్రవేశిస్తున్నప్పుడు దేవళములు

మూఢవిశ్వాస జనకములని తలంపకూడదు. అచంచలమైన భగవద్విశ్వాసముతో దేవదర్శనము చేసివచ్చిన నీ యంతరంగం పవిత్ర మవుతుంది; ఆస్తికబుద్ధి దృఢమవుతుంది."

తిరువాన్కూరు రాజమందిరంలో మహారాణి నన్ను ప్రశ్నించింది—స్వేచ్ఛ అంటే ఏమిటి? రష్యాలో నిజంగా స్వేచ్ఛ ఉందా? ఏమిటి వారి స్వేచ్ఛ? సంపూర్ణమయిన స్వేచ్ఛ సాధ్యమా? ఇలాంటివే కొన్ని విషయాలు భారతదేశం గురించీ ప్రపంచ నీతిగురించీ ఆమెతో, రాజకుమారునితో ఆఖరిసారి కొంత తడవు చర్చించినాక గోష్ఠి ముగించి రాజమాతవద్ద యువరాజువద్ద శలవు తీసుకొని రాజప్రాసాదాన్ని విడిచి పెట్టినాను.

# అధ్యాయం 12

అది ఆదివారం. ఈస్టరు పండుగ. తిరువాన్కూరులో సంచారం చేస్తున్నప్పుడు యాదృచ్ఛికంగా ఏవో క్రైస్తవ మందిరాలు, చర్చిలు కనపడుతున్నవి. క్రైస్తవ హిందూ ధర్మావలంబుల సహనభావము ఇక్కడ గోచరిస్తుంది. సత్యదర్శనకు సాధనాలు అనేకము. పరతత్త్వానుభవానికి దారితీసే విశ్వాసము పలురీతుల్లో ఉంటుంది.

తిరువాన్కూరులో క్రైస్తవ సమాజము అత్యంత ప్రాచీనము, సెంట్ థామస్ ధర్మ ప్రచారంచేసి క్రైస్తవ కూటము ఏర్పరచినాడు, క్రీస్తుశకం రెండవ శతాబ్దినాటికే భారత దేశంలో స్థిరపడినది. కాగా గ్రంథాలవల్ల భారతదేశంలో క్రైస్తవం తలెత్తటం రెండవ శతాబ్దికన్న పూర్వమేనని తెలుస్తుంది. మత సాంప్రదాయాన్ని బట్టి సెంట్ థామస్ క్రాంగ నూరులో మొదట ప్రవేశించాడని తెలుస్తున్నది. ఆయన అక్కడ ఏడు చర్చిలను కూడా స్థాపన చేశాడట, క్రీ. శ. 47 సంవత్సరం నాటి గ్రీక్, రోమక నాణెములు క్రాంగనూరులో దొరికినవి. ఇక్కడివారు క్రైస్తవులు కారు. వీరు 'నాజరెనులు' భగవ ద్విశ్వాసముగల ఆస్తికులు కనుక క్రైస్తవులైనారు. సెంట్థామస్ కూడా నాజరెనుల తెగకు చెందినవాడే. గ్రీకు దేశీయులు సులభ మైన సముద్ర మార్గాలు కనుగొన్న తరువాత, ఋతుపవనము

అనుకూలమని గ్రహించి పాశ్చాత్యులు నౌకాయానం చేసేవారు. నాటినుంచీ యూదీయ వర్తకులు కూడా ప్రాగ్దేశాలతో వర్తకం చేయడం మొదలు పెట్టినారు.

వీరే జాకోబైట్ క్రైస్తవులు. భారతావనిలో 20 లక్షల మందివున్నారు. వీరు పాట్రిక్ ఆంటియోబ్ జాకోబైట్ మతాధిపత్యం అంగీకరించినారు. కాని కొందరు అంగీకరించ లేదు. జేమ్సు బర్డాయి బిషప్పు జస్టినియన్ చక్రవర్తికాలంలో కాథలిక్కు తెగకు విరుద్ధంగా జాకోబైట్ లేక మోనోఫిసైట్ అనే తూర్పు దేశపు క్రైస్తవతెగ క్రీ. శ. 451 లో ఏర్పడింది. ఈ తెగకు చెందినవాళ్లే తిరువాన్కూరు క్రైస్తవులు. ఈ శాఖవారు క్రీస్తును మానవత్వాతీత దైవాంశగా నిర్ణయించినారు. ఈ సిద్ధాంతం యూనిటేరియన్ క్రైస్తవానికి విరుద్ధం. క్రీస్తు మానవమాత్రుడు కాడు, మానవచ్ఛాయ. పరమేశ్వరుడు మాయా ప్రతిబింబిత చైతన్యము. మానవ రూపధారణం చేసి ఆయన అవతరిస్తాడు. త్రిమూర్తులు సగుణ బ్రహ్మాంశలు. గుణాకారాలు పరతత్వాభాసము. ఇంత విలక్షణంగా తీవ్రంగా తూర్పుదేశాల్లో క్రైస్తవులు సిద్ధాంతం చేయలేదు. వారు వర్ణాశ్రమ వ్యవస్థతో, ఆత్మల దేహాంతర ప్రవేశంతో సమాధానపడినారు. ఈ కాలంలో ప్రాగ్దేశ క్రైస్తవుల్లో సగంమంది కాథలిక్ సోదరులతో కలిసి లాటిన్ భాషలో బైబిలుచదువుతూ కర్మకలాపాలు నిర్వర్తిస్తూ, ఫ్రాన్సిస్ జేవియరు భక్తుని బోధలువిని అతన్ని అనుసరించినారు.

ఈ ఆదివారం ప్రాతఃకాల భోజనానికి రమ్మని మహామాన్యుడయిన ఆర్చిబిషప్పు మార్ ఇవానియో నాకు ఆహ్వానం

పంపినాడు. ఆయనపేరు ఇంగ్లండు అమెరికాలలో కూడా వినికిడి. ఆయన మంచి స్ఫురద్రూపి. వృద్ధుడయినా దృఢంగా ఉత్సాహంగా వున్నాడు. ఆ మాన్యుడు నివాసంచేసే బసకు వెళ్లినాను. ఆయన తిరువాన్కూరులో కొండమీద మకాము. ఒకవైపు సముద్రదృశ్యం, మరొకవైపు పచ్చని తోటలతో నిండిన తిరువాన్కూరు. ఆయన నిర్మించిన కళాశాల కొండకు ఎదురుగా వుంది. ప్రాతఃకాల భోజనం అయిన తరువాత నేను ప్రార్థనకు వెళ్లాను. ప్రార్థనా కర్మకలాపం యవన విధానములో వుంది కాని, రోమక పద్ధతి కాదని నేను గ్రహించినాను.

లోగడ మదరాసు వెళ్లినపుడు పాత మైలాపూరులో కెథీడ్రలుచర్చి దర్శించాను. 1521 కార్పస్ క్రిష్టి దినమున అంటోనియో గిల్ ఇక్కడనే ప్రార్థన జరిపినాడట. చనిపోయిన బిషప్పుల పేర్లు అక్కడ శిలాఫలకాల మీద చెక్కబడినవి. ఈ కెథీడ్రలు చర్చిలో ప్రార్థనా వేదిక, సమాధులూ రోం నగరంలో పీటర్ పాల్ సమాధి మందిరాలవలె వున్నవి. క్రీ. శ. 68 లో థామస్ భక్తుడు "ప్రభువుకై జీవనధారను అర్పించి" ఇక్కడే సమాధి చేయబడినాడు. అతని సమాధి ముందు ఎర్రని పువ్వులు చర్చికి వికాసం చేకూరుస్తున్నవి— రక్తకాంతితో.

తిరువాన్కూరులో బిషప్పు దగ్గిర ఉన్నప్పుడు యుగాల నాటి ప్రాచీన క్రైస్తవమత ప్రపంచం నా మనోవీథిలో భాసించింది. భారతీయ క్రైస్తవమత సంప్రదాయ చరిత్రవల్ల నా భావన రంజితమైంది. నా ఎదుట గంభీరముద్రలో వృద్ధ బిషప్పు ఆసీనుడైనాడు. నేను నా రోంనగర యాత్ర పోపు దర్శనం

ఆయనకు మనవిచేశాను. తిరువాన్కూరులో హిందూ ధర్మం కన్న క్రైస్తవం ప్రాచీనమైనది. క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో ఈ ద్రావిడ ప్రాంతానికి ఆర్య బ్రాహ్మణులు రాలేదు. తిరువాన్కూరు క్రైస్తవ సమాజంలో ఎంతవరకు ఆత్మదర్శనం వున్నదో చెప్పడం అవసరమూ ముఖ్యమూ. భావికాలంలో క్రైస్తవం ఆ విషయం నిర్ణయించాలి.

# అధ్యాయం 13

నాకు మార్గదర్శిగావున్న డాక్టర్ పోడువల్ నన్ను అరణ్యమయ పర్వతాగ్రం మీద ఒక మఠం చూపడానికి తీసుకొని వెళ్లినాడు. అది హిందూ ధర్మప్రచారము చేసే నవీన సంస్థ. అయితే అది అన్యమత సహనము అధికమై సంకుచితముకాని విశాల బుద్ధితో యేర్పడిన మఠము. ఇలాంటి సాధువుల మఠములూ, స్వాము లనూ వంగదేశంలో ఎక్కువగా చూచినాను.

ఒక శతాబ్దం క్రిందట హుగ్లీతీరాన నిరాడంబరుడు, నిరక్షరాస్యుడూ, పవిత్రుడూ అయిన తాపసోత్తముడు అనుభవ పూర్వకమయిన సందేశమిచ్చినాడు, ఆయనే రామకృష్ణ పరమ హంస. ఆయన శిష్యకోటిలో సెంట్ పాల్‌వంటి భక్తాగ్రణి, కార్యతత్పరత గల వివేకానందుడనే యువకుడు వుండేవాడు. అతని అసలు పేరు నరేంద్రఘోష్. అతను అచంచల విశ్వాసి, అన్యుల్ని తృప్తిపరచగల సంవాదపటిమ ఆయన స్తోత్తం. లోకానికి సందేశ మివ్వవలెననే మహాకాంక్షతో భారతదేశము, అమెరికా ఖండమూ పర్యటించినవాడు. అతని దివ్యసందేశంతో దేశం ప్రతిధ్వనించినది. వివేకానందుని ఘనతను గురించి గాంధీజీ కొట్టాయం సభాసందర్భంలో చెప్పినాడు. వివేకా నందుని సందేశంతో మతము ప్రధానాంశము. మతమనేది

ఏకైకము. మతజీవితానికి సంబంధించిన ధ్యానయోగమే కాక సంఘాభ్యుదయ కార్యకలాపముకూడా ముఖ్యం. ఈ ప్రబోధంతో ధర్మప్రేరితులయిన భారత యువకులు స్వార్థపరులుకాక సంఘోద్ధారకులై రామకృష్ణ మిషనులనే సంస్థలు విరివిగా ప్రపంచం పలుతావులలో స్థాపించారు, వివేకానందునిలో ఒక్క కెంపిస్ వంటి శీలమేకాక, నీషే జర్మన్ తత్త్వవేత్తవంటి రాజస మానవోత్తమ మహత్తర గుణాలు కూడా మూర్తీభవించి ఉన్నాయి.

తిరువాన్కూరులో రామకృష్ణ మఠమువారిచే పాఠశాల స్థాపితమైనది. వారు పిల్లలకు విద్య గరపటంతో పాటు రోగుల చికిత్సార్థం ఒక ఆసుపత్రిని కూడా నడుపుతున్నారు. ఇక్కడ నాకు స్వామితో పరిచయం కలిగింది. ఆయనపేరు తపస్యంత స్వామి. వస్త్రధారణ వగైరాబట్టి చూస్తే బౌద్ధ భిక్కువలె కనిపించాడు.

నేనూ, స్వామీజీ, నా మార్గదర్శి పోడువల్ ముగ్గురమూ పర్వతమెక్కినాము. సోమర్‌సెట్ మాఘం అనే నవలాకారుడు 'రాజర్స్ ఎడ్జ్' నవలలో వర్ణించిన దృశ్యం ఆ పర్వతారోహణ సమయంలో స్మరణకు వస్తున్నది. స్వామీజీ న్యాయవాదిగా అన్యాయ జీవితం గడపలేక, ఆ పదవికి తిలోదకాలచ్చి, సన్యాసాశ్రమం స్వీకరించి, ఈ సరళ జీవితం గడుపుతూ, అనాథ రోగులకై చికిత్సాలయం నడుపుతూ సమాజోద్ధరణ చేస్తున్నారు. తీరిక సమయంలో యోగనిష్ఠలో మగ్నమవుతారు.

ఒక భారతీయుడు సన్యాసులను తృణీకరిస్తూ ఇలా వ్యాఖ్యానించాడు—"వాళ్లు కేవలం సోమరులు. కాలహననం

చేయడమే వారి యోగనిష్ఠ." ఈ వైపరీత్య వాక్కులు యోగాను భవానికి విరుద్ధములు. కేవలం పారలౌకిక యోగానుభూతి మాత్రమే కాక కర్మయోగానికి ప్రాధ్యానమిచ్చిన వివేకానంద తిలక్ మహాశయులే దానికి ప్రబల నిదర్శనం.

భారతీయ వేదాంత మతంలో ఆత్మానుసంధానం చేసిన వాడు పరమాత్మతో తాదాత్మ్యం పొందుతాడనటం ప్రమాదకర విశ్వాసం. అది ఆధ్యాత్మికానుభవ జనిత దురహంకారం. జీవాత్మ పరమాత్మలు రెండూ ఒక్కటే. నిజమే. ప్రతిజంతువూ ప్రతిరాయీ కూడా పరమాత్మతో తాదాత్మ్యం చెందుతుంది. ఎవరేమన్నా వేదాంతం భారతీయ హృదయం ఆకర్షించింది. ప్రజానీకమంతా మనసాంతరం పరమాత్మగా మారితేనో!

నాతోవున్న స్వామీజీ నిష్కాముడు, నిరహంకారుడేకాదు. అల్డస్ హక్సిలె అన్నట్టు 'ముక్తపురుషుడు' కూడానూ. ఆయన సోమరిగా లేడు. ఆయన నిర్లిప్తుడు, అది తెచ్చిపెట్టుకున్న నిర్లిప్తత కాదు. ఆయన జీవితమే విస్సంగము. ఇలాంటి జీవన పురుషార్థములు అన్వేషించాలనే నేను భారతదేశం వచ్చాను.

స్వామీజీ మఠం పర్వతాగ్రాన వున్నది. అది ఒంటి అంతస్తు భవంతి. చాలా నిరాడంబరంగా ప్రశాంతంగా వుంది. అక్కడనుంచి చూస్తూవుంటే విశాలమైన ఆకాశంకింద పచ్చని చెట్లతో వనాలతో అందంగా కనిపించే ఆ పర్వతప్రదేశం లోయ అంతా కాథలిక్ జాకోబైట్ మఠ పర్వతాగ్ర దృశ్యాన్ని మరిపి స్తుంది. మేము మఠ ఆవరణలో ప్రవేశించేసరికి ముగ్గురు పోలీసులు ఒక దొంగను పట్టి తెచ్చినట్టు తెలిసింది. కారణం

అడిగినాను, కొండదరి నుండే వాళ్ళందరినీ స్వామికి బాగా తెలుసును. అప్పుడప్పుడూ వాళ్ళమధ్య చెలరేగే అనేకమైన తగాదాలను స్వయంగా స్వామీజీ మధ్యవర్తిత్వం వహించి శాంతంగా పరిష్కారం చేసి పంపివేస్తూ వుంటారు.

కొండకింద లోయలు, మరొకవైపు హిందూమహాసాగర దృశ్యాలు శాంత గంభీరంగా వున్నవి. ఈ కొండ లోయల్లో ఆదుర్దా, సంక్షోభమూ, దారిద్ర్యమూ కాస్తోకూస్తో లేకుండా వుండవు. ఇక్కడ కూడా దొంగలున్నారంటే దారిద్ర్యం ఉందని తెలుతుంది కదా! కాని శాంతికూడా కానవస్తున్నది. ఈ శాంతికీ పరమ సత్యానికీ సంబంధం వుంది. వెలుగు నీడలు, బింబప్రతి బింబ సంబంధం వంటిదే. కాలగర్భానికి క్షణికములైన రాగ ద్వేషాలకూ అలాంటి సంబంధం ఉంది. ఇక్కడ కావలసినంత శాంతి గోచరిస్తుందనటానికి ఈ ఆశ్రమవాసులైన సన్యాసులే తార్కాణం! అందుకే సోమర్‌సెట్ మాఘమ్ ఇలా ఉద్ఘాటించాడు. "పవిత్రాంత కరణులైన భారతీయ పరివ్రాజకులు నిరర్థకంగా జీవిస్తారని అనుకోవటం చాలా పొరపాటు. వాళ్లు చీకట్లో కాంతి రేఖలువంటి తేజ పురుషులు."

నాకు ఇక్కడ వాతావరణం అనుకూలంగాఉంది. మనసు ప్రశాంతంగా వుంది. ఇక్కడ దేశాచార ప్రకారం మఠ ప్రవేశం ముందు జోళ్లు తీయమన్నారు. తర్వాత రామకృష్ణ పరమహంస పీఠాని కెదురుగా గచ్చుమీద పద్మాసనంవేసి కూర్చున్నాను. ఆశ్రమ వాసులంతా వరుసగా ఆసీనులైనారు. ఆశ్రమ పెద్ద అయిన స్వామీజీ ప్రార్థన యథావిధిగా కొనసాగించినాడు. ఒక

గోడమీద వివేకానందుడు క్రీస్తుదేవుడు పక్కపక్కనే వేలాడుతూ విశాల సహనభావం ప్రకటిస్తున్నవి. వివేకానందుడు బహు ప్రజ్ఞావంతుడే కాని, ఆయనను గూర్చి నాకు ఇంకా ఒక నిశ్చితాభిప్రాయమంటూ ఏదీ ఏర్పడలేదు. విశేషంగా ఆయన త్యాగం చేయకపోయినా అమెరికాలో లక్షలాది జనాన్ని ఆకర్షించగల మహావ్యక్తి. ఆయన సహనం అత్యధికం కావడంవల్లనే రామకృష్ణమఠంలో వివేకానంద రామకృష్ణుల చిత్రాల ప్రక్కనే క్రీస్తు చిత్తరువు ఉంచినారు. బహు ముఖాలయిన సర్వమత ధర్మాలలో ఏకైకసత్యం అనుసూత్యమైంది. సత్య సాధనకు శీలసంపద ముఖ్యం. అందుచేత సత్యశీలాలకు పరస్పర సంబంధం వుంది. నా ప్రక్కనేవున్న స్వామీజీ బహు నిష్ఠాపరుడు. ఆ సత్యనిష్ఠకు కారణం ఆయన మతధర్మం కాదూ?

## అధ్యాయం 14

మద్రాసు సమీపంలో ఫ్రెంచివారి వలసయైన పుదుచ్చేరి ఉన్నది. చెన్నపురి హోటల్లో ఎవరయినా ఫ్రెంచిభాష మాట్లాడితే వారు పుదుచ్చేరీ వాస్తవ్యులై వుంటారు. వారి వేషభాషలు విశిష్టంగా వుంటవి. పైన అంగవస్త్రం వేసుకొని పూజారులవలె వుంటారు. పుదుచ్చేరిలో ప్రసిద్ధ యోగిపుంగవులయిన అరవిందుల వారి ఆశ్రమం వున్నది. ఆయనకూ విఖ్యాతాంగ్లేయులకూ మధ్య అత్యధికమైన మైత్రి వుంది. లారెన్సు బినియన్ వంటి ఆంగ్ల కవులు ఆయన మిత్రులే. హార్డింజి కాలంలో అరవిందులు వంగ దేశంలో విప్లవానికి మూలకారణమైనారు. అందుచేతనే బ్రిటీషు ఇండియాను విడిచి ఫ్రెంచివారి వలసగావున్న పుదుచ్చేరిలో స్థిరనివాసం కల్పించుకొన్నారు.

కొన్నాళ్లకు ఆయన రాజకీయాలనించి వైదొలగి తాపసులైనారు. ఆయన ఆశ్రమ నిర్వహణభారం ఒక ఫ్రెంచి మహిళ స్వీకరించినది. అరవింద రవీంద్రులు భారతీయుల మేధాసంపద. అరవిందులు ప్రఖ్యాత పండితుడు. ఆయన గీతా భాష్యము పాశ్చాత్య ప్రపంచంలో ప్రసిద్ధము. ఆయనతో పరిచయంకోసం లండన్‌నించి కొన్ని లేఖలు తెచ్చినాను.

కొన్నాళ్ళకు ఆశ్రమ కార్యకర్త నాకు సమాధానం వ్రాసినాడు. "అరవిందుల పేరు బహుశా మీరు వినే వుంటారు. ఆయన మా గురుదేవులు సంవత్సరానికి నాలుగు సారులు మాత్రమే గురువులు ప్రజలకు దర్శన మిస్తారు. ఈ సారి దర్శనం 24 తేదీ ఏప్రిల్ నెలలో. మీకు దర్శనం ప్రస్తుతం లభ్యంకావడం ఎలాగ? మీరు అరవిందులను 'చూడడం' అంటే ఏమిటి? దర్శనార్థమా? ఆయన ఆశీర్వాదము కావలెనా? ఆయన ఎవరితోనూ ప్రసంగించరు మాట్లాడరు కూడానూ. కేవలం వారు ఇచ్చే దర్శనం రోజునాడు ప్రజలను మౌనంగా మాత్రమే దీవిస్తారు. అంతేకాని మళ్ళీ వారు ఎవరికీ దర్శన మివ్వరు. ఇది గురుదేవుల నియమం. ఈ దర్శనంకూడా ఆశ్రమానుమతి లేనివారికి సాధ్యంకాదు. ఈ సందర్భంలో డాక్టర్ ఇంద్రసేన్ ప్రస్తుతం ఢిల్లీలో జరుగుతున్న ఆసియా మహాసభలో ఉన్నారు. మిమ్మల్ని కలవమని ఆయనకు రాస్తున్నాను."

నా మనసులో భావాలు సంకీర్ణములైనవి. అరవిందుల దర్శనంనాటికి నేను చైనాలో ఉండక తప్పదు. మానవమాత్రులతో మాటామంతీ లేకుండా నిర్లిప్తుడై అరవిందుడు ఏదో ఆశ్రమకోణంలో ఉన్నాడు. మానవోద్ధరణ చేయవలసిన యోగి సమాజానికీ దూరమై, నిర్లేపుడై వుండవలసిన అగత్యం లేదు. యోగి సంఘానికి ఎందుకు దూరంగా వుండవలెనో నాకు బోధపడలేదు. యోగానికి సంఘ బహిష్కారం అవసరమా? ఈ దేశంలో గురువు కావడానికి ఇది అవసరమా?

గురువు దైవతుల్యుడని భారతదేశంలో శిష్యకోటి ప్రగాఢ విశ్వాసం. గురు సాన్నిధ్యానికి కొందరు రావీలు

పడటమూ, కొందరు రావడానికి వీలులేకపోవడమేమిటి ? కేవల దర్శనం సోమరిపోతు రమ్యదృశ్యం చూచినట్టుగా వుంటుంది. నేను అరవిందులతో గోష్ఠి కోరుతున్నాను. ఆశ్రమ కార్యకర్తలకు లేఖ వ్రాశాను. ఆయన పండితులు కనుక ప్రసంగిస్తానని. కొందరు ఆశ్రమవాసు లన్నారు—"తమ ఆస్తిపాస్తులన్నీ ఆశ్రమానికి అర్పించి, స్వాభిమానంవల్ల నిజం చెప్పలేక, ఆశ్రమ జీవనం నిరుపయోగమై పోయిందనీ, తాము సరియైన దారి తొక్కలేదనీ అంగీకరించినారు." నాకు వారి విమర్శతో పనిలేదు. వారి దృష్టి సరియైనదా, కాదా ? అని నేను తెలుసుకో దలచలేదు. ఆశ్రమ జీవనం ఎలా వుందో గ్రహించాలని నాకు ఉత్కంఠమైన కాంక్ష ఉన్నది. (ప్రాచీన నవ్య ప్లేటో మత రీతులవలె) జ్ఞానయోగ మార్గము అవలంభించి జీవన పరమార్థం సాధించడం నేను తెలుసుకొంటాను.

జీవనపరమార్థం గురించీ, యోగానుభూతిని గురించీ అరవిందులు 'బేసస్ ఆఫ్ యోగ' అనే గ్రంథం సరళమైన భాషలో వ్రాశారు. ఆయన 'ది డివైన్‌లైఫ్' అనే గ్రంథ భావమంతా ఫిక్టేవేదాంతి రచించిన 'బ్లెస్‌డ్ లైఫ్' కు సామీప్యంలో వుండి. రెండు పుస్తకాల్లో కొంత విషయభేదం మటుకు లేక పోలేదు.

నేను చాలాకాలం పాశ్చాత్య రాజనీతి అభ్యసించాను. బ్రిటను అమెరికాల రాజ్యాంగశాస్త్రాలను బాగా కాచి వడపోశాను. ప్రజాభిమతాన్ని బట్టి రాజనీతివేత్తలు వ్యవహరిస్తారని నేను ఎరుగుదును. ప్రాగ్దేశీయ విధానం అనుసరిస్తే పాశ్చాత్య రాజనీతి విశారదులు పరాజయం పొందక తప్పదని నా విశ్వాసం. పాశ్చాత్య రాజనీతివేత్త ఆత్మోన్నతి భారతీయ యోగానుభవం

కాదు. అతని ఆత్మోన్నతికి ప్రజతో మైత్రి నెరపడమూ, ప్రజా హృదయంలో పలుకుబడి సంపాదించడమే ప్రధానములు.

అంటే పాశ్చాత్యుడిలో సాంఘిక ప్రవృత్తి అధికమని కాదు. ప్రాగ్దేశాలలో ఆత్మవికాసానికి ప్రథమ భూమిక, సంఘ బహిష్కరణమూ నిర్లిప్తత. సాధకుడు సామాన్య మానవులకు దూరమై, ఔన్నత్యము అపాదించుకొంటాడు. భారతీయ సాధనకు గమ్యము ఆధ్యాత్మిక బ్రహ్మతత్వము.

హిందూధర్మంలో కూడా ఈ సమస్యనే పరిష్కరించాలి. ఒక దృష్టితో చూస్తే హిందూ మతము ఏకత్వ ప్రతిపాదకమైన అద్వైతధార. ఆ ఏకమయిన పరతత్త్వం ధర్మాధర్మాలకూ, పుణ్యపాపాలకూ, సకలభేధాలకూ, అతీతం. అద్వైతానుభూతిని బట్టి ఉన్నట్టు తోచబడేది ఆభాస అయితే ఆభాసకు కూడా 'సత్త' లేకపోలేదు. కాని ఆభాసకున్న ఉనికి ప్రాతిభాసికము, క్షణికమైనది. సత్య ప్రతిష్ఠానం ఆధారంలేనిదిగా తోచబడుతూ వుంటుంది. ఈ ఆభాస, ఈ తోచబడడం అవిద్యావిలసితం మాత్రమే.

శాంకరాద్వైతానికీ మాధ్యమిక బౌద్ధానికీ సామ్య వైషమ్యాలు కనపడతవి. ఆభాసకు వెనుక సద్రూప ప్రతిష్ఠాన మున్నదని అద్వైతులు ఘంటాపథంగా చెబుతారు. యోగంవల్ల నిధిధ్యాసవల్ల ప్రకృతి విముఖులమై శాంతులమూ దాంతులమూ అవుతాము. నిర్లేప బుద్ధునిలాగ. బహుశా చివరకు యవన దేశీయ స్టోయిక్, నియో ప్లేటో సిద్ధాంతానుయాయులవలె యోగి ప్రాపంచిక సుఖదుఃఖాలకు దూరమవుతాడు. కాని క్రైస్తవ హృదయం మానవుల సుఖదుఃఖాల వల్ల కరుణాలింగితమై

స్పందిస్తుంది. యోగి ఆత్మద్రష్ట, మానవాతీతుడు. అతన్ని మానవ కారుణ్యమూ, సుఖమూ అంటలేవు. యోగులు, ఉద్యోగస్తులు, శాసకులున్నూ, నాయకులున్నూ అవుతున్నారు. ఇదే ఇద్దరికీ సామ్యం. ఈ ప్రాగ్దేశవిధానానికి పాశ్చాత్య ప్రజాతంత్రము చాలా విరుద్ధమైంది. అయితే క్రమేణా నాగరకత పరిణామం చెందినకొద్దీ పాశ్చాత్యులు అరవిందుల దృక్పథం గ్రహించినారు. ఈ దృక్పథంలో సనాతన బ్రాహ్మణత్వమూ, సన్యసనమూ, తత్త్వప్రతిష్ఠాపనమూ ఓతప్రోతంగా ఉన్నవి.

మహాత్ముని వాక్యాల్లో ఆకర్షణీయమైన సమత్వం కనపడుతున్నది. 'యరవాడ మందిరం నుండి' అన్న వ్యాసంలో మహాత్ముడిలా వ్రాసినాడు—"ఆత్మ సంజాతమయిన వినయ సంపద గుప్తముగా ఉండలేదు. కానీ తాను వినయశీలుడనేవాడు దాని ఉనికే ఎరుగడు. వినయశీలమువల్ల మానవుడు అహంకార నిర్ముక్తుడై తాను నిమిత్తమాత్రుడనిగా తలుస్తాడు. అయితే ఎవడు శీలసంపదవల్ల గర్వితుడో వాడు సాంఘిక శ్రేయమునకు పనికిరాడు. వినయమూ, అహంకారమూ ఏకమని పొరపాటు పడకూడదని హిందూధర్మం చెబుతున్నది. యదార్థమైన వినయం మానవశ్రేయం నిమిత్తం ఏర్పడిన నిరంతర కఠోర సాధన మాత్రమేనని మనం గుర్తించాలి."

హింద్ స్వరాజ్యలో గాంధీజీ ఇలా వ్రాసినారు—"అధిక సంఖ్యాకుల అభిమతము అల్పసంఖ్యాకులు అనుష్ఠించవలెనని నిర్బంధించడం నాస్తికుల అనామక చర్యగా భావించాలి. అధిక సంఖ్యాకుల నిర్ణయాలు దోషాలని నిరూపణ చేయవచ్చును. దానికి

చాలా తార్కాణాలు ఉన్నవి." సెంట్ ఆగస్టైన్ వాక్కులను తలపింపచేస్తూ మహాత్మ డింకా ఇలా నుడివినాడు. "అధిక సంఖ్యలో దొంగల ముఠాలో దొంగతనము ఆచరణీయ మయి నప్పుడు, ఆ ముఠాలో ఒక భాగవతోత్తముడు అధికవర్గ ధర్మమే అనుష్ఠించవలెనా?" వినయశీలము కానీ, ప్రజాతంత్ర భావన కానీ, ఆ శాసనాలను గౌరవించడమేకాక ఆత్మోన్నది పొందిన సత్యవ్రతులయిన గురువులను పూజించవలెను.

ఫ్రాన్సిస్ జేవియర్ నేటి పాశ్చాత్యునికంటె అరవిందుల భాగవతదివ్య జీవనమును చక్కగా తెలుసుకో గలిగేవాడే. ఈ వచనామృతం ఎవరిదో చెప్పడం సులభమా? "నీవు ధ్యాన యోగంలో నిశ్చలంగా ఉన్నప్పుడు ఆత్మప్రభాభాసము గాఢ మైనకొద్దీ, ప్రాపంచిక విషయ వాసనా, ఆంతరంగిక కల్లోలము శాంతిస్తాది. అదే మహా అభ్యుదయం!" ఇవి సెంట్ ఇగ్నీషియస్ 'ఆధ్యాత్మిక సాధనలో' వాక్యాలా? బాక్స్టర్ సుభాషితాలా? లేక అరవిందునివా? అరవిందులవే! అయినా అరవిందుల నిరంకుశ తత్వసాధనలో పాశ్చాత్యులకు విశ్వాసం లేదు. ఇది సున్నితమైన ప్రపంచం. ఈ ప్రపంచం సున్నితమైన సాధన ద్వారానే ఘనమైన, ప్రత్యక్షమైన విజయాన్ని చూరగొనాలనే ప్రవృత్తికి లోబడిపోయింది.

ఈ నిరంతర జీవన ప్రవృత్తే పాశ్చాత్యుల జ్ఞానానుభవమా? లేక అజ్ఞానమా? నాకు గభీర శాంత్యానుభూతి ఎలా లభ్యమవుతుంది? సాధకుడు లింగార్చన చేయవలసిందేనా? లేక డయోనిసియస్ శాఖవారివలె పాశ్చాత్యులంతా మారవలెనా? ఈ ప్రశ్నలకు సమాధానం ఏమిటి?

# అధ్యాయం 15

ఉత్తర హిందూస్థాన పర్యటనం పూర్తిచేశాను. నేను ఢిల్లీలో ఉండగా జయపుర సంస్థానాధీశుడు నన్ను ఆహ్వానించినాడు. ఆయన క్రీడారంగంలో పేరుపొందిన ఆటగాడు. సాయంకాలం భోజనానికి కొంచెం ముందుగా జయపురం చేరాలని ఉదయం 5½ గంటలకే ఢిల్లీనుండి మోటారులో బయలుదేరినాము. 200 మైళ్ళ దూర ప్రయాణంలో ఒక్క ఆళ్వారు విశ్రాంతి భవనంలో మాత్రమే మజిలీ చేయదలుచుకొన్నాము.

ఢిల్లీనుంచి పశ్చిమంగా వెళ్లే బాటనే ప్రయాణం చేశాము. ఉత్తరపంజాబులో జలసమృద్ధిలేని విశాలమైదానాలు దాటినాము. గ్రామాల్లో మట్టికొంపలు ఎక్కువ. ఎక్కడ చూచినా పేడ కుప్పలు. పేడ పోగుచేసే గ్రామీణ యువతులు తరుచుగా రోడ్ల ప్రక్క కనబడుతారు. ఇది భారతీయుల పొదుపరితనాన్ని సూచిస్తున్నట్లుంది. పల్లెకన్యలు నూతిదగ్గర ప్రోగయి ఒలకపోసే ఒయ్యారం చాలా మనోజ్ఞ దృశ్యం. వారు ఎర్రమన్నుతో చేసిన కుండలు బుజాన పెట్టుకొని నీళ్ళకు వెడతారు. పల్లీయ వనితలు పిడకలకోసం పేడ పోగుచేస్తున్నారు. కాని ఆ గ్రామీణ వనితా సౌందర్యం అశేషమైన కాయకష్టంవల్ల మాసిపోతూ వుంటుంది. సిసలైన భారతీయ జీవనం జానపద జీవితమేనని మహాత్ముడు

నుడివిన సూక్తి అక్షరాలా యదార్థం. ఆ జానపదజీవనం ఎంత వరకు సుఖదాయకమో నేను చెప్పలేను. తరుచుగా పల్లెటూరి వనితలు రాజపుత్ర స్త్రీలవలె తయారవుతూ వుంటారు. రంగు రంగుల లాగులు గుల్ఫములదాకా తొడుగుకొంటారు. ఆ వేషము స్త్రీలకు అనుచితమని పాశ్చాత్య దృష్టికి తోస్తుంది. వనితలు స్తనవల్కాలాలు ధరించి పైన కంచుకాలు తొడుక్కొని పల్లె వాటో, లేక చీరో కట్టుకొంటారు. కాని స్తనమండలాలు అర్ధ నగ్నంగావుంటవి. ఇక్కడ ప్రతి గ్రామంలోను మసీదులున్నవి. కాని మహమ్మదీయుల జీవన ప్రమాణం హిందువులకన్న అత్యల్పము.

మేము పంజాబువిడిచి ఆళ్వారు ప్రవేశించాము. ఇక్కడ వ్యవసాయం అభివృద్ధికరంగా ఉన్నట్టు నాకు కనపడుతున్నది. బటానీమొక్కలు తోవ కిరువైపులా వరసగా నాటినారు. మేము రహదారి వదిలి చాలా సార్లు నాటుతోవను వెళ్లవలసి వచ్చేది. రహదారి అక్కడక్కడా పాడైపోయి మరమ్మత్తులో ఉండడంవల్ల.

ఆళ్వారు చిన్న పట్టణం. కారు సులభంగా వెళ్లశక్యంగాని ఇరుకైన వీధులు. ఇక వీధుల్లో జనసమ్మర్ధం గురించి చెప్ప నక్కర్లేదు. మా మోటారు షాపువాళ్ళ కాళ్లు రాసుకొంటూనే వెళ్లింది. ఆ మార్కెట్టు, దుకాణాలూ చూస్తూవుంటే హారునల్ రషీదునాటి బాగ్దాదు పట్న వర్ణన గుర్తుకు వస్తోంది. ఆళ్వారు స్టేషను రెండు భాగాలుగా విభజించబడింది. సగభాగం జన సామాన్యం కోసం, మిగతా సగభాగం రాజావారి రాకపోకల సౌకర్యార్థం, ఆహ్వానం నిమిత్తం హాలు ఏర్పాటయింది. సంస్థానపు అతిథిగృహం చక్కగా వుంది. నాకూ మా డ్రైవరుకు

గులాబీ పరిమళం వాసించే చల్లని పానీయము ఇచ్చినారు. ఆళ్వారులో హిందూసంఘం ఫాసిస్టు పద్ధతిగా తయారై హిందూ రాజ్యస్థాపనకు (మహాత్ముని వధకు) కుట్రపన్నినదని దరిమిలా తెలుసుకొన్నాను. తర్వాత 50 మైళ్లు ప్రయాణించినాక జయపూరు సంస్థాన పొలిమేరలో ప్రవేశించాము. ధనగాజీ, షాహపురాల దగ్గిర తోవకు రెండువైపులా మధ్యయుగం నాటి పెద్ద బురుజులతో రెండు కోటలున్నవి. పిమ్మట పర్వత సానువులపై చిరస్మరణీయమైన అంబర్ అనే ప్రాచీనపట్టణం ప్రవేశించాము. కొండగట్లతో విశాలమయిన సరోవరంవుంది. ఆపర్వత లోయలో ప్రవేశించడం అసాధ్యం. లోయకు అడ్డంగా బలిష్టమయిన ఒక కోట నిర్మించబడినది. అది చాలా ప్రాచీనకాలం నాటిది. కోటకు ఒకవేపు పెద్దదేవాలయం, కొలను ఉన్నై. దానిమీద కనిపించే భారతీయ శిల్పసంపదా మధ్యకాలీనపు నాటిది. పురాతన కోటలూ, ఊళ్లూ సూర్యకాంతిలో అందమైన గులాబీ వన్నె లీనుతున్నై.

జయపూరు మహారాజులు రెండు శతాబ్దాలు క్రితమే ప్రాచీన నగరం విడిచి నూతన నగరం నిర్మించారు. ఈ నవీన నగరం నవ్యశిల్ప విన్నాణంతో వెలుగొందుతుంది. ఇది కేవలం ప్రాగ్దేశ నగరంగా లేదు. పురవీధులు లండనులో వాటికంటె విశాలములు. చక్కగా తీర్చిదిద్దినట్టు వుంటవి. సౌధాలకు సొగసైన గోపురాలున్నవి. పెద్ద చికిత్సాలయం, పాడిపరిశ్రమ పరిశోధనా కేంద్రం వున్నవి. దూరంగా ఎర్రని కొండల్లో రాజప్రాసాదం బెదరిస్తున్నట్టు మహా గంభీరంగా కనపడుతుంది. తెలుసుకొంటే చాలా ఆశ్చర్యం. 1739 డూప్లెక్సు కాలంలో



( లండన్‌లో భా. హై. క. శ్రీ వి. కె. కె. మీనన్ సౌజన్యంతో.)

స్వర్గీయ సర్దార్ వల్లభాయి పటేల్

భారతం విచ్చేసిన ఒక ఫ్రెంచి దేశీయ శిల్పి ఈ జయపూరు నిర్మాణానికి ప్లాను వేశాడట. అప్పటికింకా వాషింగ్టన్ నగరం నిర్మాణం కాలేదు. ఆ రోజుల్లో లండను చిన్న పట్టణం. జయపూరు మహారాజే నగరనిర్మాణ కారకుడు. నగరంలో భవంతుల మీద శిలాఫలకాలే దానికి ప్రబల తార్కాణం.

నేనా సాయంకాలం జయపురంచేరి రాజదర్శనం చేశాను. ఆయన పోలో ఆటలో 'జయ' అనే పేరట సుప్రసిద్ధులు. నేను వెళ్ళిన మర్నాడే ఆయన కరాచీమీదుగా లండనువెళ్లే ప్రయాణ సన్నాహంలో వున్నారు. కాబట్టి ఆయనతో లండన్ లోనే గోష్ఠి చేయదలచుకొన్నాను. మహారాణీ సౌందర్య ఖనిగా వాసికెక్కిన భారతీయ మహిళ. మహారాజు నాడే రాణీ జన్మదినోత్సవం చేస్తున్నారు. ఉద్యోగబృందానికీ ప్రజలకూ గొప్ప విందులు చేశారు. ఉత్సవసమారోహమంతా పాశ్చాత్య పద్ధతిలో కొనసాగింది.

రాజావారు తెల్లని సిల్కున్ స్పోర్ట్సు దుస్తుల్లో వున్నారు. అతిథులతో ముచ్చటించారు. ఆత్మవిశ్వాసంతో ఉన్న ఆయన ముఖమండలం క్రీడలంటే ప్రకాశిస్తుంది. లండన్ ప్రయాణ సన్నాహంలో రాజకీయాలకన్న స్పోర్ట్సును గురించే సంభాషణ సాగింది. పాన్ అమెరికన్ విమానంలో ఒక్కరోజులోనే లండన్ వెళ్లి సాయంకాలం క్లారిడ్జి హోటల్లో మహారాజు ఉల్లాసంగా తేనీరు సేవిస్తారు. ప్రాక్ పశ్చిమాలు ఎంత దగ్గిరికి వచ్చినై! రాజావారు హడావిడిగా ఉన్న సమయంలో కూడా నాకుఆతిథ్యం ఇచ్చారు. అది భారతీయుల అతిథి సత్కారపద్ధతి. మహారాజుల దర్పమే సంస్కారంగా కొందరు తలుస్తారు. వారి ఠీవి మాత్రమే ఒక్కొక్కసారి సాక్ష్యం.

మర్నాడు నా తిరుగు ప్రయాణానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయినాయి. సంస్థానం తరపువారి హృదయపూర్వక వీడ్కోలు నందుకొని కారులో ఢిల్లీ బయలుదేరాను. దారిలో ఎన్నో సుందరమైన రాజమందిరాలను తిలకించాను. లక్షలాది ఖజానా సొమ్ము వెచ్చించి ఏనాడో నిర్మించబడ్డ ఆ భవంతులలో మూడువంతులు నిర్మానుష్యంగా పడి వున్నాయి. ఇది బహు శోచనీయమైన విషయమని నాకు తోచింది.

ఏకధాటిగా సాగిపోతున్న మా కారు కొన్ని గంటల్లోనే పంజాబు సరిహద్దులు దాటేసి ఆళ్వారు మీదుగా పరుగెత్తుతుంది. మళ్ళీ ఆ పర్వత పరివేష్ఠితమైన ఆళ్వారు సంస్థానాధీశుల కోట, సరోవరము, దేవాళయం, ఆత్మవిశ్వాస జనితమైన పులివంటి సుందరమైన శక్తీ అన్నీ నా మనసులో గట్టిగా అత్తుకున్నాయి.

# అధ్యాయం 16

నేను సిమ్లానుంచి కారులో వస్తున్నప్పుడు హిమాలయ పాద సమీపంలో వున్న చిన్న కొండల్లోంచి పెద్ద పాము దారికడ్డంగా పరున్నది. దానిమీదుగా కారు పోనిచ్చినాము. అంబాలాలో పంజాబ్ మెయిలులో పరుండడానికి వీలయిన కంపార్టుమెంటు ఏర్పాటు చేసుకొన్నాను. ఢిల్లీలో బండ్లుమారినై. ధోల్‌పూర్‌లో దిగినాను. ధోల్‌పుర మహారాజావారి అతిథిని నేను. నా మిత్రుడు ప్రొఫెసర్ జె. బి. రాజు రాజావారి ఆజ్ఞానుసారం తన సొంత నౌఖర్లను నా దగ్గిరికి పంపించినారు. సంస్థానపు కారులో రాజ ప్రాసాదం చేరినాను. ఊరు తీర్చిదిద్దినట్టు సొగసుగా వుంది.

మహారాజావారి అల్లుడూ, ఆఫీసర్లూ మందిర సోపానాల మీద నిలవబడి చిరునవ్వుతో నన్ను సమ్మానించినారు. రాజా వారిది తెలివైన వదనం. ఆయన హృదయం చాలా సున్నితం. తెల్లని షేర్వాణీ ధరించారు. హరితవర్ణంగల పాగా తలకు చుట్టుకొన్నారు. ఆ దివాణపు మర్యాదలు నా మనసుకు బాగా నచ్చినవి. 18 వ శతాబ్దినాటి రాజమందిర మర్యాదలు నాకప్పుడు జరిగినై.

తేనీరు ఆరగించాము. పిమ్మట రాత్రి ప్రయాణపు బడలిక కూడా లక్ష్యం చేయకుండా కారులో బయలుదేరి వేటకు సిద్ధమైనాను. మహారాజు లిద్దరూ, నేనూ, డ్రైవరూ కారులోఉన్నవాళ్లం.

మా కారు ఒక చిట్టడవిగుండా వెడుతూవుంటే ప్రజలు ప్రణామం చేశారు. నేను అనుకోనన్ని నెమళ్ల పురులువిప్పి కన్నుల పండు వుగా అడివిలో కానబడినవి. లోగడచేసుకొన్న ఏర్పాట్ల ప్రకారం కారు ఆగింది, ఇద్దరు సిపాయీలు, ఒక వార్డెన్ ముందుకువచ్చి కారునిండా దోసపళ్ళవంటి పళ్ళు నింపినారు. ఇది రాజావారి సాయంసమయ విహార పద్ధతి. ఇదే రివాజని నేను చప్పున ఊహించుకొన్నాను.

రాజావారు నాతో అటవీ నియమాలు ముచ్చటించినారు. చీకటి పడకుండా పులి జంతువును చంపదు. తన ఉనికి జంతువుకు హెచ్చరిక చేస్తుంది. హెచ్చరికచేసినా గుంపులోనుంచి లేడి దూరమైపోతే, తప్పక అది పులికి ఆహారమవుతుంది. మా రాక తెలిసింది లేళ్లు గుంపులై మమ్మల్ని చుట్టివేసినై. కారు వెనుక భాగాన్ని హరిణాలు కొమ్ములతో రాస్తున్నై. రాజావారి సిపాయీలు లేళ్ళను పేరుపేరునా పిలిచి వాటికి పళ్లిచ్చారు. ప్రేమతో చేసిన విందు చాలా నేపు పట్టింది. మేము రాజమార్గాన్నే ముందుకు సాగుతున్నాము.

ఇంతలో ఒక మనిషి హడావిడిగా పరుగెత్తుకు వచ్చి కారులోవున్న మహారాజుతో ఏదో నెమ్మదిగా గుసగుసలాడినాడు. ఆయన మందహాసంచేసి నాకేసి ముఖం త్రిప్పి—“పులిని చూడడం నీకు సమ్మతమేనా?” అని నన్ను ప్రశ్నించారు. తప్పకుండా చూడాలన్నాను. అక్కడ (రాజస్థాన్‌లో) రక్తవర్ణ పర్వతాల మధ్య, ఒక సరస్తీరాన రాజావారి వేటకోసం నిర్మిత మయిన మందిరం చేరినాము. నిశ్శబ్దంగా [illegible] సోపానాలెక్కి— ముఖానికి అద్దాలు పెట్టుకొన్నాము. సరోవరజలం కడుపారత్రాగి

చిక్కగా పెరిగిన నిలువెత్తు పచ్చికలో హాయిగా పులి మాగన్నుతో పరున్నది. దాని రొమ్ము తెల్లగా, లేతఎర్రగా వుంది. ముఖాన అద్దాలుపెట్టుకొని దాన్ని అవలీలగా కనుకోగలిగినాను, క్రిందికి కారుదగ్గిరికి వచ్చేటప్పటికి చుట్టూ లేళ్ల గుంపులు కూడినై. పులి విశ్రమించిన తావుకు నాలుగువందల గజాల దూరంలో ఉన్నాము. ఏమీ ఖంగారు పడకుండా లేళ్ళకు పళ్ళిచ్చి కారు పోనిచ్చాము. గోధూళి వేళయింది. పాలిపోయిన హారిద్రకాంతితో సూర్యుడు అస్తమిస్తున్నాడు, మా కారు కదలగానే లేళ్లగుంపులు కూడా కదలినై. అంతటితో పులికి కూడా కదలిక కలిగింది. మినుకు మినుకు మని ఇళ్ళల్లో దీపాలు మెరుస్తూవుండగా ధోల్‌పూర్ చేరుకొన్నాము.

రాత్రివిందు. దివాణపు సిబ్బందియావత్తూ హాజరయింది, ప్రొఫెసర్ రాజు కూడా వచ్చాడు. మహారాజుతో అర్ధరాత్రి వరకూ ఆయన విజ్ఞానం అనుభవాలు తెలుసుకోనే సదవకాశం నాకు లభించింది. ఆయన రాజపుత్రుడు, మహారాష్ట్రుడు కాడు. రెండువేల సంవత్సరాలనాటి పురాతన రాజవంశమది. జపానులో మికాడోకన్న ప్రాచీనం, చేమంతి పువ్వుల సింహాసనం ఆక్రమించే అధికారం ఆయనకే వుంది.

రాజనీతిలో ఆయన దృక్పథం నాకు బోధపడింది. గతించిన కన్నాట్ ప్రభువుకు తాను చాలా ఋణపడ్డాననీ, బ్రిటిషువారి కవిధేయుణ్ణనీ మహారాజు స్పష్టపరిచాడు. తర్వాత రాజధర్మాలు గురించి ఆయన భావాలను వ్యక్తపరిచాడు. "హిందూమత విశ్వాసంబట్టి శ్రీకృష్ణుడు అవతార పురుషుడు.

కాని నా ఉద్దేశంలో అతను గొప్పరాజకీయవేత్త, రాజసింహుడు. కాబట్టి శ్రీకృష్ణునిలో మూర్తీభవించిన మహత్తర రాజకీయ నైపుణ్యం, చాకచక్యమూ ప్రతి రాజేంద్రునిలో రాశీభూతమై ఉండాలని నా కోరిక." అని ఆయన అన్న వాక్కులు వింటూ వుంటే 'దేవిడ్‌కున్న లక్షణాలన్నీ ప్రతిరాజకుమారునికీ ఉండాలి' అన్న లూథర్ ప్రవచనం నాకు గుర్తుకువచ్చింది. బైజాంటైను చక్రవర్తులు భగవంతుడు మానవమూర్తిగా రాజైనాడని ఉద్ఘాటిస్తారు. ఆంగ్లప్రభువు మొదటి జేమ్సు సిద్ధాంతరీత్యా రాజు దైవాంశ సంభూతుడు.

మహారాజావారు ఇంకా ఇలా చెప్పినారు: సుశాసనబద్ధ మయిన ప్రపంచంలో ప్రతివ్యక్తికీ ఉచిత కర్తవ్యం ఉంది. ఇదే సిద్ధాంతం తిరువాన్కూరులో నేను తెలుసుకొన్నాను. 'ప్రతివ్యక్తి కర్తవ్యమూ' అంటే వర్ణాశ్రమ వ్యవస్థ అన్నమాట. వ్యక్తికి ఆత్మీయ స్వేచ్ఛ ఉంది. అయితే వర్ణాశ్రమ వ్యవస్థ వ్యక్తిగత స్వేచ్ఛకు ఆటంకము, కాని హిందూధర్మం ప్రతి జీవాత్మనూ కృష్ణుడని అంటుంది. 17వ శతాబ్దపు సర్ రాబర్టు ఫిల్మరువలె మహారాజు ఇలా అన్నారు-"రాజు ప్రజలకు తండ్రి. భారతీయ సంఘం కుటుంబ వ్యవస్థమీద నిర్మితమైంది, ప్రభువు రాజ ధర్మం అనుష్ఠించాలి. సుశాసనబద్ధమైన పరిపాలన కొనసాగించాలి. ప్రజలు తమ కర్తవ్యం నెరవేర్చవలసిన బాధ్యత ఉన్నది. తమతమ కర్తవ్య నిర్వహణవల్లనే సంఘాభ్యుదయం. ఐక్యతా సిద్ధిస్తవి. ఇది ప్రాచీన హిందూధర్మం."

నాకు లవలేశం కూడా సందేహం లేదు—రాజాగారు భూతదయాపరు లనటంలో. "జీవకారుణ్యం చూపితేనే మానవ

లోకానికి శాంతి" అన్న భూతదయాపరుల మాటలు ఆయన అంగీకరిస్తారు. తన ప్రజలు స్వధర్మానుష్ఠానం చేసినప్పుడు ఆయన వారికి తండ్రే అనటంలో కూడా నేనేమీ సందేహించను. గీతలో కృష్ణుడు అర్జునుడికి బోధించిన స్వధర్మం మహారాజు ఆదర్శంగా తీసుకొని ఆచరణలో పెట్టినారు. కాని ఈ దేశంలో రాజాధిరాజు లందరూ ఈ రసపుత్రునివలె స్వధర్మపరాయణు లంటేమాత్రం నేను అంగీకరించలేను. స్వధర్మ నిర్వహణపట్ల అచంచల విశ్వాసంతో సనాతన శాంతాభ్యుదయాలను కాంక్షించే తేజోమూర్తి—ధోల్పూరు మహారాజాకు కేవల సాంప్రదాయ రీత్యా కాక భక్తిపురస్కారంగా కైమోడ్చి, శలవు పుచ్చుకొని ఢిల్లీకి మరలి వచ్చినాను.

# అధ్యాయం 18

నేను మళ్లీ కలకత్తా వెళ్లవలసి వచ్చింది. ఢిల్లీ వదలినాను అలహాబాదులో భారతీయ లిబరల్ పార్టీ (మితవాద పక్షం) వృద్ధ నాయకుడయిన సర్ తేజ్ బహదూర్ సప్రూతో మాట్లాడా లని, త్రివేణీసంగమం దర్శించాలనీ వెళ్లినాను. పడవవాళ్లు తైర్థికుల కోసం ఎదురు చూస్తున్నారు. ఈ సంగమం దగ్గరే యేటేటా తీర్థం జరుగుతుంది. పుష్కరానికొకసారి ఘనమైన కుంభమేళా (తీర్థం) జరుగుతుంది.

పవిత్రమయిన వారణాసికి అనతిదూరములో ఉన్న సార నాథం వెళ్లాను. పురాతత్త్వవేత్త అయిన మిత్రుడు డాక్టర్ ఘోష్ కూడా ఉన్నాడు. బౌద్ధానికి నాలుగు క్షేత్రాలు సుప్ర సిద్ధాలు—బుద్ధ జన్మస్థానమైన నేపాళంలోని లుంబినీవనం: బుద్ధుని అవసాన స్థానమైన కుసినగరం; బుద్ధగయలో జ్ఞానో దయం అయినతావు అశ్వత్థవృక్షము; సారంగనాథం (వాడుకలో సారనాథ్ )అనే తావులు బౌద్ధక్షేత్రాలు. సారనాథంలోనే బుద్ధుడు ప్రప్రథమంగా ధర్మచక్ర ప్రవర్తన ఉపదేశించినాడు. జ్ఞానభాస మైన తరువాత గౌతముడు బుద్ధుడై తన పూర్వ శిష్యకోటిని కలుసుకోవలెనని వచ్చినాడు,



( లండన్‌లో భా. హై. క. శ్రీ వి. కె. కె. మీనన్ సౌజన్యంతో. )

ఢిల్లీలో మొగలాయి చక్రవర్తి హుమయూన్ గోరీ

( 1570 నాటి కట్టడము )



అల్హాబాదులో కుంభమేళానాటి-త్రివేణీ సంగమదృశ్యం



(లండన్‌లో భారత హైకమీషనర్ సౌజన్యంతో

సారనాథంలో మూలగంధ కుటీవిహార మందిరం

ఆయనను మొదట శిష్యులు నాస్తికుడన్నారు. సారనాథం వస్తున్న బుద్ధదేవుణ్ణి వధించాలని శిష్యాధములు పన్నుగడ పన్నినారు. కాని తేజోమయమయిన గురుదేవుల ముఖమండలం వీక్షించిన తరువాత శిష్యహృదయం మారిపోయింది. శిష్యకోటి యావత్తూ మోకరిల్లి ఆయనకు పాదాభివందనం ఆచరించి సత్కరించింది. ఇక్కడే ఇటీవల నా మిత్రుడు, భౌతికవిజ్ఞాన శాస్త్రాచార్యుడు అయిన ఒకానొక అమెరికా దేశీయుడు జ్ఞానియై హీనయాన సాంప్రదాయమైన బౌద్ధధర్మం స్వీకరించాడు.

ఇది ఆర్యాష్టాంగ మార్గము—యదార్థ దృక్పథం, యథార్థాశయం, యథార్థ వాక్కు, యథార్థ క్రియ, యథార్థ జీవనం, యథార్థ ఉద్యమం, యథార్థ లక్ష్యం, యథార్థ చింతన, పోతే మధ్యేమార్గం అవలంబించేవారి అభిమతం ఏమిటి ?

"సోదరులారా ! దుఃఖాన్ని గురించి ఇదే ఆర్యసత్యం. జన్మ దుఃఖం, జరా దుఃఖం, మరణ దుఃఖం, అలాగే ప్రణయ వియోగాలూ, నైరాశ్యాలూ, అవాంఛిత వస్తు సంయోగం, వాంఛిత వస్తు వియోగంకూడా దుఃఖహేతువులే, ఒక్కమాటలో చెప్పాలంటే ఈ పాంచభౌతిక శరీరమే దుఃఖమయం. కనుక తృష్ణా క్షయము, తృష్ణా పరిత్యాగమే సమస్తదుఃఖాల ప్రధ్వంస పథము."

సారనాథంలో ప్రవేశించగానే ప్రాచీన శిధిల శకలాలు, అశోకచక్రవర్తిచే నిర్మితమైన శిలాస్తంభము, నాలుగు అంతస్తుల మేడవలె ఎత్తయిన మహాచైత్యమూ, చిన్నచిన్న స్తూపాలూ

నా కంటపడినవి. ప్రథమం బుద్ధుని బోధామృతం సోకిన పవిత్ర ప్రదేశంలో నేను అడుగు పెట్టినాను.

ఈ బౌద్ధవిహారం భారతీయ దేవళాలకు గాని, చైనీయ మందిరాలు—ముఖ్యంగా హాంగ్‌చౌ మహోన్నత కోవెలకుగాని ఎక్కడా పోలికలేదు. చైత్య నిర్మాణం చాలా భాగం పాశ్చాత్య రీతిలో సాగినట్లు తోస్తుంది. క్రీస్తు పూర్వం ప్రథమ శతాబ్ది వరకూ సారనాథంలో ఎట్టి ప్రతీకాలూ వెలియలేదు. ఇక్కడ విగ్రహాలు యవన ప్రభావం సోకినాకనే ఆవిర్భవించినాయి. ఇక్కడ వున్న వస్తుప్రదర్శనశాలలోని పురాతన శిధిలావశేషాలు పురాతత్త్వవేత్తలకు బహు ఉత్సాహకరమైన విషయమే కానీ, నాకు బుద్ధభగవానుని స్మరణగాధే మహోత్సాహపూరితమైనది. బుద్ధబోధలో పరమార్థం నాకు ముఖ్యంగా కావాలి.

తన మరణానంతరం తనకు సంబంధించినవి ఏవీ భూమిలో నిక్షేపము చేయవద్దని బుద్ధుడు శిష్యకోటికి చెప్పినాడు. ఈ సందర్భంలో సారనాధంలో ఒక విచిత్ర సంఘటన విన్నాను. బుద్ధభక్తులయిన సింహళీయులు బుద్ధదేవుని అస్తికలు ధాతువులు సారనాధ నవీన దేవాలయంలో నిక్షిప్తము చేసినారు. క్రీ. శ. 1932 అని ధాతునిక్షేపణ చేసినకాలం శిలాఫలకంమీద గండరింప బడింది. గయనుంచి బోధివృక్షశాఖిక తెచ్చి దేవాలయ సమీపాన నాటినారు. కాని సారనాధంలో ప్రధాన శిధిలం శేషించలేదు.

1793 లో హిందూరాజు, బాబూజగత్‌సింహుడు తన కాశీ విపణిని వృద్ధిచేసే నిమిత్తం కంకరకోసం సారనాధ శిధిలాలు

తవ్వించి పాడుచేసినాడు. మహాచైత్యములో చాలా భాగము ఆ ముష్కరుని చేతుల్లో సిక్తయిపోయింది. పోగా మిగిలింది చిన్న స్తూపము. కేంద్ర చైత్యం లేదు. కాశీరాజే ఆ అమూల్యమయిన బౌద్ధశిల్పం నాశనం చేసినాడనటంలో సందేహంలేదు.

స్తూపాంతర్భాగంలో శిలామయ శవపేటిక ఒకటి కనపడింది. పేటికలో రజత పిటకము నిక్షిప్తమయింది. శిలాపేటిక మాత్రం భద్రం చేసినారు. దానిలోవున్న సువర్ణపేటికను సంగ్రహించి ద్విగుణీకృతోత్సాహంతో కాశీరాజు వారణాసిలో వున్న బ్రిటీషు రెసిడెంటు జోనాధన్ డంకనుకు బహూకరించినాడు. డంకన్ విజ్ఞాని, పురాతత్త్వజ్ఞానం కలవాడు కావడంచేత దాన్ని గురించి పత్రికలో ఒక అమూల్యమైన వ్యాసం వ్రాసి ప్రచురించినాడు.

డంకన్ వాదమిది: స్వర్ణపేటికలో వున్న ఆభరణాలు, అస్తికలు ఎవరో మహామహుని భౌతికశరీర అవశేషాలనీ, ఆ అస్తి శకలాలు ఏ హిందూ ధర్మావలంబివో అయినట్లయితే వెంటనే కాశీరాజు గంగాజలంలో విమజ్జనం చేసేవాడనీ వ్రాశాడు. అవి ఏ బుద్ధభక్తుని అస్తికలో లేక బుద్ధభగవానునివే కావచ్చునన్న మాట ముమ్మాటికీ యధార్థం.

ఇప్పుడా సువర్ణపేటికా లేదు, అస్తిశకలాలు అంతకన్నా లేవు. ఎక్కడ ఉండేవోకూడా తెలియదు. ఏ పురాతత్త్వ శోధకుడైనా ఆ పేటికను కరిగించి బంగారు ముద్దచేసి వుంటాడా? అలాగైతే అతనికి కిట్టుబాటైన స్వర్ణంకంటే ఆ స్వర్ణపేటిక విలువే అత్యధికమైందని అతను తెలుసుకోలేదన్నమాట. పోనీ బుద్ధ

భక్తులు పెట్టి హరించివేస్తారా? అంత పవిత్ర మయినదాన్ని వారు దొంగిలిస్తారా? లేదా డంకనే సంగ్రహించి రహస్యంగా స్కాట్లండ్‌లో దాచుకొంటాడా? ఏమీ బోధపడటం లేదు. కాశీలో బుద్ధధాతు నిక్షిప్తమయిన ఆ పవిత్ర స్వర్ణపేటిక పోయిన సంగతే ఎవరికీ పట్టినట్టు తోచదు. బంగారం ఏ చోరులనో ఆకర్షించిందని నా మిత్రులు టూకీగా అనేసి ఊరుకుంటారు. కాని చౌర్యం సంగతి ఎక్కడా వ్రాయబడి లేదు.

# అధ్యాయం 18

క్రీ. పూ. 6వ శతాబ్దిలో శ్రావణపూర్ణిమనాటి సంజవేళ సుమారు ఏడు గంటలకు బుద్ధభగవానుడు కాశీనుంచి సారనాథం పాదచారిగా వెళ్ళినాడని చరిత్ర చెబుతుంది. అక్కడ మాధ్యమిక మార్గమనే అష్టాంగమార్గమును ఉపదేశించినాడు. గురూపదేశము సాక్షాత్కారం కానీ మోక్షానికి అవసరంలేదని ఆయన చెప్పినాడు. ఆత్మ శాశ్వతత్వాన్ని గురించి, యజ్ఞయాగాదుల నిరుపయోగత్వం గురించీ శ్రుతి వాక్యాలు ఆధారాలున్నవి. కర్మకాండ నిర్వాణానికి తోడ్పడదని ఆయన వాదం. క్షత్రియుడు కానీ, శూద్రుడుకానీ ఎవరయినాసరే మోక్షార్హులే. మోక్షానికి యాగాదులతో, వర్ణాశ్రమాచారాలతో నిమిత్తం లేదు. దేవతలకూ, కృష్ణుడికీ కూడా మోక్షం కావలసి వచ్చింది. ఆనాడు కేవలం వ్యక్తిగతమైన వర్ణాశ్రమాచార విరుద్ధమయిన నాస్తికవాదమై. బౌద్ధం విలక్షణమైన తార్కిక పథమును ఏర్పరచింది.

నాటి ఆచార్య శంకరునివలె, నేటి మహాత్మా గాంధీవలె హిందువులకు గౌతముడు ధర్మసంస్కర్త. క్రీ. శ. 8వ శతాబ్దిలో శంకరులు మహాయాన బౌద్ధతత్త్వం మాదిరిగానే సనాతన మాయా సిద్ధాంతం నిర్ధారణ చేసినారు. దానితో భారతదేశంలో

బౌద్ధానికి క్రమేణా స్థావరం లేకుండా పోయింది. బౌద్ధం మహాయానమై హిందూ సంస్కృతిలో లీనమయింది. బుద్ధదేవుడు దేవతారాధనము అంగీకరించనే లేదు. అందుకనే శిష్యకోటికూడా ఆయనకు దేవత్వము ఆపాదించి పూజించలేదు. విద్వాంసులు నిర్వాణం అంటే ఏమిటని తర్కవితర్కాలలోకి దిగి భిన్న రీతుల్లో సిద్ధాంతం చేశారు. నిర్వాణము ఏ గురుదేవతా కటాక్షము లేకుండానే శూన్యతానుభవమే అవుతుందా ? మహాయాన బౌద్ధంలో నాగార్జునాచార్యులవారి మాధ్యమిక వాద ప్రకారం బౌద్ధులు మాయనూ, పరబ్రహ్మనూ అంగీకరిస్తారు. ( శాంకరా ద్వైతులు వలె ) హీనయానం క్రమేణా పరివర్తితమై హిందూ వేదాంతమార్గం అనుసరించింది. దానితో బుద్ధారాధన బయలుదేరింది. అవతారాల్లో బుద్ధుణ్ణి చేర్చినారు. క్రమేణా బౌద్ధశిల్పము వివిధరీతుల్లో వికాసం పొందింది.

చైనాలో మహాయాన బౌద్ధ ప్రభావంవల్ల సహజమైన దేశీయ సంస్కృతి మారిపోయింది. బౌద్ధప్రభావానికి పూర్వం చైనీయులు వ్యావహారిక సత్యము మాత్రమే అంగీకరించిన భౌతికవాదులు. మహాయాన సంపర్కంవల్ల వారు భారతీయ దృక్పథమైన ఆముష్మిక చింతనాశీలము అలవరచుకొన్నారు.

బుద్ధభగవానుడు స్టోయిక్కులవలె జాతి కుల విచక్షణ లేకుండా జిజ్ఞాసువులయిన ప్రజలందరికీ బోధ చేసినాడు. నిర్వాణము మానవ జీవిత గమ్యము. అంటే హిందూధర్మంలో పరబ్రహ్మానుభవం వంటిదే ఈ నిర్వాణము. టిబెట్‌లోనూ, చైనాలోనూ లామాలు అయోమయంగా ఈ తత్త్వమే ఉపదేశిస్తారు. బుద్ధుడు త్యాగములో, నిష్కామ కర్మలో మోక్షం ఉన్నదన్నాడు.

సారనాథ దేవాలయం గురించి 7వ శతాబ్దిలో చైనా యాత్రికుడు సమగ్రంగా వర్ణించినాడు. అంతవరకూ విహార శిల్పం ఉజ్వలంగానే ఉంది. కాని 12వ శతాబ్దిలో ముసల్మానులు దేవాలయశిల్పాన్ని విధ్వంసం చేసినట్టు నేను తెలుసుకొన్నాను.

ఏదో వివాదము ఉన్నప్పటికీ ప్రబల సాక్ష్యం నాకు కనపడుతున్నది. ప్రాచీన శిలా స్తంభం మీద వ్రాసిన లిపి ఇలా వుంది. " దేవానాం ప్రియుడయిన అశోకుడు శాసిస్తున్నాడు." రాజశాసనం ఇది—" సోదర భిక్షువుల కూటంలో చీలికలు కలిగించేవాళ్లు సంఘము నుండి బహిష్కృతు లవుతారు. వారు కాషాయాంబరం ధరించరాదు " ఈ శాసనం దగ్గరగా మరో శిలాశాసనంలో—" సహజియాన శాఖవారిది " అని ఉల్లేఖించబడినది. అంతకు పూర్వమున్న భిక్షువులు సంఘ బహిష్కృతులు కాగా వారి స్థానే సహజియాన శాఖవారు వచ్చి చేరినారు.

భారతీయ నాగరికత గోపూజలో ఘనత వివరించినా నాకు అంగీకారంకాదు. సర్వైక్యత గోపూజలో ఉంటే ఉండవచ్చును. కాని ప్రత్యేక పదార్థాలకు భారతీయులు విలువ ఇవ్వరు. జీవనానికి విలువ ఇవ్వడం, గౌరవించడం తప్పదు. అయితే అది చాలా మూల్యాలలో ఒకటి మాత్రమే. బుద్ధుడు గోపూజ చేయలేదు. ఐనా ఆయన జీవనసర్వైక్యతను గ్రహించినాడు. ఆ సర్వైక్యత హేతుప్రభవమయినదే అయితే, ఐక్యత కేవల సత్యం కాదు. అది గ్రహించినమాత్రాన మోక్షము, శాంతి కలగవు. (?)

బుద్ధునివంటి పరిత్యాగికి విశ్వనాధుడు ఎదురుచుక్క. సారనాథంలో ' మూలగంధ కుటీవిహారం 'లో మారుని నాట్యకత్తెలు

బుద్ధుణ్ణి మోహ ప్రలోభునిగా చేయవలెనని యత్నిస్తూ. నగ్నంగా నృత్యం చేసి చేసి వృద్ధవనిత లవుతారు. వర్ణాశ్రమా చారాలు, కర్మకలాపాలు మాయ. అట్టి మాయావరణం ఛేదించిన వాడే బుద్ధుడు. జీవనబంధాలన్నీ త్యజించివేసినాడు.

హీనయాన బౌద్ధాన్ని విమర్శించేవారి పద్ధతి నాకు నచ్చదు. మహాయాన బౌద్ధం జీవనపరమార్థం నిర్వాణమనే శూన్యతత్త్వమని చెప్పడమూ నాకు సమ్మతముకాదు. ఈనిరాశా వాదం నవీన సత్తావాదులయిన ( Existentialists ) హిడెగ్గర్, సర్టరులవలె అర్థరహితం, పరమార్థరహిత నాస్తికవాదమేనని నాకు తోస్తున్నది. ఇంకా ఈ నాస్తిక సత్తావాదులంటారు కదా "సంకుచిత మాయావరణంలో జీవించు. అయితే నూతన కర్మానుష్ఠానం వల్ల మాయా వలయం భేదించి నీ బుద్ధిని రక్షించుకో." హేతుబద్ధంగా బౌద్ధం వివరించాలి. "మాయను పరిశీలించు. సత్తలేక ఉనికి ఆత్మసారమునూ మాయగా చూడు." ఎందుకీ కర్మకలాపము? బౌద్ధులు సనాతన హిందూధర్మాన్ని వికలంగా, సులభంగా, స్పష్టంగా చూపించారని నా అనుమానం. అంతకన్న 'ధమ్మపదం' ప్రమాణంగా స్వీకరిస్తేసరి. "ప్రకృతి ధర్మం పుట్టడం గిట్టడం. విషయాలు క్షణికాలు. పునరావృత్తి రహితత్త్వమే పరమానందం. బ్రహ్మలోకం కూడా క్షణికము. అది వ్యక్తిగతం. వ్యక్తిగత బ్రహ్మలోకం తృణీకరించు. వ్యక్తిత్వం నుండి విముక్తికై సాధనచేయి."

బుద్ధుడు నేతినేతి వాక్యాలతో సగుణ నిర్గుణ తత్త్వాలు ఒకటేనని పరిణామము దుఃఖమనీ ఉపదేశించినట్లు కనపడుతుంది. చైనాలో కన్‌ఫ్యూషియన్ తాత్త్వికునివలె, ఆధ్యాత్మిక సమస్యల

జోలికి ప్రజలు వెళ్ళవద్దనీ, బుద్ధుడు నైతికజీవనమే ప్రధానంగా బోధించినాడు. "మాలుంక్యపుత్రుడా! నన్ననుసరించి పవిత్ర జీవనం గడుపు. శాశ్వతమనీ, శాశ్వతంకాదీ ప్రపంచమనీ నేను చెబుతున్నాను." "కాదు భగవాన్...." అన్నాడు మాలుంక్య పుత్రుడు. "అయితే నేను చెబుతున్నాను, జగత్తు శాశ్వతమయినా, అశాశ్వతమయినా జన్మ జరా మృత్యు దుఃఖ తాప నైరాశ్యాదు లున్నవి. జన్మ జరా మృత్యు దుఃఖ తృష్ణా ప్రధ్వంసమే నేను బోధించేది. జగత్తు శాశ్వతమయినా కాక పోయినా—జగద్విచారణ వల్ల నిష్ప్రయోజనం. అది పవిత్ర జీవనసూత్రమునకు ప్రాతిపదిక కాదు కూడానూ."

# అధ్యాయం 19

రెండువేల అయిదువందల సంవత్సరాల క్రిందట గౌతమబుద్ధుడు ధర్మప్రబోధం చేయడానికి సారంగనాధం వేంచేసినాడు. సరిగా ఆ చోటనే నేనిప్పుడు నిలవబడినాను. విశ్వమానవకోటిలో నాలుగవవంతు ఆయన శిష్యపరంపర. శిష్యకోటి క్రమేణా అవినీతి మార్గము అనుసరించినారు. పెకింగులో పండితులు నాతో అన్నారు—బుద్ధుడు ప్రజలకు ఆముష్మికచింత కలిగించినాడని. ఆయన యదార్ధంగా చేసిన ఉపదేశ మేది?

ఈ ప్రశ్నకు సమాధాన మివ్వటానికి యావజ్జీవనం నేను బౌద్ధ విద్వాంసుణ్ణికాను గాని, కేవలం యాత్రికుడనై బుద్ధ వచనాలను అనుభవపరంగా గ్రహిస్తాను. శూన్యమని చెప్పే పరతత్త్వంతో తాదాత్మ్యము నాకు అంగీకారము కాదు.

పద్మయోని అయిన పరమేశ్వరుడు శాంతిదాయకుడా? హిందువులు చెబుతున్నది యదార్ధమా? జీవితం సర్వసంగ పరిత్యాగమా? అయితే సృజింపబడేది లేదా? లేకపోతే ఎందుకీ జీవన పోరాటం? భిన్నభిన్న చిత్రవర్ణ శబలిత కోణాలనుంచి జీవన రత్నకాంతులు పరిశీలించడంలో పరమార్ధ మేమీ లేదా? బౌద్ధావలంబికులు-మచ్చుకు టిబెట్ బౌద్ధుల అభిమతం ఏమిటి?

నాకు మార్గదర్శిగా ఉన్న ఘోష్ అన్నాడు—టిబెట్ గిరికంద రాల్లో బౌద్ధులు తాంత్రికోపాసన చేస్తారట.

నే నిలా పఠించినాను—"విముక్తుడికి 'సుందరం' అంటే ఏమిటో స్పష్టంగా తెలుసును, అతని అనుభూతి సుందర మైనది కనుక."

"పవిత్ర జీవనసారము ప్రియమైత్రి, విశ్వమైత్రి. సోదరులారా! సద్వస్తువును చూచి భయపడకూడదు. సద్వస్తువు ఆనందపర్యాయ పదము. అది అత్యంత ప్రీతిదాయకము.... నాకై నిరీక్షించేవాళ్లు రోగులను కనిపెట్టుకొనండి........తృష్ణా మూలముగా, ద్వేషమువల్ల, మాయాభయాలవల్ల మానవుడు పాపాచరణ చేస్తాడు."

"పరివ్రాజకుడు మానవులతో అభిమాన బంధాలు ఏర్ప రచు కొనడు. కామాది ప్రలోభాలకు అతీతుడయిన విరాగి ఎవరి తోనూ వాగ్వాదము చేయడు."

"సోదరులారా! లోకంతో పోట్లాడను. లోకమే నాతో పోట్లాడుతుంది. ధర్మోపదేష్ట లోకులతో వివాదపడడు."

"ద్వేషం ద్వేషంతో సమసిపోదు. ద్వేషరాహిత్యంవల్ల ద్వేషం సమసిపోతుంది. అది ప్రాచీన ధర్మసూత్రం."

"ఆ రీతిగా సాధకుడైన సోదరుడు బాహ్యాభ్యంతరాల్లో మననవిధి ధ్యాసలుచేస్తాడు. ప్రాపంచిక విషయాలను ఆసించడు."

ఈ సారనాదంలోనే బుద్ధుడు ధర్మచక్రం ప్రవర్తింప చేసినాడు. ఆనందములో ఉద్వేగము లేదనీ, అదే శాంతమనీ శివంకరమనీ, తృష్ణాక్షయంతో నిర్వాణప్రాప్తి అని ఆయన

ఉపదేశించినాడు. విషయాలకు మానవుడు దూరమై అనాసక్తుడై, సత్కర్మాచరణలోనూ అనాసక్తుడై శాంతుడై దాంతుడై వుండవలెను. సాధకుడు అహింస అలవరచుకోవలెను. "సద్దృష్టి నిస్సంగత్వం మీద, రాగద్వేష రాహిత్యం మీద, విరక్తిమీదను ఆధారపడినది." ఇది బుద్ధిపూర్వక స్వకీయనాశనానికీ, ఇంద్రియ లాలసకూ మధ్యమార్గము. స్వీయనాశన విషయం తప్ప మిగతా బౌద్ధ సిద్ధాంతం యావత్తూ జైన సిద్ధాంతంవలెనే ఉంది. గాంధీ గారి తల్లి జైనమతస్థురాలుగానే ఉండేది.

జర్మన్ కవిసామ్రాట్టు గేటే వ్రాసిన 'ఫాస్టు' పద్య నాటకంలో మెఫిస్టోఫిలిస్‌తో ఫాస్టు అంటాడు—"సమస్తానికీ మూలం శూన్య" మని. బుద్ధుడు సిద్ధాంతం చేశాడేకాని తోసి రాజనలేదు. ఆయన సర్వసంగ పరిత్యాగానికీ అనాసక్తికీ ప్రాధాన్యం ఇస్తూ అష్టాంగమార్గం ఉపదేశించినాడు.

అయితే అన్నిటినీ సరిపెట్టుకొనేవాడు నాతో ఇలా అన్నాడు—"ఏమిటి విరక్తి? విశ్వమైత్రి, సర్వసంగ పరిత్యాగమూ, అనాసక్తీ అన్నీ సుభాషితాలు. నీ శరీరం అన్యుల శరీరంవంటిది కాదూ? ఏమిటీ వ్రణంలాంటి జీవన ప్రవృత్తి? ఫలాభిసంధి రహితమయిన కర్మయోగ మేమిటి? నా కార్యసిద్ధి ఏమిటి? నా మహత్త్వకాంక్ష తగ్గించుకొని గొఱ్ఱెవలె జీవించవలెనా? కాషాయాంబర ధారులయిన టిబెట్ సన్యాసులు 'ఓం మణి పద్మేహుం' అని ఉపాసన చేస్తూ వారి మహత్వకాంక్ష తగ్గించుకో గలిగినారా? ప్రవృత్తి విసర్జించినారా?"

నే నిలా సమాధానం ఇచ్చాను—"యదార్ధ భావం కావలసిందే, కర్మాచరణలో యదార్ధ భావన ప్రబల శక్తిదాయకం."

హనుమాన్ దేవాలయం పక్కగా కాశీలో నేను వెడుతు న్నప్పుడు తధేకాలోచనలో ఉన్నాను. దేవాలయంమీద కోతులు గంతులువేస్తూ పుష్కరిణివైపు తిరుగుతున్నై. నానా రూపాలు కనపరుస్తూ కరాళతాండవం చేసే కాళీమాతకు ఎదురుగా కోతు లెన్నో గంతులు వేస్తున్నై.

కోతులకూ సత్యానికీ సంబంధం ఏమిటని మార్గదర్శిని అడిగినాను. హిందూధర్మంలో బహుదేవతారాధన ఉందనీ, హనుమంతుడు దాస్యభక్తికి తార్కాణమనీ చెప్పినాడు. వానరాలు ప్రయోజనం కనపడే నిరంతర మానవ ప్రవృత్తిని తెలియ చేస్తున్నై. 'తథాగతుడు' సత్య ద్రష్టయిన బుద్ధుడు మాత్రం ఆ ప్రవృత్తి చూడలేదు. నామరూప నానావర్ణికా శబలితా భాసలకూ, ఈ కోతి గంతులకూ అర్థమేమిటో? నాకు అగమ్య గోచరంగా ఉంది.

# అధ్యాయం 20

బి. ఓ. ఏ. సి. విమానం వలయంగా తిరుగుతూ కలకత్తాలో 'డం—డం' విమానాశ్రయంలో దిగింది. విమానం నుండి మొట్టమొదటిసారి వంగదేశ ప్రకృతిని వీక్షించినాను. ఎక్కడ చూచినా కాలువలు, జలమార్గములూ, జలమార్గములకు రెండు వైపులా కొబ్బరిచెట్లూ, తాటితోపులూ విరివిగా ఉన్నవి. ఆకూ అలమూ దగ్ధం చేయగా మంటలు రేగుతూ కనపడుతున్నవి. ఆ బూడిద చేలకు ఎరువుగా ఉపయోగ పడుతుంది.

వంగదేశీయ రాజకీయ నాయకుడూ విఖ్యాత భారతీయుడైన శరచ్చంద్ర బోసుకు నే నతిథిని. చక్కని స్టుడ్‌బేకరు కారులో కాంగ్రెస్ పతాకము గాలిలో రెపరెపలాడుతూ ఉండగా బోసుగారి బంగాళాకు వెళ్లినాను. ఆయన చేసిన ఆదరసత్కారము లద్వితీయం. ఆయన వాసమందిర మంతా పాశ్చాత్య పద్ధతినే అలంకృతమై ఉంది.

బోసు కుమార్తెలు చక్కని చుక్కలు. రమకు పద్దెనిమిది సంవత్సరాలు. చిత్ర చిన్నది. ఆదివారంనాడు నన్ను ఇద్దరూ కాళికా నాటకశాలకు తీసుకొని వెళ్ళినారు. శ్రీమతి శాంత అనే విఖ్యాత దాక్షిణాత్య నర్తకి కలకత్తావచ్చి అశేష జనాన్ని ఆకర్షిస్తున్నది.

కేవలం భారతీయమయిన నాటకశాల జనంతో కిక్కిరిసింది. తెర ఎత్తకముందు పురుషులు ధూమపానం చేస్తున్నారు.

స్త్రీలు నుదుట కుంకుమతో, చక్కగా సవరించిన కురులలో పుష్పాలు తురుముకొని. భూషణాలతో, కర్ణతాటంకాలతో అలంకృతమై కనపడుతున్నారు. కర్ణాభరణము, ముక్కుపుడకలు పాశ్చాత్య దృష్టికి అందవికారం. ప్రాగ్దేశాల్లో క్రమేణా వాటిని తీసివేస్తున్నారు. నాట్యశాలలో గోడలమీద భారత సంస్కృతి కారకులయిన రవీంద్ర చిత్తరంజన వివేకానందుల చిత్తరువు లున్నవి. విశ్రాంతివేళలో థియాటరులో శీతలపానీయం, ఉర్లగడ్డ చిప్సు లభ్యమవుతాయి. ఈ పద్ధతి పాశ్చాత్య నాటకశాలలో కూడా వుంది.

నాట్యశాలలో దీపాలు ఆర్పివేయగానే తెర యెత్తినారు. మొదట గాయకుల స్వరమేళ ప్రారంభమైనది. నేను న్యూయార్కులో ఉదయశంకర్, రామగోపాలు నాట్యంచేయగా చూచినాను. శాంతాదేవి నాట్యంకూడా అలాగేవుంది. నాట్యం యావత్తూ ఆమే నిర్వహించింది. ఇతివృత్తం పౌరాణికమూ మతవిషయకమైనది. భంగిమలూ, ముద్రలూ, విన్యాసాలూ భావపూరితాలు, రసోపస్కారకాలుగా ఉన్నై. నేను థియేటరులో ఈ నృత్యంలో హావభావ భంగిమలు పరిశీలిస్తుండగా రవీంద్రుని శాంతి నికేతనానికి వచ్చి ఉపన్యశించమని ఆహ్వానం వచ్చింది. ఈ ఆహ్వానం ఒక ప్రత్యేక వార్తాహరునిచేత రవీంద్రుని మేనల్లుడైన రతీంద్రనాథ ఠాగూరు పంపినాడు.

శాంతాదేవి నాట్యం ముగిసిన తరువాత నాకూ విఖ్యాత నటుడయిన దేవనాథదాస్‌కూ పరిచయం కలిగింది.

తర్వాత కొన్నాళ్ళకు శాంతి నికేతనంలో, ఢిల్లీలో న్యూయార్కులో భారతీయ నాట్యం చూచే అవకాశం నాకు

లభ్యమయింది. వాటిలో ఇతివృత్తము కూడా పౌరాణికమూ మతవిషయకమూ అయినవే. నా అనుభూతి అప్పుడూ ఇప్పుడూ ఒకేలాగ వుంది. మానవమాత్రులుగా కాక, దైవత్వం ఆరోపించుకొని మానవాతీతులై నృత్యం చేస్తారు. సంగీతము రసానుభవం కలిగిస్తుంది.

చీకటిగావున్న కాళికా నాట్యశాలనుంచి కలకత్తా చౌరంఘీ వీధిలో ప్రవేశించేసరికి సూర్యకాంతి తీక్ష్ణంగానే వుంది. అది సంధ్యాసమయమయినా, చౌరంఘీలో బెంగాలు క్లబ్బు, సెంట్ ఆండ్రూస్ చర్చివున్నా తోవగుండానే మా బసకు వెళ్లుతున్నాం. కలకత్తా ఆండ్రూస్‌చర్చి తరువాత ఇంగ్లండులో చర్చివలె అందమయిన ప్రెస్బిటేరియను క్రైస్తవ చర్చి కనబడింది. స్కాట్లండ్ దేశీయ భావన, యవనదేశీయ స్పష్టతా, కెలడోనియా సంయమమూ, ఆండ్రూస్ చర్చి నిర్మాణ శిల్పంలో కానవచ్చినై. నేటికి సంవత్సరం కూడా కాలేదు—ఈ కలకత్తా వీధుల్లోనే శిక్కులూ, మహమ్మదీయులూ, హిందువులూ కత్తులు దూసుకొని కుత్తుకలు ఉత్తరించుకొన్నారు. కొందరు ఆంగ్లేయవేషం ధరించి కొందరు పంచలు కట్టుకొని పరస్పరం నిర్దాక్షిణ్యంగా నరుక్కున్నారు. 'అల్లా' 'రాం' అంటూ సుమారు ఎనిమిదివేల మానవ కళేబరాలు నేల కొరిగినాయి. 'రక్తపిపాసతో మతబోధ' చేయటమనేది జాన్ కాక్సుకే తగును. బౌద్ధ గ్రంధమైన 'దమ్మపదము' లో ఇలా ఉల్లేఖింపబడింది—"ద్వేషపూరిత హృదయాలకు తృప్తిలేదు—" అన్న శంఖారవం మానవ హృదయాన్ని స్పదింపచేస్తుందా ?—ధ్యానయోగంలోకి పోతుందా ? లేదా పద్మాలయమయిన సరస్సు ధ్యానయోగం కలిగిస్తుందా ?

# అధ్యాయం 21

మిత్రులు నన్ను సుభాస్‌చంద్ర బోసు మందిరం చూచేందుకు తీసుకు వెళ్ళవలెనని నిర్ణయించినారు. నేడు వంగదేశంలో అది జాతీయ పుణ్యక్షేత్రం. సుభాస్‌బోస్ వంశంలోవున్న అందచందాలన్నిటినీ పుణికి పుచ్చుకొన్నవాడు. బ్రిటీషువారిని భారతంనుంచి పారదోలే నిమిత్తం, జపాన్‌వారి సహాయంతో సేనానీకము నిర్మించి, నడుపుతూ ఆయన గతించినాడు. బోస్ మందిర దర్శనావకాశం నాకు లభ్యం కావడంవల్ల, బోసుకన్యల నేత్రాల్లో చెలరేగిన స్పర్ధరేఖను చూడగలిగాను.

వుడ్‌బరన్ పార్కులో టెన్నిస్ ఆడే పచ్చికబయళ్ళ దగ్గిర రెండంతస్తుల ఎర్రమేడ కలకత్తాలో ఉన్నతంగా ఉన్నదే బోసు గృహం. ఆ మందిర వాతావరణం గంభీరంగా కనపడుతుంది.

చాలామంది బ్రిటీషువారికి బోసుబాబు 'క్విస్లింగు.' క్విస్లింగు అనే శబ్దార్థం 'వైదేశిక సహాయంతో దేశద్రోహం చేసేవాడు' అని. బోసు దేశద్రోహి ఎన్నటికీకాడు కాజాలడనీ భారత జాతీయవాదులు నిష్కర్షగా చెబుతారు. రాజనీతిలో ఆయనకు దూరదృష్టి లేదనీ, ఆయన మార్గం సరియైనది కాదనీ అంటే అనవచ్చును. ఎవరేమన్నా సుభాస్‌చంద్రుడు స్వతంత్ర

సమరం సలిపిన మహావీరుడు ప్రజాహృదయం చూరగొన్న నాయకమణి. ఆయన సహసోపేత విప్లవకృత్యాన్ని ముప్పై మూడుకోట్ల భారతీయులూ గానం చేస్తూ ఉంటారు.

ఆయన మందిరం దగ్గిర ఐ. యన్. ఎ. (భారత జాతీయ సైనికులు) స్వతంత్ర రణరంగంలో త్యాగశౌర్యములు చూపి వీరస్వర్గం అలంకరించినవారి స్మారకచిహ్నంగా ఒక శిలాఫలకం ప్రతిష్ఠించబడినది. దానిముందు దీపిక వెలుగుతున్నది. ఈ స్మారక శిలా స్తంభం సింగపూర్‌లో బోస్ వీరులు ప్రీతితో నిర్మించిన సుభాషచంద్రుని స్మారక శిలా స్తంభంవలె ఉన్నదని కొందరు చెబుతూవుంటే నేను వింటున్నాను. అప్పుడు అక్కడ వున్నవారంతా నా మొఖ కవళికను కనిపెట్టుతూనే ఉన్నారు. సింగపూరును ఆంగ్లేయులు పునరాక్రమణా సుముహూర్తంలో బోస్ స్మారక స్తంభాన్ని డైనమైట్‌తో పడగొట్టినారు. అన్య దేశీయుల ఉజ్జ్వల జాతీయాదర్శములయెడల గౌరవము చూపవలసిన సభ్యత నాది. అట్టి సహనం ప్రదర్శించిననాడుగాని నేను సభ్యప్రపంచంలో సగర్వంగా తలెత్తుకు తిరగలేను.

మేడ మొదటి అంతస్తు ఎక్కినాము. అక్కడ కాలిజోళ్లు తీసివేయమన్నారు. నేను అందరితో పాటు తీసివేశాను. అది పవిత్ర క్షేత్రమన్న భావనతో ఆవిధంగా నేనూ భారతీయాచారం పాటించాను. బోసుబాబు నిజమందిరం విడిచి వెళ్ళినప్పుడు వస్తువులు ఏస్థితిలో ఉన్నవో అలాగే భద్రపర్చబడినవి. ఆ మహా వీరుడు స్వీకరించిన కానుకలెన్నో మందిరంలో ఉంచినారు. ముఖ్యంగా జపాన్‌వారు కానుకగా అర్పించిన ఇత్తడి

పూలకుండీలు స్వస్తికా చిహ్నములతో నన్ను ఆకర్షించినవి. తూర్పు దేశాలలో సర్వత్రా స్వస్తికాముద్రలే కానవస్తాయి. డాక్టర్ గోబెల్సు స్వస్తికాముద్రలోని భావం బహుశా ఆయన హైద్రాబాదులో విద్యార్థిగా ఉన్నప్పుడు నేర్చుకొన్నాడేమో!

నా అలవాటు చొప్పున బోస్‌బాబు గ్రంథాలయంలో ఏమేమి పుస్తకా లున్నవోనని గమనించాను. అలమారులో కొరాను ప్రొఫెసర్ రాలే సంపాదితమయిన షేక్‌స్పియరు, ఆల్బర్ట్ స్వీట్జరు రచించిన 'డెవలప్‌మెంట్ ఆఫ్ ఇండియన్ థాట్,' లోవెల్ థామస్ వ్రాసిన 'రైడర్స్ ఆఫ్ ది డీప్' వంటి పుస్తకాలున్నై. పడకగది కుర్చీల్లో బోస్ మృతశరీర సంబంధమైన చిత్రాలు మాలాలంకృతాలై కనపడినవి. అక్కడ ఆయన వస్తువులు చివరికి సేవింగ్ బ్రష్ కూడా బహుభద్రంగా దాచినారు. నేను అక్కడ ఉన్నంతసేపూ యాత్రికులు తండోప తండాలుగా వచ్చి జోళ్లు విడుస్తూనే ఉన్నారు. లెనిన్, సన్‌యట్‌సేన్ సమాధుల దగ్గిర ఇంతకన్న తక్కువ జనాన్నే చూచాను. అందులోనూ ఆవేళ జనవరి 23 తేదీ సుభాస్‌చంద్రుని జన్మదినోత్సవం కావడంవల్ల జనప్రవాహాన్ని పట్టశక్యం కాలేదు.

మర్నాడు మేము కలకత్తాలో విక్టరీ మెమోరియలు శిఖరం ప్రక్కనించే కారులో వెళ్ళినాము. శరచ్చంద్రబోసు పెద్దకుమార్తె రమాదేవి ఇలా అన్నది. "ఈ స్మారక చిహ్నం బ్రిటీషువారు స్థాపించారు. మహారాజుల దగ్గరనుంచి విరాళాలు పుచ్చుకొని కట్టినారు. కాగా ఇది తాజ్‌మహలుకు చచ్చు నకలు." చెల్లెలు రమను కొంచెం వెనక్కిలాగి వింతగా ముఖం పెట్టింది—

నన్ను అగౌరవించ కూడదన్నట్టు. ప్రపంచంలో రాజకీయానుభవం నాకు విశేషంగా ఉంది. ఎట్టి రాజనీతి విమర్శకులనైనా తట్టుకోగల నిబ్బరము కలవాణ్ణి. అయితే వంగదేశీయుల స్వభావము ఇతరుల మనసు నొప్పించకూడదని. వారి సౌహార్ద్రము గ్రహించి నేను మెచ్చుకొన్నాను. తర్వాత సుభాస్ చంద్రుని మేనగోడలు బ్రిటీషువారి పాపాలను బాగా దుయ్యబట్టుకొన్నది. ఆ అమ్మాయి మనసులో ఉద్దేశాలను దాయకుండా వెళ్ళకక్కినందుకు నేను కృతజ్ఞత చూపాను.

ఆమె ఇలా అన్నది: "స్వేచ్ఛ సంపాదించాక ఇంకా భారతదేశం విషమస్థితిలోనే వుంది. 1943 లో దేశంలో వరి విరగపండింది. దానికి ఫలం మా దేశంలో భయంకర క్షామం చెలరేగింది. ముఖ్యంగా బెంగాల్లో ప్రజలు వీధివీధిని చనిపోయారు. పసిపాపలూ, చిన్నా పెద్దా విచక్షణలేకుండా లక్షలాది ప్రజ గుట్టలు గుట్టలుగా తిండిలేక మలమలమాడి అసువులు బాసినారు. కాని పండిన ధాన్యమంతా మధ్యప్రాచ్యంలో సేనాని వహాలకు మాత్రం చేరుస్తూనే వున్నారు. ఇది మహాదారుణం కాదా! ఆ స్థితిలో తిండిపెట్టినా దరిద్రులు జీర్ణం చేసుకోలేరు."

తరువాత నేను వుడ్‌స్ట్రీటులో క్వాకరులనే సమాజ సేవకుల ఆతిథ్యం అంగీకరించాను. వంగదేశంలో క్షామదేవత విలయ తాండవం చేస్తున్నప్పుడు ఈ క్వాకరులనే క్రైస్తవులు చూపిన కారుణ్యం, చేసిన ప్రజాసేవా నిరుపమానం. మానవ దుఃఖం పోగొట్టే కార్యకలాపం మహా ఘనమని జెసూట్ ఫాదరులు నాతో అన్నారు.

వంగదేశంలో పీడిత ప్రజకు రాజకీయవాంఛలు మినహాయించి, సరళమైన సుఖజీవనం గడపడానికి ఏమికావాలని ఫాదరులనూ, క్వాకర్లనూ నేను ప్రశ్నించినాను.

కలకత్తా వీధులలో నేను తిరిగి వస్తున్నప్పుడు స్కాచ్ వేషం వేసుకొని తిరుగుతున్న భారతీయుణ్ణి చూశాను. అతను రంగురంగుల గీరల దుస్తులను ధరించాడు. రంగురంగుల తోలుతిత్తితో వున్న గన్‌సెట్ వాద్యం చేపట్టి, ముష్టికోసం దర్పంగా తిరుగుతున్నాడు. ఆ దృశ్యం స్కాట్లండ్ దేశీయుడికి సహజంగా కోపం తెప్పిస్తుంది. నా కా వీధులు చిత్రంగా కనిపించినాయి. అరుగులమీద ఆవులున్నై. మనుష్యులు నెమ్మదిగా తిరుగుతూనే వున్నారు. నాలుగు డబ్బులకోసం తిరిగేవాడికి స్కాట్లండ్ దేశీయునితో ఎందుకు తగాదా వస్తుంది?

# అధ్యాయం 22

నాకూ రవీంద్రునికీ కూడా మిత్రుడయిన డాక్టర్ అమియా చక్రవర్తి రామకృష్ణ మిషనువారు చేసే హిందూమత నవ్య వికాస కార్యక్రమం తెలుసుకోవటం అవసరమని చెప్పినాడు.

"భగవంతుడు పేదవాళ్ళలోనే ఉంటాడు." ఇది స్వామీ వివేకానందుని సుభాషితం. క్రైస్తవానికి సెంట్ పాల్‌వలె హిందూమత పునరుద్దీపనకు రామకృష్ణ మిషనువారిచే ఉద్దిష్టమైన ఉద్యమ నిర్వహణకు, ప్రచారానికీ మూలశక్తి వివేకానందుడే నని కొందరు విజ్ఞులు చెబుతారు. "భారతదేశంలోనూ, అమెరికాలోనూ పర్యటించి మహోజ్జ్వల ఉపన్యాసాలు చేసిన ఆయనకు ప్రజా దారిద్ర్యఘోష తెలుసునా?" అని కొందరు ప్రశ్నిస్తారు. వాస్తవానికి వివేకానందుని అద్వితీయ ప్రతిభా సామర్థ్యాలు రామకృష్ణ పరమహంస ఘనతను లోకానికి చాటి చెప్పటంలోనే నిబిడీకృతమై ఉంది. నిజకాంతి నసించటంవల్ల ఆ కాలంలో ప్రతీచీ ప్రపంచం ప్రాగ్దేశాలనుంచి ప్రసరించే కాంతి కిరణాలకోసమే నిరీక్షించింది. వివేకానందుని అనన్య ఆకర్షణీయ వ్యక్తిత్వము, గంభీరోపన్యాస పాటవమూ అబాల గోపాలాన్నీ అద్భుతంగా ఆకర్షించింది అందుకనే.

వివేకానందుని జీవిత చరిత్రలో స్వామీజీ సర్వ ప్రపంచాన్ని ఎలా ఆకర్షించినాడో, ప్రసిద్ధ ఫ్రెంచి తత్త్వవేత్త, గాయకుడూ, రచయితా అయిన రోమారోలా విశదపర్చినాడు. అంతవరకెందుకూ, వివేకానందుడూ ఆయన గురుదేవుడు—రామకృష్ణపరమహంస ఆకర్షణశక్తి ఎట్టిదో, ప్రాజ్ఞుడు తీవ్ర విచక్షణాశీలుడు అయిన రోమారోలా వారిని సందర్శించినాక పొందిన ప్రగాఢ పారవశ్యమే మనకు నిదర్శనం. మహారాజా ఖత్రీ ఆర్థిక సహాయంవల్ల వివేకానందుడనే ఘోష్ సర్వమత సమావేశానికి అమెరికాఖండ పర్యటన చేయగలిగినాడు. "బొంబాయినుండి వివేకానందుడు ప్రయాణమైనప్పుడు రక్తవర్ణ దుకూలం, కాషాయ వర్ణపు తలపాగా ధరించి ప్రపంచాకర్షణ కలిగించినాడు." 1891 లో స్వదేశంలో స్వస్థానమైన పోరుబందరు—నాలుగేళ్ళ న్యాయశాస్త్రాభ్యాసం చేసి కృతార్థుడై లండన్ నుంచి గాంధీ తిరిగి వచ్చినాడు. అదే సమయంలో ఒక ప్రాజ్ఞుడు వివేకానందునితో 'ప్రస్తుత పరిస్థితిలో మీ సందేశాన్ని ఆలించేందుకు స్వదేశంకంటే విదేశమే అనుకూలమైనద' ని అన్నాడు. తర్వాత రెండేళ్ళకు రాజపోషణ లభ్యం కావడమూ, వివేకానందుడు అమెరికా పర్యటనమూ తటస్థించినాయి.

1893 లో వివేకానందుడు చికాగోలో సర్వమత సమావేశానికి హాజరైనాడు. ఆనాటి ఘట్టంగురించి రోమెరోలా ఇలా వ్రాస్తున్నాడు.—"సభకు వచ్చిన వారిలో వేలాది జనాన్ని వివేకానందుడు ఆకర్షించినాడు. అతని మత మేమిటో ఏశాఖీయుడో ఆ యువకుడని అందరూ అనుకొన్నారు.

ఆ యువకుడు ఒక్కడే ఏ సంకుచిత మతానికీ ప్రాతినిధ్యం వహించలేదు. మరులుకొలుపు ముఖ వర్చస్సు, ఆ ఉదాత్త గంభీరమూర్తి, రమణీయ వస్త్ర పరిధానమూ ఎందరినో ఇట్టే సమ్మోహితులను చేసినాయి. ఆ దివ్యమూర్తి తనలో కావలసి నంత భావోద్రేకాన్ని గుప్తము చేసుకొన్నాడు...."

"అంతటి మహాసభలో వక్తలు తమతమ మత సిద్ధాంతాలలో ప్రతిపాదింప బడిన దేవుళ్ళను గురించి ఏకరువు పెట్టినారు. ఆయన—ఒక్క వివేకానందుడు మాత్రమే జగద్వ్యాపక పరమేశ్వరునిలో మతాంతరాల్లో చెప్పబడుతున్న దేవతాకోటి యావత్తూ ఇమిడి పోతుందని ఉద్ఘాటించినాడు." *

'మతం ఒక్కటే. అన్ని మతాలూ యదార్ధములే.' అన్న అతని సందేశం అందరినీ ఆకర్షించింది. బౌద్ధమూ యదార్ధమే. కారలు మార్క్స్ భౌతికవాదమూ యదార్ధమే. ఇస్లామ్ ఆస్తిక ద్వైతమూ, సూఫీ వేదాన్తమూ, లింగాదిరూప ప్రతీకోపాసనమూ, అద్వైతతత్త్వమూ అన్నీ నిజాలే. వివేకానందుడు నేర్పుగా సభ్యుల హృదయాలు ఆకర్షించినాడు. "భారతదేశానికి అత్యవసరమైనది మతం కాదు—ఆహారం." అని చికాగో సభావేదికనుంచి ఉద్ఘోషించినాడు.

వివేకానందుడు రామకృష్ణ పరమహంస శిష్యుడు. రామ కృష్ణుడు శిష్యునివలె సర్వతోముఖ ప్రతిభావంతుడు. "సజీవ బాధిత మానవత్వముతో దైవయోగము పరమ పవిత్ర

* రోమెరోలా "ది లైఫ్ ఆఫ్ వివేకానంద" నుండి

ప్రతీకద్వారా అభివ్యక్తమయినది." 1872 లో రామకృష్ణుడు దక్షిణేశ్వరంలో నుండగా అతని భార్య అక్కడికి వచ్చినది. అప్పుడు రామకృష్ణుని హృదయం ఆర్ద్రమయినా ఆకామహితమై అనాసక్తమయినది. ఆయన దేవతగా ఆమెను గుర్తించి పలికినాడు. జ్యేష్ఠమాసంలో (మే నెలలో) ఒకనాటి రాత్రి పూజా ద్రవ్యములు సిద్ధమైనవి. ఆయన ప్రియురాలయిన శారదాదేవిని పూజాపీఠంపై కాళికాస్థానంలో కూర్చుండ చేసినాడు. ఆయన స్మార్త క్రియాకలాపం, షోడశీపూజ సువాసిన్యర్చనమూ కావించినాడు. భార్యాభర్త లిద్దరూ వ్యక్తావ్యక్తచేతనా తన్మయతలో వున్నారు. అతడు జాగ్రదవస్థకు వచ్చి భార్యను జగన్మాతగా సంస్తుతించినాడు. ఆయన దృష్టిలో శారదామణీదేవి పవిత్ర మానవత మూర్తీభవించిన సజీవ ప్రతీకం. "ఆ సమయంలో ఇరుగుపొరుగుననున్న ఒక వైష్ణవార్చకుడు ఈ విచిత్ర దృశ్యమును కన్నులార గాంచినాడు."

"రామకృష్ణుని తాంత్రిక సాంప్రదాయం ఒక్క పవిత్ర గృహిణితో మాత్రమే పరిమితం కాలేదు. ఆయన వేశ్యలలో కూడా జగన్మాతను దర్శించినాడు. వివేకానందుడు ఇలా చెప్పినాడు: "గురుదేవుడు వేశ్యల యెదుట నిలిచి, మోకరిల్లి అశ్రుధారలతో వారి పాదములు తడిపి ఉద్రిక్తుడై ఇట్లు పలికినాడు— 'జననీ! నీవొక రూపమందు వీధిలోనూ, మరొక రూపమున నీవు జగద్రూపిణివి, తల్లీ నమస్కారం!—ఇదే నీకు ప్రణామము తల్లీ!'—"[1]

[1] రోమెరోలా రచన "ది లైఫ్ ఆఫ్ రామకృష్ణ" నుండి

ఈ విషయాలు తెలుసుకొన్న కొద్దీ మతాలన్నింటికి సామాన్యమై అనుస్యూతమయిన దేమన్నా ఉన్నదా అని నాకు ఆశ్చర్యం వేసింది. వివేకానందుని హిందూధర్మంవలె మానవుడికి కావలసిన అఖండ సత్యం నిర్వికారమయినదేకదా అని ఆశ్చర్యపడ్డాను. సర్వమూ ఏకమయితే సమస్తసాధనలూ సత్య లక్షితాలు. అప్పుడు యదార్థమయిన విలువలుంటవా? నామతంలో దానము మహా పురుషార్థం. దానం పాత్రత అపాత్రతా గమనించి వివేకంతో ఆచరించాలి.

మొదటిసారి కలకత్తాలో రామకృష్ణ మిషన్‌వారి పాఠశాలలో సంజవేళ పఠన ప్రార్థనలు, ఉపన్యాసాలూ కన్నాను, విన్నాను కూడా. ఇక్కడ స్వామీ నిత్యస్వప్నానందంతో గోష్ఠి చేశాను. రామకృష్ణ ప్రచారసమితివారు చేస్తున్న మానవసేవను గురించి ఆయన నాతో వివరించి చెప్పినారు. తరువాత నేనూ స్వామీజీ, నా మిత్రుడు డాక్టర్ అమియాచక్రవర్తి, విజ్ఞానఘనుడయిన ప్రొఫెసర్ సర్కారూ అందరమూ కలిసి హుగ్లీ (భాగీరథీ) తీరానికి, బేలూరు మఠ సందర్శనార్థం బయలుదేరినాము.

ఆ మందిర నిర్మాణానకి అమెరికావారు ఆర్థికంగా చాలా సాయపడ్డారు. దేవాలయ శిల్పం మాత్రం భారతీయమే. కాని శిల్పరేఖల్లో స్వచ్ఛమైన పాశ్చాత్య శిల్ప ప్రభావం పొంచి ఉందనటంలో సందేహం లేదు. భాగీరథీతీరాన్నే దేవాలయం చక్కగా నిర్మితమయింది.

అక్కడ సన్యాసులతో నేను మాట్లాడినాను. ఆ సంస్థకు అధ్యక్షుడయిన విరజానందకు 75 సంవత్సరాల వయస్సు—

ఆయన నాతో మాట్లాడుతూ ఆధ్యాత్మిక శాంతితోనే తాము ఊరుకోక సర్వభూతాల్లో ఆత్మదర్శనం చేస్తూ, సాంఘిక సేవ చేస్తున్నామని చెప్పినారు. ఎవరికయినా బాధ కలగితే మాకు కూడా కలుగుతుంది. అందరి శ్రేయమే మా శ్రేయము అని వాక్రొన్నారు.

పిమ్మట గాంధీ సిద్ధాంతాలు చర్చకు వచ్చినవి. కొందరు స్వాములు గాంధీతత్త్వం అంగీకరించలేదు. అనాశక్తి యోగమనే పేర గీతకు గాంధీ వ్యాఖ్యానం వ్రాయటం వారికంత హితవుగా లేదు. హిందూధర్మం కర్మయోగానికి ప్రాధాన్యం ఇస్తుంది. అటు పిమ్మట ఆత్మస్వరూపాన్నీ, త్రిమూర్తుల్నీ మేము చర్చించినాము. ఏకమైన పరబ్రహ్మ అద్వితీయం. సృష్టి జరిగే కాలంలో ఆయన ఈశ్వరుడు, జగత్కారణుడనీ, ఈశ్వరుడనీ ఆయనను సంబోధిస్తాము. సృష్టి స్థితి లయాత్మకమే త్రిమూర్తి తత్త్వం. సృష్టికి బ్రహ్మ, స్థితికారకుడని విష్ణువును, లయకారకుడని ఈశ్వరుణ్ణి వ్యవహరిస్తాము. కేవల పరబ్రహ్మ మన తెలివి తేటలకు అందదు. కనుక 'తెలుసుకోడం' అనే వ్యాపారం ఉన్నప్పుడు తెలుసుకొనేవాడు, తెలియబడే వస్తువు, తెలివీ అనే త్రిపుటి వుంటుంది. కనుక పరతత్త్వానుభవంలో జ్ఞాత జ్ఞాన జ్ఞేయ త్రిపుటి లేదు. త్రిపుటీ వున్నంతవరకూ తోచబడేటంత వరకూ ద్వైతమే, త్రిపుటి రహితమై, తానై సర్వత్రా వ్యాపకమై వుండగా అపరోక్షానుభవం. రామకృష్ణ మఠం వారివల్ల హిందూ ధర్మంలో సర్వాస్తికవాదం (Pantheism అద్వైతము) వుందని విన్నాను.

చీకటిగా వున్న దేవమందిరావరణలో ప్రవేశించేసరికి దేవతా విగ్రహాలు కనపడినవి. రామకృష్ణుని భక్తులు ఆయనను

పరమేశ్వరుడని భావించలేదు. ఆయన ఒకానొక మానవోత్తము డని మాత్రమే భావన చేస్తారు. చూపుకు పారిస్‌లో మాడలీన్ మందిరంవలె లేకపోయినా, ప్రాక్ ప్రతీచీ శిల్పాన్ని ప్రతిఫలింప చేస్తున్న బేలూరు ఆలయంలో ప్రవేశించాను. ఇక్కడ ఛాందసు లెవ్వరూ నన్ను అడ్డుపెట్టలేదు. కొద్ది దూరంలో వికస్వర సుస్వరంలో వేదగానం వీనులకు విందుచేసింది. ఆలయంలో భక్తులు పద్మాసనాసీనులయినారు. వారి వెనుక స్త్రీలు కూడా కూర్చున్నారు. ఆలయాంతర్భాగంలో తెల్లని పది అడుగుల ఎత్తయిన రామకృష్ణుని విగ్రహం ఒలింపియా జీయాసు విగ్రహంవలె ఉజ్జ్వల కాంతితో మెరుస్తున్నది. పురోహితులు వింజామరులు వీస్తున్నారు. హారతి వెలిగించి నీరాజన మిచ్చి నారు. పూజాపీఠం పుష్పమాలాలంకృతమైంది. మధ్య మధ్య దేవాలయ ఘంటలు శృతి గోచర మవుతున్నవి.

కొంతసేపు రామకృష్ణ స్తుతి సంస్కృతములో శ్రావ్యంగా చేసినారు. దేవాలయ ఘంటికాస్వనంలో సంస్కృత గీతికాగానం మిళితమవుతూ వుండగా, వివేకానందుడు సిద్ధి పొందిన ప్రదేశం తిలకించినాను. దేవాయలలోవలెనే ఇక్కడ కూడా పాద రక్షలు తీసివేసినాను. తర్వాత వివేకానందుని శయ్య, విషణ్ణ ములు, మాలాలంకృత ఛాయా పటము, పాదరక్షలూ భద్రం చేయబడిన గది చూచినాను.

కొన్ని వారాలపాటు నేను తీవ్రాన్వేషణలో వున్నానని గుర్తించినాను. భారతదేశంలో మానవులకూ మహారాజులకూ దేవతలకూ భేదము స్వల్పం. ఆ విధంగా భారతదేశానికి దేవతలు కోటానకోట్లయినారని నా నిశ్చితాభిప్రాయం.

# అధ్యాయం 23

కొద్ది కాలంపాటు నేను భారతదేశ పర్యటనం చేస్తూ పుస్తక జన్య జ్ఞానమే కాకుండా ప్రత్యక్షంగా హిందూ ధర్మసారము గ్రహింప గలిగినాను. ఈ మత ధర్మము గ్రహించక భారతీయ నాయకమణుల ఆత్మీయతను ముఖ్యంగా మహాత్ముని గ్రహించడం దుస్తరం.

హిందూ ధర్మం సువిశాలమై మహోన్నతాకర్షణీయమైన వ్యవస్థ. వైదిక ధర్మములో తాత్త్విక చింతనమూ పరిశీలనమూ అనన్యసామాన్యమయినవి. ముసల్మానుల సరళద్వైతము వైదిక తత్త్వ పరిశీలనతో సరితూగలేదు. అయితే దానితో పోల్చుటకు వీలయినవి సూఫీల వేదాన్తము, యవన దేశోద్భవమయిన 'అవిసిన్న' 'అవరోల' తత్త్వసిద్ధాంతములు మాత్రమే. ఉపనిషద్వేదాంతంతో సాటిగా ఇస్లాం మహోన్నత భావసంపదను అర్పించ గలుగుతుందా?

ఈ ఉపనిషద్వేదాంత ప్రభావం జర్మన్ తత్త్వవేత్తల మీద కొంతవరకూ ప్రసరించి ఉంది. షోపన్‌హోవర్ అనే జర్మన్ తాత్త్వికుని నాటినుంచీ పాశ్చాత్యుల మీద ఉపనిషత్ప్రభావం వుంటూ వచ్చింది. దానికి చిన్న తార్కాణంగా హెగెల్ పండితుని వాక్యాలు ఇలా కొంచెం పరిశీలించండి–"ఆరంభంలో

సృష్టికి పూర్వం సత్పదార్థ ముండెను. అది రూపగుణ రహితం. ఆకార రహితం. అది అసత్తుకన్న భిన్నం. సదసత్తుల సామరస్యమే పరిణామం." ఈ వాక్యాలలో వేదాంతమే ఉల్లేఖింపబడింది. కారలు మార్క్సు అనుయాయులు అతిగా ప్రలాపించేది హెగెలు రచించిన తార్కిక శాస్త్రాన్నే. అయితే మార్క్సు పక్షీయులు పలికే 'చారిత్రక యాథార్థ్యానికీ' పైన ఉల్లేఖింపబడిన హెగెలు వాక్యాలకూ సంబంధం లేదు.

ఈ భావవాదం ( Idealism ) భౌతికవాదం ( Materialism ) నకు దగ్గరగా వున్నట్టు వుంటుంది. చార్వాకానికీ వేదాంతానికీ దగ్గర చుట్టరికం లేదు. అద్వైత వేదాంతాన్ని బట్టి పరబ్రహ్మ నిరాకార నిర్విశేష చిన్మాత్రమై, సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమై, స్త్రీకాక పురుషుడూకాక, త్రికాలాబాధ్యమై, విగళిత వేద్యాంతర సంపర్క శూన్యమై, కేవలమూ అద్వితీయ మైన అఖండ సచ్చిదానందం. పరబ్రహ్మను సగుణంగా ఈశ్వరుడని భావన చేసినప్పుడు మాయా ప్రతిబింబిత చైతన్యము, వేదాంతానికి ప్రాప్యము అపరోక్షానుభూతి. అదే బౌద్ధుల నిర్వాణం. ( అది మాధ్యమికుల 'శూన్యము' కానీ, సద్వస్త్వనుభవము కానీ కావచ్చు ) బౌద్ధం వైదికధర్మ విప్లవం మాత్రమే. బుద్ధుడు బౌద్ధుడుగాకాక హిందువుగానే భావన చేస్తూ సిద్ధి పొందినాడు.

పరిణామం అంగీకరిస్తున్నప్పుడు అనగా, సృష్టి స్థితి లయాలకు త్రిమూర్త్యాత్మకమయిన కారణరూపునిగా పరమేశ్వ రుణ్ణి వ్యవహరిస్తాము. సృష్టి పరిణామంలో స్థితిభేదాలను బట్టి

త్రిమూర్తులనే వ్యవహారం. శివుడు భర్తగా, కాళీ ప్రియురాలిగా లలితకళల్లో చిత్రకారులు చూపినారు. శివశక్తుల మేళనలో జగద్రూప పరిణామం. కాళీ జగన్మాత, సర్వ లయకారిణి, మహారుద్రరూపిణి. కాళి కాలశబ్ద సమీపం. కాలం లయస్వరూపం. కాళికారూపం కరాళం. మానవ కపాలాలను కంఠహారాలుగా ధరిస్తుంట. రక్తాన్ని వాంఛిస్తుంది. ఆమె సత్యం కూడాను. ఆమె మానవహృదయ లాలిత్యాన్ని కూడా లక్ష్యం చెయ్యదు.

హిందూమతరీత్యా ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఆయన సృష్టికి అభిన్ననిమిత్తోపదాన కారణమూ. జగదాభాసకు ప్రతిష్ఠానమున్నూ, సగుణరూప పరమేశ్వరునివల్ల సృష్టి పరిణామమని వ్యవహారం. పరతత్త్వము పరబ్రహ్మ. పరబ్రహ్మ దిక్కాలాలకు అతీతం, మనోవాగాతీతం. ఈ తత్త్వమే బృహదారణ్యకోపనిషత్తులో చెప్పినారు. "ఆయన వేరు, నేను వేరు అన్న సాధకునికి బ్రహ్మానుభవం లేదన్నమాట." జర్మను తపస్వి అయిన మిస్టర్ ఏక్‌హార్ట్ ఇలా అన్నాడు "నేనూ ఈశ్వరుడూ ఒకడే." నిరాకార పరబ్రహ్మము శుక్లలోహితమూ కాదు, స్త్రీ కాదు. పురుషుడూ కాదు, అది ఇక్కడ అక్కడ అనే వ్యవహారం లేకుండా సర్వత్రా వ్యాపకమై ఆకాశం వలె వున్నది. ఎవడు తెలుసుకొన్నానని పలుకుతాడో వాడికి అపరోక్షానుభవం లేదు.

శివ ప్రతీకం భీషణమయిన కామకళా విలాస సూత్రము. కాని పానవట్టముగా ( యోనిగా ) ప్రకృతి. తాంత్రికులు త్రికోణమును సృష్టి ప్రతీకగా చిత్రించి భావన చేస్తారు. యవన లిపిలో 'డెల్టా' అనే అక్షరరూపము త్రికోణమే. నైఘంటికుల మతాన్ని

బట్టి డెల్టా కూడా స్త్రీ సంబంధ ప్రతీకమని చెప్పబడుతోంది. ఇలాంటి పరస్పర విరుద్ధ సూత్రాలు చైనీయ పురాణాల్లో కూడా 'యిన్' 'యాంగ్' అనే పేర్లతో ఉన్నవి. 'జోవ్' 'వీనస్' గ్రహాల సంకేతాలు కూడా ఉంటే పరస్పర విరుద్ధాలుగానే కన బడతవి. కొన్ని ఆలయాల్లో ఈ శివశక్తులు (లింగపానవట్టాలు) ఒకే చోట కనపడతవి. బుద్ధ విగ్రహం బౌద్ధులు శాంతరస ప్రతీకంగా ఉపయోగించినట్టు, హిందువులు విదేశాల్లో వ్యాప్త మయిన బౌద్ధ నాగరకతకూ ప్రత్యక్ష సత్తకూ ప్రతీకంగా భావించారు. ఐరోపాలో విమర్శకులు ముఖ్యంగా మార్క్సు పక్షీయులు 'వ్యావహారికం' 'ఆముష్మికం' కన్న భిన్నమని చెప్పుతారు. అంటే వారి ఉద్దేశ్యంలో కూలీ ప్రమాణం, జీవన ప్రమాణాభాస, చాలా మోటారులు, అధికాహారమూ, ఇంకా కడుపుకు కావలసినవన్నీని వ్యవహారికాలే. వీటిపట్ల మనం ఉపేక్ష వహిస్తే వహించవచ్చును. కాని క్షామ పీడిత భారత దేశం వుదాసీనంగా వుందంటే ఆశ్చర్యమే. దేశంలో ఆహారం సమృద్ధిగా లేదు. జనసంఖ్య అపరిమితంగా రోజు రోజుకీ పెరిగిపోతున్నది. ఇటువంటి సమయంలో కూడా భారతీయ కుటుంబాలకు కడుపుకు కావలసిన వ్యావహారిక సత్యం కన్న ఆముష్మికభావనే అధికం.

పాశ్చాత్యుల్లో ఆర్థిక ప్రవృత్తీ, తత్ఫలితంగా అధికార కాంక్ష విస్తారమైంది. హిందువుల వైదికధర్మంలో ప్రవృత్తి నివృత్తుల సామరస్యం అధికం, వ్యావహారికం జరగడానికి పరిణామమూ ప్రవృత్తీ అత్యవసరం. కేవలం పారమార్థిక

దృక్పధం కలిగినప్పుడు నివృత్తి. శివప్రతీకం పరిణామ భావమే. పరిణామం స్థిత్యనంతరం లయముకూడా లింగప్రతీకములో భావమే. కాళికా రూపంలో జగల్లయ భావమూ, దేవీ పరాశక్తి రూపభావనలో చిదాగ్ని ప్రకాశమూ, విషయప్రపంచ లయమూ ద్యోతకములు.

# అధ్యాయం ౨౪

పాశ్చాత్యుల ప్రవృత్తిపరమయిన విపరీత ద్వైతబుద్ధి, ఆధ్యాత్మికమయిన భారతీయ హృదయాన్ని గ్రహించడం అసాధ్యం. కనీసం పాశ్చాత్యుల్లో కొద్దిమంది యవన సంస్కృతి జీర్ణించుకొన్నవారైనా భారతీయ వేదాంత దర్శనం అధ్యయనం చేయవలసిన ఆవశ్యకతను గుర్తించలేదు. ఎందుచేతనంటే తాత్త్వికుడైన ప్లేటో 'భావవాదం' అతని గ్రంధంలో ఉల్లేఖింపబడిన గుహా దృష్టాంతమున్నా వేదాంతానికి దూరంకావు. అంతేకాదు, పాశ్చాత్యులు శివశక్తుల్ని గురించి, యవన డయోనిసియస్‌ను గురించీ కూడా తెలుసుకోవలసిన ఆవశ్యకత గుర్తించ లేదు. భారతీయ సన్యాస జీవితంలో ప్రముఖస్థానం శరీరానికి ఇవ్వకపోయినా, దర్శనాల్లో శరీరం స్వాధీనం చేసుకొని చిత్తవృత్తి నిరోధం చేయమన్న యోగభావన కానవస్తుంది. పాశ్చాత్య సాధనలో కూడా శరీరేంద్రియ సంయమమే కానవస్తుంది. కానీ, వారి దృష్టిలో శరీరం పాపభూయిష్టమనే భావం కూడా వుంటూ వచ్చింది.

క్రైస్తవంలో భగవంతుడు సర్వశక్తిమంతుడవునా, కాదా? సృష్టికర్తేనా? అలా అయితే పాపపుణ్యాలను కూడా సృజించినవాడా? ఇలాంటి సందేహాలుతీరవు. భగవంతుడు పరిమిత మాన

వతా విశిష్టుడా? కేవల శుభంకరుడా? క్రైస్తవ విజ్ఞానులు చెప్పి నట్లు పాపమనేది మిధ్యారూపమా?

పాపమూ రాక్షసప్రవృత్తీ సర్పరూపమై పురుషాకారంతో విప్లవించి, కామరూపమయిన ఆపిలు ఫలమిచ్చిన వనితను ఆకర్షించింది. పాపారాధనవల్ల కామ ప్రేరితమయిన శరీరం ప్రలోభనకు వశమయింది. స్త్రీ పురుషులు పతితులయినారు. యోనిపూజ మానవులుచేసే ప్రకృత్యారాధన. సనాతనులు దాన్ని రాక్షస తామసమని గర్హించారు. తదారాధనవల్ల పాశవమైన ఇంద్రియోద్రేకం, ధర్మహాని కలిగించేవారిలో కలుగుతుంది. అంతేకాదు వారిలో విప్లవకరంగా చైతన్యం బయలుదేరుతుంది. చరిత్ర సిద్ధమవుతుంది. ఆధ్యాత్మిక విప్లవం సజీవంగా ఉండ డానికి కామవాసనే ముఖ్యకారణం. కానీ, వివేకజ్ఞానం కామవాస నను వశం చేసుకోగలదు. చరిత్రను కూడా మార్చివేయగలదు.

ఋగ్వేదానికి పరిష్యనుల జందవేస్తాకూ చాలా సంబంధ మున్నమాట చారిత్రక యదార్థం. ఆర్యుల ఋగ్వేద సంహితలో ఒక మంత్రమందు పుణ్యపాపసమరము వర్ణితమైనది. లింగార్చన చేసే ప్రాచీన ద్రావిడులు ఋక్శాఖాధ్యాయులను సాంస్కృతి కంగా ఓడించినారు. ఆర్యులపై ద్రావిడాచార సంస్కృతీ ప్రభావమున్నదని చరిత్రవల్ల తెలుస్తున్నది.

పాశ్చాత్యదేశాల్లో ఏతద్వ్యతిరేకంగా సంభవించింది. అమలేకైతులు ప్రకృత్యుపాసకులు. లింగ యోని ప్రతీకాలను ఆరాధించేవారిచే నిహతులయినారు. పూర్వం ఆష్టోరాత్ అనే దేవతోపాసనచేసే వామాచారపరులు ఉండేవారు. 'ఆష్టోరాత్'

లింగయోని ప్రతీకచిహ్నం. ఫినీషియనులు అష్టోరాత్ అనీ బాబిలోనియనులు ఇష్టర్ అనీ, గ్రీకులు అస్టర్తే అనీ, జెరిమియాలో స్వర్గ దేవతగానూ, మిల్టన్ కవీంద్రుడు కూడా చాంద్రీ దేవతగానూ పేర్కొన్నారు.

అష్టోరాత్ ఉపాసనా ప్రదేశాలు ప్రస్తుతం సికస్తయినవి. వామాచారము మహా పాపకార్యం. లింగయోన్యాది కాముక ప్రతీకోపాసనము పరమేశ్వర ప్రాప్తికి దూరమని పాశ్చాత్య దేశాల్లో ఆస్తికులు ఖండించారు. భగవంతుని తల్లికీ ఆది వనితకూ చుక్కెదురు. భగవానుని మాత పూతచరిత్ర, పాప రహిత. ఆమె గార్హ్యస్థ్య ధర్మానికి ప్రతీకమే కాని కామవాసనా సంకేతం ఎంతమాత్రం కాదు. కాళికాదేవి ప్రబల కామవాసనా ప్రతీకమా? అకామహతభావము ఆమెకన్న విలక్షణంగా ఉందా? కేవల సద్భ్రూపానికీ ఇంద్రియోద్వేగానికీగల సంబంధమే ప్రస్తుత సమస్య. కాళివంటి అష్టోరాత్ దేవతకు ఇసిస్ ఆసిరిస్ సముద్ర దేవతలు చుక్కెదురుగా ఉన్నవి. కాళికి ప్రభువు తల్లి, మేరీ వ్యతిరేక ధృవంలో వుంది. ఇంతకన్న ఏ ప్రతీకాలూ వ్యతిరేక ధృవాల్లో వుండవు. అవి అగాధమయిన మానవాత్మలోని వ్యతిరేక ధృవాలు. మనం రెండింటిలో ఒక ప్రతీకం ఎన్నుకోవాలి. యోని యదార్ధమయిన జీవన సంకేతమా? పునరావృత్తి రహిత మోక్షానికి సంకేతమా? లేక పాశవ ప్రవృత్తితో తిరిగి జన్మించాలా? లేక మూర్ఖ ప్రకృత్యోపాసకుల ప్రత్యవాయమా? అదీ కాకపోతే పాశ్చాత్య ప్రపంచము ప్రకృత్యోపాసకన్న జీవిత పరమోద్దేశ్యాలను బాగా వివరణ చేయగలదా? వీటిని గురించికాక సెంట్‌పాల్ ఇంకేమి రాయగలడు?

బౌద్ధం హిందూధర్మ సంతానం. అలాగే క్రైస్తవం యూదీయ మతసంబంధమై తిరుగుబాటు చేసిన బిడ్డ. బుద్ధుడు బాధలకు దూరమై, రాగద్వేషా తీతుడయిన శాశ్వత శాంతి ప్రతీకము. వికసిత పద్మము, విశ్వప్రాదుర్భావ ప్రతీకము. బుద్ధుడు వికసిత పద్మాసన స్థితు డైనాడు. కాని ఆయన నిస్సంగుడై నిరంతర నిదిధ్యాసలో ఉంటాడు. బుద్ధమూర్తి, 'దవిండీ' చెక్కిన క్రీస్తు విగ్రహంవలె కామరహితుడు— ముక్తపురుషుడు.

గాంధీతత్త్వం బౌద్ధమువలె ఉంటుంది. బుద్ధునివలె గాంధీ భారతధాత్రి పుత్రరత్నం. గాంధీ-బౌద్ధ ధర్మాల్లో సాదృశ్యం ముందు వివరిస్తాను. గాంధీ క్రైస్తవమత ప్రాబల్యం వల్ల హిందూ ధర్మంలోని శాస్త్రీయం అంగీకరించక, సనాతన ధర్మం అవలంబిస్తున్నాడు. తూర్పుదేశాల్లో ఆయన పాశ్చాత్యుడు. పాశ్చాత్య దేశాలకు ఆయన ప్రాగ్దేశీయుడు. కాళికోపాసనయెడ గాంధీజీ నైష్ఠికత విప్లవమని గట్టిగా చెప్పక తప్పదు. క్రైస్తవంలో పద్మ ప్రతీకం కూడా లేదు. రాక్షస తామస ప్రవృత్తి పారదోలడానికి క్రైస్తవమా హిందూధర్మమా ఏది శక్తివంతం?

# అధ్యాయం ౨౯

నేను కరాచీ నుంచి కన్యాకుమారి, కన్యాకుమారి నుంచి కలకత్తా వరకూ భారతదేశ పర్యటనం చేసినాను. ప్రాచీన భారత సంప్రదాయాలు, ప్రాచీన రాజ్యాంగ పద్ధతులు, మతాలూ పరిశీలించినాను. ఈ మతాలవల్ల శ్రేయస్సు ఉన్నదా లేదా? అనే విషయం బాగా ఆలోచించే సావకాశం లేదు. పాఠకులు నిదానిస్తే నా పరిశీలనా ఫలితాలు మనవి చేస్తాను.

రామకృష్ణ పరమహంస పూజకానీ, అరవింద దర్శనం కానీ నేను నిజంగా మెచ్చుకోగలనా? దర్శనం చేసినమాత్రాన నా శీలం పవిత్రంగా భద్రం చేసుకోగలనా? నిజానికి వారు మహానుభావులు, మహోన్నత శీలసంపద గలవారు, సమాజానికి మణిపూసలవంటి మనీషులు. తిరువాన్కూరులో కొండమీద రామకృష్ణ మఠంలో స్వామీజీతో చేసినగోష్ఠి జ్ఞాపకం చేసుకొన్నాను. తోచినట్లు విమర్శ చేయవచ్చును. కానీ, ఈ మహా విరాగులు సామాన్యులకన్న చాలా అతీతులని చెప్పకతప్పదు. చీనా దేశంలో సాంప్రదాయక తత్త్వశాస్త్రం కేవలం శాస్త్రమే కాని అనుష్ఠించడానికి యోగ్యమైన మతధర్మం కాదు. తత్త్వ శాస్త్రం ఉన్నందువల్ల లాభమేమిటి? ప్రజల నడవడి తిన్నగా ఉండదనే చెప్పవలసి వస్తుంది.

సర్వేసర్వత్రా మానవులు సేద్యము చేయాలని కోరినారు. శాంతిలో కర్మయోగం చేసినారు. సమస్త దేశాల్లో మానవులకు ప్రేమానుభవం సహజంగానే ఉంటుంది. రమణీయమయిన ఋతుసంహార చక్రం తిరుగుతూ వుంటే మానవులు మురిసి పోతారు—మానవ జీవన కవితామాధుర్యం అనుభవించగలం, అనుభవించగలరు, అనుభవించారు. అన్నితావుల్లో మాత తన సంతానాన్ని ఒకేతీరుగా జోకొడుతుంది. ఒకరిగొంతుక ఒకరు కోసుకోవలెననే దేశాల్లోకూడా; మతాల్లో కూడా; మాతాశిశువులకు తిండిపెట్టక బాధించిన చోట్లకూడా సంతానంపట్ల మాతృకంఠం ప్రేమార్ద్రమే! రాజకీయవేత్తలు తాము ఎప్పుడూ సరియైన మార్గంలోనే ఉన్నామని అనుకొంటారు. వారి దృక్పథమే యదార్థ దృక్పథంగా భావిస్తారు. చైనాదేశంలో పీడిత కర్షకలోకం "మా ప్రజలదే దోషం" అంటూ గోల పెడతాది.

ఈ సందర్భంలో హిందూధర్మం ఏ విధంగా తోడ్పడుతుంది? మతధర్మం ఏమి చేయగలుగుతుంది? వర్ణాశ్రమాచార విధులు కల్పించిన మతం హేతుబద్ధమని కొందరు సనాతనులు వాదిస్తారు. ఇస్లామ్ అఖండ భారతావనిని నిలువునా చీల్చి వేసింది. ఇరుపక్షాలూ (ఇండియా పాకిస్థానులు) యుద్ధం చేసుకొనే అవకాశం గలగచేసింది. వర్ణాశ్రమధర్మాన్ని రూపుమాపింది. స్త్రీలను బానిసలను చేసింది. మతం పేరుతో ముసల్మాను హిందువునూ, హిందువు ముసల్మానునూ పొడుచుకున్నారు. మతంపేరుతో ఈ హత్యలు జరగలేదంటే, పార్టీ స్పర్థల్లో పడిపోయి ప్రజలు కత్తులు దూసుకొన్నారని మనం గ్రహించాలి. అంటే రాజకీయవేత్తలు అధికార సంపాదనా

మహా మోహంలో ఘోర కార్యాచరణకు దిగినారు. వాళ్లు ప్రజల్లో వెర్రిఆవేశం రెచ్చగొట్టినారు. తత్ఫలితంగా రక్తం యేరులై పారింది. నిజానికి మతధర్మంవల్ల హత్యా కాండలు కొనసాగవు. రాజకీయవాదులు మతంపేరటనే రక్తపాతం అవుతున్నదని అంటారేకాని వాస్తవానికి వారివల్లనే అమాయిక ప్రజానీకం నశిస్తున్నదని గుర్తించరు. యదార్ధమయిన మతానుభవం సముపార్జించినవాడు, అతనే మతస్థుడైనా సరే కత్తులు దూసి కుత్తుకలు కోయడూ కోయజాలడు. పత్రికా ప్రాణులూ రాజకీయవాదులూ ఈ విషయాన్ని గమనించాలి.

తాంత్రిక వామాచారంవల్ల దుష్టభావోద్రేకం కలిగిందా? శీతోష్ణాలను బట్టి స్వభావాలను బట్టి తీవ్రభావోద్రేకం కలిగిందేమో? హిందువుల ఇంద్రియోద్రేకంలో మహాత్వాకాంక్ష లేదా? లేక అనాసక్తయోగి అయిన ఏ బౌద్ధుడో, జైనుడో మానవ శ్రేయోదాయక మార్గాన్ని ఏర్పరచలేడా? భారతీయ సంఘాభ్యుదయానికి రామకృష్ణ మఠమువారు ఎన్నెన్ని పాఠశాలలు, చికిత్సాలయాలు స్థాపించలేదు? ఎంత సంఘ సంస్కరణ చేయలేదు?

భారతదేశంలో అధికజనాభా హిందువులు. హిందూమతం విశిష్టరూపంలో బహుకాలం ఉంది. తిరువాన్కూరువంటి చోట్ల ఏకాస్తో క్రైస్తవ ప్రాబల్యం హిందూధర్మం మీద ప్రసరించింది. కొంత కాలంపాటు బౌద్ధం భారతదేశంలో అనన్య వ్యాప్తిలో వుండేది. అన్యసంస్కృతులవల్ల హిందూమత స్వరూపం మారేది. అనగా హిందూమతం విశాలమై అన్యసంస్కృతులలో సరస సమన్వయం చేసుకొనేది. హిందూమత సంప్రదాయాలు

ప్రజా జీవితంలో స్పష్టంగా ప్రతిబింబిస్తుంటవి. హైందవ తత్వ శాస్త్ర ప్రభావం భారతదేశంలోకంటే విదేశాల్లో అధికంగా ప్రసరించింది. అందుకనే వైదేశిక పండితులు భారతీయ తత్త్వాన్వేషణ సత్యదర్శనార్థం కృషి చేస్తున్నారు.

గాంధీజీ చెప్పిన సంస్కరణ ప్రవేశపెడితే హిందూ మతం మరింతా విశాలమవుతుంది. ఆయన సంస్కరణ ఫలితంగానే హరిజనులకు దేవాలయ ప్రవేశార్హత కలిగింది. వర్ణాశ్రమాచారాల మీద దాడి బయలుదేరింది. యంత్రాలూ నవీన పరిశ్రమలూ వర్ణాశ్రమధర్మ నాశనానికి విరివిరిగా సహాయం చేస్తవి. అంతేకాని ఎంతటి మతోద్యమాలయినా సంస్కరణను ప్రవేశపెట్టలేవు. వీటిలో మళ్ళీ వర్ణాశ్రమభేదాలుకూడా ఉన్నవి. ఒక్క వర్ణంలో శాఖలు, శాఖోపశాఖలు, చిలవలూ పలవలూ ఎన్నో వున్నవి. ఒక శాఖవారు మరొక శాఖవారితో కూర్చుని ఏక భాండాశనం చెయ్యరు. వివాహసంబంధాలు అసలే చేసుకోరు. ఇట్టి అవివేకమైన బాహ్యాచారాలవల్ల హిందూ సమాజములో ఐక్యత పోతున్నది. సత్తువ తగ్గిపోతున్నది. కాబట్టి ఈ అర్థ రహిత వర్ణ వ్యత్యాసం తొలగిపోయి సమత్వం ఏర్పడినప్పుడే భారతీయులకు అభ్యుదయం, అపార శక్తిసంపదలు పునరుద్దీపిస్తవి.

హైందవధర్మంలో పరమసత్యము స్వార్థానికీ, సామాన్య కాంక్షలకూ, సాంఘిక సంస్కరణకూ, రాజనీతికీ అతీతమైనది. పరమసత్యాను సంధానం సాధకుని గమ్యము. సాధకుడు తన స్థితి గ్రహించాలి. అతడు జననమరణ ప్రవాహరూప సంసార క్లేశ ముక్తుడు కావాలి. పునరావృత్తి రహితమైన ముక్తిని పొందాలి.

హిందూమతం దేహంనుండి దేహాంతరాల్లో ప్రవేశించే ఆత్మమూల్యాన్నీ, జీవుణ్ణీ నాశనం చేస్తుందా? కాల్విన్ మతము కర్మ సిద్ధాంతం అంగీకరిస్తూ మానవేచ్ఛను నాశనం చేస్తుందా? గాంధీ వివేకనందులు ఆత్మద్రష్టలయినా జీవుడికి ఎట్టి విలువా ఇవ్వరా? రవీంద్రుడు కూడా ఇవ్వడా? ఇది మన తత్త్వ పరిచయంలేని తార్కికుల దోషదృష్టి. జీవ పరమాత్మల భిన్నత్వం, ఏకత్వం ప్రతిపాదించే హిందూమతం జీవత్వానికీ వ్యక్తికీ విశిష్టమైన విలువ ఇవ్వదు. విజ్ఞానుల్లో కూడా మత తాత్త్విక విషయాల్లో ఏకమైన అభిమతం లేదు.

హైందవ వేదాంతం అన్యాయం సహించలేదు. ధర్మగ్లాని సహించలేదు. హిందువుల సహనభావం అపరిమితం. రక్తపాతం జరిగినా, సోదర మానవులు హతులవుతున్నా హిందూ ధర్మం సహనం విడువదు. ఈ విపరీత సహనభావం చూసి ప్రపంచం గర్హించేందుకు సిద్ధంగా లేదు.

తిరువాన్కూరులో నా మిత్రుడు సరిగా విమర్శించినాడు-

'క్రైస్తవంలో బాధ, కారుణ్యం అధికమ'ని. హిందూ ధర్మం కత్తిఅంచువలె పదునైనది. ఈ ధర్మం అవసరమైతే రక్తం కోరుతుంది. కాళి భీకర స్వరూపిణి. మానవుల బాధలు ఆమెకు ఆనందదాయకాలు. బాధ విప్లవఫలమని హిందూమతం గ్రహించలేదు. మానవ కారుణ్యంవల్ల వెలిగే సర్వశక్తివంతుని దివ్యప్రేమను అది గ్రహించలేదు. పాపాచరణునిపట్ల దయా దాక్షిణ్యం చూపక తీవ్రమయిన దేవతాశక్తి మూలకంగా హిందూ మతం వాణ్ణి సర్వనాశనం చేస్తుంది.

హిందూమతంలో మానవ మహాకారుణ్యంకన్న వజ్రాతి నిష్ఠురకాఠిన్యం అధికం. చరాచర జగత్తులో ధర్మగ్లాని సహించలేక పరమేశ్వరుడు రుద్రుడై విలయతాండవం చేస్తాడు. రుద్రుని ప్రళయ తాండవంలో మానవతాప్రతిష్ఠ లేదు. మానవలోక విలయంలోనే నటరాజస్వామికి ఆనందం. జ్ఞాన సాధనవల్ల జీవేశ్వరులకు అఖండైకత్వము సిద్ధిస్తుంది; జీవత్వమే ఆభాసమవుతుంది. భగవదనుగ్రహానికి అఖండైకత్వ సిద్ధిలో తావులేదు. సనాతన హిందూధర్మం; గాంధీతత్త్వాన్ని నిర్లక్ష్యం చేసే హిందూధర్మం నాకు అర్థంకాదు. సనాతన ధర్మం వ్యక్తి జీవన విశిష్ఠతామూల్యం గుర్తించదు. ఈ నిర్లక్ష్యమే సహిష్ణుతా త్యాగాలకు పర్యాయపదమని నాకు తోచడంలేదు.

సామాన్య హిందూమతంకన్న వేదాంత మతం విలక్షణమైనదని నాకు తెలుసు. కానీ, జనసామాన్యం వేదాంత శాస్త్రం అర్థం చేసుకోలేదు. గీతోపనిషత్తులు జీవాత్మ పరమాత్మలకు అద్వైతం ప్రతిపాదిస్తవి. ఇట్టి తాత్త్విక సిద్ధాంతమే కాకుండా ప్రస్థానత్రయం శమదమాది నైతిక జీవితానికి కూడా విలువ ఇచ్చింది. ఎడతెగని తర్కగ్రంథంవలె గీతోపనిషత్తుల్లో నైతిక వ్యాఖ్యానము అగాధము. ఈశ్వరత్వ ప్రాప్తికి నైతిక సాధన అత్యవసరం. ఈశ్వరుడు శుద్ధకళ్యాణ గుణోపేతుడు. హిందూదర్మం కర్మసిద్ధాంతం మీద ఆధారపడింది. జీవుడు కర్మపాశబద్ధుడు. జీవుడికి ఆగామి సంచిత ప్రారబ్ధకర్మలు తప్పవు.

ఋగ్వేద సంహితలో పుణ్యపాప ద్వైతసంఘర్షణ సరిసమానం చేస్తూ, అద్వైత నైతికశక్తినీ, ప్రాకృతిక దేవతాశక్తినీ

ఆమోదిస్తున్న భావాన్ని కొన్ని మంత్రాలలో సూచించబడినట్లు నాకు తెలుసు. ప్రస్తుత క్రైస్తవమత ప్రాభల్యంవల్ల నవీనంగా ఆవిర్భవించిన బ్రహ్మసమాజమూ, ఆర్యసమాజమూ వేదోద్ధరణ చేస్తూ, పుణ్యపాప సమర సంబంధమయిన ద్వైతభావాన్ని ప్రాచీనమైన అద్వైతంతోపాటు గట్టిగా వివరించినవి. ద్వైతవాద పరమార్ధం కూడా పుణ్యపాపాతీతమే. ఇక్కడ హిందూమతం పాశ్చాత్య సంపర్కంవల్ల నైతికజీవన సమస్యలను ఎన్నింటినో పరిష్కరించ గలిగింది.

వేదాంతభావంలో తార్కిక క్లిష్టత కలిగిస్తూ, బ్రహ్మ సచ్చిదానందంగా బ్రాహ్మణులవల్ల వర్ణితమైంది. సచ్చిదానందం బ్రహ్మలక్షణంగా చెప్పడంవల్ల క్రైస్తవం సాంప్రదాయక నైతిక పరమార్ధాలూ, నైతికశక్తీ, భిన్నమైన నైతిక సౌందర్యమూ ద్వైతమూ తిరిగి ప్రతిపాదితములైనట్లు నాకు కనబడుతుంది.

గీత జీవబ్రహ్మల అభేద తాదాత్మ్యం సాధకుని ప్రాప్యంగా చెప్పింది. అదే తీరుగా ప్రాచీన క్రైస్తవ ధార్మికులు నిస్సందేహంగా ఇలా చెప్పారు—"పరమేశ్వరుడు మానవుడైనాడు. కారణం మానవుడు పరమేశ్వరుడు కావచ్చునని" (సమాధిలో ఏకత్వమే) బ్రాహ్మసమాజమూ, వివేకానందుడూ విశ్వజనీన యోగానుభవ నిమిత్తం చేసిన సాధనలు తుదియత్నాలు కావనే నా ఉద్దేశం.

నా అభిమతంలో మహాత్ముడే సిసలైన హిందువు. కారణం ఏమంటే భారతీయ బ్రహ్మానుభూతిలోనూ, పాశ్చాత్య రీతిగా పాప సంహార విధానంలోనూ (హింసాపూర్వకంగా కాదుసుమండీ!)

ఆయనకు సంపూర్ణ విశ్వాసం ఉంది. ప్రాక్ప్రతీచీ ఖండాల సమైక్యతనూ, హిందూక్రైస్తవ ధర్మజీవన సమన్వయమునూ చేయగలిగినవాడు మహాత్మా గాంధీ ఒక్కడే. ఈ సత్యాన్ని మనం గుర్తించగలిగితే ఆయన ఘనత, శక్తి ప్రతిపత్తులు బోధపడతవి.

పాశ్చాత్యులు సహజంగా ఆర్యులు—జీవిత పరమార్థం ఎరిగిన వ్యావహారికులు. వారు పరమేశ్వరునిలో మానవత్వాన్నే దర్శిస్తారు. ప్రాగ్దేశీయులు దీనికి పూర్తిగా విరుద్ధులు. వారు స్వతస్సిద్ధంగా పరమేశ్వరునిలో సర్వశక్తిమత్వమూ, మానవునిలో దైవాంశమూ చూస్తారు. పాశ్చాత్యులకు క్రీస్తు నాజరెత్‌లో జీససుగానే తోచినాడు. కాని ప్రాగ్దేశీయుల దృష్టిలో చూస్తే ఆయన అవతారమూర్తి.

హిందూమతంలో పురాణపురుషులు, ధీరోదాత్త నాయకులూ ఎందరో వున్నారు; వీరరసాన్ని చూపుతారు, విషాదాన్ని ఎదుర్కొంటారు. వారిచ్చే సందేశంలో జీవనవిషాదం లేశమాత్రం కూడా ఉండదు. మహారూపకమంటే విషాదాంతమని కాదు అర్థం—అది వీరపురుషేతిహాసం. ఆ మహానాటకంలో మానవులు మహత్వాకాంక్షతో కార్యశూరులు కావడం, జయాపజయాలు అనుభవించడం, ఆత్మశ్రేయమూ నిరూపిత మవుతవి. నాకు సందేహం వస్తుంది—"ఎవడు యదార్థమైన క్రైస్తవుడు?" అని.

వివేకానందుడు చికాగోలో వుపన్యసిస్తూ ఇలా వుద్ఘాటించాడు—"మీరెంత హడావిడి చేసినా అట్టహాసంచేసినా ఎక్కడన్న కత్తిపట్టకుండా క్రైస్తవం విజయం పొందిందా?

భోగ జీవితానికి మీ క్రైస్తవం మారుపేరు; మీ మతం బోధించింది భోగాన్ని ఆశ్రయించే కదా? ఈ దేశంలో ప్రధానంగా మోసమే మతజీవనంలో కనిపిస్తుంది" అలాగయితే గాంధీ యదార్థ క్రైస్తవుడా? వివేకనందుడు యదార్థ హిందువా?

మరొక వాణి వినవచ్చింది: లోకంలో మోసగాళ్ళను చూసి విచారించాలి. ప్రతివారికీ ఇలా అడిగే హక్కువుంది కాబట్టి, నిలదీసి అడగవలెను—"నేటి ప్రపంచంలో ఎవరు సిసలైన క్రైస్తవులు?"

వివేకానందుని విసుర్లకుగాని, మరెవరి విమర్శలకు గాని నేను సమాధానం ఇవ్వకోరటం లేదు. కేవలం నేటి ప్రపంచంలో యధార్థమైన హిందువూ, నిఖరమైన క్రైస్తవుడూ మహాత్మా గాంధీజేనని నేను ఖండితంగా చెప్పదలచుకొన్నాను.

ఇస్లాం యూదీయమతంవలె మూఢవిశ్వాసాలతో ఉన్న దంటే ఆశ్చర్యపడనక్కర్లేదు. అందుచేతనే మహమ్మద్ అనుయాయులు విశ్వనాధాలయం పాడుచేసినారు. ప్రతీకాలు, విగ్రహాలు, కేవలం జడబుద్ధి నిర్మితాలు కావు. చైతన్యానికే రూపారోపణం చేసి హిందువులూ బౌద్ధులూ వాటిని నిర్మించినారు. సహజంగా హిందువుల్లో ప్రతీకోపాసన అధికం. చిన్నచిన్న రాళ్లు చివరకు చిల్లర దేవుళ్లుగా మారినాయి. ఈ చిల్లర దేవుళ్ళను ఉపాసించడం మహాప్రమాదం. కేవలం వేదాంతం తెలిసిన బ్రాహ్మణుడు ఈ క్షుద్ర ప్రతీకోపాసన ఆప గలిగినాడా! రసపుత్రునికి అధికార వ్యామోహాలులేవా? ఆతడు తాంత్రికోపాసన సరిగా గ్రహించాడా? ఇటువంటి సామాన్య క్షుద్రారాధనలను యదార్థ బ్రహ్మజ్ఞాని తోసిరాజన్నాడనటంలో నాకు సందేహం లేదు.

లామామతంవలెనే హిందూమతం ఆర్యవైదికమతాన్ని అఖండ సచ్చిదానందమయ పరతత్వాన్ని ప్రతిపాదించే వేదాంత తత్వాన్ని, ఆర్యద్రావిడ సమన్వయం చేసి, ప్రజానీకానికీ ప్రసిద్ధ సామాన్యమతాన్ని ప్రసాదించింది. దీనికి కాళికోపాసన తోనూ, తదితర వామాచార శాక్తేయాది ఉపాసనా కాండతోనూ, మధ్యమ తరగతి నీతితోనూ నిమిత్తంలేదు. ఏలననగా ఈ క్షుద్రోపాసనలు కేవల భీతిదాయకాలు. వామాచార కాపాలికాది శాక్తేయోపాసనలు మహా భీతిదాయకాలు, జుగుప్సాకరాలు. ఇట్టి భీతివల్ల అన్యహృదయాందోళనం కలిగించడంకన్న నిజ హృదయం క్షోభిస్తే, నిజాంతరంగం శుద్ధమైతే క్షుద్రోపాసనలు సహితం మంచివే. కానీ, క్షుద్రోపాసకుల ప్రాప్యమే క్షుద్రమైంది. ఇక అట్టి సాధకుడూ, సాధనా, సాధ్యమూ ఈ మూడుకూడా క్షుద్రాలే. అయితే తాంత్రికార్చనలో దక్షిణాచారం మళ్ళీ విశిష్ట మైంది. రామకృష్ణుడు తాంత్రికోపాసన అవలంబించి కృతార్థ డయిన మహాసిద్ధుడు.

బహుమార్గాల్లో హిందూమతంలో సత్యదర్శన మవు తుంది. ఎవడు సాధకుడో, వాడికేకాక సర్వ జీవులకూ పురుషార్థ సిద్ధి విధానాలు ఎన్నెన్నో కనపడతవి. హిందువుల సహనభావం అతివిపరీతం హేతువిరుద్ధం, మాయా పరబ్రహ్మల భేదం, జగన్మిథ్యాత్వంతో సమస్త జీవనిరాసమూ, అకర్మలో కర్మ, కర్మలో అకర్మ ఇవన్నీ సూక్ష్మతార్కిక మతానుభవైక గోచరాలు.

హిందూమతంలోని కర్మసన్యాసమునకు విరుద్ధంగా కర్మ యోగానికి మహాత్ముడూ, బ్రాహ్మసామాజికులూ ప్రాధాన్యం ఇచ్చినారు. హిందూమతం విశ్వమే కేంద్రంగా కలది. ఆ విశ్వ

జనీనతా ప్రవాహంలో పుణ్యపాపాలు రెండూ కొట్టుకు పోయినవి. క్రైస్తవమూ, ఇస్లామూ మానవ వ్యక్తికేంద్రము గాగల మతాలు. ఆ వ్యక్తులు కొంతవరకు చారిత్రక వ్యక్తులే. ఈ మతాల్లో చారిత్రక సత్యానికి విలువ ఉన్నది.

నిరాడంబరమై శూన్యమైన మసీదులో అంతర్భాగాలనూ, గోపురాలనూ, ప్రశాంత సరస్సులనూ, సుందర ప్రాంగణాలనూ నేను స్వచ్ఛ సమదృష్టితో తిలకించినాను. అదే దృక్పథంతో ఒకనాడు నేను ఢిల్లీలో పెద్దమసీదును సందర్శించాను. సంజవేళ మసీదు మెట్లు ఎక్కుతూ వుంటే మూడుసార్లు మహమ్మదీయ పురోహితుడు ఇలా గానంచేశాడు—"అల్లాహో అక్బర్! అల్లాహో అక్బర్! అల్లాహో అక్బర్!—భగవంతుడు సర్వోత్కృష్టుడు. అల్లా ఒక్కడే. మహమ్మదు ఆయనదూత." ఆ సంజవేళ విశ్వాసం ఉట్టిపడుతున్నట్లు జగప్రాణుడు చక్కగా వీస్తున్నాడు.



# అధ్యాయం 26

నాకు ఆతిథ్యం ఇచ్చిన శరచ్చంద్ర బోసు సమర్థుడైన ఒక నౌఖరు నిచ్చి నన్ను హౌగ్లీ రైలుస్టేషనుకు పంపినాడు. అక్కడి జనసమ్మర్దంలో దారిచేసుకొని రైల్లో కూర్చోగలిగాను. నేను ఎక్కిన పెట్టిలోనే ఇంకా కొంతమంది ప్రయాణికులు తోలు మెత్తలమీద ఎదురుబొదురుగా ఆసీనులై వున్నారు. సంధ్యాకాల మవుతున్నది. చిన్నచిన్న స్టేషన్లలో హరికేన్ దీపాలు వెలుగు తున్నై. ఉత్తరంగా ప్రయాణించి శాంతినికేతనం చేరినాను.

భారతీయ కవిచక్రవర్తి అయిన రవీంద్రనాథుని విశ్వ భారతీ సదస్యులు స్టేషనులో నన్ను కలిసినారు. కవిచంద్రుని మేనల్లుడు కార్యదర్శి, శాంతినికేతన పాఠశాల కార్య నిర్వాహ కుడూ అయిన క్షితీశరాయి ప్రపథమం నన్ను సాదరంగా ఆహ్వానించినాడు.

మేము బండి కుదుర్చుకొని బోల్‌పూర్ స్టేషన్‌నుంచి దీపాలవేళకు శాంతినికేతనం చేరినాము. నేనున్న గదిలో హరికేన్ లాంతరు ఏర్పాటయింది. ఆ గదిలోనే ఒకప్పుడు గాంధీజీ విడిదిచేసినట్లు క్షితీశరాయ్ చెప్పగా విన్నాను. ఆ గది భారతీయాలంకరణంతో నిరాడంబరంగావుంది. పువ్వుల కుండీలు,

శయ్యలూ అన్నీ భారతీయాలే. అభ్యంగశాలలో సగంవరకు మట్టిబానల్లో నీరు ఏర్పాటు చేశారు. బాగా అలిసివున్నమూలాన స్నానంచేసిన వెంటనే పరున్నాను.

ఉదయం నిద్రలేచేసరికి సూర్యుడు ఆకాశంలో పైపైకి వస్తున్నాడు. ఆవరణలో రకరకాల పూలచెట్లూ, సాల పలాశ శేఫాలికా వృక్షాలూ, పొదలూ సుందరంగా కనపడినవి. ఎటు చూసినా రంగురంగుల పువ్వులే! ఏమి వర్ణాత్మిక సౌందర్యం! లార్డ్ సిన్హా సు మొదట ఇక్కడే దేవేంద్రనాథ టాగూర్ సందర్శించటానికి వచ్చి ఈ ప్రదేశ వాతావరణానికి ముగ్ధుడై తన నివాసమే ఇక్కడ ఏర్పరచుకొని మొట్టమొదట చిన్న పాఠశాలను ఆరంభించారు. ఇక్కడే భారతదేశం నవ్య కవిత్వాన్నీ, భావి కాలాన్నీ కలలు కన్నది.

అతిథులకోసం నేనున్న బస ప్రత్యేకంగా ఏర్పాటు చేశారట. నా బసకు దగ్గిరగా 'ఉదీచి' అనే పేరుతో వేరొక అతిథి గృహం వుంది. తోవలోనే 'తాజాకలం' (Postscript) అనే పేరట రెండుగదులు వసతిగా రవీంద్రుడు కట్టించుకొన్నాడు. అవి చాలా నిరాడంబరంగా ఉన్నవి. రవీంద్రుడు విశ్రాంతిగా ఒక గదినుంచి మరొకగది చొప్పున ఆశ్రమమంతా చుట్టుముట్టి రావటం అలవాటు. ఆశ్రమవాసానికి చివరనున్న గృహంలో రవికవి వినియోగించిన చక్కని వస్తువులెన్నో ఏర్పాటయినవి. గదినిండా ప్రఖ్యాత చిత్తరువులు ఎన్నికగా ఉన్నవి. చిత్రాలన్నీ భవిష్యత్ కాలానుగుణ్య మైనవిగా ఉన్నాయి. ఆయన

అమరత్వానికి ముందురోజుల్లో కల్పనా వైచిత్రితో ఎన్నో చిత్రాలు చిత్రించినాడు. ఈ లలిత కళా ప్రవృత్తి చూసేసరికి నా కళాపిపాస అధికమయింది.

నేను చిత్రకళా ప్రదర్శనం నందలాల్ బోస్ అధ్యక్షతన శాంతినికేతన చిత్ర కళాశాలలో తిలకించినాను. రవీంద్రుని చిత్రాలు రెండుసార్లు చూచాను. ఆయన చిత్రరచన నాకు ఇంపుగా వుంది. నేను విందుకుడిచే టేబిలుమీద మనోహరమైన నాగమల్లెలతో పూల కూజాలు అమర్చినారు. వంగదేశంలో ఎన్నెన్ని పూలజాతులబ్బా! సమీప పూలమొక్కల్లో బంగారు మొహరు మరీ ముద్దులొలుకు తున్నది. మొహరుపువ్వు శిరస్సు నారింజపండువంటి అరుణవర్ణము. రవీంద్రుని చిత్రం ఎదుట ఈ రంగురంగుల పువ్వులు నివాళిగా ఉన్నట్టున్నవి.

నాటి సాయంకాలం కవీంద్రుని మేనల్లుడు మహాసభలో ఉపన్యసించమని నన్ను కోరినాడు. శాంతినికేతనంలో పాఠశాల, పూలతోటలు, ప్రాచ్య సంస్కృతికి సంబంధించిన గ్రంథాలయం నేను పరిశీలించడానికి కూడా ఏర్పాట్లు జరిగినవి. సి. యఫ్. ఆండ్రూస్ భక్తాగ్రణి స్మారకంగా పాశ్చాత్యసంస్కృతి కేంద్ర స్థాపనా విషయాలు, దానికి సంబంధించిన తన ప్రణాళిక గురించీ ఆయన నాతో చర్చించినాడు. తుఫానుగాలి రేగుతున్న ప్పుడు మేము పురాతన గృహంలో అట్టాలికమీద ఆసీనులమై బ్రహ్మోపాసనం వీక్షించినాము. ఉపాసన బ్రహ్మసమాజ పద్ధతిగా జరుగుతున్నది. విద్యార్థు లందరూ ప్రార్థనలో పొల్గొన్నారు. ఈ బ్రహ్మసమాజం హిందూమతంలో కర్మ కాండనూ, ప్రాచీనాచారాలను సంస్కరించింది. మొదట్లో

విశ్వజనీనమత స్థాపనోద్దేశ్యంతో ఈ సమాజం ఆవిర్భవించింది. కాని హిందూ మతోద్ధరణతో బ్రాహ్మమత ప్రాబల్యం తగ్గి పోయింది. విద్యార్థులు ప్రార్థన చేసే ప్రదేశం ప్రశాంత సుందర మైన పూలతోట, అక్కడే శిలాఫలకంమీద ఇలా పంక్తులు చెక్కబడినవి—"ఆయన ఏకమేవా ద్వితీయం. ఆయన ఆనందోద్గారము పరిదృశ్య మానమయినది." దానితో మళ్ళీ నాకు వైదికమత త్రిపుటి మనోగోచర మయింది. ఎబెలార్డు చెప్పినట్లు జనకుడు శక్తి, కుమారుడు తెలివి, తత్త్వము త్యాగం; హైందవధర్మాన్ని బట్టి శక్తి జ్ఞానానందాలు త్రిమూర్త్యాత్మకాలు.

నేను డాక్టర్ జార్జిఅనే తిరువాన్కూరు క్రైస్తవ నివాసితో సంభాషించాను. శాంతినికేతనంలో ఆయన హిందూ క్రైస్తవ తత్వ సమన్వయానికై కృషి చేస్తున్నాడు. తర్వాత గ్రంథాలయ పర్యవేక్షకుడయిన డాక్టర్ కె. యన్. సేన్‌తో గోష్ఠిచేసినాను. ఆయన కబీర్ జ్ఞానాశ్రయ భక్తిమార్గం అయిన 'కంబీర్ పంథా' గురించి ప్రస్తావించినాడు. కబీరును కొందరు అడిగినారు— "భగవత్ప్రాప్తికి సాధన మేమిటి?" "ఏ సాధనం? ప్రత్యేక సాధనమేమీ లేదు" "నీటిలో చేప జలాన్నే నమ్ముకొంటుంది. నీవు మాత్రం ఎందుకు నిన్ను విశ్వసించవు?" మరికొందరు కబీరుదగ్గర పరమేశ్వరుడు (యూదులూ, ముసల్మాను లన్నట్లు) ఏకమేవా ద్వితీయు డవునా కాదా? హిందువులూ క్రైస్తవులూ అన్నట్లు పరమేశ్వరుడు త్రిమూర్త్యాత్మకుడా? అనే చర్చ చెలరేగించారు, అప్పుడు కబీరు ఇలా ఉద్బోధించాడు— "భగవంతుడు సర్వశక్తి వంతుడు, హేయగుణరహితుడు.

సద్గుణోపేతుడు, నానాత్వనిరాసన చేసేవాడు." ఈ తీరుగా హిందూ మహమ్మదీయ మతసామరస్యము చేయ యత్నించినాడు—కబీరు కవీంద్రుడు.

ఈ చెప్పేదంతా నేను సంతోషంతో విన్నాను. అయితే భేదదృష్టి తొలగడం అంత సులభసాధ్యం కాదనుకొన్నాను. మైష్టిక్ అనే యోగిపుంగవునికి మనం ఊహించే జగత్తులో భేదమే తోచదు. నానాత్వమే భాసించదు. నేను పాశ్చాత్యుణ్ణి కనుక నా ద్వైతబుద్ధి తొలగి పోవడం కష్టం. పరబ్రహ్మ మానవత్వాతీతం. కబీరు హిందూ ముసల్మానుల మధ్య సాధనా పథం ఏర్పరచాలనే ఆశ కల్పించినాడు. ఆ జ్ఞాని సర్వమతాల్లో గర్భితమయిన పరమసత్యం అన్వేషించాలని నిర్దేశించినాడు. ఈ విషయంలో నాకు సందేహం లేదు.

శాంతినికేతనంలో సంజవేళ ఉపన్యసించాను. 'మార ప్రలోభ' మనే పేరుగల హాల్లో తెల్లని ఉడుపులు ధరించి స్త్రీ పురుషులు నేలమీద బారులుతీరి కూర్చున్నారు. హాలుగోడల మీద బుద్ధుని ధ్యానభంగం చేయాలని మారుడు అప్సరసలను పంపే కుడ్యచిత్రాలంకరణం ఉంది. సి. యఫ్. ఆండ్రూస్ భక్తాగ్రణి స్మారక చిహ్నంగా ప్రాక్ప్రతీచీ సంస్కృతీ సమ్మేళనం చేయాలని శాంతినికేతన వాసులు యత్నిస్తున్నందుకు అభినందించినాను. తర్వాత మహాత్ముని మహోత్కృష్ట సందేశం, పాశ్చాత్యులకు ఆయన చేసిన హితబోధ, అహింసా తత్త్వం గురించి ఉపన్యసించాను. సత్యాన్వేషణకై ఒక మహా సమస్యా పరిష్కారానికై మహాత్ముని దగ్గిరికొచ్చి భారతదేశ పర్యటనం చేస్తున్నానని చెప్పినాను. జాక్సు మారిటైన్ అన్నట్లు

సర్వమతాల్లో అనుస్యూత మైన పరమసత్యం మనం అన్వేషించి ఏనాటికైనా కనుక్కోగలమనీ, ఫ్రాన్సిస్ భక్తాగ్రణి, కబీర్, మారిటైన్, టాగూరువంటి కవిద్రష్టలు సర్వమతాల్లో గర్భిత మయిన పరమసత్యం అంగీకరిస్తారు. ఈ సాధన అసాధ్యం కాదు. సమస్త మతధర్మాల్లో అనుస్యూతమయిన పరమ తత్త్వము గ్రహించడానికి మానవుడు క్రాంతదర్శి కావాలని ఉపన్యసించాను.

# అధ్యాయం 27

శాంతినికేతనం నుంచి కలకత్తావచ్చి, రెండురోజులుండి ఢిల్లీ వెళ్ళినాను. ఓఢ్రదేశ పర్వతారణ్యాల్లోంచి, గంగా సమతల మైదానంలో ప్రయాణం చేసి, శనివారంనాడు భారత కవయిత్రి శ్రీమతి సరోజనీదేవికి అతిథిగా వెళ్ళినాను. ఆమె అఖిలాసియా సమితికి అధ్యక్షురాలు. సోమవారంనాడు భారత సోషలిష్టు నాయకమణి అయిన జయప్రకాశ నారాయణతో విందుకు ఆహ్వానితుడనైనాను.

ఒక ఉత్సాహియైన భారతీయ పత్రికా విలేఖరి, నేను జయప్రకాశతో విందు చేయబోతున్నట్లు గ్రహించి నన్ను వెంటాడినాడు. నేనూ జైప్రకాశ్ గోష్ఠిలో వున్నప్పుడు బహుశా ఆ విలేఖరి లోపలకూర్చుని మా సంభాషణ విన సంకల్పించినాడు. ఐతే పైకి మట్టుకు ప్రత్యేకంగా నాతో ఇంటర్వ్యూ చేయాలని వచ్చినట్టు అతను నటించినాడు. కాని అతని బారినుంచి ఎలాగో తప్పించుకొని నేనూ జయప్రకాశ్ విశ్రాంతిగా కూర్చున్నాము.

ఈ సుందర యువకుడు భారత రాజకీయ అగనాయకు లలో ఒకడు. అలహాబాదులో ఆయన ఏర్పాటు చేసిన కార్మిక కళాశాలలో నేను గోష్ఠి సల్పినాను. ఆయనను గురించి చాలా

విన్నాను. పెట్టుబడిదారులకూ పాలకులకూ ఆయన కొఱ్ఱులాంటి వాడు. వేదికలమీద తొణకకుండా గుట్టుగా నిప్పులు కక్కుతూ ఉపన్యసిస్తాడు. నైజాములో కార్మిక సమస్యల విషయం ప్రసంగించాలని ఆయన వెళ్ళినాడు. నెహ్రూ కాశ్మీరం వెళ్ళినప్పుడు ఎలా జరిగిందో, జయప్రకాశకూ అంతేజరిగింది అక్కడ. హైద్రాబాదులో వుండేవీలులేక జైప్రకాశ్ వెనుకకు రావలసి వచ్చింది.

భారతీయ జీవనంలో ప్రజల తీవ్రేచ్ఛలూ, రాజకీయ ఆదర్శాలూ జయప్రకాశ ద్వారా అభివ్యక్తమైనవి. ఇంతకు పూర్వం రాజకీయ వాదులంతా రాజకీయ స్వాతంత్ర్యం కోరేవారు, బ్రిటీషువారిని వైదొలగమనేవారు. ఐరోపా ఆసియాల్లో ప్రబలంగా చెలరేగిన ప్రజల ఆర్థిక సమస్యలు ఇంకా భారత రాజకీయ జీవితంలో ప్రముఖస్థానం వహించలేదు. ఐరోపాలో ఆర్థికజీవన సమస్యా పరిష్కారం దుష్కరమై, ఆర్థికసమస్యలే సంకుచిత ప్రాధాన్యములైనవి. భారతదేశంలో దానికి వ్యతిరేకంగా ప్రజలు ఆర్థిక సమస్యల జోలికి పోక క్షామాలకయినా గురిఅయిపోతారే కాని, వాటిని ఎదుర్కోరు. ఆర్థిక సమస్యలను ఎదుర్కోడం అనేసరికి, విపరీతమైన జనాభా సమస్య సిద్ధమవుతున్నది. కార్మికుల జీవన ప్రమాణాభివృద్ధీ, కుటుంబ విభాగం వున్న దేశంలో వర్గసంఘర్షణ వుపదేశించడం నిరుపయోగం. జనబాహుళ్యం ఇక్కడ ఉండలేకపోతే ఏ సోవియటు దక్షిణ సైబీరియాకో వలస పోయి స్థిరంగా వుండాలంటే ఆ దేశం జనసంకీర్ణం కాకపోయినా పరదేశస్థులను రానివ్వరు. భారత దేశంలో వర్గసంఘర్షణలేదు. కులాలవారీగా భేదాలున్నాయి

కాని, ఆర్థిక స్థితిని బట్టి వర్గాలు లేనేలేవు. ఇక్కడ మహా మతైక్యత వున్నట్టు కనబడుతుందే కాని అది అంత సులభ సాధ్యమయిన సమస్య కాదు.

ఇదివరకే భారతదేశ స్థితి మారిపోవడం ఆరంభించింది. ముస్లింలీగు కాకపోయినా కాంగ్రెసు ఆర్థిక సమస్యల విషయంలో రాజనీతివేత్తల భేదదృష్టి అధికమైంది. దేశానికి లభించిన రాజకీయ స్వాతంత్ర్యం సామాన్య ప్రజానీకం వాంఛించినది కాకపోవడంవల్ల ముఖ్యంగా కార్మికులలో అశాంతి చెలరేగటం వల్ల వారి సమస్యలకే ప్రాముఖ్యం వస్తుంది.

భారత సోషలిస్టు పక్ష నాయకుడయిన జయప్రకాశ నారాయణ భావిభారతంలో ప్రముఖవ్యక్తి కాగలడనటంలో సందేహం లేదు. ఆయన భారతరాజకీయ జీవితంలో విప్లవ నాయకమణి, ఆంగ్లేయ వ్యతిరేకి. సంభాషణలో నేను గ్రహించినదాన్ని బట్టి ఆయన రష్యావ్యతిరేకి, ఆయన రష్యా మానసిక దాస్యపుత్రుడు కాడు. కేవలం ఆయన భారతీయుడు.

స్వాతంత్ర్యసిద్ధికి ఆత్మోన్నది విధానాలు వెతికే భారతీయ స్వభావం అనువ్యవసాయమైనది. ఈ సందర్భంలో మహాత్ముని ప్రతిభ అనల్పమైనది. హిందూదేశీయ జీవనం ముఖ్యంగా కుటుంబ వ్యవస్థమీద ఆధారపడింది. కుటుంబములో వ్యక్తులు సమిష్టిగా ఉంటారు. అంతేకాని వారి జీవనోపాధికి ఆధారంగా ప్రభుత్వ కేంద్రీకరణ విధానంకానీ, రష్యాలో జారు చక్రవర్తుల వలె నిరంకుశ పరిపాలన కానీ ఉండేదికాదు.

జయప్రకాశ్ మాస్కో సందర్శించినాడు. కాని అక్కడ కనిపించిన పరిస్థితులేమీ ఆయనకు నచ్చలేదు. 'స్వేచ్ఛాపోరాట' విధానం కానీ, పోలీసుల గూఢచార పరిపాలన కానీ అవివేకమైన

దని చెప్పకతప్పదు. సోవియట్ క్రెమ్లిన్ నియంతల అధికారానికి జోహుకుం చేయడానికి జయప్రకాశ్ సుతరాం అంగీకరించడు, కొమిన్‌ఫారం అధినేతలకు దేశాన్ని అమ్మజూపడు.

సమకాలీన సమాజం కార్మికులకు హితంగా వుండాలంటే నిర్మాత్మక క్రమబద్ధ వ్యవస్థగా రూపొందాలి. శాంతిసమయంలో సౌష్ఠవమైన ప్రణాళిక ఏర్పరచాలని అంటే ప్రతివ్యక్తి ప్రణాళికలో నిర్దేశిత భావాలకు దాస్యం చేసి తీరాలని అర్థంకాదు. భారతదేశంలో గంగామైదానం కూడా కేంద్రీకృత సామ్రాజ్యాలకు అవకాశమిచ్చింది. కానిరష్యాలో ఏ జారు చక్రవర్తుల నిరంకుశ శాసనానికో, ఏ కొద్దిమంది రాజకీయ ముఠాదారులు స్వైర పరిపాలనకో ప్రజలు తలవొగ్గినట్లు. భారతీయులు కేంద్రీకృత సామ్రాజ్య శాసనాధికారాలచే పరిపాలన చలాయించే సామ్రాట్టులకూ అధికారులకూ దాసులు కాలేదు. అయితే ప్రభుత్వమూ, అత్యధిక సంఖ్యాకుల పక్షమూ, రాజకీయవేత్తల ఎత్తులపైఎత్తులూ, ఎన్నటికీ సహేతుకంగా ఉండజాలవని భావించటానికి వీలులేదు. ఆహార పదార్థాల కొరతా, ఆకలి మంటా, విదేశ నివాసమూ, మృత్యువూ ఇవన్నీ రాజనీతివేత్తల కుటిలతంత్ర కారణాలేనని మిస్టర్ ఇ. హెచ్. కార్ "సోవియట్ ఇంపాక్ట్ ఆన్ ది వెస్టరన్ వరల్డ్" పాశ్చాత్య ప్రపంచంమీద సోవియట్ల ప్రభావం అన్న గ్రంథంలో కొంటెగా రాశాడనుకొంటాను. భారత దేశంలో కూడా రాజకీయ దాస్యం ఉన్నప్పటికీ ప్రజా హృదయం స్థిరంగా వుండి ప్రశాంత జాతీయ విధానాల ద్వారా స్వేచ్ఛకై, దాస్య విముక్తికై పోరాటం సలిపింది.

తీవ్ర జాతీయవాంఛ సాంఘిక ధర్మాన్ని అతిక్రమించిన సైనికపరిష్కారం, జాతీయతా మహాయంత్రం మానవుల్ని యంత్రభాగాలుగా చేస్తుంది. జాతీయత రాక్షసరూపందాల్చి జగన్నాథ రథంవలె కదిలి భక్తుల్ని కోటానుకోట్ల హృదయాల్ని కాలరాచేస్తుంది. జాతీయతా వ్యతిరేకుల్ని భస్మీపటలం చేస్తుంది.

జాతీయతా ప్రయోజనం కేవల స్వార్థమేకాని కుటిల దురుద్దేశ్యం కాదు. అధికారం చేపట్టిన నిరంకుశులు, ప్రజాపీడా పరాయణులు బహుకాలంనుంచీ విమర్శకు జంకుతూనే వుంటారు. ప్రాచీనకాలంలో ప్లేటో తన 'రిపబ్లిక్' అనే గ్రంథంలో నిరంకుశ పరిపాలకుల మనస్తత్వం విశ్లేషించినాడు. శత్రుభయంతో ప్రజలున్నప్పుడు, పాలకులు సైన్యసహాయంతో వారిని రక్షించ గలరు. అటువంటి రక్షణయే లేనప్పుడు ప్రజలు పాలకులపై కసితీర్చుకోవలసి వస్తుంది.

మేము విందులో ఉన్నప్పుడు ఈ భావాలు జయప్రకాశ్ మనసులో తారాడుతున్నవో లేవో నాకు తెలియదు. కాని బ్రిటిషు కార్మిక సాంఘికోద్యమం గురించి, కార్మికోద్యమాలను అక్కడ నాయకులు ఎలానడిపిస్తారో, ఎలా ఆందోళనచేసి కార్మిక సమితులు స్థాపిస్తారో తెలుసుకోవలెననే కుతూహలం ఆయన కధికంగా వున్నట్లు నేను గ్రహించాను. ఆంగ్లేయ జీవిత విధానంపట్ల, వారి కార్మికోద్యమంపట్ల జయప్రకాశ్‌కు ఉన్నతాభిప్రాయం వుందని ఆయన మాటలవల్ల గుర్తించాను.

ఫిరోజిషా వీధిలో ఆయన గృహం విడిచి వస్తున్నప్పుడు నా మనసులో ఆయన దూరదర్శిగానూ, జటిలమైన భారతీయ

సమస్యా పరిష్కారం చేయగల ఉపద్రష్టనీ తోచింది. ఆ జటిల మైన మహా సమస్య ఏదోకాదు, అది నేడు భారత ప్రజానీకాన్ని పీడిస్తున్న దారిద్ర్యమే. కార్మిక జీవనంలో పెట్టుబడిదారులు కార్మికులను పీడించడమూ, అల్పజీవన ప్రమాణమూ విపరీతంగా జనం పెరుగుదల వల్లనూ దేశంలో దారిద్ర్యదేవత విలయతాండవం చేస్తున్నది. దేశం పూర్తిగా పారిశ్రామికం ఇంకా కాలేదు. భారతదేశం పరిపూర్ణ పారిశ్రామికకేంద్ర మైనప్పుడు దేశంలో వర్ణవ్యవస్థకు సమాధి జరుగుతుంది. కాని దానితో కొన్ని కొత్త సమస్యలు ఆవిర్భవిస్తవి. తాతా మిల్లులలో కానీ, జమ్‌షెడ్‌పూరు ఉక్కు కర్మాగారాల్లో కానీ కార్మిక పరిస్థితులు కొంతవరకు అభివృద్ధికరంగా ఉన్నప్పటికీ ఈ సమస్యలు ఉదయించక తప్పవు. బొంబాయి మిల్లులలో ఇప్పటికే ఈ సమస్యలు ఉప్పతిల్లి విషమరూపం దాలుస్తున్నాయి. కాబట్టి తూర్పుదేశాల్లో ముఖ్యంగా భారతదేశం ఏరీతిగా పారిశ్రామికాభివృద్ధి కావాలో తేలవలసి వున్నది. దేశం పారిశ్రామికం కావడం తత్ఫలితంగా దుష్టసమస్యలు బయలు దేరకుండా, అక్కడ మానవులు గొర్రెలవలె లేదా యంత్రాలవలె మారి బానిసలు కాకుండా ఉండే పారిశ్రామిక విధానం ఎలా అమలుపరచాలనేదే ప్రస్తుత సమస్య. భారత ప్రజల మహత్వా కాంక్ష పెరిగినకొద్దీ వారికి ఎక్కువ సుఖాలు భోగాలు కావలసి వస్తుందేమో కూడా ఆలోచించతగ్గ విషయమే. అమెరికా యూరపు ఖండవాసుల ప్రస్తుత జీవితావశ్యకతలు భారతీయులకు భోగాలు, అయితే భారతదేశం సంపదను ఎన్నడూ కోరలేదు. అక్కడ ప్రజలు ఎంత నిరంకుశ పాలనకు గురైనా,

వర్ణాశ్రమాచారాల వల్ల సంకుచితులయినా, కుటుంబ జీవన సౌఖ్యం, సిసలైన స్వేచ్ఛ అనుభవించారు. సంసారంపైన విరక్తి జనించినప్పుడు యాత్రికులై వారు యోగులు కూడా అయినారు.

భారతీయ జీవనంలో మరొక గడ్డుసమస్య సాంఘిక సమస్య. ఈ సమస్య పరిష్కారం చేయాలంటే అధిక జీవన ప్రమాణం అనగా అధిక వేతనాలని తరుచుగా వాఖ్యానిస్తూ వుంటారు. కాని దేశంలో సాలీనా ఒక్కొక్క న్యూయార్కు జనాభా చొప్పున వృద్ధి చెందుతున్నప్పుడు, కుటుంబజీవనంలో ఒక్కరిమీదనే తక్కినవారంతా ఆధార పడినప్పుడు, అధికజీవన ప్రమాణ సమస్య పరిష్కారం కాదు. ఇంతకు పూర్వం పాశ్చాత్య నాగరకత వ్యక్తిగతంగానే ఉండేది. గ్రీక్ నాగరకతానంతరం వచ్చిన క్రైస్తవం కూడా వ్యక్తిగత నాగరకతకు దోహద మిచ్చింది. నవీన వ్యక్తిత్వం పొందకుండానే భారతదేశం గనక కుటుంబ వ్యవస్థను విడిచివేస్తే అది ఆసియా దేశాల్లో ఎక్కడా కనీవినీ ఎరగని మానవజీవితాన్ని రోతగా చిత్రించే హేయమైన కేంద్రీకృత నియంతృత్వానికి దారితీస్తుంది. దేశంలో సాంఘిక పరివర్తన రావలసినమాట నిజమే. అయితే ఆ పరివర్తనం ప్రజారోగ్యాభివృద్ధి ద్వారానూ, భౌతిక జీవనం చక్కపరుచు కోడడం ద్వారానూ వస్తుంది. అందుకు ప్రధానంగా దేశంలో పాడి పంటలు వృద్ధికావాలి. వ్యవసాయంలో నవీనవిధానాలు అవలంబిస్తే దేశం సత్వర సస్యసంపన్నం అవుతుంది. ఇదే

పరివర్తనకు మార్గం. మహాత్ముని దృష్టినిబట్టి మానవుని కర్తవ్యతాగ్రహణం నుంచే స్వేచ్ఛ వస్తుంది.

ప్రముఖుడయిన జయప్రకాశనారాయణ వీరనాయకమణి; సోషలిస్టు నాయకుడు సత్వరం భారతదేశానికి కావలసిందేమిటో గుర్తెరిగినవాడనటంలో సందేహంలేదు. ఈయన పాత్ర భావి భారతంలో భారతాంగ్లేయ సమరస విధానంలో కార్మికోద్యమం నడపడంలో ప్రముఖ మవుతుందే గాని, రక్తసిక్తమయిన సోవియట్ దేవతకు ప్రణమిల్లడంలో మాత్రం కాదు!

# అధ్యాయం 28

ఆనాడే జవహరులాల్ నెహ్రూ నన్ను విందుకు ఆహ్వానించినాడు; కాని ఒక్కొమ్మడిగా రెండు తావులకు భౌతికంగా నేను హాజరుకావటం అసంభవం. అందుచేత పండిట్‌జీ ఆ మరునాడు అనగా అఖిలాసియా ప్రారంభదినాన మంగళవారంనాడు నన్ను అతిథిగా ఆహ్వానించినాడు. ఇండోనీషియా రిపబ్లికు ప్రధాని భార్య శ్రీమతి షారియర్ (డచ్చివనిత అయి వుంటుందేమో) కూడా నాతోపాటు పండిట్‌జీ ఇంట అతిథిగా వచ్చింది.

ఆ మహాసభ నెహ్రూకాసిన కలల ఫలం. యాభై జాతుల తరపున ప్రతినిధులు, మంగోలియా, ఈజిప్టు, ఖిర్జిక్ సోవియట్ రిపబ్లిక్, సయాందేశీయులు సభకు విచ్చేశారు. వచ్చినవారిలో చైనీయుల ప్రతినిధి బృందం చాలా పెద్దది. కొరియావారు ఇంకా వస్తూవున్నారు.

మహాసభ జరిగిన రెండువారాలూ నెహ్రూ సమస్త బాధ్యతలూ వహించి సభల్లో ఎప్పుడూ ఉండేవాడు. ఆయన దృష్టిలో సభాప్రాముఖ్యము అధికం. చర్చనీయ విషయాల్లో వ్యవసాయం, జనసంఖ్య, సంస్కృతి సహకార పరిశోధనలు ప్రముఖమైనవి. ఆ నాడు ప్రపంచానికి ఆసియా సమైక్యత,

ఆసియా ఖండంలో ప్రముఖమైన భారతదేశం, దాని రాజధాని ఢిల్లీగానూ సువ్యక్తమయింది. ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్య నవ భారత ప్రముఖపాత్రకు నెహ్రూపండితుడే కారకుడు.

సభలో జవహర్‌లాల్ నెహ్రూ సోదరి విజయలక్ష్మి, ఇండియా ఆర్థికమంత్రి డాక్టర్ జాన్ మత్తయ్ సతి, "ఆర్యన్ పాత్" సంపాదకురాలయిన సోఫియా వాడియాల గోష్ఠిజరిగింది. నాకు జ్ఞాపకం ఉన్నది—సభాసదులకు దేవాలయశిల్పాలు చూచే ఏర్పాటు జరిగింది. కాని ఆ శిల్పాలు చక్కని అభిరుచికి దృష్టాంతాలు కావు. సభకంతటికీ నెహ్రూ ఫిలిం తారలాగ అందంగా ఉన్నాడు. ఒకప్పుడు పంచకళ్యాణి గుఱ్ఱం స్వారీ చేస్తున్న అతని మూర్తిని ఫిలింరీలులో సిమ్లాలో చూచాను. జనమంతా మహా హర్షనినాదాలు చేశారు. ఏభై ఎనిమిదోపడిలో పాదంపెట్టినా ఆయనలో యువోత్తేజం హాస్యచేష్టలూ ఏమాత్రం తగ్గలేదు.

ఎంతో ధ్యానపూర్వకంగా పరిశీలిస్తేనేగాని నెహ్రూ వదనంలో భారత స్వాతంత్ర పోరాటంలో పొందిన కారాగారవాస క్లేశ చిహ్నాలు స్పష్టంగా కానరావు. ఆయనతో భారతీయ తక్షణ సమస్యలు అంటే ముఖ్యంగా భారతస్వాతంత్ర సమస్యగురించి, బ్రిటన్ ఒక నిర్దిష్టమైన గడువు పెట్టుకొని భారతదేశంనించి వైదొలగి రావాలని 1943 లో నేను చేసిన ప్రకటన (దీనిమీద అనూరిన్ బెవాన్ కూడా సంతకం చేశాడు) గురించి గంటసేపు గోష్ఠి చేశాను. కాని అప్పుడు ఆయనలో జైలుక్లేశ చిహ్నాలు కంటే ఎక్కువగా పరిపాలనా సామర్థ్య చిహ్నాలు, వినయశీలం



(లండన్‌లో భారత హైకమీషనర్ సౌజన్యంతో.

సారనాథంలో, కుటివిహార మందిరంలో బుద్ధభగవానుడు.



( లండన్‌లో భారత హైకమీషనర్ సౌజన్యంతో )

కేంద్రభారత విద్యాశాఖ అమాత్యులు మౌలానా అబుల్ కలాం ఆజాద్

గల రాజకీయవేత్త లక్షణాలు, మూర్ఖత్వాన్ని సహించలేని కోపిష్టితనాన్ని మాత్రం స్పష్టంగా చూడగలిగాను. జైలుశిక్ష, జైలువాసమంటే భారతీయులు జంకరని ఏవగించుకోరని వైస్రాయి సతి చెప్పింది.

సాయంకాలం సభా ఏర్పాట్ల విషయంలో నెహ్రూ చాలా త్వరపడుతున్నాడు. ఆయన దృష్టి అతిథులమీద చరచర పోతూనేవుంది. ఆ వ్యక్తి (నెహ్రూ) అణువణువులో భావోద్రేకం ఉద్రిక్తత కనబడినవి. ఆ సమయంలో ఆయన ముఖాన్ని చూస్తూ వుంటే ఈ సభకు ఆయన ఎంత శ్రమిస్తున్నాడో అని అనిపించింది. ఈ సందర్భంలో ఆయన రాజనీతిని ఉపజ్ఞను శంకించను సుమండీ! పండిట్‌జీ ఏర్పాటుచేసిన ఈ అఖిలాసియా మహాసభకు నేల నాలుగు చెరగులనించీ ప్రతినిధి వర్గాలూ, పర్యవేక్షకులూ జట్లుజట్లుగా వచ్చి హాజరైనారు. అఖిల జగత్తుకూ భారతావని అందచేసే అమర సందేశానికిది ఎంత సదవకాశం!

కాశ్మీర బ్రాహ్మణుడయిన జవహరులాలు వంటి సౌష్ఠవమయిన అభిరుచిగల వ్యక్తిని నేను ప్రపంచంలో మరెక్కడా చూడలేదు. హారోలో చదువుకొన్నదాని ఫలితం ఆయనలో ఏకోశాన కనపడదు. భారతీయుల్లో నెహ్రూ పాశ్చాత్యుడు. ఆచారాల్లో సంస్కరణం కోరేవ్యక్తి. ఆయన పాశ్చాత్యుడు కావాలని ఉబలాటపడడు, తనకుతానై వుండాలని కోరుతాడు. ఆయన ప్రపంచంలో గొప్ప నాగరక వ్యక్తి.

నెహ్రూ పక్కా బ్రాహ్మణ హేతువాది. ఆ కారణంచేతనే నా మిత్రుడూ, సనాతనవాదీ అయిన దోల్‌పూర్ మహారాజాకు

నెహ్రూభావాలు ఏమాత్రం సహించవు. నా మిత్రుడు విశ్వసించిన సనాతన సిద్ధాంత ప్రభావం నెహ్రూమీద ఆవంతకూడా పనిచేయ లేదు. హిందూ మహాసభకు కూడా నెహ్రూ సిద్ధాంతాలంటే జీర్ణంకావు. ఆ సనాతన హిందూవాదుల దృష్టిలో నెహ్రూ జాతీయ కాంగ్రెస్ మహాసభను తప్పుదారిలో నడుపుతున్న వ్యక్తిగా గోచరిస్తాడు. కాని కొంచెం సనాతన జాతీయవాది, మితభాషి అయిన సర్దార్ పటేల్ కాంగ్రెస్ రాజకీయాలపట్ల వారికి విశ్వాసం అభిమానం మెండుగా వున్నాయి. ఎన్నో లోటు పాట్లు వున్నా వ్యక్తులు వేరైనా గాంధీ, నెహ్రూ, పటేల్ అనే నాయకత్రయ భావసంకలనమే కాంగ్రెస్ మహాసంస్థ. అదే భారతీయ హృదయం.

వారాలతరబడి గాంచిన గుళ్లూ గోపురాలూ, బేలూరులో దేవతాశక్తుల సందర్శనం, తాంత్రికయోగ విశేషాలూ, అరవిందుల యోగసిద్ధాంత మర్మభేదం గ్రహించటంలోనూ గడిపిన తర్వాత నెహ్రూతో జరిపిన గోష్ఠి నాకు తేజోవంతమైన మాధ్యాహ్నిక వాతావరణంలో ప్రవేశించినట్లు తోచింది. నెహ్రూ హృదయాన్నీ భావాలనూ పాశ్చాత్యులు బాగా గుర్తించారనే చెప్పాలి. నేటి భారతీయ సమస్యా పరిష్కారం అతి సులభమైనదే కాని, లాహోర్, అమృతసర్, కలకత్తా నడివీధుల్లో అమానుష చర్యలు, ముసల్మానులు హిందువులు పరస్పరం నరుక్కు చావటానికి ఇంకా కత్తులు నూరుతూనే ఉండటం చాలా శోచనీయ విషయం. ఈ జాతులమధ్య ద్వేషానల నిర్మూలన తర్వాత భారత జాతీయత ఆచరణ సాధ్యమని నిరూపించటానికి కొంత కాలం పడుతుంది.

భారతదేశం తన సుదీర్ఘ చరిత్రలో ప్రపంచానికి తన దివ్య ప్రభాత రోచిస్సులను ప్రపంచం నాలుగు చెరగుల ప్రసరింప చేసిన కాలం మౌర్యులు ముఖ్యంగా అశోక సార్వభౌముని అధికారంలోనూ, గుప్తకాలీన మప్పుడూ, మొగలాయీలలో ప్రధానంగా అక్బర్ పాలననాడూ నని చెప్పవచ్చు. ఆ తర్వాత దేశచరిత్రలో కల్లోలాల మధ్య అనేక స్థానికశక్తులు అధికారములోకి రావటమూ పతనం కావటమూ, సరిహద్దులు పెరగటమూ తరగటమూ వినా స్పష్టమైన భావసంఘర్షణ లేవీ కానరావు. చోళ సామ్రాజ్యానంతరం చివరికి మొగలాయీల దాకా చూసినా పాశ్చాత్య దేశాలతో భారతదేశానికి చెప్పుకోతగ్గ సంబంధ బాంధవ్యాలు లేనట్టు స్పష్టపడుతోంది. ఆఖరికి సరసనున్న చైనా, పర్షియాలతో కూడా అట్టే పొరపొత్తులు ఉన్నట్టు నిదర్శనాలు లేవు. గణరాజ్యాలున్నప్పటికీ, బలీయమైన రక్షణ మిచ్చే కేంద్ర ప్రభుత్వం లేదు. రోమనులవలె భారతీయులలో సామ్రాజ్యవాదం లేదు. రాజుకూ మతానికీ మధ్య సంఘర్షణలు లేవు.

ఆది బౌద్ధము ఒక రూపకము వంటిది. దాని ప్రభావం తత్వంమీదనే గాని, రాజకీయ సంస్థలమీద అట్టే ప్రసరించలేదు. పాశ్చాత్యుల తత్త్వము చారిత్రక దృష్టిలోనే వుంది. కాని భారతీయుల తత్త్వశాస్త్రంలోనే చారిత్రకదృష్టి నిహితమైవుంది. 19 వ శతాబ్దంలో యూరోపులో లెనినీయ జాతీయతకు కనీస జాతీయతనైనా ఇస్లాం జాతీయత విజయనగర సామ్రాజ్యంలో గాని, రాజపుత్రులలో గాని రెచ్చకొట్టలేక పోయింది. ఆ నాటి మహమ్మదీయ జాతీయతా ప్రచారం అక్బరుద్వారా భారతదేశంలో

ప్రచారం కాకపోయినా (ఇస్లాం జాతీయ ప్రభావం అక్బరుమీద అట్టే పడలేదన్నమాట) ఆ పని నిష్ఠురుడైన ఔరంగజేబు ద్వారా చక్కబడిందనే చెప్పాలి.

హేగెల్ గుర్తించినట్టు చారిత్రక సత్యాన్నీ జాతీయతనూ భారతీయులకు మొట్టమొదటగా జాతీయ కాంగ్రెస్ సంస్థయే ప్రబోధించింది. తదుపరి పటేల్ సహాయంతో నెహ్రూ పాశ్చాత్య భావప్రేరేపణతో భారత జాతీయత రూపుదాల్చింది. భారత జాతీయతలో విశిష్టత అంతర్జాతీయత్వంతోను, విశ్వమానవత్వంతోనూ సమన్వయమై ఉండటంలోనే వుంది. ఈ ప్రత్యేకతకు నెహ్రూనూ, కొంత భారత మతైకదృష్టి, బాపూజీ ప్రతిభలూ కూడా కారణాలని చెప్పవచ్చు.

# అధ్యాయం ౨౧

పాతఢిల్లీలో పాత మెయిడెన్సు హోటల్లో వైస్‌రాయి ప్రత్యేక విమాన చోదకుడితో పరిచయం కావడం నా అదృష్టం. అతను సిమ్లా రమ్మని నన్ను ప్రోత్సహించినాడు. ఇది 1946 నాటి మాట. ఢిల్లీ వేడిమికి తాళలేక రాజప్రతినిధి, నాయకులూ, అమాత్యత్రయమూ సమావేశాలను సిమ్లాలో ఏర్పాటు చేశారు.

సిమ్లాలో విమానాశ్రయం లేకపోవడంవల్ల (అంతా పర్వతమయం కనుక) కారులో వెడదామని విమానచోదకుడు నన్ను ప్రోత్సహించాడు; నాకు సీటు కూడా ఏర్పాటుచేశాడు. ఉదయం నాలుగు గంటలకు హోటలు బస విడిచినాను. జీర్ణ గ్రామాల్లోంచి మాకారు వెడుతున్నది. కొన్ని మైళ్ల ప్రయాణించే సరికి ఉషఃకాల మయింది. అంబాలాలో మేము ఛోటాహజ్రీ తీసుకొన్నాము. అక్కణ్ణించి మా కారు హిమాలయ పాదంలో వున్న చిన్న కొండలమీద ప్రయాణించసాగింది. అదే సమయంలో రెండు మోటార్లు మాకన్న ముందుగా పోతున్నవి.— ఎవరివో? అధికారులవి కాబోలునని మొదట అనుకొని తర్వాత వెంటనే ఆ కారులలో జిన్నా ఆయన సహచరులు ఉన్నట్టు గుర్తించాను. ఆయన సిమ్లా చేరీచేరటంతోనే జనం పుష్ప

హారాలతో ఎదురుచూస్తూన్నది. హోటల్ సిసిల్లో మేము దిగి నాము. అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలైంది.

కొండలమీద సిమ్లా ఉన్నది. కొండలన్నీ సతత హరిత భూములతో ఆవృతాలైనవి. ఉన్నతదేశం కనుక సమశీతలంగా వుంది. సిమ్లా బ్రిటీషు పాలక బృందానికి వేసవిలో విహార స్థానం. ఇది ఆంగ్లేయుల షెల్టెన్‌హాం వంటిది. రాజవీధిలో విరివిగా టీషాపులున్నవి. సరిగ్గా 11 గంట లయ్యేసరికి బ్రిటీషు వాళ్లు, భారతీయ మహిళలూ టీ సేవిస్తారు. అక్కడ వున్న క్లబ్బులూ, పచ్చికలో టెన్నిస్ ఆటలూ భారతీయ నాగరకతకు ఇంగ్లండు స్కాట్లెంటుల కానుకలగా ఉన్నై. కొంచెం దూరంలో చెట్లకొమ్మల గుబురుచివర పైసురాయి భవనం కనబడుతున్నది. ప్రముఖులు ఆయనను చూచేవారు నలుగురులాగే రిక్షాల్లో కూర్చుని వెడుతూ వుంటారు. అక్కడ నివాసాల పేర్లు గ్రాస్ మియర్, ఫిర్స్ అనే ఇంగ్లీషు పేర్లులాగ వుంటాయి.

ఈ వలసరాజ్య వాతావరణం రాత్రి పొద్దుపోయాక, వేకువజామున మారిపోతుంది. భారతీయ కార్మికసంఘ నాయకు నితో మాట్లాడి, చీకటిపడిన తరువాత నేను రిక్షాలో బస చేరు కొన్నాను. రిక్షావాళ్లు పాటలుపాడుతూ బండి లాగుతారు. మధ్య మధ్య రిక్షాల గంటమోతలు వినవస్తున్నాయి. పచ్చని రిక్షాదీపాల కాంతిలో రోడ్డుప్రక్క దేవదారు వృక్షాల మొదల్లు పచ్చగా కనిపిస్తున్నాయి. ఏ హారుల్ రషీద్ దగ్గిరికో, అక్బర్ దగ్గిరికో, ఖిల్జీల దగ్గిరికో వెడుతున్నట్టు నాకు తోచింది. పర్వతపాదాన వనాల్లో లోగిళ్ళ దీపాలు మినుకు మినుకు మంటున్నవి.

సిమ్లాచేరిన సాయంకాలమే అక్కడ ప్రకృతి సంపద చూచే అదను లేకపోయింది. ఆనాడే నాలుగుగంటలకు కాంగ్రెస్ అధ్యక్షుడయిన అజాదును చూచేనిమిత్తం అహ్వానం వచ్చింది.

నా హోటలు సమీపంలో అజాదును ఆయన బసలో దర్శించినాను. నా మిత్రుడు హుమాయూన్ కబీరు మా ఇరువురి మధ్య ద్విభాషి. అజాదు హిందూస్తానీలో మాట్లాడినాడు.

ఆయన సిమ్లా సభల విషయం నా అభిప్రాయం గ్రహించాలని ప్రశ్నించాడు. ఆ సమయంలో తొందరపడి నా భావాలను వెళ్ళగ్రక్కటం నా కిష్టంలేదు. నేను భారతీయులకు బాగా తెలిసిన వ్యక్తిననీ భారత స్వాతంత్ర్యం కోరేవాడిననీ ఆయన మెచ్చుకొన్నాడు. నే నెంతమాత్రం ఆసియాఖండ జాతీయతను ప్రోత్సహించనని అజాదుకు తెలుసును.

నేను ఢిల్లీలో బోస్‌దగ్గిర చెప్పిన భావాలే కాంగ్రెస్ అధ్యక్షుడు అజాదుతోకూడా మళ్ళీ చెప్పే అవకాశం లభించింది. ప్రస్తుతం కాలక్షేప గోష్ఠికన్న విషయం ముఖ్యం. ప్రధాన చర్చనీయాంశం నిజంగా ప్రజలు పాకిస్తాన్ కోరుతున్నారా? పన్నుల భారంతో, దుష్కరమైన ఆర్థిక చిక్కుల్లో సతమతమయే ప్రత్యేక రాజ్యం కోరుతున్నారా? అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో ఉంటూనే టెక్సాస్ స్వతంత్ర రాష్ట్రంగా ఉంటున్నది. ఈ సంధర్భంలో కేంద్రానికి కొన్ని అధికారాలు సంక్రమించి ఉన్నప్పటికీ టెక్సాస్ స్వేచ్ఛకేమీ అడ్డుతగలలేదు. అలాగే ఇంగ్లండు స్కాట్లండుల మధ్య ఏసంధి జరిగినా రెండింటికీ ఐక్యత చెడిపోలేదు. కనుక ప్రస్తుతం జాన్‌మార్షలు అమెరికా సంయుక్తరాష్ట్ర

లకు వివరించినట్లు యావద్భారతదేశానికి బలిష్ఠమయిన కేంద్ర ప్రభుత్వం ఏర్పడాలా, అక్కర్లేదా? అనేదే సమస్య.

అమాత్యత్రయం చెప్పినట్టు ఏ అధికారాలు కేంద్రానికి సంక్రమించాలి అనేదికూడా ఏమంత వివాదస్పద విషయంగా కనపడదు. ప్రస్తుతం రాజ్యాంగ వివరణ, అధికార సూత్రీకరణ ప్రధానమైనవి. దేశరక్షణ, విదేశ వ్యవహారాలూ కేంద్రానివే. అయితే ధనవ్యయం దానికి అధికం కాబట్టి ప్రత్యక్ష సుంకాలు వసూలుచేసే అధికారం దానికి ఉండాలి. పోతే రాకపోకల సౌలభ్యం, నీటి సదుపాయాలు ఎవరి అధికారంలో ఉండాలి? టెన్నీలోయను పరిపాలించడం అమెరికా కేంద్రప్రభుత్వం చేతుల్లోనే వుంది. ఆనకట్టలు వ్యవసాయం, విద్యున్నిర్మాణం ఇవన్నీ కేంద్రం ఆజమాషీలోనే ఉండాలి.

నా వ్యాఖ్య శ్రద్ధగా విని అజాద్ కృతజ్ఞత తెలిపినాడు. నేను చెప్పినదంతా కాగితంమీద రాసి ఇమ్మన్నాడు. తరువాత నారచన అమాత్య రాయబారవర్గానికీ, కాంగ్రెస్ వర్కింగుకమిటీ లోనూ ప్రతిపాదించినట్లు నాకు తెలియవచ్చింది.

నేను సిమ్లాలో వుండగా నా మిత్రుడు శుక్లలాల్‌దాస్‌సతి నన్ను జిన్నాసాహేబు దగ్గిరికి తీసుకొని వెళ్ళినది. వారి విడిది గృహం లేక్‌జిల్లాలో ఆంగ్లేయ గృహంవలె వుంది. మిస్ జిన్నా మాకు టీ ఇచ్చింది. సత్కారం తీరంతా ఆంగ్లేయ సమాజంలో గొప్పయింటివారి ఆతిథ్యంవలె ఉన్నది. జిన్నా ఇగ్లండు హాంప్‌స్టెడ్‌లో వున్ననాటి ఇంటి సంగతులు గూర్చి కులాసాగా చర్చించుకొన్నాం.



( లండన్‌లో భారత హైకమీషనర్ సౌజన్యంతో. )

భారత కవయిత్రి, స్వర్లోకవాసిని శ్రీమతి సరోజని నాయుడు



పాకిస్తాన్ విధాత కే. శే. జిన్నా, సోదరి ఫతీమా జిన్నా

సిమ్లాలో రోజురోజూ భౌతిక వాతావరణం మారుతున్నా రాజకీయ వాతావరణంలో మాత్రం ఎట్టి మార్పూ రాలేదు. నా హోటలు విడిచి తోవకు అడ్డంగా నడచి, తోవప్రక్కనే ఉన్న గోడమీదినుంచి కిందికి చూస్తే నిట్రంగా కొండమీద సిమ్లా పట్టణమంతా కనపడుతున్నది. దిక్చక్రంమీద గులాబీమబ్బుల్లాగ హిమాలయాలు విశాల వ్యాప్తములై కనపడినై. అవి త్రివిష్టవ మనే టిబెట్టు బౌద్ధదేశంలో ప్రవేశించడానికి మార్గం ఇస్తున్నవి. ఆ శీతనగ సుందర దృశ్యం మరిచి పోలేను.

# అధ్యాయం 30

ఢిల్లీ తిరిగి రాగానే విందుకు రమ్మని జి. డి. బిర్లా నించి నాకు ఆహ్వానం వచ్చింది. ఇంతకుముందే జె. ఆర్. డి. తాతాను, ఆ మహా సంస్థలో కొందరు ప్రముఖులను నేనుకలుసుకొన్నాను. ప్రపంచ ధనాఢ్యులలో నైజాం తర్వాత బిర్లా ఒకరని చెప్ప వచ్చు. భారతీయ ధనికవాదానికి ఆయనే తార్కాణం. ఆయన సనాతన హిందువు కూడానూ, ఇటీవల కొన్ని సంవత్సరాలనించీ మహాత్మాగాంధీ ప్రభావం బిర్లా దృక్పథం మీద ప్రసార మవు తున్నది. గాంధీ తత్త్వంవల్ల ఆయన ప్రేరేపింపబడుతున్నాడు.

మధ్యాహ్నం ఒంటిగంటకు బిర్లాసుందరభవనం చేరాను. మధ్యాహ్న మండుటెండపూల మొక్కలమీద ప్రసరిస్తున్నది. దివ్యమైన పాలరాతి ద్వారతోరణం దాటి భవనం ప్రవేశించాను. బిర్లా పొడవుగా పల్చగా ఉంటాడు. తెలివైనవాడు. ఎదురొచ్చి సాదరంగా ఆయన నన్ను సమ్మానించినాడు, టేబిలుదగ్గర నౌఖ రులు భోజన ఏర్పాట్లన్నీచేసి మాకోసం వేచివున్నట్టు కనిపిం చారు.

భోజనశాల పక్కగా సరిగా అంతే విశాలమైన గది రక్త వర్ణాలంకృతమై వున్నది. అక్కడ చిన్న చిన్న పీఠములున్నవి. హిందూ దేవతల విగ్రహాలు గోడలకుచేరి ఉన్నవి. ఆయనతో

సంభాషణ చేదామనే ఇచ్ఛతో "ఆ గది దేవతార్చనా మందిరమా?" అని అడిగినాను. బిర్లా ఢిల్లీలో సనాతన హిందూదేవాలయం ఒకటి నిర్మించినట్టు నాకు తెలుసు. అది దేవతార్చనా మందిరం కాదనీ భోజనమందిరమనీ బిర్లా చెప్పినాడు. ఆ మందిరం యావత్తూ భారతీయంగానే వుంది.

బిర్లాకు బొంబాయిలో మిల్లులు చాలా వున్నవి. ఆయన ఆదర్శ జాతీయవాది. మిల్లులున్నచోట పారిశ్రామిక విప్లవం వస్తుందని అనుకోడం కద్దు. అయితే దేశం పారిశ్రామికంగా వృద్ధికానిదే మార్క్సు వర్గీయుల ధనికవాద ఖండనకు చోటు లేదు. పారిశ్రామికంగా దేశం ఆరంభస్థితిలో వుండగా కార్మికోద్యమాలకు, కార్మిక విప్లవానికీ అర్థం లేదు. బిర్లా అన్నాడు: భారతీయులు సగర్వంగా వున్నారని, యుద్ధకాలంలో వస్తువాహన సంపత్తితో వారు పాశ్చాత్యులకు సహాయపడ్డారు. క్షామం అవతరించేసరికి పాశ్చాత్యుల్ని వారు దేహీ అని చేయి చాసి ఆహారధాన్యాలు అడగలేదు.

బిర్లా కనుక అసహాయోద్యమంలో జైలుకు వెళ్ళేవుంటే, ఎంత ధనికుడయినా, అందరితోపాటు ఆయనకూడా నిరశన వ్రతం అవలంబించడం తెలియక పోయేది కాదు. ఆయన శీలం, తీవ్ర జాతీయతను శంకించవలసిన పనిలేదు. భారతదేశం స్వతంత్ర మయినాక బ్రిటీషు వారియెడల కుటిల ద్వేష భావాలు భారతీయులు వుంచుకోరనీ, వైమనస్యాలున్నా సర్దుకుపోతాయనీ బిర్లా చెప్పిన మాటలు విశ్వసించాలి.

మిష్టర్ బిర్లాకు ఒక విషయం చెప్పదలచుకొన్నాను. యుద్ధానంతరం క్షామంవంటి పరిస్థితులు కాకపోయినా తత్తుల్యమైన

కొన్ని కారణాలవల్ల అమెరికా సహాయ్యం అపేక్షించటం వల్ల బ్రిటన్ సగర్వంగా లేనిమాట నిజమే కాని, అగౌరవ పడవల సిందేమీ లేదని చెప్పగలను. కాబట్టి ఇండియాకూడా తన ప్రస్తుత క్షేమ పరిస్థితులనించి బ్రతికి బయటపడేందుకు విదేశాలనించి సహాయ్యం (నిర్నిబంధంగా) వచ్చినంతా స్వీకరించటంలో దాని గౌరవాని కెట్టి భంగం రాబోదని నా వుద్దేశం. యీ సందర్భంలో నాకొక విషయం గుర్తుకు వచ్చింది. లోగడ అంతర్యుద్ధ కాలంలో స్పెయిన్ ప్రజాస్వామిక దేశంలో కరువురాగా ఆనాడు లండన్‌లో స్పానిష్ రాయబారి నా బసకు వచ్చినప్పుడు స్పెయిన్‌దేశం ఆర్మీనియనులవలె ఆత్మగౌరవం చంపుకొని విదేశాల సహాయాన్ని ఆర్థించ జాలదని తెగవేసి చెప్పాడు. తత్కారణంగానే (ఏదేశ సాయం లేని మూలాననే) స్పెయిన్ తన అమూల్యమైన ప్రజాస్వామికత్వాన్ని కోల్పోయి, నేటి నియంతృత్వానిక్ దారితీసింది.

దక్షిణ భారతానికి నాగపూర్ మీదుగా ప్రయాణ చేస్తున్నప్పుడు నాకు ఆతిథ్యం ఇచ్చినవారు, నన్ను రాష్ట్రీయ అమాత్య వర్గంతో పరిచయం కలిగించాలనుకొన్నారు. నేను ప్రధానిని కలిశాను. తక్కిన అమాత్యులు సినీమాకు వెళ్ళారు. ఆ మర్నాడే నేను కూడా సినిమాకు వెళ్ళినాను. అది అమెరికాలో నవీన సినిమా హాలులవలె శీతల వాయు నిర్మితమై వుంది. 'వాల్ ఫేస్' చిత్రములో కార్మెన్ మిరాండా ప్రధాన పాత్ర. ఆట విరామవేళ 'డీప్ ఇన్ ది హార్ట్ ఆఫ్ టెక్సాస్' అన్నపాట మారుమోగుతున్నది, ఆట అయిపోయాక నాగపూర్ రాజవీధిలో ప్రవేశించి అమెరికా టెక్సాసును, మిరాండాను మరిచిపోయాను. ఆ సమయంలో భావి భారతౌచిత్యానికి తార్కాణ

అన్నట్టు ఆకాశంలో తారకలు వుజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. రోడ్డుమీద ఎడ్లబళ్ళ సవ్వడి వినవస్తుంది. రైతాంగం పొలాల నించి వారి గుడిసెలకు చేరుకొనే ఉత్సాహంలో వున్నారు. మధ్య పొదల్లో కీచు పిట్టల కూనిరాగాలు ప్రారంభిస్తున్నాయి. ఇదంతా భారతీయ ప్రకృతి సంపద.

తిరువాన్కూరులో నాకు ఒక మధ్య తరగతి భారతీయ మిత్రుడు విందు చేశాడు. భారతీయంగా తయారు కాబడిన పంటకాలన్నీ వడ్డించబడినాయి. కాని ఇంటి ఆడవారు సహ పంక్తికి సిగ్గుపడ్డారు. అందువల్ల మేమే (మొగవాళ్ళం) కింద పీఠలమీద కూర్చుని ఆకులు ముందుకు లాక్కున్నాము. ఆకుల్లో అన్నంతోపాటు గుమగుమలాడు మసాలాలతో తయారుకాబడిన కూరలూ, పచ్చళ్లూ చాలా రకాలు వడ్డించ బడినాయి. అన్నీ ఒక్కసారి తినడం కష్టం కాబట్టి ఒక్కొక్కటే వేళ్ళమీద తీపీ కారం తీసి రుచి చూశాను. మా ప్రక్కనే రెండు గ్లాసుల పళ్ళరసం పెట్టబడగానే భారతీయ వాతావరణమే మారి పోయింది. వాటిలో రెండు చెమ్చాలు కూడా వుంచబడినాయి. తర్వాత గదిలో విద్యుద్దీపం క్రింద కులాసాగా భోజనం చేస్తూ రాజకీయాలూ, నాగరకతలూ చర్చించుకొన్నాము.

బిర్లా భవనంలో విందు ఆంగ్ల పద్ధతిగా, మహారాజ మందిరాలలోవలె కృత్రిమంగా వుంది. ఇది భారతీయ జీవితం కాదు. భారతీయులు నేలమీద పడుకొంటారు. నేలమీద వంట చేసుకొంటారు. నేలమీద భుజిస్తారు. గోమయంతో నేల అలుకుతారు, వారికి అత్యాశలు లేవు. వారి దృష్టి భౌతికం కాదు.

పోతే భారతదేశంలో ధనవంతుల మందిరాల్లోనే భోగమూ విలాస ప్రియత్వమున్నూ కానవస్తాయి.

కారులో భారతదేశంలో వందలకొద్ది మైళ్ళు నేను సంచారం చేస్తున్నప్పుడు గమనించాను — భారతీయులకు కుటీరాలుచాలు శీతోష్ణాలకు అనువుగా తల దాచుకోడానికని, పాటలీ పుత్రం లాంటి మహా పట్ణాలు కూడా దారు నిర్మితాలు. ప్రస్తుతం ఆ నగరం రూపులేకుండా సికస్తయి పోయింది. భారతీయ జీవన విధానం అతి నిరాడంబరమైంది.

భౌతిక తృష్ణలు పెరిగినప్పుడు, అతి సంచయేచ్ఛ ఉన్నప్పుడు భౌతిక విజ్ఞానం నాగరకత తత్ఫలం. భారతీయ కర్షకుడు ఆశాపాశ వర్జితుడు కాడు. ఆశలు కలవాడేనని బిర్లా అనవచ్చును. భారతదేశ సమస్య ప్రజానీక దారిద్ర్యం కాదు. అల్ప జీవన ప్రమాణమే ప్రధాన సమస్య. ఆ జీవన ప్రమాణాభివృద్ధికైన భారతీయుల ఆశలు స్వల్పమైనవి. కుటుంబ జీవనంలో ఇంటి పెద్ద ఆర్జన చేస్తాడు. తక్కినవారు అతని మీద అధారపడతారు. ఈ సరళ జీవిత పద్ధతి పాశ్చాత్యులకు కిట్టదా ?

పాశ్చాత్యుల నాగరకతా సంస్కారభావం ఈజిప్షియనుల, ఫారవోల జ్ఞానంనుంచి వచ్చింది. ఫారవోలు సింహాసనాధిష్ఠితులై నైలునది వరదలైనప్పుడు విలోకించి అధికారం ఏర్పరచుకొన్నారు. నాగరకతను యుగాల తరబడి నిర్మించారు. భారతీయ నాగరకతారంభము ద్రావిడుల ప్రకృతి ఉపాసన నుంచి గ్రహించినట్టు కనపడుతుంది. ఆ ద్రావిడ ప్రకృత్యుపాసకులకు శాక్తేయంతోనూ సాలగ్రామంతోనూ నిమిత్తం లేదు.

విశ్వేశ్వరుడూ బుద్ధుడూ పరస్పర వ్యతిరేకులు. ఫారవో వీరందరికన్న విలక్షణమయిన శక్తి సంకేతం. విశ్వనాధుడివలె ఫారవో ఆసిరిస్ శక్తికి సంకేతం. కాని విశ్వనాధుడు కామాతీత శాశ్వత శక్తి, అతడు కాళీవలెకాక కాలాన్ని వశంచేసుకొన్న వాడు. ప్రకృతిని జయించినవాడు. ఫారవోమూర్తి పాశ్చాత్యు డికి ఆదర్శ ప్రతీకం. దానినుండే పురోహిత, సీజరు, విజ్ఞాన శాస్త్రం అనే మూర్తులు మూడూ ఉద్భవించినాయి.

భారతీయులకు శక్తిమహత్వాకాంక్ష మీద ఆసక్తి లేదా? లేక చారిత్రక దృష్టికి బదులుగా తాత్త్వికదృష్టివల్లనే భారతీయులు అదృష్టవంతులా?

అందరూ కాకపోయినా కొందరయినా తాత్త్వికచింతన వల్ల అదృష్టవంతులు. అందుకు గాంధీ నిదర్శనం. బిర్లా భౌతిక ఆధ్యాత్మిక సమన్వయం చేసుకొన్నవాడేమో. ఈ నాగరకతకు ఏది ప్రమాణం? చిత్రాలా? కార్మెన్ మిరాండా? గాంధీగారా? ప్రజారంజనంగా పాలించే సర్వహితైషనియంతృత్వాన్ని ఈ యుగంలోనూ కోరేవాళ్లు ఉంటారా?

# అధ్యాయం 31

అఖిలాసియా మహాసభ 1947 మార్చి నెలలో జరుగుతున్న సందర్భంలో సభ్యులకు ఢిల్లీలో చరిత్రాత్మక మందిరాలు చూచే అవకాశం ఏర్పాటయింది. మామూలు పద్ధతిగా మార్గదర్శకుడు చూపుతూ చెబుతూవుంటే పురాతన ప్రదేశాలు దర్శించడం నాకు బొత్తిగా గిట్టదు. అందుకనే నేను ఒంటరిగా హుమయూన్ గోరీ చూడాలని నిశ్చయించుకొని వెళ్ళినాను.

హుమయూను గొప్ప పండితుడు. ఖగోళ జ్యోతిషశాస్త్రవేత్త, ఆయన బాబరు కుమారుడు. అక్బరుకు తండ్రి, ఆయన గ్రంథాలయ భవన సోపానములు దిగుతూవున్నప్పుడు మృత్యుముఖంలో జారి పడినాడు. అతని భార్య హమీదా బనో బేగం భర్తృ స్మృతికిగాను గోరీ కట్టించింది.

ఈ గోరీలోనే మొగలుల్లో చివర పాదుషా తూర్పు ఇండియా వర్తక సంఘంవారి సైనికులవల్ల తరుమబడి సిపాయిల స్వాతంత్ర్య యుద్ధంలో 1857 లో దాగినాడు. ఇలా దాగినవాళ్ళను బైటకులాగి ఇంగ్లీషువారు కాల్చివేశారు. ప్రాగ్దేశాల విషయంలో పశ్చిమదేశాల వైఖరి ఆరోజుల్లో

అంత క్రూరంగా ఉండేది. చిట్ట చివరికి మొగలు పాదుషాను బ్రిటిషువారు బంధించి ఖైదీగా సింగపూరు పంపినారు.

మేము ప్రాచీన మందిరాలు, భారతీయ శిల్పాలంకార శోభిత సరోవరాలు చూస్తూ, విపులమైన వేదిక సమీపించాము. ఆ వేదిక క్రమంగా జెరూసలంలో ఓమర్ మసీదువలె ఉన్నతమై గోళాకారమై రక్తశిలా నిర్మితమై మొగలాయీల శిల్పసంపదను చాటుతున్నది. భవన ప్రవేశం చేసేముందు ద్వారతోరణం మీద స్వస్తికాది చిహ్నములు చూచినాను.

ఈ మందిరాగ్రాన అట్టాలిక మీదనుండి చూస్తే ఢిల్లీ మైదానం యావత్తూ పాతకోట, ఎర్రకోట, యమునానది ఇసుక తిన్నెలూ కనపడతవి. భారత చరిత్ర యావత్తూ ఈ ప్రాచీన భవనాల రూపంలో ప్రత్యక్షం.

నే నెప్పుడూ అన్వేషణ చేస్తూనే ఉంటాను. నా జీవితాన్ని పరామర్శ చేసుకొన్నాను. నేను భారతదేశం ఎందుకు వచ్చాను? జటిలమైన రాజనైతిక జీవన సమస్యల పరిష్కారంకోసం మహాత్మ్యుణ్ణి సందర్శించటానికి వచ్చాను. పాశ్చాత్య రాజకీయ వేత్తల కుటిల కుతంత్రాలవల్ల యుద్ధోన్మాదం చేలరేగి వరదలై పారుతున్న రక్త స్రవంతుల నించి, మానవత్వం యావత్తూ మారణహోమం అవుతున్న పశ్చిమ ఖండంనించి శాంతికై వచ్చినాను. తృతీయ ప్రపంచ సంగ్రామాన్ని నివారించే శాంతి మార్గాన్వేషణకై వచ్చాను. ఈ సమస్యకు సమాధానం మహాత్ముని ఆశించే వచ్చాను. హిట్లర్, స్టాలిన్, చర్చిల్, ట్రూమన్ వంటి రాజకీయ దురీణత్వం ఆయన దగ్గర లేక పోయినా, ఆయనే యదార్థమైన శాంతివాది, సత్యవాది.

చాలా కవిత అల్లాలనుకొన్నాను. అందుకు నాలో చాలా కవితా భావాలు వున్నాయి. కాని తీరికగా కూర్చొని కవిత చెప్పే కాలం కాదు ఇది. అసలు సమస్యాపరిష్కారం అయితేగాని నాకు విశ్రాంతి లేదు. నా కలానికి శాంతీ లేదు.

హుమయూన్ గోరీనించి చూస్తూవుంటే అది భిన్న సంస్కృతి సమ్మేళణ కారణంగా ఉద్భవించిన కళామయ ఖండంగా కనబడింది. ఎంత సుందరమైన భవనం! ఢిల్లీలోకల్లా రమణీయ మందిరమదేనేమో! ఆ శిల్పంలో విశ్వవిఖ్యాత తాజ్‌మహల్ నిర్మాణంలో వలెనే భారతీయప్రభావం చాలా వుంది. నిర్మాణంలో చక్కని ప్రమాణమూ ప్రశాంతీ కనబడతవి. శిల్పసౌందర్యంలో పరమేశ్వర సత్త రూపొందింది. ప్రాణ విలాసం కనపడుతున్నది. శాంతి గోచరిస్తోంది. బ్రహ్మ విగ్రహంలో కూడా ఇట్టి శాంతిసందేశం కానరాదు. బ్రాహ్మణ మతపురుషార్థాలు ఉత్తమంగా దేవాలయాల్లో పరిస్ఫుటం కావు. ఇక్కడ మందిరంలో భావం వ్యక్తమవుతున్నది.

హిందూధర్మం ఇస్లాంకన్న సంస్కృతికీ లలితకళా వికాసానికీ ప్రోద్బలం ఇచ్చినమాట యదార్థం. ఆ మత ప్రచారం రామకృష్ణ మిషన్ చేస్తూనేవుంది. ప్రచారకులు సాధనసంపత్తిని గురించి చెబుతారు. తాంత్రిక హఠయోగాది సాధనాలు నే నెరుగుదును. ఇలాంటి సాధనలవల్ల ప్రజ్ఞలు కలుగతవేకాని ఆధ్యాత్మికంగా ఔన్నత్యం కలగనేరదు.

ఉపనిషత్తులూ వేదాంతమూ ఘనమైనవి. జీవుడు 'నేనే బ్రహ్మ' ననే దశకు వస్తాడు. మానవునిలో ఈశ్వరత్వము

అహంకారంగా పరిణమించకూడదు. ఇస్లాంలో సత్యాన్వేషణ చేస్తూ దానిని కనుగొన్నాను. బాబరు వంశీయులయిన ఇరానీయులు తాత్త్వికులు కారు. సమ్యక్‌దృష్టి కలగడానికి కారణం భారతీయ తత్వశాస్త్రంవల్ల కాదు, ఇరానీయులు కావడంచేతనూ కాదు.

వైట్‌హెడ్ పండితుడు తన 'ఎడ్వాంచర్స్ ఆఫ్ ఇండియా' అన్న గ్రంథంలో ఇస్లాం ధార్మిక సంప్రదాయాన్ని బట్టి జగత్తు అల్లా సంకల్పారోపణమే అంటాడు. జగత్తులో నియమ క్రమాలకు కూడా అల్లా ఇచ్ఛ కారణమట. మహాయాన బౌద్ధతత్వంలో ఈశ్వర ధర్మము సర్వవ్యాపకమున్నా సమవాయ సంబంధం కలదన్నీ. బ్రాహ్మణ తత్త్వంలో జగత్తునందు పరమేశ్వరుడు అనుస్యూతంగా సర్వవ్యాపకుడై అధిష్ఠాన సత్తగా ఉన్నాడు.

ఇలాంటి ఈశ్వర భావాన్ని అల్లాఅనే పేరటనో లేదా సృష్టికి అతీతమయిన కర్త అనే పేరుతోనో తోసివేయడానికి వీలులేదు. మహమ్మదీయ సిద్ధాంతం కూడా సర్వవ్యాపక పరమేశ్వర భావాన్ని దృఢంగా చెప్పదని 'షీత్' సంప్రదాయం వల్ల స్పష్టపడుతోంది. క్రైస్తవుల అవతారవాదం మహమ్మదీయుల నిరాకృతిని అంగీకరించదు. క్రైస్తవంకూడా బ్రాహ్మణ తత్త్వం వలెనే త్రిమూర్తి తత్త్వ ప్రతిపాదకం. క్రైస్తవంమీద గ్రీకుల సర్వవ్యాపక జ్ఞానప్రభావం కూడా ఉంది. సెంట్‌జాన్ ఉపదేశాన్ని బట్టి క్రైస్తవం శాశ్వత పరమార్థాలను గణన చేస్తుంది. 19 వ శతాబ్దిలో క్రైస్తవంలో ఎన్నో సంఘర్షణలు (సంకరార్థోత్పత్తి వల్ల) వచ్చినవి. తత్ఫలితంగా క్రైస్తవంలో

జొహన్నీయ సంబంధమయిన క్రాంతదర్శిత్వము సృష్టిలోనూ చరిత్రలోనూ లోపించింది. చాలామంది ప్రొటస్టంటులు సంకరార్యజాతికి చెందినవారు. యూనిటేరియనులు సంపూర్ణంగా ఆర్యజాతీయులు. జొహన్నీయ సందేశంవల్ల క్రైస్తవం బ్రాహ్మణ మతానికి సన్నిహితం కావడంలోమాత్రం యూనిటేరియనులు బుద్ధిపూర్వకంగా నిర్లక్ష్యం చేస్తారు.

బ్రాహ్మణుడు పుణ్యపాపాతీతమయిన దైవత్వాన్ని ప్రబలం చేస్తూ, నిరపేక్ష నిరాకార చిన్మాత్రం వరకూ వెడతాడు. పుణ్యపాప సంఘర్షణ ఇస్లాం బాగా గుర్తించింది. అంతేకాక మైస్టిక్ అనే యోగీశ్వరుడు యదార్థానికీ ఆభాసకూ, శాశ్వతవస్తువుకూ క్షణికవస్తువుకూ, అహంకారానికీ ఈశ్వరత్వానికీ అంతరం సాపేక్ష్యంగా చూస్తాడు. కేవలం నిర్గుణమయిన సర్వాతీత తత్త్వం మైస్టిక్ యోగిపుంగవులకు రుచించదు. యూదీయ సూఫీయోగుల విషయంలోనూ అంతే. బ్రాహ్మణ మతం అద్వైతతత్త్వ ప్రతిపాదకం. సర్వనానాత్వాలకూ ఆభాసలకూ అనుస్యూతమై సర్వవ్యాపకమై అధిష్ఠానమయిన సత్తనే బ్రాహ్మణతత్త్వం ప్రతిపాదిస్తుంది. ఇలా ప్రతిపాదించేసరికి నివృత్తికి దారితీసినట్లే. ఇస్లాం ద్వైతధర్మ ప్రతిపాదకం. జగత్తును శుద్ధంచేసే నిమిత్తముగా, అల్లా ఇచ్ఛగా చెబుతూ ముసల్మాన్ కత్తి దూస్తాడు. దాని మూలాన ఇస్లాంమతంలో అసహిష్ణుత బలిసిపోతుంది. నిజానికి మైస్టిక్కుల అనుభవమూ నైతిక సాధనమున్నూ సమన్వయం చేస్తే తత్త్వ పరిష్కారమవుతుంది.

# అధ్యాయం 32

హుమయూన్ సమాధి భవనాంతస్తునుంచి నేను ఎండలో మాడు తున్న మైదానం చూస్తున్నప్పుడు నాలో పరస్పర విరుద్ధాలైన భావాలు ఎన్నో ఉద్భవించినవి. సమ్యక్ బుద్ధిగలవాళ్లు మాత్రమే విచారణ చేసి అట్టి యోచనలన్నింటినీ క్రమబద్ధం చేస్తారు. సిద్ధాంతం చేస్తారు. నేను రాయబోయే భావాలు కొన్ని మాసాల పాటు యోచన చేసినవి.

జటిలమైన ప్రస్తుత మతసమస్య సామాన్య మానవుని మతజీవిత విధానం ఎటువంటిదని? ఈ సందర్భంలో ఋషీశ్వర యోగీశ్వరుల బ్రహ్మానుభవం సామాన్య ప్రజలకు నిష్ప్రయోజనము. సామాన్యులకు ఆధ్యాత్మిక, వేదాంత, మనోవైజ్ఞానిక విషయాలు అనుపయుక్తములు. మతాలు ఉద్ఘాటించిన పుణ్య పాపాలు నిత్య జీవితయాత్రలో ఎంతవరకు సామాన్యప్రజలు తెలుసుకొని పవిత్ర జీవితం గడుపుతున్నారు? లేక నిత్య జీవ యాత్ర ఏ ధర్మ సూత్రాన్ని అనుసరించి ప్రజలు గడపవలెను? ఇవే ప్రధాన సమస్యలు.

మహాత్ముడు ఒక్కడే ఈ సమస్యా పరిష్కారంచేసి సామాన్య మానవుడికి సలహా ఇవ్వగల మహనీయుడని నా నమ్మకం. హిట్లరు స్టాలినులు ఆయుధం చేబట్టి లక్షలాది

ప్రజలను వధించి, రక్త స్రవంతులు ప్రవహింపజేసి, రాజ్యాంగం నడిపినారు. అలాకాకుండా అహింసాయుత విధానం అవలంబించి దిగ్విజయం పొందిన రాజకీయవాది మహాత్మా గాంధీ! ఫాసిజం, కమ్యూనిజం అనే సిద్ధాంతాల సంకుల సమరంలో భగవంతుడి అస్తిత్వం అసలే మసికొట్టుకుపోతున్న నేడు, మహాత్ముడే అనుభవపూర్వకమయిన శాంతి సందేశాన్ని లోకానికి ఇవ్వగలిగిన మహా స్రష్ట: ఆయన అమర సందేశం అహింసలో దైవికప్రేమ, పవిత్ర త్యాగమూ గర్భితమయి ఉన్నాయి. అహింసవల్ల మానవుడు సుశిక్షితుడై, సత్యారాధకుడై, జీవితాన్ని సత్యానికే అంకితం చేస్తాడు. ఇలా చేయడం సులభమా? ఆచరణ సాధ్యమా? భారతీయ యోగిపుంగవుల్లో మహాత్ముడు కూడా ఒకడు—అంతేనా? అందరికన్న తెలివైన రాజనీతి విశారదుడు మాత్రమేనా? మార్క్స్ పక్షీయులన్నట్టు గాంధీగారు పైకి మాత్రం ఫకీరా? అదేనా ఆయన ఇచ్చే అనుభవపూర్వక తత్వ సందేశం? ఆయన సందేశం భారతీయమేనా? లేక విశ్వజనీనమా?

నేను తోవ మళ్ళినాను. రక్తవర్ణ సోపానాలు దిగి నిశ్చల తటాకాల పార్శ్వాన ప్రయాణంచేసి నా కోసం వేచివున్న మిత్రబృందాన్ని కలిసి మొగలాయీ రాజధానీ పథం పట్టినాను. ఢిల్లీ ప్రవేశించేలోగా నిజాముద్దీన్ ముస్లిం భక్తుని మందిర క్షేత్రాన్ని దర్శించవలసి వచ్చింది.

నేను ఆ మందిర యజమానికి అతిథిని. ఆయన పేరు పీర్ జమీన్. నిజాం అంటే మహంసు. ఆవేళ నావంటి పన్నెండు మందిని ఫలహారానికి ఆయన ఆహ్వానించినాడు. ఆ మందిరా

వరణలో నిజాం ఉద్దీన్ మతాధిపతుల సమాధు లున్నవి. కొంత గోష్ఠిచేసిన తరువాత అతిథుల వినోదార్థం ఏర్పాటు చేయబడిన సంగీతమూ నాట్యమూ చూచి సంతోషించినాను. నౌఖరులు వీవనలతో మాకు విసిరినారు మందిరావరణలో.

గాలీబ్ కవీశ్వరుని సమాధి పక్కగా నడిచినాము. ఈ నిజాముఉద్దీన్ క్షేత్ర దర్శనార్థం ఈజిప్టునుంచి కూడా భక్తులు వస్తారు. పీర్ నిజాం చాలా ప్రముఖుడు. ఆయనను నేను మొదట సర్వజాతుల సమ్మేళనలో ఢిల్లీలో చూచాను. ఆయన మతానికి చేసిన సేవ అంతగా లేకపోవచ్చును కాని ఆయనలో మానవ కారుణ్యం, ప్రబలతర సత్కారేచ్ఛలే చెప్పుకోతగ్గవి. ఆయనకు అల్లా ఆయురారోగ్యాలు ప్రసాదించాలి.

# అధ్యాయం 33

నేను ఢిల్లీ తిరిగి రాగానే నాకు కాశీలో మిత్రుడూ, గాంధీజీ శిష్యుడూ అయిన డాక్టర్ ఘోష్ కానుకగా ఇచ్చిన గ్రంథం బైటికి తీశాను. దాని పేరు "హింద్ స్వరాజ్" (రచన మహాత్మాగాంధీ) దానిలో, అంత చిన్న గ్రంథంలోనే గాంధీ తత్త్వం యావత్తూ నిక్షిప్తీకృతమయి ఉన్నట్టు లార్డ్ లోథియన్ నాతో ఒకసారి అన్నాడు. అది అక్షరాల యదార్థం.

ఆ పుస్తకం ఎందుకు బైబిలువలె మతగ్రంథంవలె ఉన్నదో? ఆ గ్రంథ రచయిత ఎలాంటివాడో? బ్రిటీషువారు ఆయన రచనవల్ల ఎందుకాశ్చర్యపడతారు? - నేనురాస్తున్నాను పరిశీలించండి.

1869 అక్టోబరు 2 వ తేదీన పోర్‌బందర్‌లో ఒక కోమటింట మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ఆరుగురు సంతానంలో కడసారి శిశువుగా జన్మించినాడు. ఆయన తండ్రీ కరంచంద్ గాంధీ రాజకోట సంస్థానానికి దివాన్‌గా ఉండేవాడు. ఆయన తాతగారు కూడా పోర్‌బందర్‌లో దివాన్‌గిరీ చేశారు.

అలాంటి ఉన్నత వంశంలో జన్మించినాడు గాంధీ. గాంధీకి భారత సంప్రదాయరీత్యా పితృభక్తి గాఢమని ఆయన జీవితచరిత్ర వల్ల విశద మవుతున్నది. అయినా మాతృ

ప్రభావమే ఆయన జీవితంలో ఎక్కువగా కనపడుతుంది. మాతృ ప్రభావమేకాక దాది ఆయనకు చిన్నతనంలో శ్లోకాలూ పద్యాలూ నేర్పేది. బ్రాహ్మణ విమర్శకుల ప్రకారం, గాంధీ తల్లి హిందూవైష్ణవి అయినా భర్తపోయాక ఒక జైన సన్యాసి బోధవల్ల జైనం స్వీకరించినది.

భారతదేశంలో క్రైస్తవంకన్న జైనమతానుయాయుల సంఖ్య స్వల్పము. జైనం సన్యాసానికి ప్రాధాన్య మిస్తుంది. క్రీ. పూ. 6, 7 శతాబ్దాల్లో బుద్ధుని కాలంలో బౌద్ధంవలెనే, ఘూర్జరదేశంలో జైనం ఉద్భవించింది. క్రీ. పూ. 6వ శతాబ్దిలో మహావీరుడు ఈ జైనమతాన్ని స్థాపించాడు. జైనం కర్మకలాపాలను తోసివేసింది. అది పశుహింస, యజనయాజనాలు విసర్జించి, ఆత్మత్యాగానికే ప్రాధాన్యం ఇచ్చింది. ఆత్మత్యాగమే అహింస, సర్వజీవ సంరక్షణము, హింసా విసర్జనము. అదే జైనమత ప్రధానాశయం.

ఈ జైనప్రభావం గాంధీ తల్లిమీద బాగా ప్రసరించినట్లు కొందరు వక్కాణించి చెబుతున్నారు. తత్ఫలమే గాంధీకీ జైనానికీ దగ్గర చుట్టరికం కుదిరిందంటారు. జీవరక్షణమూ సర్వజీవ సమాదరణమూ గాంధీకి ప్రీతిదాయకాలు. ఆయన అహింసా సిద్ధాంతం హిందూధర్మంలోనూ బౌద్ధంలోనూ కూడా ఉన్నై. అంతలోనే దానిని గాంధీజీ జైనంనుంచే స్వీకరించాడని చెప్పటం ఉచితమేనా? కావచ్చు. ఎందుచేతనంటే ప్రాచీనకాలంలో జైనులు బ్రాహ్మణులవల్ల హింసించబడ్డారు. ఆ జైన వాతావరణంలోనే మహాత్ముడు సనాతనధర్మ వ్యతిరేకిగా పెరిగినాడు. ఆయన ఎప్పుడూ సనాతన వైదికధర్మానికి వ్యతిరేకమే.

పసివాడైన గాంధీ బుద్ధిమంతుడే అయినా తప్పుచేసి నప్పుడు లజ్జపడేవాడు. పసితనంనుంచీ ఆయనలో పట్టుదల హెచ్చు. ఏదయినా నైతిక ధర్మసూత్ర విషయంలో ఆయన పట్టుదల మరింతా ద్విగుణీకృతమయేది. ఆయన జీవితాంతం వరకూ దానిని ఆచరణలో పెట్టటం విశిష్ట లక్షణం. స్వీయ చరిత్రలో ఆయన తన పాఠశాలా వృత్తాంతం ఉల్లేఖించినాడు. ఒకసారి పాఠశాల తనిఖీకోసం స్కూళ్ళ ఇన్స్పెక్టరు వచ్చి, క్లాసులోవున్న గాంధీని ఒక ఇంగ్లీషు మాటకు వర్ణక్రమం చెప్పమన్నాడట. గాంధీ తప్పు చెప్పినాడు. ఆ ప్రక్కనేవున్న ఒక విద్యార్థి సాయంచేయగా ఆ విద్యార్థి పుస్తకం తొంగిచూచి కాపీచేయటానికి గాంధీ ఇష్టపడలేదు. సరికదా ప్రధానోపా ధ్యాయుడు కనుసైగచేసినా తప్పు సవరించుకోలేదు.

గాంధీలో ఈ మహత్తర నైతిక సూక్ష్మవివేచన ఎప్పుడూ ఉంటూనేవుంది. ఈ సూక్ష్మమయిన అంతరంగ పరిశీలనము చాలామంది తపోధనుల్లో, భక్తుల్లో, యోగుల్లోనూ ఉంటుంది. ఈ విలక్షణ నైతిక పరిశీలనవల్లనే ఆయన నేడు ప్రపంచంచేత మహాత్ముడనిపించుకొంటున్నాడు, మహా యశస్వి అయినాడు.

అగస్టయిన్ భక్తాగ్రణి 'కన్ఫెషన్సు' అనే స్వీయ చరిత్రలో స్వయంకృతాపరాధములు రచించినాడు. అదేతీరుగా గాంధీ స్వీయ జీవితకథలో పొగతాగడము, మాంసాహారం మొదలయిన చిన్న పెన్నా అపరాధాలన్నీ రాసుకొన్నారు. ఇలాంటి దోషాలు అమానుష రాక్షసప్రవృత్తిగా అయన భావించి, అలాంటి పాపాల జోలికి ఎన్నడూ పోనేపోనని దీక్ష

పట్టినాడు. పాపాలు అంతరాత్మను వేధించడంవల్ల ఆయన వాటికి దూరంకావలెనని శపథం పట్టినాడు. భారతదేశంలో జైన ప్రభావంవల్ల మాంసాహారం పరమదోషమని ముఖ్యంగా గుజరాతులో జనులు భావించేవారు. మాంసాహార విషయంలో పసితనంలో గాంధీ పొరపడినాడు. అన్నిదేశాలకన్న భారత భూమిలో మాంసాశనం జాస్తీగా నిషేధిస్తారు. గాంధీ అన్న గారి స్నేహితుడు మాంసం తినవలసిందని బోధచేసినాడు. దానివల్ల దేహం గట్టిపడుతుందనీ, బ్రిటీషువారిని అవలీలగా దేశంనుంచి గెంటివేయవచ్చుననీ ఆ మిత్రుని సలహా. ఆ మిత్రుడే స్వయంగా ఒకనాడు సొమ్ము చెల్లించి గాంధీని వేశ్య వాటికలో వ్యభిచారానికి ప్రోత్సహించినాడు! అప్పుడు చెడ్డవారితో చెలిమి కూడదని తల్లి ఆయనకు పరిపరివిధాల చెప్పినది. కేవలం మిత్రుణ్ణి సంస్కరించాలని ఆయనతో సానివాడకు వెళ్ళానని గాంధీజీ తల్లికి సమాధాన మిచ్చాడు.

ఈ విద్యార్థి దశలో నెయ్యమూ, అనుభవమూ కలసి గాంధీజీకి భావిప్రపంచంలో "శక్తపురుష" పీఠాన్ని ప్రసాదించినై. అంతేకాదు వాటి ప్రభావం ఆయన భావిజీవితంమీద కూడా బాగా ప్రసరించిందనే చెప్పాలి.

భక్తులూ యోగులూ సంఘానికి దూరంగా తటస్థులై ఉంటారు. వారు ప్రజాస్వామ్య వాదులవలె సమాజంతో కలసి పోలేరు. గాంధీ స్వీయచరిత్రలో ఇలా రాస్తున్నారు: "సంస్కర్త సంస్కరించదలచే వ్యక్తితో కూడా కలిసిమెలిసి ఉండలేడు. జగత్తులో నిజమైన విశ్వమైత్రి ఆత్మీయమైనది. అది అపూర్వము, స్నేహం సజాతిలో అధికం. మిత్రుల్లో అది

అన్యోన్యాశ్రితము. స్నేహితుల్లో సంస్కారానికి వుండే అవకాశం బహు తక్కువ - ఒకరి దోషాలు ఒకరు ఎంచుకోరు కనుక. అతిపరిచయంలో అందుకే సంస్కరణకు తావులేదు. కాబట్టి అతిపరిచయము విసర్జనీయ మంటాను. మానవుడు అవలీలగా పాపాచరణకు సిద్ధమవుతాడేకాని, పుణ్యకార్యా చరణకు సిద్ధపడడు. భగవంతుని నెచ్చెలి ఏకాంతం కోరేవాడై ఉంటాడు. లేదా విశ్వమంతా అతని మిత్రము "

గాంధీజీ 'ప్రేమ' కేవల కామవాసనా విలసితం కాదు. శ్రేయాన్ని కోరినప్పుడో, ఈశ్వరుణ్ణి వరించినప్పుడో హృదయో ద్భవమయిన శుభంకరభావమే యదార్థ ప్రేమము. అది ఏకాంత యోగాన్ని, సాధననూ అడ్డగించదు. మహాత్మునికన్న రాగద్వేషా తీతుడు మరొక్కడు ఉండడు.

బాల్యజీవితంలో మరోరెండు ఘటనలు ఆయన శీలాన్ని తీర్చి దిద్దినవి. స్వల్ప విషయాలే, చదువులూ ఆటపాటలూ పిల్లల నడవడిలో గొప్పమార్పు తీసుకొస్తవి. ఒకసారి గాంధీ హరిశ్చంద్ర నాటకం చూచి ముగ్ధుడయినాడు. నాయకుడు సత్య దీక్షితుడై మహాత్యాగం చేస్తాడు. నాటకప్రభావం ఆయన్ని అమితంగా ఆకర్షించింది. నాటినించీ ఆయనలో సత్యవ్రతం ప్రబలమైంది. ఆయనకు మాంసాహారం స్వీకరించ ఇచ్ఛలేదు. గుజరాతులో మాంసాశనం సహజంగా నిషేధిస్తారు.

పెద్దలయెడ ఆయన భక్తిశ్రద్ధలు అలవరచుకొన్నాడు. అదే ధర్మసూక్ష్మం. స్వీయచరిత్రలో గాంధీ ఇలా రాసు కొన్నారు—"నేను పెద్దలయెడ విధేయత నేర్చాను. వారి మంచిచెడ్డలు నేను వివేచన చేయదలుచుకోలేదు."

పదహారేళ్ల రాకపూర్వమే ఆయన కస్తూరిబాయిని పెళ్లాడి ఇంటివాడయినాడు. ఆయన తండ్రి పెద్దకుమారునికీ, గాంధీకీ, తన సోదరునికీ ఏకముహూర్తములో మూడు పెళ్ళిళ్ళూ, ఖర్చు కలిసి వస్తుందని, కానిచ్చేశాడు. కొంతకాలానికి తండ్రి చావు బ్రతుకుల్లో ఉండగా గాంధీ చూడటానికిరాక నాటిరాత్రి భార్యతో అనంగరంగ సంగ్రామంలో పడినాడు. అందువల్ల తండ్రికి అంత్యకాలంలో ఆయన సేవ చేయలేదు. అదే రాత్రి తండ్రి దివంగతుడైనాడు. గాంధీ దృక్పథంలో బ్రహ్మచర్యనిష్ఠ ఆయన బాల్య వివాహంతో నిర్ణీతమైంది. పితృసేవ సకాలంలో చేయలేనందుకు సిగ్గుపోయినాడు. తల్చితల్చి దురపిల్లినాడు. అనుభవాలంటే ఇటువంటివే—అల్పమైనా ఇవన్నీ ఆయన శీలాన్ని తీర్చి దిద్దగలిగినవి. ఆయన ఇంద్రియ వ్యాపారంలో సంయమము ఏర్పడడానికి కారణం ఈ స్వల్పానుభవాలేనని వక్కాణించక తప్పదు.

# అధ్యాయం 34

తండ్రి పోయాక గాంధీ కుటుంబస్థితి ఆర్థికంగా బాగాలేదు. బొంబాయిలో ఫేషనలూ, ఖర్చులూ అధికం కావడంవల్ల భావ నగర్‌లో శ్యామలదాస్ కళాశాలలో చేరి మెట్రిక్యులేషను పూర్తి చేసుకొన్నాడు. కాని, కాలేజీచదువు ఆయనకు నచ్చలేదు. ప్రొఫెసర్లు విద్యార్థుల ఉత్సాహాన్ని రేకెత్తించరు. కాగా గాంధీకి చదువులో ప్రోత్సాహం లేకపోయింది.

దృఢమయిన నడవడికితోడు అదృష్టదేవత కూడా అప్పట్లో ఆయనపట్ల అనుకూలంగా వుంది. గాంధీ కుటుంబానికి తరుచుగా సలహాలిచ్చే బ్రాహ్మణ మిత్రుడొకాయన వున్నాడు. ఆయన యువకుడైన గాంధీతో "నీ తండ్రీ తాతగారు దివాన్‌గిరీ చేశారు. ఆ పదవికోసం తాపత్రయ పడమని నా సలహా" అన్నాడు. కాలం గడుస్తున్నకొద్దీ దేశంలో మార్పులు వస్తూ ఉండటంవల్ల ఆంగ్లవిద్యాభ్యాసం ఘననీయమైనదని భారతీయులు ముఖ్యంగా పెద్దకుటుంబీకులు తలచారు. ఐతే అందుకు భారత దేశంలో కాలేజీచదువు అంత హితవుగా వారికి తోచలేదు. "మా కుర్రవాడు కేవలరాం, ఇంగ్లండులో బారిష్టరు ప్యాసు కావటం చాలా సులభమని అంటాడు." అని ఆ విప్రుడు ఒక నాడు పలికినాడు.

గాంధీ జ్యేష్ఠ సోదరుడు ఈర్ష్యా ద్వేషరహితుడు. సోదరుడు బారిష్టరుకావడం ఆయన సంపూర్ణంగా సమర్థించాడు. అన్నివిధాలా అంగీకరించాడు కూడా. కాని గాంధీ దాయాది మాత్రం అంగీకరించలేదు. లండను వెళ్ళేవాళ్లు కులభ్రష్టు లవుతారని ఆయన పూర్ణవిశ్వాసం. అయినా ఆయన గాంధీని ఇంగ్లండు వెళ్ళవద్దని గట్టిగా నిరోధించలేదు. ఎవరేమన్నా తల్లి అంగీకారమే గాంధీకి ప్రధానం. ఆయన ఆమె అనుజ్ఞ వేడినాడు. తల్లి జైనసన్యాసి సలహా అర్థించింది. ఆయన ఇలా అన్నాడు: "కుర్రవాడు మూడు శపథాలు చేయాలి; మత్తుపదార్థాలు సేవించననీ, మాంసాహారం పుచ్చుకోననీ, స్త్రీ వ్యసనానికి గురికానని, అలా అతను వాగ్దానంచేసి ఇంగ్లండు వెళ్ళవచ్చును." గాంధీ ఈ సలహాను శిరసావహిస్తానని శపథం చేశాడు. ఆ తర్వాత ఇంగ్లండు ప్రయాణం స్థిరపడింది. ఖర్చులనిమిత్తం గాంధీ భార్య నక్కట్టులో కొంత తెగనమ్మవలసి వచ్చింది.

ఈ ఇంగ్లండు ప్రయాణం చాలా హడావిడి చేసింది సమాజాన్ని. దానిలో ఒకసంఘటన చాలా ముఖ్యమైనది. బొంబాయిలో గాంధీ శాఖవారైన బనియాలు ఏకమై సభచేసి ఇంగ్లండువంటి అవినీతికి ఆలవాలమయి తావుకు ఎవరు ప్రయాణంచేస్తారో, వాళ్ళను వెలివేయక తప్పదని నిశ్చయించి, కులపెద్దగావున్న ఒక ప్రముఖ శ్రేష్ఠి గాంధీతో నయానభయాన చెప్పినాడు సముద్రం దాటకూడదని. కాని గాంధీ ఆయన మాట పెడచెవిని పెట్టడంవల్ల ఆయణ్ణి వెలివేశారు.—స్పినోజావంటి తత్త్వవేత్తను వెలివేసినట్టు శ్రేష్ఠులంతా గాంధీని పంక్తిబాహ్యుణ్ణి

చేశారు. నాటినించి మోహన్‌దాస్ దివాన్ కుమారుడుగానే కాక కడజాతివానివలె జీవయాత్ర సాగించాడు.

సెప్టెంబరు 4వ తేదీ 1887లో గాంధీ 18వ యేట బొంబాయి రేవులో భార్యనూ, పిల్లవాణ్ణీ విడిచి ఇంగ్లండు ప్రయాణమైనాడు.

లండనులో గాంధీ ఆదివారం విక్టోరియా హోటల్లో తెల్లని ఫ్లానల్ సూటుతో ప్రవేశించినాడు. స్టీమరులోనే అనుభవమైంది—మాంసాహారం విసర్జించి ఇంగ్లండులో జీవయాత్ర కష్టమని. అయితే అదృష్టవశాత్తు డాక్టర్ పి. జె. మెహతా గాంధీని వచ్చిననాటి సాయంకాలమే కలిసి లండన్ వాతావరణం తెలియజెప్పి ఇక్కడ పెద్దవాళ్ళను 'సర్' అని సంబోధించవద్దనీ, అలా సంబోధించే వాళ్లు సేవకులనీ విశదపర్చినాడు.

బసకోసం ఆయన ఊరంతా గాలించారు—విక్టోరియా హోటలుకన్న చౌకగా అద్దెకు దొరుకుతుందేమోననీ, శాకాహారం లభ్యమవుతుందేమోననీ. నోట్లో నాలుకలేని గాంధీ తన కష్టసుఖాలు ఈ పరాయి దేశంలో కొత్తవాళ్లతో ఎలా చెప్పుకోగలడు? "మాతృప్రేమ నన్ను వెంటాడిస్తూనే వుంది. రాత్రి కన్నీళ్లు కపోలాల జారి సోనలైపోయేవి. ఇంటిపట్టున తీయని స్మృతులతో మనసు ఊగిపోయి నిద్రలేకుండా పోయేది. ఇక్కడ నా కష్టంలో భాగం పంచుకొనే వాళ్లెవరు?"

భావికాలంలో మహాత్ముడయ్యే మోహనదాసు పట్టువిడువలేదు. "మూడేళ్లు చదువుకోవాలని నా అంతర్వాణి పలుకుతున్నది." ఆయనకు తిండి గిట్టలేదు. వంటచేసే ఆమెకు ఎలా

చేసిపెట్టాలో, ఏమిచేయాలో మొదట్లో తెలియలేదు. హాస్యాస్పదమయిన చిక్కులోనుంచి శుభం చేకూరింది. రిచ్‌మండ్ ఆన్ థేమ్స్‌లో వున్న నా మిత్రుడు ఇలా అన్నాడు; చదువురాని పరాయిదేశ విషయం ఎరగని తల్లియెదుటచేసిన శపథానికి విలువ యేముంటుంది? అదో వాగ్దానమా? ఎన్నటికీ కాదు...."

గాంధీ రిచ్‌మండ్ నుండి వెస్టుకెన్‌సింగ్‌టన్‌కు బసకోసం వెళ్ళినాడు. ఆ వసతి యజమానురాలు గాంధీని కనిపెట్టి చూచి ఆదాయాన్ని బట్టి, కేవలం శాకపాకాలే చేసి పెడతానన్నది. చిట్టచివరకు ఫారింగ్డన్ వీధిలో మోహన్‌దాస్ గాంధీ శాకాహారం లభ్యమయ్యే హోటలు కనుగొన్నాడు. ఆహార శ్రద్ధతోపాటు ఆయన సాల్టుదొర రాసిన 'శాకాహార సిద్ధాంతం' అనే గ్రంథం కొని పఠించినాడు. అంతేకాదు లండనులో భోగట్టాచేసి గాంధీ శాకాహారుల సమితిలో నెమ్మదిగా సభ్యుడైనాడు. కొంత కాలానికి ఆయన ఆ సంఘానికి కార్యదర్శికూడా అయినాడు. సభలకు హాజరవుతూ కార్యకర్తగా వ్యవహరించినాడు. లండన్ వంటి మహా రాజధానీ నగరంలో అదే ఆయన ప్రథమోద్యోగ పర్వము!

మాంసాహారం సుతరాం ఇష్టంలేకపోవడంవల్ల ఆయనను చూచి లండనులో మిత్రులు విభ్రాంతచేతస్కు లయినారు. ఆహారశాలల్లో గాంధీని చూచి ప్రజలు తెల్లపోయేవారు. ఈ దృశ్యాలన్నీ జ్ఞాపకం చేసుకొని ఆయన స్వీయచరిత్రలో ఇలా రాశారు—"నేను అసాధ్యమయిన పనికి పూనుకొన్నాను. అకస్మాత్తుగా ఆంగ్లేయుడనై పోవాలని" ఆయన షోకయిన సూటు కొన్నాడు. రంగురంగుల సీతాకోకవన్నెల కాలరు,

గీరల నెక్టై, సిల్కుహాట్ పందొమ్మిది షిల్లింగులకు కొన్నాడు. బాండ్ వీధిలో పది పౌనులకు ఈవినింగ్ సూటు కొన్నాడు. రోజూ అద్దంముందు నిలవబడి నవీనపద్ధతిలో క్రాపు దువ్వు కొంటూ టై సవరించుకొంటూ పదినిమిషాలకాలం అందుకు వినియోగించేవాడు. "తయారయిన నెక్టై పెట్టుకోడంకన్న టై వేసుకోడం అనే కళ నేర్చుకొన్నాను" అని జీవితకథలో ఆయన రాసుకొన్నాడు.

గాంధీ వేషానికితోడు ఫ్రెంచిభాష అభ్యసించేందుకు 3 పౌనులు, నాట్యంకోసం, ఫిడేలు తరిఫీదుకు మూడు పౌనులు, ఆరంభలో వక్తృత్వం నేర్చుకోవాలని గిన్నీ ఖర్చుపెట్టినాడు. బెల్ రాసిన 'స్టాండర్డు ఎలొక్యూషనిస్టు' అన్న గ్రంథం కొన్నాడు—వక్తకావాలని. గాంధీ "బెల్ రాసిన పుస్తకం నన్ను గాభరాపెట్టింది" అని స్వీయచరిత్రలో రాసుకొన్నాడు. నాట్యం నేర్చుకోడంవల్ల పెద్దమనిషితరహా వస్తుందా? "నా శీలం వల్లనే నేను పెద్దమనిషి అవుతాను." డ్యాన్సుకు తను పనికిరానని గాంధీ నిశ్చయించుకొన్నాడు. ఆయన మొదట మంచివక్త కాడు. ఫిడేలువాయిద్యం అంతకన్నా రాదని గుర్తించి ఆ పాఠాలకు ఆయన ఉద్వాసన చెప్పినాడు. అన్ని అభ్యాసాలు మానేసినా "చాలా కాలందాకా వేషధారణలో అత్యంతశ్రద్ధ మాత్రం తీసిపోలేదు." అని ఆత్మకథలో గాంధీ రాసుకొన్నాడు.

జవహరులాల్ నెహ్రూకు అబ్బిన హారో పాఠశాలా లక్షణాలు గాంధీ అలవరచుకోలేక పోయినాడు. అయితే ఆయన భారతీయ హృదయంతో ఐక్యానుసంధానం చేసుకోగలిగినాడు, అదే ఆయన స్థిరమైన నడవడిలోని పటిమ.

బ్రిటీషు న్యాయవాది కాదలచిన గాంధీ కృషి కొనసాగుతూనేవుంది. విందులు తప్పడం లేదు. అప్పుడప్పుడు పరీక్షలు ప్యాసయ్యేవాడు గాంధీ, పేపర్లుతేలికగా ఉండడంవల్లా, దిద్దేవాళ్ళ ఔదార్యంవల్లా. 'ఇన్నర్ టెంపిలు' విందుల్లో గాంధీ ద్రాక్షరసం సేవించక పోవడంవల్ల ప్రసిద్ధుడయినాడు. తోటి విద్యార్థులు ఆయన వాటా పుచ్చుకొనేవారు. శ్రద్ధాపూర్వకంగా లాటిన్‌లో రోమక న్యాయచట్టం చదివేవాడు. ఆ చదివింది తరువాత దక్షిణాఫ్రికాలో ఆయన వకీలుగా ప్రాక్టీసు చేస్తూండగా బాగా ఉపయోగపడింది.

1891వ సంవత్సరం జూన్ 10వ తేదీన గాంధీ వకీలు అయినాడు, పట్టా వచ్చింది. 11వ తేదీన హైకోర్టులో బారిష్టరుగా పేరు నమోదు చేయించుకొన్నాడు. 12వ తేదీన యస్. యస్. అస్సాం నౌకలో మూడు మూర్తులా ఆంగ్ల న్యాయవాద ప్రముఖుడై భారతదేశం వచ్చినాడు. ఆ విధంగా ఆయన జీవిత కథలో రెండో అధ్యాయం ముగిసింది.

# అధ్యాయం 35

మోహనదాస్ గాంధీ భారతదేశం వచ్చాక శేషజీవితం జిల్లా అటర్నీగానో, ఉన్నత స్థానికోద్యోగిగానో బహుశా గడపవలె ననుకొన్నాడు.

అటర్నీకి ఆయన అంతగా పనికిరాడు. ఆయనకు భారతీయ ధర్మశాస్త్రం ఏమంతయినా తెలియదు. ఫ్రెడరిక్ పింకట్టు గాంధీకి భారతేతిహాసం తెలియదని ఆయనకే జ్ఞాపకం చేసినాడు. మొదటిసారి బొంబాయి స్మాల్ కాజ్ కోర్టులో కేసు వాదించ వలసి నప్పుడు గాంధీజీకి సభా కంపం వచ్చింది. వెంటనే గాంధీ కేసు పకేలుకు ఇచ్చేశాడు. వకీలు జీవయాత్ర చేయగలనా అని సందేహం పట్టుకొన్నది ఆయన్ని. ఆరు మాసాలయిన తరువాత ఆ యువ న్యాయవాది బొంబాయి నుండి రాజకోట వెళ్ళి పైసా రాలని పిటీషనులు బీదసాదలకు రాసిచ్చేవాడు. ప్రాక్టీసు సరిగా లేక పోవడంవల్ల ఆయనకు ఉత్సాహంగా లేదు. అనుకోకుండా ఆయన దరిద్ర ప్రజకు సహాయ్యం చేస్తూ వారివారి కష్టసుఖాలు గ్రహించ గలుగుతున్నాడు. ఫ్రెడరిక్ పింకట్టు ఒక్కడే గాంధీకి హితోపదేశం ఇచ్చినవాడు. ఋజు మార్గంలో కష్టపడినవాడు విజయం పొందకతప్పదన్నాడు—మిష్టర్ పింకట్టు.

గాంధీకి అదృష్టం కలిసివచ్చింది. పోర్‌బందరులో దాదా అబ్దుల్లా కంపెనీవారు గాంధీ అన్నగారికి ఉత్తరం రాశారు. తమ కంపెనీ తాలూకు 40,000 పౌన్లదావా ఒకటి దక్షిణాఫ్రికాలో నడిపేందుకు సమర్థుడైన లాయరు కావాలని. ఈ అపరిచిత దేశంలో వ్యాజ్యం నడపడానికి గాంధీ వెడతాడా? ఖర్చులూ ప్లీడరు ఫీజూ యావత్తూ కంపెనీవారే భరిస్తారు. ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చి రెండో పర్యాయం ఆయన మాతృదేశం విడిచిపెట్టినాడు. ఆయన స్వదేశానికి రాకమునుపే కీర్తి స్థాపితం కావాలి. లెనిన్‌వలె గాంధీ యశస్సు విదేశంలోనే స్థాపితమైంది. 1893 ఏప్రిల్‌లో సాహస కార్యోద్యుక్తుడైనాడు గాంధీ.

ఆయన నేటాలులో అడుగు పెట్టీపెట్టడంతోనే సంఘటించిన ఒక సంఘటనవల్ల ఆయన పేరు పత్రికల్లోనూ, ప్రజా హృదయంలోనూ మారుమోగింది. అది తలపాగాకు సంబంధించిన విషయం. ఆ ఘటనతో గాంధీ దక్షిణాఫ్రికాలో రంగు జాతుల సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. దావాలో కూడా అదే సమస్య ప్రాధాన్యం వహించింది.

ఆఫ్రికాలో అబ్దుల్లాసేట్ గాంధీని డర్బాన్ కోర్టుల తీరూ తెన్నూ చూపడానికి తనకూడా తీసుకొని వెళ్ళినాడు. గాంధీ ఆ సందర్భంలో తలపాగా ధరించినాడు. మేజిస్ట్రేటు తలపాగా తీసివేయమని హుకుం జారీ చేశాడు. దానికి గాంధీ అంగీకరించక రోషంతో కోర్టు విడిచిపెట్టాడు. స్థానికంగా 'అరబ్బీలు' అన బడే ముసల్మానులయితే కోర్టులో పాగా పెట్టుకోవచ్చును. అక్కడి ఆచారం అది. కాని భారతీయుల్ని ముఖ్యంగా

హిందువుల్ని దక్షిణాఫ్రికాలో నిమ్న జాతులకింద పరిగణిస్తారు. చాలామంది హిందువులు అయిదేళ్ళ అగ్రిమెంటు మీద కూలీ నాలీ చేసేనిమిత్తం దక్షిణాఫ్రికాకు వచ్చినవారట. అందుకని వాళ్ల కోర్టులలో తలపాగా ధరించటానికి అనర్హులట.

ఐరోపీయనుల సూటు వేసుకోమనీ, అలా వేసుకొంటే తగాదాలు రావనీ గాంధీతో అబ్దుల్లా అన్నాడు. కాని గాంధీ మాత్రం తలపాగా పెట్టుకోగా అందరూ ఆయనను హోటలు పనివాడను కొన్నారు. వార్తా పత్రికల్లో రంగుజాతుల భేదాన్ని ఖండిస్తూ గాంధీ పత్రికలకు లేఖ వ్రాయగా దానికి సమాధానం గగ్గోలుగా బయలుదేరింది. తలపాగా పెట్టుకోడం భారతీయుల్లో గౌరవతా సంపాదకం. అది భారతీయ జాతీయ చిహ్నం కూడానూ.

ప్రిటోరియాలో గాంధీ రైలు ఎక్కేసరికి మళ్ళీ ఇదే సమస్య నూతనరూపంలో ఎదురైంది. ఆయన ఫస్టుక్లాసు టికెట్టు తీసుకొన్నప్పటికీ పెట్టిలో కూర్చోడానికి వీలులేక పోయింది. బండిలోని తెల్లవాళ్ళు గాంధీని దిగమని గద్దించారు. కాని ఆయన నిరాకరించగా బలవంతంగా కిందకు లాగివేశారు. చివరకు పోలీసు జవానుకూడా బారిష్టరయిన గాంధీని గదమాయించినాడు. ఇక ప్రయాణించేసే వీలులేనందున స్టేషనులో వెయిటింగ్ రూమ్‌లో రాత్రి గడిపినాడు. రైల్వే నిబంధనల ప్రకారం ఆయన బెడ్డింగుకు 5 షిల్లింగులు చెల్లించేవుంటే ఏ సంఘటనా జరిగేది కాదు. ఆయన తన బిచాణా ఉందికదా అని సొమ్ము చెల్లించలేదు.

మర్నాడు రైల్వే జనరల్ మేనేజరు ఫోనులో ఉదహరించిన నియమావళిని బట్టి గాంధీ ఛార్లెస్టవునుకు ఫస్టుక్లాసులోనే

ప్రయాణించినాడు. అయితే ఆ రాత్రి ఆయన బెడ్డింగు ఫీజు చెల్లించాడు. జహాన్నిస్‌బర్గు వెళ్ళే కోచ్‌లో ఇలాంటి పరిస్థితినే మళ్ళీ ఆయన ఎదురుకొన్నాడు. ఆయన కూర్చున్న సీటు బలవంతాన ఖాళీచేయక తప్పిందికాదు! జహాన్నిస్‌బర్గులో దిగి ఒక హోటలు గదిలో బసచేసినాడు. అక్కడ ఒక భారతీయ మిత్రుడు గాంధీతో ఇలా అన్నాడు—"ఏంచేయంబాబూ! మేము ఈ దేశంలో ఇలాగే బ్రతుకుతున్నాం; పొట్టపోసుకోడానికి తిట్లు తింటూ ఉన్నాం — ఆత్మగౌరవాన్ని కూడా చంపుకొని."

ప్రిటోరియాలో మరొక సంఘటన! ఫస్టుక్లాసు పెట్టెలో ఆంగ్లేయుడు కాని తెల్లవాడు ఎవడు కూర్చున్నాసరే పర్వాలేదు. కాని నల్లవాడు మాత్రం ఆ పెట్టెలో ఎక్కడానికి వీలులేదు. అప్పుడు అమెరికావారి హోటల్లో ఒక నీగ్రోజాతీయుడు గాంధీకి బస ఏర్పాటు చేశాడు. అమెరికావారికి వర్ణద్వేషం కాస్త తక్కువ కనుక, అన్యజాతివారిని దగ్గరికి రానిస్తారు. అందు వల్లనే గాంధీకి వారి హోటల్లో తావు దొరికింది.

'కూలీల ప్లీడరు' అనే పేరుతో గాంధీ జీవయాత్ర ఆరంభించాడు. ఆరంభంలో ఆయనకు ఆంగ్లేయుల సహకారం లభ్యమయింది. ఆఫ్రికాలో కొన్ని జాతులవారు అమానుషంగా ప్రవర్తిస్తారని గాంధీ గ్రహించినాడు. ఆయన నిర్ణీతాభిప్రాయానికి రావాలి. లోకంలో జాతుల సమస్య పరిష్కారం కావాలి. "నేను నా హక్కులకై పోరాడనా? స్వదేశానికి చక్కాపోయేదా? లేక ప్రిటోరియాకు వెళ్ళి అవమానాలు లక్ష్యం

చెయ్యక కేసు వాదించనా? నా పని పూర్తిచేయకుండా మాతృ భూమికి మళ్ళీ పోవటం పిరికితనమే అవుతుంది. కనుక నేను ఎదుర్కొనే కష్టాలు ఎన్నైనాకానీ లక్ష్యపెట్టను. ఈ కష్టాలు జాతి సమస్య వల్లనే వస్తున్నవి. ఈ విద్వేషం పారదోలడానికి పాటుపడాలి, ఎన్ని కష్టనష్టాలకు గురిఅయినా సరే" అని స్వీయచరిత్రలో ఆయన రాశారు.

# అధ్యాయం 36

గాంధీ లండనులో వున్నప్పుడు ఆయనకూ ఆంగ్లేయులకూ సన్నిహిత సంబంధం ఏర్పడింది. శాకాహారుల సమితిలో ఆయన అందరితో సమంగా బాధ్యతగల వ్యక్తిగా వ్యవహరించేవాడు. వెంటనర్, బ్రైటన్ నగరాల్లో విచ్చలవిడిగా విహరించే యువతీ మండలిని చూచి వివాహితుడయిన గాంధీ తత్తరపడక, అతి చాకచక్యంగా శీలం కాపాడుకొంటూ వ్యవహరించడం, అక్కడ వనితలకు విపరీతాశ్చర్యము కలిగించింది.

ఆంగ్లేయుల ఆచార వ్యవహారాలేకాక వారి మతతత్త్వ సిద్ధాంతాలతో గాంధీ బాగా పరిచయము కలిగించుకొన్నాడు. నిజానికి ఆంగ్లేయ దివ్యజ్ఞాన సామాజికుల ద్వారానే మొట్టమొదటి సారిగా ఆయన సర్ ఎడ్విన్ ఆర్నాల్డు అనువదించిన గీతను మూలంతో సరిపోల్చుకొని పఠించినాడు. ఆ భగవద్గీతే రానురాను ఆయన సత్యాన్వేషణకు అద్భుతంగా ఉపకరించింది.

దివ్యజ్ఞాన సామాజికులతో ఆయన కలవడానికి ఇష్టం లేకపోయినా బిసంటు సతీమణి హిందూధర్మంయెడల గాంధీకిగల సంకుచిత భావాన్ని తొలగించింది. క్రైస్తవ మిషనరీల దుష్ప్రచారంవల్లనే హిందూధర్మం మూర్ఖవిశ్వాసాలకు మూలకందమని

గాంధీ భ్రమపడినాడు. తనచిన్నతనంలో తండ్రిదగ్గిరికి బ్రాహ్మణ జైన, పారశీక, ముసల్మానులు వస్తూపోతూ వుంటే గాంధీకి క్రైస్తవ మిషనరీలయెడ జుగుప్స బయలుదేరింది. దానికి తగిన కారణం లేకపోలేదు. క్రైస్తవం స్వీకరించినవాళ్లు మాంసం తినడం మద్యపానం చేయడం, కాగా వాళ్లు మిషను బడుల్లో పిల్లలకు మతబోధపేరిట హిందూధర్మాన్నీ దేవతలనూ తిట్టడం వల్ల గాంధీకి క్రైస్తవంపట్ల రోత కలిగినమాట వాస్తవం. మిషనరీల వాదం ఆయనకు సుతరాం కిట్టకపోయినా, ఏమత విశ్వాసమూ గాఢంగాలేక నాస్తికతవైపుకే తనమనసు మొగ్గుతూ వుండేదనేవాడు. ఏది ఎలావున్నా "సమస్తానికి నైతికసూత్రం ప్రధానమనీ, సర్వ నైతిక సారమూ సత్యమేననీ, సత్యం బాధ్యతారహిత నిర్లిప్తతకు ఛుక్కెదురనీ" ఆయన అచంచల విశ్వాసము.

ఇంగ్లండులో గాంధీ సహృదయుడైన ఒక క్రైస్తవుణ్ణి కలిసినాడు. ఆయన మాంచెస్టర్ నివాసి. ఆయన శాకాహారి, మద్యపానం కూడరాసిదని బోధించేవాడు. ఆయనే బైబిలు చదువమని గాంధీని ప్రోత్సాహ పరచినాడు. పాతనిబంధనలోని వాచకము చదివితే ఆయనకు ఆవలింతలతో నిద్ర కమ్మగా పట్టిందట. అయితే కొత్త నిబంధన మాత్రం ఆయనకు వెలుగు దారి చూపింది.

"నిజంగా నాలో కొత్త నిబంధన జాగృతి కలిగించింది. 'సెర్మన్ ఆన్ ది మౌంట్' చదివిన తరువాత నా సంతోషం పట్టశక్యం కాలేదు. గీత నా అధ్యాత్మికతను గాఢం చేసింది. టాల్‌స్టాయి రాసిన 'ది కింగ్‌డం ఆఫ్ గాడ్ ఈజ్ విధిన్ యూ'

అన్న గ్రంథం నా ఆధ్యాత్మికతకు స్థిరత్వం ఇచ్చింది." అని స్వీయ చరిత్రలో గాంధీ వక్కాణించాడు.

ఆయన బైబిలులో 'సెర్మన్ ఆన్ ది మౌంట్' నూ, గీతాశ్లోకాలనూ సమన్వయం చేయబూనుకొన్నాడు. 'బ్రాడ్లా' శ్రాద్ధసమయంలో గాంధీ ఒక క్రైస్తవ హేతువాదితో నాస్తికతను గూర్చి తర్జనభర్జనలు చేశాడు. అప్పుడు ఆయన కేవల శాస్త్ర జ్ఞానంకన్న మతానుభవం కూడా వాంఛనీయమని గుర్తించారు. తరువాత కొన్నాళ్ళకు గాంధీ కార్డినలు మానింగును కలవడం సంభవించింది. మానింగు కార్మిక నాయకుడు. 1890 లో ఆయన పారిస్ ప్రదర్శనానికి వెళ్ళి నగరంలో పాతచర్చి భవనాలు వీక్షించి ఇలా అన్నాడు: "చర్చిల గాంభీర్యమూ ప్రశాంతీ అవిస్మరణీయం. దేవమందిర నిర్మాణానికి లక్షలాదిధనం వ్యయం చేసినవారు తప్పక భక్తులూ భగవంతుణ్ణి ప్రేమించేవారే."

దక్షిణాఫ్రికాలో మహాత్ముడు కాబోయే గాంధీ మత విషయాలను గురించి సాంగోపాంగ తర్కవితర్కణకు చక్కని తరుణం లభించింది. ఆయన ఒక కాథలిక్ మిషనరీనికలిసినాడు. అబ్దుల్లా సేటుగారి అటార్నీ ఏ. డబ్ల్యూ. బేకర్ కూడా మతధర్మ ప్రచారకుడే. ఆ అటార్నీకి కాల్వనిస్టుల విశ్వాసం ఉండేది: "శాశ్వత శాంతి పొందడానికి భగవన్మానస పుత్రుడయిన ఏసునే ప్రార్థించాలి." గాంధీ సంప్రదాయారీత్యా వైష్ణవం అనుసరించినా ఆయనకు అవతారవాదం మీద నమ్మకం ఉండేది. ప్లిమౌత్‌లో 'సోదర విశ్వాస' సమితి వారితో ఆయన సమావేశమవుతూ వచ్చినాడు. దానివల్ల ఆయన గ్రహించింది ముక్తికి ఈశ్వరాను

గ్రహము అవసరమని. మతానుభవమూ, నైతికానుభవమూ దానికి పర్యాయపదాలని ఆయన నమ్మిక.

గాంధీ వినయంగా, దృఢవిశ్వాసిగా బేకరుతో తన స్థితి ఇలా వివరించినాడు : "నేను జన్మతః హిందువును. అయినా నాకు హిందూమతం గురించికాని, మరేయితర మత విషయం గాని అట్టే తెలియదు. నిజానికి నా విశ్వాసం, నా స్థితీ, నా ఉనికీ నాకే అగమ్యగోచరంగా ఉంది. అందుకనే స్వధర్మమయిన హిందూమతం ఏమిటో, ఇతర మతాలతోపాటు బాగా తెలుసుకోవాలని నా మనసు ఆరాటపడుతోంది."

ఆ కారణంచేతనే క్వాకర్లతో, బేకర్ సంఘాలతో ఆయనకు అంత ఘనిష్టమైన సంబంధం ఉంటూ వచ్చింది. ఆయన తన జీవితకథలో ఇలా రాసుకొన్నాడు: 'క్రైస్తవుడే మోక్షార్హుడనటం నేను సుతరాం విశ్వసించను. ఏసుమాత్రమే భగవన్మానస పుత్రుడంటే అంగీకరించను. త్యాగబుద్ధికి చూస్తే క్రైస్తవులకన్న హిందువులే అత్యధికులు. హిందువుల లోట్లు నా కంటికి కనబడతాయి. హిందూధర్మంలో అస్పృశ్యత ఒక భాగమే అయితే అది కేవలం దోషదుష్టము. వేదాలు అపౌరుషేయాలు బ్రహ్మనిశ్వసితాలే అయితే బైబిలూ కొరానూ మాత్రం ఎందుకు కావు ?"

ఈ విషమస్థితిలో రాయ్‌చంద్‌భాయ్ అనే గాంధీజీ భారతీయ మిత్రుడు గాంధీకి ఇలా సలహా ఇచ్చినాడు : "నిష్పాక్షికంగా చూస్తే ప్రపంచంలో ఏమతమూ గంభీర సూక్ష్మ తత్త్వ సమన్వితం కాదు ఒక్క హిందూమతం తప్ప. ఆత్మానుసంధానంలో నైతేనేమి, త్యాగంలో నైతేనేమి హిందూ

ధర్మం సర్వోత్కృష్టము, సూక్ష్మము, గంభీరమైనది." ఛార్లెసు ఫిలిప్సు అనే 'రంగుజాతుల' మతాధిపతి-ప్రచారకుడున్నూ, రివరెండ్ జోసెఫ్ జె. డోక్ అనే జ్ఞానస్నానకుడు (బాప్టిస్టు) న్నూ గాంధీకి సత్యాన్వేషణా తత్పరత కలిగించారు.

1909 లో జె, డోక్ ప్రప్రథమంగా గాంధీజీ గురించి 'ఏన్ ఇండియన్ పెట్రొయిట్ ఇన్ సౌత్ ఆఫ్రికా' అనే గ్రంథాన్ని రచించాడు. అదే సంవత్సరంలో హెన్రీ పోలక్‌చే రచింపబడిన గాంధీజీ జీవితగాథ ఇండియాలో ప్రచురించబడింది. రాయచంద్ అనే దృఢశీలంగల మార్వాడీ ప్రముఖుడు గాంధీజీకి అందరికంటే సన్నిహితుడైనాడు. ఆయన ప్రభావం గాంధీ మీద అత్యధికమైంది. కాగా రాయచంద్ గాంధీజీ గురువై, ప్రబోధాత్మకమైన కవి ముక్తానందుని భక్తిరస దోహాలను నిత్యమూ గానం చేసేవాడు. ఆ దోహాల్లో భావమిది: "పరమేశ్వరుణ్ణి నా దినచర్యలో ఎప్పుడు దర్శిస్తానో, అప్పుడు కృతార్థుణ్ణి."

గాంధీమీద తమ ప్రభావం ప్రసరింపచేసిన మరో ఇద్దరు వ్యక్తుల్ని గాంధీ స్వయంగా కలుసుకోలేదు. కాని వారి గ్రంధాలను దక్షిణాఫ్రికాలో ఉండగా ఆయన పఠించాడు. అందులో మొదటిది కోట్సు ఇచ్చిన 'ది కింగ్డమ్ ఆఫ్ గాడ్ ఈజ్ విథిన్ యూ' అనే టాలుస్టాయి విరచిత గ్రంథం, దాన్నిగూర్చి మహాత్ముని అభిప్రాయ మిది: "స్వేచ్ఛాపూరిత యోచనకూ, ప్రగాఢ నైతిక సంపదకూ, సత్యనిష్ఠకూ ఈ గ్రంధం అన్ని గ్రంధాలకన్న నాకు బాగా ఉపకరించింది." ఆయన రెండవతూరి దక్షిణాఫ్రికా వచ్చినప్పుడు, జోహన్సుబర్గునించి డర్బాన్ ప్రయాణిస్తున్న సమయంలో

హెన్రీ పోలక్‌చే ప్రసాదితమైన రస్కిన్ రచన 'అన్ టు ది లాస్టు' అనేది రెండవ గ్రంథం. ఇది తన జీవితమంతటినీ మార్చివేసిన మహత్తర గ్రంథమని గాంధీజీ వ్రాసినారు. థోరే థోరు రాసిన 'సివిల్ డిసొబిడియను' ప్రభావంకూడా గాంధీజీ మీద బాగా పడిందనే చెప్పాలి. శ్రీమతి పోలక్‌చే నిర్వహింప చేసిన స్త్రీ జనరోద్ధరణ మొదలు ఆయన ప్రతి ఉద్యమంలోనూ దాని ప్రభావం గోచరిస్తుంది.

పురానుభవాల్లో రెండు విషయాలు స్పష్టంగా గాంధీజీ జీవితకథలో కనబడతవి. వాటిలో మొదటి విషయం—గాంధీ భారతీయాచార్యుడయినా తొలిజీవితం విదేశాల్లో గడపడం వల్లనూ, గ్రంథాలవల్లనూ, ఆయన భావం పాశ్చాత్య ప్రభావితమైంది. ఆయన మతోత్సాహం ఇంగ్లండులో ప్రదీప్తమై దక్షిణాఫ్రికాలో రూపుదాల్చింది. ఆయన జీవితాన్ని తీర్చిదిద్దిన గ్రంథం కేవల కొత్తనిబంధనేకాక గీతా, టాలుస్టాయి రస్కినుల గ్రంధాలూ, తులసీరామాయణం ఇవికూడా అందుకు సహకరించినవి.

రెండోవిషయం–వృత్తిరీత్యా ఆయన న్యాయవాదయినా, ఆచరణవల్ల విఖ్యాత రాజనీతివేత్తయినా గాంధీజీ నైతిక దర్మోపదేష్టగా ప్రముఖుడు, అందువల్లనే ఆయన సన్నిహిత మిత్రులైన క్వాకర్లూ, మిషనరీలు, సి. యఫ్. ఆండ్రూస్ వంటివారు రాజనీతి వేత్త లీ విషయం గాంధీలో చూడరు. అజ్ఞానులైన పాశ్చాత్య రాజకీయ వాదులు కొందరు గాంధీని ఏ ఫకీరుగానో, మోసకారిగానో లేదా తమవలె సూక్ష్మబుద్ధిగల రాజనీతివేత్తగా పరిగణిస్తారు. ఆయనను సరిగా గ్రహించినవాళ్ళల్లో లోధియన్

ప్రభువు, లార్డు హాలిఫాక్సు, సర్ స్టాఫర్డు క్రిప్సు వంటివారు ముఖ్యులు. వారు కూడా క్రైస్తవ మతచింత. ధర్మనిష్ఠగలవాళ్లు కాబట్టి గాంధీజీ యదార్ధ మనస్తత్వాన్ని అర్థం చేసుకోగలిగారు.

మా పరిశీలనలో మరోవిషయం గ్రంథాంతంలో సాకల్యంగా మనవిచేస్తాం. మహాత్ముడు గీతనూ బైబిలునూ సమన్వయం చేయబూనుకొన్నాడు. అతిశయోక్తిలేకుండా చెబితే ఆయన జీవన పరమార్థం. ఆయన అమరసందేశం ఈ సరస సమన్వయమనే చెప్పాలి.

# అధ్యాయం 37

దాదా అబ్దుల్లా కేసు గెల్చింది. గాంధీ ప్రోద్బలంవల్ల కోర్టు వెలుపలనే ఉభయపక్షాలమధ్య రాజీ కుదరడమూ, దానివల్ల సొమ్ము పొదుపు కావడమూ తటస్థించినవి. కోర్టు తీర్మానమే అయితే సొమ్ము చాలా వ్యయమైవుండేది. కేసు రాజీచేయించి గాంధీ ఇలా వాఖ్య చేశాడు: "వకీలు వృత్తి నిజంగా ఇప్పుడే నేర్చుకొన్నాను. మానవ స్వభావాన్ని గ్రహించి మానవ హృదయంలో ఎలా జొరబడాలో కనుగొన్నాను. ఉభయ పక్షాల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనే విరోధాన్ని రెచ్చకొట్టేదానికన్న రాజీకుదర్చడమే న్యాయవాది ధర్మమని గ్రహించినాను." తదుపరి చాలా కేసులలో ఆయన అదే—రాజీవిధానమే అవలంభించినాడు. ఆయన ఇంకా ఇలా నుడివినాడు. "అలా చేయడంలో నాకు నష్టంలేదు. ధనవ్యయంకాదు. ఆత్మద్రోహం అంతకన్నా ఉండదు." తరువాత కొన్నాళ్లకు ప్రాక్టీసువల్ల గాంధీజీ సంపాదన కూడా బాగా అభివృద్ధి కాసాగింది.

కేసు ముగిసిన తరువాత గాంధీ నిజనివాసానికి మరలినాడు. మళ్ళీ ఆయనకు అదృష్టం త్రోసుకు వచ్చింది. నెటాలు సైడెన్‌హాంలో మిత్రులు ఆయనకు వీడ్కోలు పత్రము సమర్పించినారు. నెటాలులో భారతీయులకు శాసనసభల ఎన్నికల్లో

పార్లొనే హక్కులు లేకుండాచేస్తూ ఒకబిల్లును నెటాలు శాసన సభలో ప్రభుత్వం ప్రవేశపెట్టినట్లు పత్రికా ముఖంగా వెలువడిన వార్తే సమ్మాన పత్రంతోపాటు గాంధీజీకి చదివి వినిపించ బడింది. అబ్దుల్లా సేట్ మొదలయినవాళ్ళకు ఆ బిల్లు వివరమేమీ తెలియవు. "కాని చాలామంది భారతీయులు దక్షిణాఫ్రికాలోనే పుట్టిపెరిగి చదువుసంధ్యలు నేర్చినారు. వారు సాయం చేయరా?" "వారా? వారు క్రైస్తవులు కావడంచేత తెల్లమిషనరీల మోచేతి నీళ్లు తాగుతున్నారు. ఆ మిషనరీలు ప్రభుత్వానికి దాసులు." ముందుగా త్వరితగతిని క్రైస్తవుల్లో దేశభక్తి పాదుకొల్పవలెనని గాంధీ మనసార తలపోసినాడు. ఆ తర్వాత భారతీయుల హక్కులకోసం ఆయన బిల్లును ప్రతిఘటించడానికి నిశ్చయించు కొన్నాడు.

కొద్దికాలం కిందటనే గాంధీ ప్రిటోరియా (ట్రాన్సువాల్ రాజధాని) బహిరంగసభలో ప్రసంగించినాడు. అప్పుడు ప్రిటో రియా ప్రెసిడెంటు క్రూగర్ ఆధిపత్యంలో వుంది. గాంధీ ఉద్య మానికి అక్కడ బ్రిటిషువారి ఏజంటు సానుభూతి చూపి మిత్రు డైనాడు. ట్రాన్సువాలులో భారతీయులు తమ దుస్థితిని బాగా గుర్తించవలసిన అవసరం వచ్చింది. కాబట్టి వారు నిద్ర మేల్కోవలె. అదే గాంధీజీ ఉపన్యాససారాంశం. దక్షిణాఫ్రికాలో ఆత్మగౌరవం గల భారతీయులకు చోటులేకుండా పోతున్నది. గాంధీజీ ఉద్యమానికి సాధన సత్యమే. వర్తకులు వారి వారి సాంఘిక బాధ్యతలు గుర్తించేలాగ గాంధీ కృషి చేసినాడు. తత్ఫలితంగా కార్యనిర్వాహకవర్గం ఏర్పాటు చేయవలసిందని ప్రజలు గాంధీని కోరినారు. తర్వాత ఆయన అండదండు

లుండగా ప్రజలు తమ బాధ్యతలు గుర్తెరిగి, బాధ్యతాభారం వహించదలచినారు. అబ్దుల్లా మొదలయిన ప్రజలు గాంధీని దక్షిణాఫ్రికాలో మరోమాసం ఉండవలసిందని కోరినారు. తన జీవితచరిత్రలో ఆయన ఇలా వ్రాసినారు: "ఆ విధంగా ఈశ్వరుడు దక్షిణాఫ్రికాలో నా జీవితానికి పునాదులు వేసినాడు; జాతీయాత్మగౌరవార్థం యుద్ధబీజాంకురాలు చల్లినాడు."

సత్యాగ్రహోద్యమ సమర చరిత్రనంతా గాంధీజీ 'దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం' అన్న గ్రంథంలో వివరించబడింది. 1914 దాకా ఆయన మాతృదేశం రావడానికి వీలులేక పోయింది. అంత వరకూ ఆయన రాజనైతిక పోరాటానికి సత్యాగ్రహమనే ఆయుధాన్ని కనుగొని, దాన్ని సుసంఘటిత పర్చి సుప్రతిష్ఠతం చేయటంలో నిమగ్నమయినాడు.

1893 లో నెటాలు శాసనసభచే భారతీయుల హక్కులు హరిస్తూ కావించబడిన చట్టాన్ని ప్రతిఘటిస్తూ (ఒక) పిటీషను దాఖలు చేయబడింది. ఈ సందర్భంలో హిందువులు, ముస్లిములు, పారిసీలు, క్రైస్తవులూ అంతా ఐక్యసంఘటనగా ఏర్పడినారు. "అందరూ మాతృదేశానికి బిడ్డలు కాబట్టి, మాతృదేశానికి వారంతా సేవకులే" అను నినాదం దేశంలో లేచింది. తెల్లవాళ్లు చక్కని వివేచనా బుద్ధితో ఈ ఐక్య సంఘటనను సాధించినారు. బిల్లును వ్యతిరేకిస్తూ దాఖలు కాబడిన పిటీషన్ను సమర్థిస్తూ పత్రికలు వ్యాసాలు ప్రచురించేసరికి వాటి స్వేచ్ఛను ప్రభుత్వం వమ్ముచేసింది. ఏమైనా బిల్లు ప్యాసయి పోయింది. కాని ఆ వెంటనే పదివేలమంది సంతకాలతో బిల్లును

తీవ్రంగా ఖండిస్తూ అప్పుడు లండన్‌లో వలసరాజ్యాల కార్య దర్శిగా వున్న లార్డు రిప్పన్‌కు లేఖ వ్రాయబడింది. దానికి లండన్ టైమ్సు పత్రిక మద్దత్తు నిచ్చింది.

22 మే 1893 లోనే సుసంఘటితమైన నెటాలు భారతీయ కాంగ్రెస్ వినిర్మించబడింది. ఆ వెంటనే అది 'దక్షిణాఫ్రికాలో ఆంగ్లేయ ప్రజానీకానికి విజ్ఞప్తి' అన్న కరపత్రం ప్రచురించింది. నాటినించీ గాంధీజీ రాజకీయ వ్యవహారమంతా స్వయంగా తానే చూడ ప్రారంభించాడు. ఆయన కార్యసాధనం అత్యంత విలక్షణం.

గాంధీ అటార్నీ జనరలు సూచనవల్ల నెటాలు బారు అసోసియేషనులో సభ్యుడయినాడు — వ్యతిరేక పక్షమువారికి ఇష్టములేక పోయినా, అప్పు డాయనను తీసివేయమని అందరూ కోరినారు, గాంధీ పాగా తీసివేసి—"ఈ పాగా నిమిత్తం నేను సత్యాగ్రహం సలిపి నా శక్తినీ సమయాన్ని వృధాచేయ దల్చుకోలేదు." అన్నాడు. నెటాలు వకీళ్ళ సంఘంలో సభ్యు లెవ్వరూ తలపాగాలు పెట్టుకొనే ఆచారము లేదు. ఆయన ఇంకా ఇలా అన్నారు—"నా జీవితమంతా సత్యాగ్రహం సామరస్య సౌందర్యాన్ని గ్రహించమన్నది. ఈ స్వభావం నా సత్యాగ్రహంలో ఒక భాగం. సత్యాగ్రహంకోసం తరుచు ఆపదలను ఎదుర్కోవలసి వచ్చేది. దానికోసమే మిత్రులకు ప్రీతి నెరపలేక పోయేవాణ్ణి. కాని సత్యమెంత కఠినమో, అది కుసుమమువలె అంత మృదుల మైంది కూడాను."

పరిస్థితులు బట్టి నెటాలు భారతీయ కాంగ్రెస్ చివరికి పోరాటం సల్పవలసి వచ్చింది. ఒడంబడికరీత్యా తన కాల

పరిమితి పూర్తి అయినాక ఎవరైన భారతీయులు దక్షిణాఫ్రికాలో ఉండదలిస్తే, అట్టివారు సాలుకు 25 పౌన్లు విధిగా ప్రభుత్వానికి పన్ను చెల్లించాలి. అలా చేయలేనివారు భారతదేశానికి మళ్లి పోవాలి. అప్పుడు భారత రాజప్రతినిధికి విన్నపం చేయబడింది. తత్ఫలితంగా (ఒడంబడికలో సూత్రం రద్దుకాలేదు కాని) పన్ను 25 పౌనులనించి 3 పౌనులకు తగ్గించబడింది.

మాసంమాత్రం ఉండవలెననుకొన్న గాంధీ మూడేళ్లు దక్షిణాఫ్రికాలో ఉండవలసి వచ్చింది. ఆయన భార్యా పిల్లలూ భారతదేశంలోనే ఉన్నారు. ఇంతలో కొంతవీలు చిక్కటంవల్ల కొంత ఊపిరి పీల్చుకోటానికీ, ఇల్లూవాకిలీ చూసుకోటానికీ 1896 లో కలకత్తావెళ్ళే స్టీమరులో భారదేశం ప్రయాణించి నాడు. దేశం చేరీ చేరగానే బొంబాయిలోనూ, రాజకోటలోనూ, ప్లేగు రెచ్చిపోతున్నదని గాంధీ గ్రహించినాడు, దానితో మాతృదేశానికీ, పీడిత సోదర ప్రజాకోటికీ సేవచేసే అవకాశం ఆయనకు లభ్యమయినది. ఆ అవకాశం పోనివ్వలేదు. ఆయన తన పద్ధతిలో ప్రజారోగ్యం బాగుచేయ సంకల్పించినాడు, కృషి చేయదల్చినాడు. తానూ తనతోటి మిత్రులూ కలసి కార్మికుల దొడ్లూ, 'అస్పృశ్యుల' కుటీరాలూ పరిశీలించారు; అంటు రోగం ఎక్కడనుండి వస్తున్నదోనని. స్వయంగా రోగార్తులకు సేవా శుశ్రూషలు సలపటం ఆయన విధికృత్యాలలో ఒకటిగా భావించేవారు.

కొందరు భారతీయులు గాంధీని దక్షిణాఫ్రికాకు వెళ్ళ వద్దని నిరుత్సాహపరిచినారు. భారదేశంలోనే చేయవలసిన పని చాలా ఉందని వారు బోధించినారు. కాని దక్షిణాఫ్రికాలో

ఆరంభించిన ఉద్యమ నిర్వాహనకే ఆయన సిద్ధపడ్డాడు. ఆ సందర్భంలో—"అనాసక్తితో మానవుడు కర్మాచరణంచేస్తూ జయాపజయములు తృణప్రాయంగా చూడాలి. తన విధి నిర్వహణంలో అతను తనువు చాలించినా పరవాలేదు." అన్న గీతా ప్రబోధవాక్యాలను గాంధీజీ స్మరించటంద్వారా ఉత్తేజితుడైనాడు.

దక్షిణాఫ్రికాలో వున్న భారతీయ కుటుంబాలన్నీ ఇంచుమించు గాంధీ యెరిగున్నవే. వారంతా దరిద్రులూ నిరక్షరాస్యులున్నూ, వారిలో బాలసుందరం అనే కార్మికుడు యజమానిచేత పళ్ళూడ గొట్టించుకొన్నాడు. ప్లీడరు సలహాకై అవమానంచే క్రుంగిపోతున్న ఆ నిర్భాగ్యుడు గాంధీ దగ్గిరికి వచ్చాడు. ఆయనను సందర్శించగానే వినయపూర్వకంగా చేతులు రెండూ జోడించి నమస్కారం చేసినాడు. "దరిద్ర మానవసేవే నా హృదయ కాంక్ష. వారి సేవకోసం, వారితో కలిసిమెలిసి ఉండడానికి నాడు తరుణం లభించింది" అని గాంధీజీ తన స్వీయ చరిత్రలో రాసుకొన్నాడు. అందుకే దక్షిణాఫ్రికాలో కర్షకులకు కార్మికులకు ఆయన 'మా గాంధి' 'గాంధీజీ' గా మారినాడు. ఆయనకు పేదల కష్టాలు తెలుసును. ఎంతో ఖర్చుతో కూడిన లండన్ మహా నగరంలో ఆయన ఎంత పొదుపుగా జీవితాన్ని గడిపినాడో అందరూ ఎరిగున్నదేగా!

"మానవసేవలో మగ్నుడ నవుతున్నానంటే దానికి మూలకారణం నా ఆత్మ దర్శనమే. మానవసేవే మాధవసేవగానూ, యదార్థ ధర్మసేవగానూ గ్రహించాను. సేవ మానవసేవ, మాతృదేశసేవ ఇలాంటి సేవాభిరుచి నాకు అధికం.

దక్షిణాఫ్రికా వెళ్ళడంవల్ల సేవలో ఈశ్వరసాక్షాత్కారం సాధించేందుకు యత్నిస్తున్నాను. ఆ సేవ చేస్తున్నకొద్దీ నాకు విశ్వప్రేమానుభవం క్రమంగా గోచర మవుతున్నది."

# అధ్యాయం ౩౮

కలకత్తా పత్రికాధిపతులు ఎంత ఉదాసీనంగా వున్నా అలహాబాదులో 'పయినీర్' పత్రికా సంపాదకుడు మాత్రం గాంధీజీకి ప్రోత్సహమిచ్చి, దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యలు ప్రచురించే సందర్భంలో ఆయనతో గోష్ఠికికూడా సమ్మతించినాడు. గాంధీజీ నెటాలు వెళ్లిన తర్వాత ఆయన ఊహించని ఫలితాలు కానవచ్చినాయి. గాంధీని భారతదేశంలో వున్న కొద్దికాలంలోనే కాంగ్రెస్ అగ్రనాయకుల్లో ఒకరైన గోఖ్లేతో సమావేశమై దక్షిణాఫ్రికా భారతీయుల స్థితిగతులు సమగ్రంగా తెలియపర్చినాడు.

1897 లో కొన్ని మాసాలయిన పిదప ఒకేసారి 800 మంది భారతీయులు దక్షిణాఫ్రికాలో నివాసం కల్పించుకొనే నిమిత్తం, దాదా అబ్దుల్లా కంపెనీవారి ప్రోత్సాహంతో బయలుదేరి రెండు నౌకల్లో నెటాలు వచ్చారు. అక్కడ తెల్లజాతి రెసిడెంట్లు ఈ భారతీయుల్ని చూచి భీతచిత్తులయినారు. వాళ్ళకు పత్రికా సంస్థలవారివల్ల తెలిసింది—గాంధీ దక్షిణాఫ్రికా భారతీయుల హక్కులకై భారతదేశంలో ఆందోళన సాగిస్తున్నాడని. దానితో తెల్లవాళ్లు భారతీయులను ఆఫ్రికా విడిచి వెళ్ళమని గట్టిగా

చెప్పినారు. వెంటనే గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల తరఫున సత్యాగ్రహధ్వజ మెత్తినాడు.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో తిరిగి పాదం మోపగానే ఆయన మీద ప్రజలు రాళ్లు విసిరినారు. ఆయనను పట్టి కొరతవేయించే ప్రయత్నం జరిగింది. బహిరంగంగా గాంధీ నెటాలు హార్బరులో దిగవద్దని ప్రభుత్వం హుకుం చేసింది. కాని, ఆయన అంగీకరించలేదు. గుంపులో ఆయనను ఎవరో లాగి ఇనుప చువ్వతో కొట్టబోయారు. ఆ దెబ్బనించి ఎవరో పోలీసు ఆయనను రక్షించినాడు. ఇంతలో ఒక స్త్రీ తన చిన్న గొడుగు చేపట్టి గాంధీని రక్షించేందుకు సాహసించింది. ఆ సాహసి ఎవరో కాదు పోలీసు కమీషనరు భార్య. పరిస్థితి విషమించేసరికి గాంధీని రహస్యంగా పోలీసు స్టేషనుకు తీసుకొని వెళ్ళినారు. ఈ లోగా జనం ఇలా పాట పాడింది—"ముసలి గాంధీని ఆపిలుపొమ్మనే ఉరితీయండి."

ఈ పరిస్థితి అనూహ్యము. వలస దేశాల అప్పటి కార్యదర్శి జోసెఫ్ చాంబర్లేన్ నెటాలు ప్రభుత్వాన్ని కేబులుద్వారా— "ఆందోళన కారకులను ప్రాసిక్యూటు చేయవలసింద" ని అర్థించాడు. నెటాలు పత్రికలు తెల్లవాళ్ళను నిశితంగా విమర్శించినవి. కాని అత్యద్భుతమైన విషయం—అటు బ్రిటిషు ప్రభుత్వం సలహామీద దక్షిణాఫ్రికా ప్రభుత్వం దుండగీళ్ళను పట్టి శిక్షించపోతే అందుకు గాంధీ సమ్మతించక పోవటం ప్రపంచాన్ని దిగ్భ్రాంతం చేసింది.

గాంధీజీ మామూలు ప్రజాతంత్ర రాజకీయవాది కాదని తెలుసుకోడం సరదాగా వుంటుంది. పెద్దల మాటలు వినడం

ఆయనకు పూర్వ సంప్రదాయసిద్ధం. మానవకోటికి అన్యాయాలు జరుగుతూ వుంటే దేశభక్తి ప్రబోధించి జనాన్ని ఉత్తేజపరిచి, సత్యాగ్రహోద్యమంతో ఆయన ఏకమైనాడు. దేశభక్తీ మానవత్వమూ ఆయన ఉద్యమంలో సరిసమంగా ఉన్నవి. మేజినీ తరువాత ఈ పంథాలో దేశానికి దారి చూపగలవాడు గాంధీయే.

నాటినుంచీ గాంధీజీ దక్షిణాఫ్రికా రాజకీయ కార్యక్రమంలో సంపూర్ణంగా మగ్నమైనాడు. అంతేకాదు ఆయన నిరాడంబరంగా టాల్‌స్టాయ్ పద్ధతిలో జీవితం గడపసాగాడు. దానికి కారణం ప్రధానంగా నైతిక ప్రేరేపణమే గాని, పొదపరితనమూ ఆభాసలో విరక్తీ కావు. అదైనా 1904 లో ఫోనిక్సు ఒడంబడిక కుదిరినాకనే ఆయన టాలుస్టాయపు సరళ జీవనం ఆరంభించినాడు. ఆ సందర్భంలో పోలక్ కూడా ఆయనకు సాయపడినాడు. కొంతకాలం అయినాక గాంధీజీ 1906 లో కుటుంబాన్ని తెచ్చుకొన్నాడు. ఇన్నాళ్లూ ఆయనకు కుటుంబ సౌఖ్యం లేదు. అంతేకాక పిల్లలు చదువు సంధ్యలూ, ఆస్థిపాస్తులూ అన్నీ ఆయన తలపెట్టిన ఉద్యమంలో ఆహూతి అయిపోయినయ్. కానీ ఆయనజ్యేష్ఠ కుమారుడు మాత్రం తృతీయ పంథా త్రొక్కినాడు. స్వేచ్ఛ, సేవ, సత్యంకోసం గాంధీజీ నాడు తన సర్వస్వం ధారపోసినాడు. మహాపురుషులు కష్టాలు వరిస్తారు. గాంధీజీ కూడా అంతే!

1901 లో హిందూదేశానికి గాంధీజీ వచ్చి మొదటిసారి భారత జాతీయ మహాసభకు హాజరైనాడు కలకత్తాలో. అప్పుడే నెటాలు నుంచి ఆయనకు కేబుల్ వచ్చింది. "ఇక్కడికి చేంబర్లేన్ వస్తున్నాడు. తక్షణం బయలుదేరి రావలెను." అని దాని

ఆయనకు పూర్వ సంప్రదాయసిద్ధం. మానవకోటికి అన్యాయాలు జరుగుతూ వుంటే దేశభక్తి ప్రబోధించి జనాన్ని ఉత్తేజపరిచి, సత్యాగ్రహోద్యమంతో ఆయన ఏకమైనాడు. దేశభక్తీ మానవత్వమూ ఆయన ఉద్యమంలో సరిసమంగా ఉన్నవి. మేజినీ తరువాత ఈ పంథాలో దేశానికి దారి చూపగలవాడు గాంధీయే.

నాటినుంచీ గాంధీజీ దక్షిణాఫ్రికా రాజకీయ కార్యక్రమంలో సంపూర్ణంగా మగ్నమైనాడు. అంతేకాదు ఆయన నిరాడంబరంగా టాల్‌స్టాయ్ పద్ధతిలో జీవితం గడపసాగాడు. దానికి కారణం ప్రధానంగా నైతిక ప్రేరేపణమే గాని, పొదపరితనమూ ఆభాసలో విరక్తీ కావు. అదైనా 1904 లో ఫోనిక్సు ఒడంబడిక కుదిరినాకనే ఆయన టాలుస్టాయపు సరళ జీవనం ఆరంభించినాడు. ఆ సందర్భంలో పోలక్ కూడా ఆయనకు సాయపడినాడు. కొంతకాలం అయినాక గాంధీజీ 1906 లో కుటుంబాన్ని తెచ్చుకొన్నాడు. ఇన్నాళ్లూ ఆయనకు కుటుంబ సౌఖ్యం లేదు. అంతేకాక పిల్లలు చదువు సంధ్యలూ, ఆస్తిపాస్తులూ అన్నీ ఆయన తలపెట్టిన ఉద్యమంలో ఆహూతి అయిపోయినయ్. కానీ ఆయనజ్యేష్ఠ కుమారుడు మాత్రం తృతీయ పంథా త్రొక్కినాడు. స్వేచ్ఛ, సేవ, సత్యంకోసం గాంధీజీ నాడు తన సర్వస్వం ధారపోసినాడు. మహాపురుషులు కష్టాలు వరిస్తారు. గాంధీజీ కూడా అంతే!

1901 లో హిందూదేశానికి గాంధీజీ వచ్చి మొదటిసారి భారత జాతీయ మహాసభకు హాజరైనాడు కలకత్తాలో. అప్పుడే నెటాలు నుంచి ఆయనకు కేబుల్ వచ్చింది. "ఇక్కడికి చేంబర్లేన్ వస్తున్నాడు. తక్షణం బయలుదేరి రావలెను." అని దాని

పాఠం. ఆ విధంగా గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయులకు నాయకుడైనాడు.

చేంబర్లేన్ భారతీయ ప్రతినిధి వర్గానికి, పూర్వం సమాఖ్యగా వున్న దక్షిణాఫ్రికా కాలనీలు నేడు క్రమంగా స్వయం నిర్ణయాధికారంగల వలసలుగా రూపొందినాయి. కాబట్టి వాటి మీద వలసరాజ్యాల కార్యదర్శికి వున్న అధికారాలు అతి పరిమితమని చెప్పి మొండి చెయ్యి చూపాడు.

ఎట్టి క్లిష్ట సమయాల్లోనైనా గాంధీ స్తిమితంగా ఉంటాడు. దక్షిణాఫ్రికాలో వర్ణభేదం హిందూదేశంలో వర్ణాశ్రమాచారాల వల్ల వచ్చిన పాపఫలంగా ఆయన భావించినాడు. "సృష్టికర్త అన్ని బొమ్మలకూ ఒకేకుంచెతో రంగువేస్తాడు. మనందరినీ ఆయనే సృజించినాడు. అందుచేతనే మన అపరిమిత శక్తులన్నీ ఈశ్వరశక్తులే. ఏ మానవమాత్రుణ్ణి కించపరిచినా పరమేశ్వర శక్తిని తక్కువగా చూచినట్లే అవుతుంది. కనుక ప్రపంచంలో ఎక్కడైనాసరే ఎవరినీ హింసించకూడదు." "పాపమంటే అసహ్యించుకో గాని, పాపినికాదు." ఇదే అహింసా సిద్ధాంతం, దీనిద్వారానే మానవుడు యదార్థమైన సత్యాన్వేషణ చేయగలడు-శాంతి స్థాపించగలడు.

జోహన్నీసుబర్గులో ప్లేగు తాండవిస్తున్నప్పుడు భారతీయులు నివసించే 'మాలపల్లి' కిక్కిరిసి ఉండడంవల్ల అక్కడ వైద్యసహాయం చేసేనిమిత్తం డర్బానులో ఒక సంస్థనూ, 'ఇండియన్ ఒపినియన్' అనే వార పత్రికనూ గాంధీజీ నెలకొల్పి తను స్వయంగా పీడితప్రజాసేవకోసం

కుటుంబ సహితంగా జోహన్నీస్‌బర్గులోనే మకాం చేశాడు. రస్కిన్ ప్రభావంవల్ల గాంధీ కర్షక కార్మికుల సరళజీవితమే జీవింపదగినదని గ్రహించినాడు. ఆ నాటినుండి లండన్ బారిష్టరు, దక్షిణాఫ్రికా సంస్కర్త, రాజనీతివేత్త అయిన గాంధీజీ భారతీయ కర్షకునివలె అతి సరళ జీవితము గడప నారంభించినాడు. 1904 లో డర్బాను దగ్గర ఫోనిక్సులో జాతులమధ్య ఒడంబడిక కుదిరింది. తర్వాత గాంధీజీ జోహన్నీస్‌బర్గు దగ్గర టాల్‌స్టాయ్ ఫారం ప్రారంభించాడు. 1914 లో ఫోనిక్సు వర్గంవారు భారతదేశం వచ్చినారు. సి. యఫ్. ఆండ్రూస్ మహాశయుని సలహానుబట్టి వారు కొన్నాళ్ళపాటు శాంతినికేతనంలో రవీంద్రుని అతిథులుగా ఉన్నారు. ఫోనిక్సులోనే గాంధీ ఆశ్రమం ఆదిలో స్థాపితమైంది.

1908 లో గాంధీ ట్రాన్స్‌వాలు ప్రభుత్వ వ్యతిరేకంగా శాంతియుత పోరాటం ( నిరాహారదీక్ష ) ద్వారా జైలుపాలయి నాడు. ఫీల్డుమార్షలు స్మట్స్ మహాశయుడే గాంధీని నాడు అరెస్టు చేయించింది. మళ్ళీ ఆ జనరల్ స్మట్సే, గాంధీజీ 70 వ జన్మదినోత్సవ గ్రంథంలో ఒక వ్యాసం రాస్తూ— "మీరు అనుసరించే విధానాలనుబట్టి చూస్తే, మిమ్మల్ని ఎదుర్కోటం ఎలాగ?" అని ప్రశంసాపూర్వకంగా అన్నాడు.

ఫోనిక్స్ సమాధానం సందర్భంలో గాంధీ నిరసనవ్రతం ఆరంభించాడు. రాజకీయాందోళనచేసే మిత్రులు కొందరు ప్రలోభాలకు వశ్యులై శీలము చెరచుకొన్నట్లు గాంధీకి తెలిసింది. ఆ వార్త అశనిపాతంవలె ఉంది. ఆయన ఏడు రోజులు నిరాహారదీక్ష సాగిస్తూనే ఉన్నాడు. టాల్‌స్టాయ్ క్షేత్రంలో

ముస్లిములు రంజాన్ నిరసనవ్రతం సాగిస్తున్నారు. హిందూ సోదరులు ప్రదోషంనాకా వుపవసిస్తున్నారు. యీ వుద్యమంలో అడపాతడపా క్రైస్తవులు కూడా కొందరు పాల్గొన్నారు.

"ఉపవాసమువల్ల ఇంద్రియ సంయమము ఏర్పడుతుంది. ఇంద్రియాలకే కాక మనస్సుకు కూడా వుపవాసం కావాలి. అలా కాకపోతే నిరశనదీక్ష మోసమే అవుతుంది. అది నశించిపోతుంది." అని ఆయన జీవితకథలో రాశారు. కాగా 1906 లోనే గాంధీజీ భార్య అంగీకారంమీద బ్రహ్మచర్యం అవలంభించినాడు.

1914 లో గోఖలే గాంధీని హిందూదేశానికి లండన్ మీదుగా రావలసిందని రాసినాడు. గాంధీ భారతదేశం వెళ్ళిన తదుపరి హెన్రీ పోలక్ భారతీయులకు దక్షిణాఫ్రికాలో నాయకుడైనాడు. "పాలకులయెడ పాలితుల భీతి పారదోలట" మే గాంధీ వుద్యమాశయం. ఆయన ఆయన భార్య అగష్టు 6 వ తేదీన లండనులో అడుగు పెట్టినారు, అప్పటికి మరో రెండు రోజుల్లో ప్రథమ ప్రపంచయుద్ధ ప్రకటన కాబోతాది. గాంధీజీ లండన్ రావటంతోనే తలవనితలంపుగా బకింగ్‌హాం వీధిలో వున్న ఎమర్సన్ సమితిలో సభ్యుడైనాడు. దక్షిణాఫ్రికాలో ఆయనకు నాయకత్వానికి కావలసిన శిక్షణ పూర్తయింది. అప్పుడాయనకు 45 ఏళ్ళవయస్సు. ఇక ఇక్కడ్నించే ఆయన మహా ప్రవక్త, విశ్వనేతా కాబోతున్నాడు. ఇంకా లోహము కొలిమి పరీక్షకు ఎదురు చూస్తుంది. కాని గాంధీ కొలిమి పరీక్షలో నెగ్గిపోయ్యాడు!

# అధ్యాయం ౩౭

దక్షిణాఫ్రికాలో వుండగానే గాంధీజీ రాజనీతిలో కొన్ని నిర్ణయాలకు వచ్చినాడు. అవి ఆయన భావి కార్యక్రమాన్ని దర్పణమువలె నిగదర్శిస్తవి కనుక, అత్యంత ప్రధానములు.

బోయరు యుద్ధంలో సమయం చిక్కిందికదా అని ఆయన బ్రిటీషు సామ్రాజ్యానికి వ్యతిరేక సన్నాహాలు చేసి ఆఫ్రికావాసుల హక్కులు సంపాదించక బ్రిటీషువారికే మద్దతు ఇచ్చినాడు. బ్రిటీషు పౌరుణ్ణి రక్షించటానికే సిద్ధమైనాడు. అందుకు ఆయన సత్సీలురైన కొందరు భారతీయులను కూడ కట్టుకొని, యుద్ధంలో గాయపడిన సైనికుల సేవ నిమిత్తం వైద్యదళాన్ని ఏర్పాటు చేసినాడు. తర్వాత నెటాలు బిషప్పు సౌహార్దంతో వారు యుద్ధ రంగానికి వెళ్ళి క్షతగాత్రుల సేవ ప్రారంభించారు. గాంధీ వైద్యదళ వాలంటీరులే యుద్ధభూమిలో గాయపడి నేలకొరిగిన ఫీల్డుమార్షల్ లార్డు రాబర్ట్సు కుమారుణ్ణి రక్షించినారు. ఈ విధంగా సమర రంగంలో సాహసం ప్రదర్శించిన వలంటీర్లను ప్రశంసిస్తూ కారకుడైన గాంధీజీకి బ్రిటీషువారు యుద్ధసంబంధమైన పతకం బహూకరించి గౌరవించారు.

ఆయన జీవితకథలో ఇలా రాసుకొన్నారు: “ నేను బ్రిటీషు రాజ్యాంగానికి విధేయ రాజభక్తునిగా మెలగిన రోజులవి.

ఆవిధేయతకు నా సత్యప్రియత్వమే మూలం. బ్రిటీషువారి జాతీయగీతం నెటాలులో నేనుపాల్గొన్న ప్రతిసమావేశంలో పాడే వారు. నాకూ పాడవలెనని ఇచ్ఛకలిగేది ; నేనూ పాడేవాణ్ణి."

"బ్రిటీషు పరిపాలనలో లోటుపాట్లు నేను ఎరగనివికావు. ఎరిగినా వారి రాజనీతి కేవలం దూష్యంకాక మొత్తంమీద అంగీకార యోగ్యమేనని భావించేవాణ్ణి. అప్పట్లో బ్రిటీషు పాలన యెడ నాకు సమ్మతి ఉండేది. నాడు పాలితులకు వారి పాలన శ్రేయోదాయకమనే విశ్వసించినాను."

"దక్షిణాఫ్రికాలో నాటి వర్ణద్వేషం బ్రిటీషు సంప్రదాయాలకే వ్యతిరేకం. కాబట్టి అది తాత్కాలికమూ స్థానికమున్నూ అని తలచి వారి రాజరికాన్ని పూజించినాను" తత్ఫలం స్వదేశీయులవల్ల ఆయన చీవాట్లు తిన్నాడు, అవమానితుడైనాడు.

తరువాత జులూ యుద్ధం వచ్చింది. యధారీతిగా ఆయన బ్రిటీషువారికి మళ్ళీ సహాయంచేయ నిశ్చయించు కొన్నాడు. ఆయన ఇంద్రియోద్వేగానికి వశుడైపోక నిగ్రహంతో భారతీయ సేవాదళం సమకూర్చి ఆంగ్లేయులకు ఉపకారం చేసినాడు. చిత్రమేమంటే ఆయన శాంతియుతమైన మానవ సేవకూ, యుద్ధరంగమందు అగ్రశ్రేణిలో వీరోచిత సాహసకార్యానికీ భేదం తీసివేసినాడు, కారణం : "క్షతగాత్రులకు సేవచేస్తున్న వైద్యులుకూడా యుద్ధ సంబంధమయిన అవినీతిలో భాగస్వాములే."

సార్జంట్ మేజరు మోహనదాస్ గాంధీజీ, అతని అనుయాయులూ యుద్ధంలో క్షతగాత్రులయిన జులూలకు సేవచేసే

యేర్పాటు చేసినారు. వైద్యాధికారికి అదే సమయంలో మతి పోవడంవల్ల గాంధీ పరివారమే క్షతయోధులకు సహాయం చేసినారు. ఆయన తన చరిత్రలో ఇలా రాసుకొన్నారు: "మే మెక్కడికి వెళ్ళినా ఈశ్వరప్రీతికై కర్మయోగము చేయ డానికి తరుణము లభిస్తూ ఉన్నది. స్ట్రెచర్లమీద గాయాలు తగిలిన సైనికుల్ని వైద్యశాలలకు మోసుకొని వెళ్ళినాము. నర్సులు వారిని కనిపెట్టుకొనే వున్నారు." "అదివరకు మన పూర్వులు బ్రహ్మచర్యాన్ని అతిశయోక్తిగా గ్రంథాల్లో ప్రశం సించారని అనుకొన్నవాణ్ణి, అనుభవాన్నిబట్టి దానిశక్తి ఘనమని గ్రహించగలిగినాను." ఆధునిక ప్రపంచం దేహానికే ప్రాధాన్యం, ఆత్మకు అప్రాధాన్యమూ ఇస్తుంది. హైందవ ధర్మంలో ఎక్కువ మంది ఆచరించలేని బ్రహ్మచర్యనిష్ఠ, క్రైస్తవంలోని సనాతన దృక్పథం గాంధీజీ అక్షరాలా అవలంభించినారు. 1906 లో దక్షిణాఫ్రికాలో ఆయన బ్రహ్మచర్యదీక్ష వహించినట్లు చెప్పే వున్నాం. 1908 లో లండన్‌నించి తిరిగివచ్చి ఆయన 'హింద్ స్వరాజ్య' గ్రంథరచన చేసినారు. ఆ గ్రంథంవల్ల ఆయన రాజకీయ మత నైతిక సిద్ధాంతాలు కరతలామలక మవుతవి.

1914 లో గాంధీజీ అంతరాత్మను మూడో పర్యాయం యుద్ధ సంబంధమైన విషమ సమస్య ఎదుర్కొంది. బోయరు యుద్ధం, జూలూ విప్లవంలోనూ అంతగా ఆయన అంతరాత్మ వేగించలేదు. కాని ప్రపంచ యుద్ధకాలంలో ఆయన అంతరాత్మ నిజంగా మహా సమస్యే యెదుర్కోవలసి వచ్చింది. బ్రిటీషు వారికి ఆ యుద్ధకాలంలో సహాయ్యం చేయడం సమంజసమూ

అసమంజసమా? వారు యుద్ధసన్నాహాల్లో ఉండగా ఆ అవకాశం పురస్కరించుకొని జాతీయ వాంఛలు, హక్కులు ప్రకటించి కత్తులు దూయడమా? అయితే భారత జాతీయవాదులు చాలా మంది రెండో ప్రపంచయుద్ధంలో సహాయనిరాకరణం చేశారు. బోసువంటి తీవ్ర జాతీయవాదులు బ్రిటీషువారిని ఒత్తిడి పెట్టినారు. అలాగే పాలస్తీనాలో కూడా సంభవించింది. ఆ పరిస్థితులు వేరు.

1914 లో చెప్పిన భావాలే తిరిగి గాంధీజీ ప్రకటించాడు. "ఆ రోజుల్లో బ్రిటీషు ఉద్యోగులవల్ల భారతదేశస్థితి విషమించింది కాని, బ్రిటీషు రాజ్యాంగ విధానంవల్లకాదు. అందుచేతనే మనము వారి హృదయ పరివర్తనను ప్రేమతో సాధించటానికి యత్నించాలి. ఒకవేళ బ్రిటీషువారి సహకారంతో మనం వృద్ధికి రాగలిగితే వారికి సాయం కావలసినప్పుడు మనం చేయాలి. వారి స్థితిగతులు సరిగాలేని సమయంలో మనం వారిమీద విప్లవధ్వజ మెత్తడం సమంజసం కాదని నా ఉద్దేశం." తర్వాత సరోజినీదేవి సహాయంతో వలంటీర్లకోసం దేశాన్ని అర్థించినారు.

ఈ యుద్ధసహకార కాండను అహింసతో సమన్వయం చేయడం ఎలాగ? పోలక్ మొదలయిన శాంతిప్రియులు ఈ సమస్యను పరిష్కరించమని గాంధీజీని కోరినారు. కేవల భారతీయునివలె ఆయన సమాధానం చెప్పినారు. శివశక్తులు సృజన లయ సంహారాలు చేస్తవి. "మనం హింసలో ఊపిరాడక నలిగిపోతున్నాం నిస్సహాయులమై, జీవితం అన్యజీవితం మీద ఆధారపడుతుంది." జయాపజయాలమాట ఎలావున్నా హింసకు ప్రతిక్రియగా యుద్ధంచేయక తప్పదు.

"అహింసా వ్రతనిష్ఠుడు నిజవిశ్వాసం యెడల సత్య వర్తనుడు. దానికి కారణం దయ. అతడు క్రమంగా ఆత్మ సంయమమైన భూతదయలో బాగా పెరుగుతాడు. కాని బాహ్యమైన హింసకు దూరంగా, స్వేచ్ఛగా ఉండలేడు." అందుచేత అహింస సాపేక్ష్య మయినది—Relative.[1]

అలాగయితే దానిఫలితమేమిటి? ఇది చాలా విలక్షణమైన విషయం. బ్రిటీషు సామ్రాజ్యచ్ఛాయలో వుంటూనే, ప్రజలను సంఘటితంచేసి సామ్రాజ్యానికి ప్రతికూలంగా ఉద్యమం నడపగలనని గాంధీజీ తలచి వుండవచ్చు, లేదా కృష్ణజన్మ స్థానానికి వెళ్ళేందుకు ఆయన సిద్ధమైవుండాలి—వ్యక్తిగతమైన శాంతియుత అసహాయోద్యమం లేవదీయడంద్వారా. అదీ కాకపోతే ఆయన "సామ్రాజ్యం తరఫున యుద్ధంలో పాల్గొని హింసాప్రతిఘటశక్తిని సంపాదించాలి" అని అనుకొని వుండవచ్చు. వీటిలో ఆయన మూడో మార్గమే అవలంభించినాడు. అసలు యుద్ధం ధర్మమా? అయితే ఎప్పుడది ధర్మబద్ధం? అనే విషయం తేలలేదు.

గాంధీ రోగంతో పీడించబడుతున్న ఆవుదూడను చూడలేక కాల్పించాడు. దానికి హిందూ సోదరులు అంగీకరించలేదు. ఆయన ఇలా రాశారు: "రెండు దేశాలు పోరాడుతూవుంటే అహింసా వ్రతదీక్షితుడు యుద్ధాన్ని నిరోధించవలెను. అలా చేయలేని పక్షంలో యుద్ధంలోపాల్గొని అతను మనసార యుద్ధం చేయాలి, తనదేశం భవిష్యత్తుకూ యుద్ధవిముక్తికీ పాటుపడాలి."

1 ఈ పారాగ్రాఫులో సమాచారం యస్. యల్. పోలక్ నాకు అందచేశారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఖైదీఅయిన శాంతి కాముడు రాయ్‌వాకర్ ఇలా సంక్షిప్తంగా సిద్ధాంతీకరించాడు: "గాంధీజీ భారతదేశం అక్కౙలు బాగా అవగాహన చేసుకొన్నాడు. ఐనా భారతదేశ విషయనిర్ణయం ప్రధానంగా యుద్ధానంతర ఫలితం మీదనే ఆధారపడి వుంది. కాబట్టి యీ యుద్ధకాలంలో దాని సహాయ సహానుభూతులు మిత్ర మండలికేనే మొగ్గినాయి." ఈ సందర్భంలో మిష్టర్ వాకర్ అతిశయోక్తిగా కొంత రాశాడని నా ఉద్దేశం. గాంధీ, బ్రిటీషు వారల అన్యోన్యము వాకర్ తిన్నగా గ్రహించలేదు. పోలండులో పిల్సుడిస్కీ గాంధీ విధానం ఎంత మాత్రం అవలంభించ లేదు.

వాకర్ ఇంకా ఇలా రాశారు: "భారతదేశంగాన సంపూర్ణంగా అహింసాశక్తిని స్వీకరిస్తే, భారతీయ హృదయం సత్యాగ్రహం ద్వారా అద్భుతంగా వ్యక్తం కాగలదు. కాని ఇండియా ఈ మహత్తర శక్తిని పూర్తిగా గ్రహించిందా? అది సత్యాగ్రహ ఆయుధాన్నే చేపట్టగలదా? పోతే హింసా, పిరికితనమా, ఏది కోరతగినది? అనే పాత ప్రశ్న ఎలాగూ వుండనేఉంది. ధర్మమని తోచినప్పుడు దానికోసం యుద్ధం చేయడమే మంచిది. అంతేగాని హింసకు వెరచి వెన్ను చూపటం దౌర్బల్యం, స్వార్థపరత్వాలే కారణం. సత్యాగ్రహం పందతనానికి పర్యాయపదమని తలచేవారు కేవలం ఆత్మద్రోహులూ, భీరువులనే చెప్పాలి. గాంధీజీ అహింసలో పారుబోతుతనానికి తావు లేదు. అది స్పష్టం."

గాంధీజీ కూడా అదే స్పష్టపరిచాడు—"పిరికితనంతో కూడిన శాంతి తుచ్ఛమైనది. అంతకంటే యుద్ధరంగంలో

శౌర్యమే శ్రేష్ఠమైనది. కాబట్టి పిరికిపందతనంకన్న యుద్ధంలో పోరి చావటమే మేలు." ఆయన పోలికను ఆశ్చర్య చకితుని చేస్తూ యుద్ధంలో సైనికుడు అయిపోవాలని తలచినాడు.

ధోల్‌పూర్ మహారాజు నాతో ఇలా చెప్పినాడు: "గాంధీజీ భారతదేశం తిరిగివచ్చి, మోతీలాల్ నెహ్రూ తదితరులు కలిసి ఆనాడు బ్రిటీషువారికి యుద్ధంలో సహాయనిరాకరణం చేయడానికి చేసుకొన్న తీర్మానమును ఎదుర్కొని నెగ్గనీయలేదు." ధోల్‌పూరురాజు బ్రిటీషుసభ్యులకు సలహా యిచ్చినాడు. భారతీయులే మార్గం నిర్ణయించుకొనే స్వేచ్ఛనీయమని. పిమ్మట మహాత్ముణ్ణి ఆయన ఇలా ప్రశ్నించాడు— "భారతదేశంలో మైత్రి నెరపినవాడికి అవసరం వచ్చినప్పుడు సహాయం చేయడానికి బదులు, మిన్నకుండటం ధర్మం అంగీకరిస్తుందా?" దానికి మహాత్ముని సమాధానం "మీ అభిమతం కొత్తది. దీని విషయం నేను బాగా యోచించాలి." తదుపరి ఒక సంయుక్త సమావేశంలో ఇలా ఉద్ఘాటించారు: "సంపూర్ణమైన బాధ్యతతో నేను తీర్మానం బలపరుస్తున్నాను."

ఆ తర్వాత స్వయంగా ఆయనే ఆసేతుహిమాచల పర్యంతం పర్యటించి వలంటీరు దళాన్ని సమకూర్చే సన్నాహంలో ఆరోగ్యంకూడా చెడగొట్టుకున్నారు. గ్రహణీవ ఆయన జీవించడని అనుకొన్నారు. అట్టి రాజనీతివేత్తన యోగపుంగవుని ప్రజలు సరిగా బోధపరుచుకోలేక విపరీతా వచ్చే తీరుగా—"బ్రిటీషు వారి యోగక్షేమాలకోసం తలవం

కాపలాకుక్క" అని ఆక్షేపించారు. ఐనా ఆయన అహింసాత్మక శిక్షణ ప్రజల కీయవలెనని తలచినాడు. ఆయన భారత సంప్రదాయవాదిగా, ఆశ్రమధర్మ వ్యవహర్తగా మనం విస్మరించ కూడదు. గాంధీజీ విప్లవాత్మక సనాతనుడు, సనాతన విప్లవకారుడూనూ.

# అధ్యాయం 40

1915 లో గాంధీజీ భారతదేశం వచ్చినాడు. 19 ఏళ్ళకిందట మొదటిసారిగా ఆయన పేరుమోసిన కాంగ్రెస్ నాయకుడు గోపాలకృష్ణ గోఖలేను దర్శనం చేసినాడు. 1901 లో కర్జన్ ప్రభువు దర్బారు జరిగేసమయంలో ఆయన గోఖలేతో కలసి మొట్టమొదటిసారిగా కాంగ్రెస్ సభలో పాల్గొన్నాడు. గోఖలే దక్షిణాఫ్రికాలో గాంధీజీని చూచినాడు. అప్పుడే ఆయన హింద్ స్వరాజ్య గ్రంథం మీద హాస్యచతురోక్తులు విసిరినాడు. తర్వాత ఆయన గాంధీతో లండనులో మిత్రునివలె సమావేశమైనాడు. అప్పుడు గోఖలే మహాత్మణ్ణి భారతదేశానికి వెళ్ళమని సలహా ఇచ్చినాడు, తదుపరి 1915 లో గాంధీజీకి గోఖలే బొంబాయిలో స్వాగతం ఇచ్చినాడు. బొంబాయి ఇతర వర్గాలవారు కూడా ఆయనకు ఘనమైన స్వాగతం ఇచ్చారు. అట్టివారిలో ఒక గుజరాతీ నివాసి శ్రావ్యంగా ఆంగ్లంలో గాంధీజీకి స్వాగత వచనం పలికినాడు. ఆయనే మహ్మాదాలీ జిన్నా. జనాబ్ జిన్నా ఆ రోజుల్లో పక్కా కాంగ్రెస్ వాది. గాంధీజీ మాత్రం స్వచ్ఛమైన భారత జాతీయవాదిగా గుజరాతీ భాషలోనే స్వాగతపత్రానికి సమాధాన మిచ్చాడు.

ఇక్కడనుండే గాంధీజీ భారత సాంఘిక, రాజకీయ కార్యక్రమాలు నిర్వహించవలసిన మహాధ్యాయం ఆరంభ

మవుతున్నది. 1901 లో గాంధీజీ కేవలం ఒక కంపెనీ ఆంగ్ల న్యాయవాదికి సలహాదారు మాత్రమేకాని, నేడు ఆయన ఒక గురుతర కార్యక్రమంలో దూకి విజయం గాంచబోతున్న మహాత్ముడు. ఆ రోజుల్లో భారతదేశంలో గోఖలే, బాలగంగాధర్ తిలక్, సి. ఆర్. దాస్, మదనమోహన్ మాలవ్యా, మోతీలాల్ నెహ్రూ పండితులూ గణుతికెక్కిన అగ్రనాయకులు. కాని గాంధీజీ దీర్ఘ విదేశవాసం వల్ల దేశానికి కొంత అపరిచితుడైనా ప్రతిష్ఠ లేకపోలేదు. అప్పట్లో బొంబాయి గవర్నరు (తర్వాత ఇండియా వైస్‌రాయి) అయిన లార్డు విల్లింగ్టన్ దూరదృష్టిగల రాజకీయవేత్త గాంధీజీని చూడాలనీ ప్రసంగించాలనీ ఆతృతపడి, దగ్గరకు రప్పించుకొని గోష్ఠి జరిపి, ఏవైనా కష్టనిష్టురాలుంటే తనకు ఎప్పుడైనాసరే నివేదించవచ్చునని తెలిపేడంటే, అది ఆయన నాటి పలుకుబడికి తార్కాణం కాక మరేమిటి?

గాంధీజీ భారతదేశంలో అడుగుపెట్టిన తర్వాత దక్షిణాఫ్రికాలో బానిసతుల్య జీవనాన్ని వెళ్లబోస్తున్న భారతీయుల సమస్యకై కృషిచేసి మన్నన పొందినట్లే, భారతదేశంలో కూడా అంతకన్న నికృష్ట సోదరప్రజల ఉద్ధరణకోసం పాటుపడి దరిద్ర నారాయణు డనిపించుకొన్నాడు. ఆయన జనసమ్మర్దంగా వుండే మూడో తరగతి రైలుపెట్టిలోనే దేశమంతా పర్యటన చేస్తూ వుండేవాడు. ఒకొక్కప్పుడు సామాన్లతోపాటు ఆయనను పోర్టర్లు కిటికీగుండా పెట్టిలోకి తోయవలసి వచ్చేది. గంటలు తరబడి జనం తొక్కిసలాడే పెట్టిలో నిలబడవలసి వచ్చేది. అయినా పట్టు విడువలేదు చిట్టచివరవరకూ. "విద్యా

సంస్కారాలుగల గొప్పవారు కొందరయినా బుద్ధిపూర్వకంగా దరిద్ర ప్రజానీకంతో ఐక్యమవుతేగాని సంస్కరణ సాధ్యం కాదు." అని గాంధీజీ ఆత్మ కధలో ఉద్ఘాటించారు.

కొద్దికాలం రవీంద్రుని శాంతినికేతనంలో గాంధీజీ గడిపిన అనంతరం దేశసంచార మొనర్చి, 1916 లో అహ్మదాబాదు సమీపంలో ఒక విశాల ఆదర్శప్రాయమైన ఆశ్రమాన్ని ఆయన స్థాపించాడు. అదే సబర్మతీ ఆశ్రమం అంటారు. దాన్నే 'సత్యాగ్రహాశ్రమం' అని కూడా పిలుస్తారు. ఆయన దేశ పర్యటనలో హరిద్వారంలో మహాత్మా మున్షీరాంజీ చేసే సాధుసేవ చూసి తన్మయుడై, తానుకూడా అస్పృశ్యత అనే పిశాచాన్ని పారద్రోల వలెనని దృఢనిశ్చయం చేసుకొన్నాడు. సబర్మతీ ఆశ్రమంలో అస్పృశ్యతా నివారణోద్యమానికి అదే నాందీ ప్రస్తావన. ఆశ్రమంలో జాతి కులాచార వైషమ్య రహితంగా 2॥ కుటుంబాలు కలసిమెలసి కాపురం చేయసాగి నాయి. ఐతే సనాతనంగా పెరిగిన కస్తూరిబాయి మనసులో మొదట కొంతఆరాటం కలగక పోలేదు. అలాగే ఇంకా ఈ ఉద్యమాన్ని దూషించినవారి సంఖ్య ఏమీ తక్కువకాదు. ఐనప్పటికీ తలవనితలంపుగా వుద్యమ నిర్వహణకు కావలసిన ఆర్థిక సాయంచేసి ప్రోత్సహించిన సంస్కరణ ప్రియులు కూడా లేకపోలేదు.

గాంధీజీ జీవితంలో మొదటి ఘట్టం 1917 లో ఉత్తర బీహార్ చాంపరాన్ సత్యాగ్రహం. అక్కడ అనేక అన్యాయపు పన్నుల భారముచే పీడించబడుతున్న నీలిమందు బీదరైతాం గోద్ధరణకోసం ఆయన పూనిక వహించి, ఉద్యమ సారథ్యం

చేపట్టటానికి ముందు చాంపరాన్ మోతిహారి గ్రామం విచ్చేసి పరిస్థితుల విచారణ ప్రారంభించాడు. తర్వాత చక్కని శిక్షణ ద్వారా రైతాంగాని జాగృతి పరిచినాడు. దీనికి స్థానికాధికార్లు బెదిరి గాంధీని తక్షణం చాంపరాన్ విడిచి పొమ్మని హుకుం జారీచేశారు. కాని ఆయన దానికి శిరసొగ్గక తనపని మామూలు గానే చక్కపెట్టుకో సాగాడు. అప్పుడు ప్రభుత్వ శాసన ధిక్కారనేరం ఆయనపైమోపి కేసుపెట్టింది — ముందువెనుక లేమాత్రం యోచించకుండా,

కోర్టులో తను నిరపరాధినని గాంధీ నిరూపించాడు. "శాసనానుసారంగానే నేను నా కృషిని కొనసాగిస్తున్నాను. నిజం చెప్పవలసివస్తే సర్కారువారే నేరగాళ్లు. కారణం సర్కారు కళ్లు కప్పి అభూతకల్పనలద్వారా నన్ను నిర్బంధిం చటంలో పోలీసు కమీషనరు విజయం గాంచినాడు." అని ఆయన స్థిరంగా పలికినాడు. ఆ దెబ్బతో మాజిస్ట్రేట్ ఏమి చేయాలో పాలుపోక కేసు వాయిదా వేశాడు. అప్పుడు దేశంలో పలుకుబడిగల రాజకీయ మహాసంస్థ కాంగ్రెసు ఈ చాంపరాన్ గొడవ తెలిసో తెలియకో, మరేకారణంచేతనో ఉదాసీనంగా చూస్తూ ఊరుకొంది. ఐనా గాంధీ ఒక్కడే ఈ ధర్మపోరాటంలో విజయాన్ని చూరగొనేందుకు సిద్ధపడ్డాడు. మధ్యలో మహదేవ దేశాయి, కృపలానీ (రాజేంద్ర ప్రసాదుకూడా) ఆయనకు బాగా సాయపడ్డారు.

గాంధీ తన స్థితిగతులు తంతిద్వారా మాలవ్యాకు, వైస్రాయ్ లార్డు ఛెమ్సుఫర్డుకు తెలియపరిచాడు. తత్ఫలితంగా బిహార్ లెఫ్టినెంట్ గవర్నర్ అయిన సర్ ఎడ్వర్డు గయిట్ హుకుం కాగానే, స్థానికాధికారులు తక్షణం కేసు ఉపసంహరించు

కొన్నారు. ఏమ్మట గాంధీజీ కృషి ఫలితంగా చాంపరాన్ సమస్యమీద వార్తాపత్రికలు వ్యాసపరంపరలను ప్రముఖంగా ప్రకటించసాగాయి. దేశంలో ఆందోళన చెలరేగింది. తక్షణం సమస్యా పరిష్కారం కోసం ఒక విచారణ సంఘం ప్రభుత్వం ఏర్పాటు చేసింది (ఇందులో గాంధీ కూడా ఒక సభ్యుడు) ఆ సంఘం విచారణానంతరం రైతుల ఆందోళన, కోరికలు న్యాయ సమ్మతమేనని ముక్తకంఠంతో తీర్పు ఇచ్చింది. ఆ వెంటనే రాష్ట్రప్రభుత్వం రైతులు చెల్లించు అదనపు పన్నులూ, ల్యాండ్ టెన్యూర్ పద్ధతి రద్దుపరుస్తూ ఒక శాసనం తయారుచేసి అమలు పరిచింది. గాంధీజీ ఆత్మకథలో— "గవర్నరు మంచివాడయినప్పుడు" అన్న శీర్షికను ఒక అధ్యాయంలో ఈ చాంపరాన్ సంఘటన గూర్చి వివరంగా ప్రస్తావించాడు.

చాంపరాన్ సత్యాగ్రహం సమాప్తం కాగానే (1918 లో) అహ్మదాబాదులో మిల్లుయజమానులకూ కార్మికులకూ మధ్య వేతనాల విషయమై వివాదం చెలరేగింది. గాంధీజీ మధ్య వర్తిత్వం నెరప చూశాడుగాని, యజమానులవర్గం అందుకు విముఖంగా వుంది. అప్పుడే ఆయన వల్లభాయి పటేలుతో కలిసి మొదటిసారిగా పనిచేశాడు. గాంధీజీ పూనిన బైటాయింపు సమ్మె అనుసాత్త్వక నిరోధం రెండోసారి దేశంలో శాంతి యుత విలక్షణ మార్గంలో కొనసాగింది. పక్షంరోజుల తర్వాత కార్మికుల్లో అసహనం కారణంగానూ, యజమానులకు లొంగి పొయ్యే స్థితికి కార్మికులు దిగజారుటవల్లనూ ఆయన నిరాహార దీక్షను కూడా అవలంబించవలసి వచ్చింది. అప్పుడు

యజమానులకు వివేకోదయమై మధ్యవర్తిత్వంద్వారానే సమస్యా పరిష్కారం చేసుకొన్నారు.

ఈ విశిష్టమైన సత్యాగ్రహ విధానం పాశ్చాత్య దేశాల్లో ఉన్నదా? అక్కడ జయప్రదం కాగలదా? అన్న ప్రశ్న చెల రేగుతోంది. దానికి సమాధానం ఒక్కటే, మధ్యవర్తిత్వం నెరపే వ్యక్తి నైతిక జీవనాన్ని బట్టి జయాపజయాలు నిర్ణయించబడతాయి. అప్పుడే అట్టి వ్యక్తియొక్క వ్యక్తిత్వం, శీలం ఘనంగా వ్యక్తపడతాయి.

ఇంతలో మళ్లీ (1918 లోనే) గుజరాతులో ఖేడా అను కైరా రైతాంగం పన్నుల నిరాకరణోద్యమం ప్రత్యక్షమైంది. గాంధీజీ సమస్యా పరిష్కారంకోసం జోక్యంచేసుకొని ఇరుపక్షాల మధ్యవర్తిత్వం వహించి రాజీ కుదిర్చినాడు. "వ్యవసాయ రైతులకు వుద్యోగులపట్ల గల భీతి తొలగిపోవలెను. వుద్యోగులు కేవలం ప్రజాసేవకులని రైతులు గుర్తించేటట్లు చేయవలెను." అని గాంధీ ఉగ్గడించారు.

ప్రథమ ప్రపంచయుద్ధంలో తన కార్యక్రమాలవల్ల గాంధీజీ భారత ప్రభుత్వంతో ప్రత్యక్షంగా ఢీకొనవలసి వచ్చింది. కారణం యుద్ధానంతరం భారతదేశానికి ఏదో ఒలకపోస్తామని ప్రభుత్వాధి నేతలు చేసిన వాగ్దానాలు వమ్ముచేశారు. సరికదా! కృతజ్ఞతకు ఫలం కృతఘ్నతగా దేశంలో కాంగ్రెస్ హోంరూలులాంటి జాతీయోద్యమాలను నిరోధించేందుకు, నాటికే ఐర్లండ్ విషయంలో అప్రతిష్ఠకు పాలయిన లాయడ్ జార్జి ప్రభుత్వం 19 జూలై 1918 లో రౌలట్ కమిటీ ద్వారా

ఇండియాలో యుద్ధకాలపు అసాధారణ శాసనాలను పునరుద్ధరింప చేసింది. ఆ రౌలట్ చట్టంలో మచ్చుకు కొన్ని విషయాలు తెలుపుతున్నాం—కుట్రకేసుల్లో నిందితుడు అపీలు చేసుకొనే హక్కు లేదు. విచారణ ఆ సందర్భంలో జ్యూరీ వుండగా జరగదు. క్రాసుపరీక్ష లేకుండా సాక్ష్యం వినడమూ, వ్యక్తుల్ని విచారణ చేయకుండానే అరెష్టు చేయవచ్చును.

దక్షిణ హిందూదేశంలో వుత్తర హిందూస్థాన్‌వలెనే ప్రజల్లో వ్యతిరేకత పెరిగిపోయింది. రౌలట్ చట్టాన్ని నిరసిస్తూ గాంధీజీ, రాజగోపాలాచార్యులు తీర్మానాలు ప్రకటించినారు. 1919 ఏప్రిల్ 6వ తేదీన యావద్భారతదేశంలో హర్తాళ్ జరిగింది. ఢిల్లీలో ప్రత్యేకంగా మార్చి 30వ తేదీన హర్తాళ్ జరిగింది. ఆ హర్తాళ్ వల్ల అద్భుతమైన యావద్భారతైక్యత ఉన్నదని ప్రభుత్వానికి తెలిసింది.

పంజాబులో లెప్టనెంట్ గవర్నర్ సర్ మైకేల్ ఓడయ్యర్ పంజాబ్ జాతీయవాదు లందరినీ అరెష్టు చేయడం ఆరంభించాడు. తత్ఫలితంగా పంజాబులో అల్లరులు బయలుదేరినవి. ప్రజాందోళన చూచి గవర్నరు భయపడినాడు. సేన కూడా భీతి చెందింది. ప్రజలు కుట్రలు చేస్తారేమో, కూనీలు చేస్తారేమోనని. తత్కారణంగా ఏప్రిల్ 11వ తేదీన జనరలు డయ్యరు అమృతసరం ఆక్రమించాడు. 13వ తేదీన జలియన్ వాలా బాగ్‌లో రౌలటు చట్టాన్ని నిరసిస్తూ ప్రజలు సమావేశమయినారు. క్రిక్కిరిసిన అసంఖ్యాక ప్రజానీకంతో సభ జరుగుతూ ఉండగా, డయ్యరు సేనను పంపినాడు కాల్పులకు. ఆ సమయంలో జనం పారిపోయే అవకాశం కూడా అంతగా

లేదు. పారిపోతున్నవాళ్ళను సహితం సైనికులు కాల్చివేసినారు. నాటి డయ్యర్ రాక్షసకృత్యంవల్ల సుమారు 4-12 వందల మధ్య అమాయక ప్రజలు అసువులు బాసినారు, 2000 మంది క్షతగాత్రులైనారు. చరిత్ర క్షమించని మహాఘోరం ఈ జలియన్ వాలా బాగు దురంతం!

మోహన్‌దాస్ గాంధీ తాను 'హిమాలయమంత పెద్ద తప్పు' చేశానన్నాడు. ప్రజలింకా సత్యాగ్రహ విధానానికి సుశిక్షితులు కాకపోవడంవల్ల అసహాయోద్యమం జయప్రదం కాలేదని ఆయన భావించటమే దానికి కారణం. (అక్టోబరు— 1919 లో) గాంధీజీ పంజాబు వెళ్ళే అవకాశం ప్రభుత్వం కలిగించింది. ఆయన వెంటనే మోతీలాలు నెహ్రూతో కలిసి పంజాబు వెళ్ళినాడు. డిశంబరులో అమృతసరంలో జరిగిన కాంగ్రెసు మహాసభలో సి. ఆర్. దాస్‌కు ఇష్టంలేకపోయినా, గాంధీజీ పంజాబు గుజరాతుల్లో జరిగిన అల్లర్లూ హింసనూ నిరసిస్తూ ఒక తీర్మానం ప్రవేశపెట్టినాడు. మహమ్మదీయులు కూడా ఆయన అహింసా సత్యాగ్రహ విధానం మెచ్చుకొని, కత్తిదూసి మతంకోసం చేసే 'జిహాద్' సమరంవంటి హింసాత్మక కార్యక్రమం మానివేసి, శాంతియుత అసహాయోద్య మంలో చేరి సహకరిస్తామని, అలహాబాదు సమావేశంలో గాంధీజీకి మాట ఇచ్చారు.

కాంగ్రెస్‌లో తన స్థానం అస్థిరంగావుందని తెలుసుకొని గాంధీజీ ఆల్ ఇండియా హోమ్ రూల్ లీగు అధ్యక్షత అంగీక రించినాడు. అయితే సెప్టెంబరు 1920 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సభలోనూ, నాగపూర్‌లో జరిగిన సమావేశం లోనూ ఆయన చాలా ప్రయత్నించి అహింసాత్మక పోరాటం

శ్రేయస్కరమని సభ్యులను ఒప్పించినాడు. స్వరాజ్య సంపాదనకు సాధనము శ్రేయోదాయకమైన అహింసాత్మక శాంతియుతమైన సత్యాగ్రహమేననీ, ఆ తీరుగా కాంగ్రెసు నిబంధనావళిలో ఆయన పరివర్తన తెచ్చినాడు.

గాంధీజీ ఫ్రాగిరోలమో సవొనరొలావలె విదేశీయ వస్త్ర దహనం ప్రోత్సహించినాడు. వడకునూలుతో తయారయ్యే ఖాదీ బట్టలు భారతీయులు కట్టవలసినదని ఆయన ఉద్బోధించినాడు. ప్రిన్స్ ఆఫ్ వేల్సు (ప్రస్తుతం ఆయన డ్యూక్ ఆఫ్ విండ్సర్) బొంబాయికి 1921 నవంబరులో రాగా భారతీయులు అసమ్మతి సూచకంగా హర్తాళం జరిపినారు. వీధుల్లో బహిరంగంగా గాంధీజీ ఆయన అనుచరులూ విదేశ వస్త్రదహనం చేసినారు. 'మహాత్మాగాంధీకి జై' అనే ప్రజలు నినాదాలు మిన్ను ముట్టినవి.

జనకోలాహలం పెరిగిపోతున్నది. చివరికి జనాన్ని పట్ట శక్యంగాలేదు. తక్షణం గాంధీ నిరసనదీక్ష వహించి ఇలా నుడివినారు—" విప్లవానికి తగిన ఆధ్యాత్మిక శిక్షణ ప్రజానీకంలో లేదు. అందుచేతనే నేను వాళ్ళను ఖాయిదాపరచ లేకున్నాను " ఇదే సత్యాగ్రహ పద్ధతిగా దేశమంతటా శాంతి యుతంగా హర్తాళ్ జరిగింది. ఈ అవకాశం తీసుకొని బెంగాల్ ప్రభుత్వం ఖిలాఫత్, కాంగ్రెస్ దేశసేవకులు అక్రమ సంఘ సభ్యులని ప్రకటన చేసింది. కాంగ్రెసు ప్రభుత్వ ప్రకటనను లక్ష్యం చేయలేదు. అందువల్ల మోతీలాల్ నెహ్రూ, సి. ఆర్. దాస్, మౌలానా అజాద్‌వంటి ప్రముఖ నాయకులు బంధితులయినారు. తిలక్ 1919 లోనే గతించినారు.

ప్రభుత్వంవారు బొంబాయి క్రానికలు పత్రికా సంపాదకు డయిన హార్నిమన్‌ను ద్వీపాంతరం పంపినారు. ఆయన గాంధీ, సరోజినీదేవి, పటేలుగార్లతో కలిసి రౌలట్‌చట్ట నిరసన ప్రతి ఘటన విధానము చర్చించినవాడు. తరువాత కాంగ్రెసుపక్షాన గాంధీజీ 'యంగ్ ఇండియా' అనే పత్రికకు సంపాదకత్వం వహించినాడు దిగ్విజయంగా. ముసల్మానులూ, హిందువులూ, సిక్కులూ కలిసి ఏర్పరిచిన జలియన్‌వాలా బాగ్ స్మారకనిధికి గాంధీజీయే ధర్మకర్త అయినాడు. కాంగ్రెసు రాజకీయ విషయాలు చూసే త్రైయ సభ్య సంఘంలో గాంధీగారే నిబంధనలూ తీర్మానాలూ రాసేవారు. పాతనాయకులు మరణించి నారు. ఉన్నవారిలో చాలామంది నాయకులు అరెస్టు అవుతూ వుండగా 1921 డిసెంబరులో మహాత్మాగాంధీ కాంగ్రెసు కార్య నిర్వాహకభారం సంపూర్ణంగా స్వీకరించాడు. ఆయన అందరి అభిమతాన్నిబట్టి జాతీయ నాయకమణిగా వెలిగినాడు. ఆ నాయకత్వాన్ని శంకించి వివాదపడేవారే లేరు.

ప్రజానీకంలో అసహాయోద్యమం ప్రబలింది కాని, చౌరీ చౌరాలో మళ్ళీ హింస రేగేసరికి 22 మంది పోలీసువాళ్ళు హతులయినారు. అప్పుడు బార్డోలీలో ఉన్న గాంధీజీ వెంటనే ఉద్యమం ఆపివేయమని ఉద్యమచోదకులకు వర్తమానం చేశాడు. "అహింసలో హింస మనం పరిణమింప చేసుకోలేక పోతే, మనం వెంటనే అడుగులు వెనుకకువేసి, కార్యప్రణాళిక పునరాలోచించి శాంతి నెలకొల్పాలి" అని ఆయన అభిప్రాయం కాని మోతీలాల్ నెహ్రూకు ఆ పద్ధతి నచ్చక మనసులో

రుసరుస పడినాడు. గాంధీ కార్యక్రమం హితవుగాలేదని సభలో తీర్మానం ప్రవేశపెట్టగా అది నెగ్గలేదు.

13 మార్చి 1922 లో ప్రభుత్వ చర్యవల్ల పరిస్థితి మారింది. మహాత్ముడు బంధితుడైనాడు. మొదట ఆయనను సబర్మతీ జైలులోనూ తర్వాత యరవాడ బందికానాలోనూ ఉంచినారు. ఎప్పుడయితే నేమి ఆయన జీవితంలో 20 ఏళ్లు చెరసాలలో గడిపినాడు. అప్పుడిలా రాసినాడు:—"నా సత్య నిష్ఠ నన్ను రాజకీయరంగంలో ప్రవేశపెట్టింది. ఏమీ సందేహించకుండా, నమ్రభావంతో స్పష్టంగా చెబుతున్నాను— రాజకీయాలను మతంతో ముడిపెట్టకూడదన్న వాళ్ళకు మతం అంటే ఏమిటో సుతరాం తెలియదు."



# అధ్యాయం 41

గాంధీజీని అరెస్టుచేసి విచారణ చేయడం చరిత్రలో గొప్ప విచారణల్లో ఒకటి. భారతీయాత్మగా భారతీయులు ఆయనను పూజిస్తూ ఉన్న సందర్భంలో ఆయనను అరెస్టు చేసేసరికి కోటి కోటి భారత ప్రజాహృదయాలు విషాద పూరితాలైనై, ఉద్రేక పూరితాలైనై. అప్పుడే విశ్వకవి రవీంద్రుడు హృదయోద్రేకం వెలిగ్రక్కినాడు. "మహాత్ముడనే గాంధీజీ ఆత్మానుసంధానం చేసినవాడు, కనుకనే మహాత్ముడైనాడు. జీవుడు స్వస్వరూపాను సంధానం చేసి అమృతుడౌతాడు. మహాత్మా గాంధీ అంతే!" అని రవీంద్రుడు ఉపనిషత్తుల ద్వారా మహాత్ముని ఆత్మీయతను స్తుతించినాడు.

మార్చి 18వ తేదీన అహమ్మదాబాదులో సెషన్సు జడ్జీవద్ద విచారణ ఆరంభ మయింది. ఖైదీ కోర్టు హాల్లో అడుగు పెట్టే సరికి కోర్టు యావత్తూ లేచి నిలవబడింది, విచారణ తన ధర్మం కనక జడ్జీ నెరవేర్చినాడు. నేరాలు ఏకరువు పెట్టినారు. దోషి ప్రభుత్వం యెడల (యంగ్ ఇండియాలో రాసిన రాజభక్తిని భగ్నమొనర్చుట, సమస్య దాని పరిష్కారం, సింహం జూలు పట్టి గుంజుట అను వ్యాసత్రయంద్వారా) విద్వేషాన్ని

కలిగించాడనీ, కలిగిస్తూ ఉన్నాడనీ ఫిర్యాదు చేయబడింది. గాంధీజీ, శంకరలాల్ బ్యాంకర్ నిర్దోషులని వాదన జరిగింది. పబ్లిక్ ప్రాసిక్యూటరు సర్ స్ట్రాంగ్‌మాన్ కేసు యావత్తూ విశదం చేశాడు.

గాంధీజీ దానికి స్పష్టంగా సమాధానం ఇచ్చినాడు. తన గత చరిత్ర యావత్తూ చెప్పినాడు. పిమ్మట ఆయన రౌలటు చట్టం, జలియన్‌వాలా బాగ్ చిత్రవధ, పంజాబు దురంతాలూ అన్నీ ఏకరువు పెట్టినాడు. ఆయా ఉద్యమాలన్నిటిలోనూ తాను అహింసాధర్మమే ప్రజలకు బోధించాననీ, బోధిస్తూ వున్నాననీ తెలియజేసినాడు. పోతే తాను యంగ్ ఇండియా అవతరణకు చాలాకాలం క్రితంనించే రాజద్రోహపూరిత బోధ చేస్తున్నాననే భూమికతో గాంధీ తన వాఙ్మూలం ప్రారంభించాడు. అందు కొంతభాగం:—"పూర్వంకన్న హిందూదేశం బ్రిటీషుపాలనలో తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొన్నది. ఆ విశ్వాసం దృఢంగా నాకున్నందు వల్లనే బ్రిటీషువారి పాలనా విధానమే పాప భూయిష్ఠము. అటువంటి పరిపాలనయెడ అనురాగం చూపడం ఆత్మద్రోహంగా, పాపంగా తలుస్తాను.........నేను ఎటువంటి తీవ్ర దండననైనా ఆహ్వానిస్తున్నాను, నవ్వుతూ కులాసాగా. నా చర్య మీకు (కోర్టువారికి) ఘోరమైన నేరంగా కనపడి శిక్షార్హ మవుతూవుంటే నేనా నేరాన్ని దేశభక్తుని విధికృతంగా ఉత్తమోత్త మయినదిగా తలుస్తాను.

"న్యాయమూర్తీ! నీ కొక్కటే మార్గం ఉంది. అయితే నీ వుద్యోగానికి నీళ్ళు వదిలెయ్యి; పాపానికి దూరమైపో; లేదా నేను చేసినది అధర్మంగా చట్టాన్నిబట్టి కనబడితే తీవ్ర దండన విధించు, చట్టం ప్రజా శ్రేయస్సుకే ఏర్పడిందని నీకు తోస్తే."

అంత స్పష్టంగా చెప్పినాడు మహాత్ముడు. ఆయన విధానంలో ఎప్పుడూ సామరస్యమే. శాంతియుత ప్రతిఘటనమే, సత్యాగ్రహమే, సత్యసందేశమే గోచరిస్తాయి.

జడ్జీ సి. యన్. బ్రూంఫీల్డు శిక్ష చెప్పేముందు కేసు యావత్తూ సంగ్రహం చేసినాడు. పన్నెండేళ్ళనాటినుంచీ అంటే తిలక్ కేసు నాటినుంచీ జరుగుతూవున్న వుద్యమం యావత్తూ కేసులో విషయమే. న్యాయాధిపతి తన ధర్మం నెరవేర్చక తప్పదు కనుక శిక్ష చెప్పినాడు. ఆరేళ్ళు సామాన్య దండన విధింపబడింది. ఐతే ఈ మధ్య కాలంలో ప్రభుత్వమూ కాంగ్రెసూ అనుకూలపడితే శిక్షాకాలం తగ్గుతుందనీ, లేదా గాంధీ ముక్తుడు కావచ్చుననీ, అలా కావడం తనకు సంతోషమనీ న్యాయపతి తెలియచేసినాడు. ఈ తీర్పు పిమ్మట గాంధీజీ తనపట్ల న్యాయమూర్తి చూపిన దాక్షిణ్యానికీ సుహృద్భావానికీ మెచ్చినాడు. అంతేకాదు తనను లోకమాన్యునితో తుల్యముచేసి గౌరవించినందుకు ఆయనకి కృతజ్ఞతాభి నమస్సు లర్పించాడు.

కేసు రాజకీయము. కాని దేశభక్తుడు అంతరాత్మ చెప్పిన ప్రకారము దేశసేవ చేయడమా, ప్రభుత్వ చట్టాన్ని తిరస్కరించడమా? అనే క్లిష్టసమస్య వచ్చింది. అప్పుడు సత్యాగ్రహులందరిలో సోక్రటీస్ ఉత్తమోత్తముడని, ఆయన పంథానే తాను అనుసరించానని గాంధీజీ స్పష్టంగా రాశారు.

గాంధీజీ తనకోసం ప్రత్యేకసౌకర్యాలు జైల్లో కోరనే లేదు. అందుచేతనే సి. యఫ్. ఆండ్రూస్ మహాత్ముని దర్శనం చేసే అవకాశం లేకపోయింది. మహాత్ముడు బాలగంగా

తిలక్ మహోదయులవలెనే జైలులో గీతా భాష్యము రచన ఆరంభించారు. ఆయన ఖురాన్, బేకన్, ఎమర్సన్, థోరో, టాల్‌స్టాయ్, రస్కినుల గ్రంధాలు పఠించేవారు. సంజవేళ ఒక చైనీయ క్రైస్తవ మిత్రునితో బైబిలు పారాయణం చేసేవారు. 1923 లో ఆయన ఆరోగ్యం పాడయింది. 12 జనవరి 1924 లో అర్ధరాత్రివేళ కల్నల్ మేడక్ సాహసించి గాంధీజీ ఆంత్ర ప్రదాహ వ్యాది ( Appendicities ) కి శస్త్రం చేశాడు. ఆసందర్భంలో మహాత్మణ్ణి పూనా ఆసుపత్రికి మార్చినారు.

అప్పుడు ఆండ్రూస్ ఇలా రాశాడు :—" ఇక్కడ ఈ పూనా ఆసుపత్రిలో ఉన్న దుర్బలవ్యక్తే భారతాధినేత, పరిపాలకుడు. ఈ వ్యక్తి పాలనమే ప్రభావమే దేశంలో బ్రిటీషు పాలనా ప్రతిపత్తులకంటే మిన్న. న్యూఢిల్లీ రాజమందిరాల్లో రాజప్రతినిధులకంటే ఈయన వేరు. అఖిల భారతావనిలో పల్లెపల్లెలా ప్రజలు మహాత్ముని నామాన్నే జపిస్తూ ఉంటారు. గవర్నర్ల పేర్లు స్మరణీయాలు కావు. కాని గాంధీజీయే వారికి చిరస్మరణీయుడు ! "

తదుపరి ఎట్టి నియమనిబంధనలూ లేకుండగనే ఫిబ్రవరి 5వ తేదీన గాంధీజీని ( ఇంకా శిక్షాపరిమితి ఉండగనే ) విడుదల చేశారు. ఆయన జుహూ బంగాళాకు అదివరకే రెండుసార్లు బంధితుడయిన జవహరులాల్ నెహ్రూ వచ్చినాడు. 1919 నాటి భారత రాజ్యాంగచట్ట రీత్యా శాసనసభల్లో ప్రవేశించి అధికారం హస్తగతం చేసుకోడానికి గాంధీ సమ్మతించలేదు. అంటే సహాయ నిరాకరణం చేద్దామని ఆయన ఉద్దేశం కాదు. నెహ్రూ పండితుడు ఉన్న శాసనాధికారం స్వీకరించి ఐరిషు ప్రజలవలె

రాజ్యసంపాదన చేయాలన్నారు. 1924 లోనే గాంధీజీ బెల్గాం కాంగ్రెసుకు అధ్యక్షుడయినా, ఆయన రాజకీయరంగం వెనుక తటస్థంగా ఉండదలచినాడు. నాడు ఆయన ముఖ్యంగా హిందూ ముసల్మానుల సమస్య, అస్పృశ్యత, గ్రామీణ కుటీర పరిశ్రమల విషయం శ్రద్ధ చూపదలచినాడు. "హిందూ మహమ్మదీయ మైత్రియే నా జీవిత పరమార్థం. దక్షిణాఫ్రికాలో నేనందుకే కృషి చేశాను. అందుకే ఇక్కడా శ్రమించాను, శ్రమిస్తున్నాను, శ్రమించబోతానుకూడా." అని గాంధీజీ ఎలుగెత్తి చెప్పినారు.

1925 ఏప్రిియల్ మాసంలో మహాత్మా గాంధీ తిరువాన్కూర్ వైకంగ్రామంలో హరిజన దేవాళయ ప్రవేశార్థం సత్యాగ్రహం నడిపెను. యీ సందర్భంలో ఆయన విజయం సాధించినట్లు కూడా లోగడనే మేము రాశాము. 1922 నుంచీ ఆయన కేవల రాజకీయరంగంలో కృషిచేయటం తగ్గించుకొన్నారు ఆరేళ్ళదాకా. మదరాసు కాంగ్రెసుచే పండిట్ జహ్వార్‌లాల్ వత్తాసు వల్ల "సంపూర్ణ జాతీయ స్వాతంత్ర"మే ప్రధానాదర్శంగా గుర్తించబడింది. చివరకదే లక్ష్యమైంది. ఈలోగా (అంటే 3 ఫిబ్రవరి 1928 లో) సైమన్ కమీషన్ భారతీయులు స్వపరిపాలనకు తగుదురా, తగరా? అని విచారణ జరిపి తెలుసుకొనేందుకు భారతదేశానికి వచ్చింది. కాని దేశం అన్ని తావుల్లో ఆ సంఘాన్ని ప్రజలు నిరసించినారు. తదుపరి గాంధీజీ (1928 నాటి) కలకత్తా కాంగ్రెసు తీర్మానానుసారం 1929 డిశంబర్ 31వ తేదీలోగా అధినివేశ ప్రతిపత్తి భారత దేశానికి ఇవ్వక తప్పదని బ్రిటీషువారిని హెచ్చరించారు.

నెహ్రూ ఇలా రాశాడు :—"పదిహేను సంవత్సరాల అహింసా ప్రబోధం భారత రాజకీయ నేపథ్యాన్ని పూర్తిగా, విప్లవాత్మకంగా మార్చివేసింది."

సత్యాగ్రహోద్యమం సాగుతూనే వుంది. ఉద్యమానికి భంగం కలిగించే హింస ఎక్కడా తలెత్తలేదు. అధినివేశ ప్రతిపత్తి ఇస్తామన్నది శుష్కప్రియాలేకాని క్రియాశూన్యం కావడం వల్ల, 1929 లో లండనులో బ్రిటీషువారు ఏర్పాటుచేసిన ప్రథమ రౌండు టేబిలు మహాసభకు కాంగ్రెస్ నాయకులు వెళ్ళలేదు. 1929 ఏప్రిల్ 6వ తేదీన గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం చేసినాడు. దండీవద్ద మే 4 వ తేదీన ఆయనను అరెస్టు చేశారు. పోలీసులు లాఠీచార్జీలు సాగించారు కాంగ్రెసు సేవకుల మీద. పోలీసులున్ను కొట్టు తగులబెట్టారు ప్రజ ఉద్రిక్తులై.

శ్రీనివాసశాస్త్రి, సర్ తేజ్‌బహాదుర్ సప్రూ రౌండు టేబిలు మొదటి సమావేశానికి వెళ్ళి బ్రిటీషువారిని కాంగ్రెసుతో సమాధాన పడమని చెప్పినారు. అప్పుడే గాంధీజీ ఆయన అనుచరులున్నూ ఏనియమాలూ లేకుండానే విముక్తు లయినారు. ఆయన లార్డ్ ఇర్విన్‌తో సూటిగా సంబంధం పెట్టుకొన్నాడు. ఇర్విన్ ఆ రోజుల్లో భారత రాజప్రతినిధి రెజినాల్డు రైనాల్డ్సు ఇరువురికీమధ్య రాయబారం నడిపేవాడు. దిక్చక్రము ఉషోరాగ రేఖలను చూపిస్తున్నది. రాజప్రతినిధితో గాంధీ కలిసినప్పుడు తేనీటి విందు చేశారు. గాంధీ తేనీరు బదులు నీరే అడిగి 'అక్రమ' మయిన ఉప్పు పొట్లాం మొలనుంచి తీసి నీళ్ళలో వేసుకొని తాగినాడు. 29 ఆగష్టు 1931 లో గాంధీజీ తటపటాయిస్తూ ఆలస్యం చేసిచేసి చివరకు రాజపుతానా నౌకఎక్కి రెండో గుండ్రబల్ల సభకు లండన్ వెళ్ళినాడు.

మార్సెల్సులో కష్టమ్సు ఉద్యోగులు ప్రయాణీకుల వస్తువులు తనిఖీ చేసేందుకురాగా గాంధీ ఇలా చెప్పినాడు. "నేనొక దరిద్ర సన్యాసిని. భౌతికమైన నా ఆస్తల్లా ఆరు చరఖాలు, జైలు చిప్పలూ, మేకపాల డబ్బా, ఆరు వడుకునూలు గావంచాలూ, తువ్వాళ్ళూ, ఏదో కాస్తోకూస్తో కీర్తిసి ఉన్నై." కష్టమ్సు ఉద్యోగులే కాదుకదా, ఇంకా ఓడలో వున్న తోటి ప్రయాణీకులంతా యీ సంభాషణను ఆలకించి విభ్రాంతి చేతస్కులైనారు. అనవసర వస్తువులన్నీ అంతకుముందే, ఏడెన్‌లోనే వెనక్కు పంపి వేయబడినాయి. కేవలం సామాన్యులూ, కార్మికులూ నివసించే పేట లండన్ ఈస్టెండులో శ్రీమతి మురెల్ లెస్టర్‌కు ఆయన అతిథి అయినాడు. ఇప్పటికీ గాంధీ విడిసిన కింగ్స్లేహాలు గదిలో ఆయన నాడు నిత్యం నూలుతీసిన రాట్నం చిరస్మరణీయంగా ఉంది.

లండనులో మొదటిసారి మహాత్ముని దర్శనం చేసే భాగ్యం నాకు లభించింది. గోవర్ వీధిల్లో ఎల్లిన్ విల్కిన్‌సన్ చే ఏర్పాటు చేయబడిన విందులో నేను ఆయనను దర్శించాను. నేను సి. ఇ. యమ్. జోడ్ పక్కనే కూర్చున్నాను, మా వరుసలోనే ఇంకా పది పదిహేనుమంది అతిథులు లార్డు స్టాన్సుగేట్, హెరాల్డ్ జె, లాస్కీవంటి ప్రముఖులు ఆసీనులైవున్నారు. గాంధీజీ అసాధారణమైన రాజనీతివేత్త! ఆశ్చర్యపడుతూ ఆయన్ని తిలకించినాను. నేనంతగా—గాఢంగా దూరదృష్టి లేనివాణ్ణి. ఏమిటో ఆయన ఘనత చూచాను. కాని ఆంతర్యం గ్రహించలేక పోయినాను. ఆయన మతం వామ పక్షీయులకూ, మార్క్స్ పక్షీయులకూ చిన్నతనంగా, చప్ప చప్పగా వుంది.

గాంధీ హాజరయిన రెండో గుండ్రబల్ల సభాఫలితం శూన్యమైంది. వెంటనే బ్రిటీషువారు అధినివేశ రాజ్యప్రతిపత్తి ప్రసాదించి తీరాలని భారత జాతీయ కాంగ్రెస్ అభిమతాన్ని పునరుద్ఘాటించింది. దానిమీద ఫలితం సున్న. ఆయన లంకా షైర్ బట్టమిల్లు లున్నచోటికి వెళ్ళినాడు. ఆ కార్మికులకూ, యంత్రాలకూ ఖాదీ వుద్యమంవల్ల నష్టం వచ్చింది. కార్మికులతో ఆయన ఇలా చెప్పినాడు :— "ఒకరోజు పనిలేకపోతే మీ దామాషా వేతననష్టం పదిషిల్లింగులయితే, మా దామాషా రాబడి నెలకు ఏడుషిల్లింగుల ఆరుపెన్నీలు మాత్రమే." అని తరువాత గాంధీజీ ఇలాఅన్నాడు : "మేము మర్యాదా పొంద డానికి సిద్ధం. కొంచెం మమ్మల్ని కష్టపెట్టినా మేము అన్నింటికీ సిద్ధమే. అయితే మాకు ఆదరణే లభించింది. అందుకుమేము సిద్ధపడలేదు. కాని ఈ అమూల్య స్మృతులను భద్రం చేసు కొంటాను, నా భౌతిక జీవితాంతం దాకా."

రౌండు టేబిలు సమావేశంలో సభ్యులతో గాంధీ వచనాలు : "భారతదేశానికి కావలసినది యదార్థమైన స్వాతంత్ర్యం. దానికి మీరు ఏపేరైనా పెట్టండి — రోజా పువ్వును ఏ పేరుతో పిలిచినా తీయని పరిమళం విరజిమ్ముతుంది, మాకు కావలసింది స్వేచ్ఛ అనే గులాబీ, అంతేకాని కృత్రిమ మయిన రోజాకాదు."

కింగ్స్లే హాలులో గాంధీజీ ప్రజలతో ఎంత కలిసిమెలిసి ఆప్యాయంగా ఉన్నాడో, శ్రీమతి లెస్టర్ ఇలా రాసింది :— "తరుణులైన తల్లులూ తండ్రులూ ఆయనకు మరీ దగ్గిరిగా వచ్చారు. వారు పిల్లల్ని ఎత్తుకొని గాంధీజీ ముద్దాడుతూ స్పృశించడానికి దగ్గిరిగా వచ్చారు." స్థానికంగా ఉన్న ఒక

కార్మికు డిలా అన్నాడు :—“ఆయన పద్ధతి యావత్తూ కని పెట్టినాను. ఆయన నిజంగా లోకానికంతకూ పూజనీయుడే.... సమ్మోహనాకారం. ఎప్పుడూ పెదాలపై హాసం. కులాసాగా ఛలోక్తిగా మాట్లాడుతూ ఉంటారు.”

డిసెంబరులో మహాత్ముడు భారతదేశం వెళ్ళినాడు. అదే పాశ్చాత్యదేశానికి ఆఖరిసారి ఆయన రాక.

# అధ్యాయం 42

1932 లో రెండవసారి అసహాయోద్యమం బ్రహ్మాండంగా ప్రారంభమైంది. ప్రభుత్వం ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేయ ప్రయత్నించింది. భారత దేశం శాంతిభద్రతలతో ఉండవలెనంటే స్వాతంత్ర్యం ఏదోరూపంలో తక్షణం ఇస్తేగాని లాభంలేదని దీనితో మరీ స్పష్టంగా ప్రపంచం తెలుసుకొంది. బ్రిటీషువారు భారతీయులలో ఐక్యతలేదంటూ ఇన్నాళ్లూ సాకు చెబుతూ వచ్చారు. జాతీయ కాంగ్రెసు దేశంలో అసంఖ్యాక ప్రజా సమూహానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఏకైక మహాసంస్థ కాదనే సాహసం ఎవరికీలేదు. ఎటొచ్చీ ప్రభువులూ; సంస్థానాధీశ్వరులూ బ్రిటీషువారికి దాసోహమని అంటూవుండటంవల్ల వారు అఖిల ప్రజానీకంలో చేరరు.

బ్రిటీషు రెసిడెంట్లు ప్రజాభిరుచి ఎరిగినవారు. ప్రజలు వాంఛించేది ఏదో వారెరుగుదురు. అంతేకాని నాయకులు కోరేదేమిటో వారికి తెలియదట. ప్రపంచంలో చాలా చోట్లవలె భారతీయ జనసామాన్యం రాజకీయవేత్తలు కారు. కాని భారత దేశం కూడా రష్యా తుర్కీస్థానంవలె లేదా సోవియట్ సమాఖ్యలోని రిపబ్లిక్కులవలె ప్రజాతంత్ర ప్రభుత్వానికి భారతీయులూ, భారతదేశం పూర్తిగా అర్హమైందే.

1932 జనవరిలో గాంధీజీని తిరిగి భారత ప్రభుత్వం అరెస్టు చేసింది. 1827 నాటి శాసనం ప్రకారం ఆయనను న్యాయవిచారణ చేయకుండానే జైలులో నిర్బంధించారు. అస్పృశ్యతా నిరోధంకోసం ఆయన యెరవాడా జైలులోనే ఎన్నోసార్లు ప్రాయోపవేశం చేశాడు. హరిజనులకు దేవాలయ ప్రవేశార్హత విషయంలో శాసనం చేయమని నిరసనవ్రతం పూనినాడు. దానిద్వారా హరిజనులకు దేవాలయ ప్రవేశం లభించింది. కాని సనాతనులను నొప్పించటం ఇష్టంలేక రాజ ప్రతినిధి శాసనం మాత్రం చేయలేదు. ఇంతకంటె ప్రముఖ మైంది 'కమ్యూనల్ ఎవార్డు' ను ప్రతిఘటిస్తూ, సవర్ణ అవర్ణ హిందూ ఐక్య సంఘటనకై కొనసాగించిన అమరణ నిరసన వ్రతం. కాని 6 రోజుల్లోనే ఘన విజయాన్ని గాంధీ చూర గొన్నాడు. ఇదిలా వుండగా మరొకవైపు డాక్టర్ అంబేడ్కర్ వర్ణాశ్రమ ధర్మాలన్నీ పెరికి పారేయాలనీ, కులాలు నశించి తీరాలనీ హెచ్చరిక చేయ సాగాడు.

గుండ్రబల్ల సమావేశం నిష్ఫలంకాగానే విల్లింగ్డన్ ప్రభువు రాజప్రతినిధిగా వున్నప్పుడు ప్రభుత్వ పాలనా విధానం మహా నిరంకుశమైంది. సర్ సామ్యూల్ హోర్ కూడా ప్రభుత్వ శాసనాలన్నీ "దారుణాతి దారుణంగానూ, కఠినంగానూ" వున్నవని తీవ్రంగా విమర్శించినాడు. మదరాసు బిషప్పు ఇలా వ్యాఖ్య చేసినాడు: "గాంధీమహాత్ముని జైలులో వేసిన నిరంకుశ అధికారవర్గంకన్న, వారిని క్రైస్తవు లనుకోడం కన్నా మహాత్మునిలో క్రీస్తును నేను చూస్తున్నాను. ఇలా

చూడడం నాకు బాధగా వున్నప్పటికీ మహాత్ముడు పరమ శాంతంగా దయాధర్మాలకోసం బాధపడుతూ ఉన్నాడు."

1933 లో బేషరతుగా మహాత్మా గాంధీ చెరసాలనుండి విముక్తు డయినాడు. కాని రాజకీయ కార్యక్రమం నెహ్రూవంటి తీవ్ర స్వరాజ్యవాదులకు వదలి ఆయన గ్రామోద్ధరణకై కృషి సాగించినాడు. నెహ్రూ గాంధీలకు భావాలలో కించిత్ భేదం వచ్చింది, నెహ్రూ అభిమతాన్ని బట్టి తీవ్రగతిలో దేశానికి రాజకీయాభ్యుదయం చేకూరవలెనని. కాని స్వరాజ్య చోదకు డైన గాంధీజీ హరిజనోద్ధరణకై హరిజన వాడలలో తిరుగాడుతూ సాంఘిక నిర్మాణ కార్యక్రమంలో నిమగ్ను డయినాడు. ఎలాగో నెహ్రూకు బ్రిటీషు రాజనీతివేత్తలతో సమభావం కలిగింది. ఆ రాజనీతి విశారదులు మత రాజకీయ జీవితం గడిపే మహాత్ముడూ అహింసా విప్లవకారుడూ అయిన గాంధీజీతో ఎలా నెగ్గవలెనో గ్రహించలేక పోయినారు.

ఈ లోగా గాంధీజీని వ్యక్తిగతమైన ఒక విషమ సమస్య ఎదుర్కొంది. ఆయన జ్యేష్ఠ కుమారుడు హరిలాల్ గాంధీ ముసల్మానుల్లో చేరిపోయి అబ్దుల్లా అయినాడు. "నీవు అబ్దుల్లా అయినా సరే, హరిలాలు అయినాసరే రెండు పేర్లూ ఈశ్వరుని నామాంతరాలే కాబట్టి నా కేమీ చింతలేదు." అని గాంధీ అభిభాషించాడు.

1936 సంవత్సరంలో కాంగ్రెసువారు రాష్ట్రీయ శాసన సభాధికారాలు హస్తగతం చేసుకోవలెనని నిర్ణయించుకొన్నారు. 1935 భారత రాజ్యాంగ సంస్కరణచట్టం ప్రకారం. 1937 లో గాంధీజీ ఇలా వ్రాశారు: "భారతదేశంలో చాలా భాగము

కాంగ్రెసు అధికారంలో ఉంది." కాంగ్రెసువారికి తొమ్మిది రాష్ట్రాల్లో అధికారము లభించింది. రెండు రాష్ట్రాల్లో మాత్రం అధికారంలేదు. దీర్ఘపోరాటం ముగింపు కానవస్తున్నది. 1932 సంవత్సరపు ప్రభుత్వ విధానములోని కాఠిన్యం తగ్గిపోయింది.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామ ధూమము దశదిశల అప్పుడే కమ్ముకొంటున్నది. మహాత్ముని అభిప్రాయాలకోసం లోకం తహతహ లాడుతుంది. హిట్లరు యూదుల విషయంలో అమానుషంగా ప్రవర్తిస్తూ జర్మన్ కీర్తిప్రతిష్ఠలను మంటకలుపు తున్నాడు. ఐనా గాంధీ విశ్వాస ప్రకారం హిట్లరుకుగాని, ముసోలినీకిగాని, స్టాలినుకుగాని పాపవిముక్తి వుంటుంది. మహాపాపం ఆచరించినా వాళ్ళకు విముక్తి సావకాశం ఉంది. పదేళ్ళ క్రితం మహాత్ముడిలా రాశాడు: "మారణ కారణమైన బాంబు వెనుక మానవ హస్తం దాన్ని విసరుతున్నది. ఆ హస్తం కదలడానికి కారణం మానవ హృదయమే. కొందరు తీవ్ర హింసావాదు లున్నారు. వాళ్లు వెనకనించి శత్రువుల ఇచ్ఛను ప్రవర్తింపచేయకుండా హింసాపద్ధతి అవసరమంటారు, అనుకొనే ఫలితం సాధించవచ్చు నంటారు........నాకు తీవ్ర విశ్వాసం ఉంది—ఆ విశ్వాసం నేడు పూర్వంకన్న మహా జ్వాజ్వల్యమానంగా వెలుగుతుంది. గడిచిన అర్ధశతాబ్దిలో నా అహింసానుభవంవల్ల ఆ విశ్వాస మహిమోన్నతి గ్రహించాను. అహింస మూలంగానే ఏనాటికైనా మానవకోటికి శ్రేయస్సు! ఇదే బైబిలు ప్రధానోద్దేశం; ఇలాగే నేను బైబిలు బోధపరచు కొన్నాను."

" అట్టి మహత్త అహింసాసిద్ధాంతం అమలు జరపడంలో తత్సాధనలో మనం జీవితాన్ని కోలుపోతే మాత్రం నష్టమేమిటి? మహా సిద్ధాతం కోసం అసువులు అర్పించినవాళ్ళ మవుతాము."

యుద్ధోన్మాదులకు మహాత్ముని అహింసాబోధ: "విజయం సాధించిన జేతవల్ల వచ్చినదేమిటి? ఆయన సాధించిన విజయమే ఆ జాతికి నాశనం." "శాశ్వత శాంతియెడ విశ్వాసం కలిగినవాళ్లు మానవస్వభావం పరమేశ్వరాంశను గ్రహించని వాళ్లు....కేవలం అనుభవంలోకి క్రీస్తు సందేశం తెచ్చుకోక, అపనమ్మకంతో వుంటూ, క్రీస్తు శాంతిదూతగా భావిస్తూవుండడం మహా ఘోరం. ఇంతకన్న మానవులకు విషాదాంతం ఏముంది? ఏసు సందేశం సంకుచితం చేసి విపరీతంగా ప్రవర్తించేవారిని చూచి ఖేదపడాలి." ఇటువంటి తీవ్ర ప్రబోధం నాడు పారసీకులకు క్రైస్తవులనుకొనేవాళ్ళకూ, మహా ఘనతవహించిన రాజకీయ ప్రాణులకూ నొప్పికలిగించింది. ఐనాసరే క్రైస్తవం పేర, మతంపేర జరిగే ఘోర అన్యాయాన్ని హర్షించక తెగువతో మహాత్ముడు నిశితంగా విమర్శించినాడు. నాటి రాక్షస పైశాచిక మారణ కృత్యాలను విజృంభింప చేస్తున్నా ప్రపంచ శక్తుల ముందు ధైర్యంగా బోరవిర్చి శాంత్యాభ్యుదయపూరిత ధర్మప్రబోధం కొనసాగించిన మహా మహిమాన్వితుడు మహాత్మా గాంధీయే!

1939 లో సంస్థానాల్లో ప్రభువులు ప్రజల్ని హింస పెడుతున్నప్పుడు గాంధీజీ మళ్లీ సత్యాగ్రహ ధ్వజం లేవనెత్తినాడు. సంస్థానాల్లో ప్రజల పోరాటం కాంగ్రెసు ఆదేశాన్ని బట్టి

అహింసాత్మక మైంది. సంస్థాన ప్రజలు కాంగ్రెసులో చేరినారు. కాని సుభాష్‌చంద్ర బోస్ జాతీయ సేనానిర్మాణం కావించి పోరాటం హింసాత్మకంగా నడపడానికి ఉద్యుక్తు డవుతున్నాడు. గాంధీజీ ప్రబోధానుసారం బోసుబాబు కాంగ్రెసు అధ్యక్షతపీఠం విడిచిపెట్టినాడు. మహాత్మునికి మద్దతు ఇస్తూ నెహ్రూ పండితుడు ఒక తీర్మానం కాంగ్రెసులో ప్రవేశపెట్టినాడు. దానితో బ్రిటీషు వారి వైదేశిక రాజనీతిని కాంగ్రెసు నిశితంగా ఖండించింది. భారతదేశం స్వేచ్ఛగా వైదేశిక రాజనీతి అవలంబిస్తుందని ఘంటాపథంగా కాంగ్రెసు వ్యక్తం చేసింది.

మరోపర్యాయం మహాత్ము డిలా చెప్పవలసి వచ్చింది : "బ్రిటీషువారు నాశనోన్ముఖు లవుతున్నప్పుడు, ఆ సావకాశం తీసుకొని మేము స్వాతంత్ర్యం పొందము." గాంధీ వచనాలతో పూర్తిగా వర్కింగ్ కమిటీ అంగీకరించలేక పోయింది. మౌలానా అబుల్‌కలాం అజాద్, మహాత్ముడూ కాంగ్రెసు యుద్ధసహాయం చేస్తుందనీ, అందుకుగాను ముందు దేశంలో జాతీయ ప్రభుత్వస్థాపన చేయవలెననీ బ్రిటీషువారితో చెప్పినారు. బ్రిటీషు ప్రభుత్వం దానికి సమాధానంగా "భావి భారత రాజ్యాంగరచన భారతీయుల బాధ్యత మీదనే నిర్మింపబడు తుంది." అని ప్రకటించింది. దానిమీద పాకిస్తాన్ సమస్య, ముసల్మానుల ఆందోళన సిద్ధమైనాయి.

గాంధీజీ అహింసాతత్త్వ ప్రచారం చేసేందుకు అవకాశం తీసుకొన్నాడు. "యుద్ధం బదులు అహింస అవసరం. అహింసా విధానం అవలంబించే వుంటే, గత కొన్ని మాసాలనించి జరుగుతున్న యూరోపు చరిత్రంతా మరో విధంగా వ్రాయ

బడేది. ఐరోపా రక్తస్రవంతులు ప్రవహింపచేసే అవసరం ఉండేదికాదు. చిన్న చిన్న రాజ్యాలు ఆహుతి కానక్కర్లేక పోయేది. ద్వేషం, మానవత్వంపట్ల అపనమ్మకం పెచ్చు పెరగక పొయ్యేది........నేను బ్రిటీషు ప్రజలకు యావజ్జీవ మిత్రుణ్ణి. ఈ మైత్రి అనిర్వేతుకంగా కోరేవాణ్ణి. నేనొకప్పుడు మీ బ్రిటీషు సామ్రాజ్యాన్ని గాఢంగా ప్రేమించినవాణ్ణి. అప్పుడది భారతదేశానికి మేలు చేస్తున్నదను నమ్మకం ఉండేది నాకు. కాని క్రమంగా చూస్తూవుంటే సామ్రాజ్యం మాకు అపకారమే చేస్తున్నదని గుర్తించాను. అందుచేత నేను అహింసాత్మకంగా మీ సామ్రాజ్యవాదంతో పోరు ప్రారంభించాను. పోరాడుతున్నాను." "యుద్ధాన్ని ప్రతిఘటించే ఏకైక పద్ధతి అహింస ఒక్కటే." అదే సత్యాగ్రహోద్యమం ఆరంభమైంది మళ్లీ, అరెస్టులు పెరిగిపోయినై. కాని గాంధీజీని మాత్రం బ్రిటీషువారు ఆలోచించి అరెస్టు చేయలేదు. యథా ప్రకారంగా 'హరిజన్' పత్రికలు ప్రకటింపబడుతూనే ఉన్నవి.

# అధ్యాయం 43

భారతేతిహాసమే గాంధీజీ స్వీయగాథ. ప్రపంచంలో (భారత దేశంలో కూడా) చాలామంది గాంధేయమత వ్యతిరేకపక్ష ప్రముఖులు మహాత్ముని ప్రభావం దేశంలో క్షీణిస్తుందనీ, అహింసాతత్వం నాయకుల అనుభవాల్లో లేదనీ, "ఆయన వృద్ధుడైనాడు. ఆయన సిద్ధాంతంకూడా జరాభావంతో శిథిలమై పోతోంది, ఆచరణలోలేదు." అన్న విమర్శన లేకపోలేదు. "ఇటువంటి వ్యాఖ్యలూ, విమర్శలూ, గత పదిహేనేళ్ళనించీ కుప్పతిప్పలుగా కురుస్తూనే ఉన్నవి" అంటూ పండిట్ జవహర్ లాల్ ఇలా రాశాడు—"ఈ పాలకులను ప్రజాహృదయం ఏలాంటిదో గుర్తించజాలని అజ్ఞానులనే చెప్పవలసి ఉంది. భారత రాజకీయరంగంమీద మహాత్ముడు పాదం మోపిననాటి నుంచీ నేటివరకూ ఆయనఖ్యాతి నానాటికీ అధికమవుతున్నదే కాని తగ్గట మనేది లేదు. అంతేకాదు. ఆయన యశఃప్రభావం ఇంకా విస్తృతమై, ప్రపంచమంతా వ్యాపిస్తున్నది." మహాత్మా గాంధీకి జై.' 'గాంధీ జిందాబాద్' అనే హిందూస్తానీ నినాదం ప్రతిభారత ప్రజాహృదయోద్రేకంనించి నిరంతరంగా వెలువడు తుండటమే దానికి ప్రబల సాక్ష్యం. భారత హృదయమే మహాత్మా గాంధీ!

ఫ్రెంచి గాయక, తత్త్వవేత్త రోమెరోలా మహాత్ముని జీవితకథ రాస్తూ ఆయనను భారత ప్రవక్తగా స్తుతించినాడు.

అందుకే కాబోలు రోం నగరంనుంచి వెడుతూవుంటే గాంధీని పోపు మతాధిపతి దర్శించనేలేదు ! కాని ఇటలీ రాజేంద్రుడు, అధికారవర్గమూ, ఇటలీరాణి మహాత్మునికి స్వాగత వచనాలు పలికినారు. అంతేకాదు రాణి స్వయంగా అత్తిపళ్లు ఆయనకు కానుకగా ఇచ్చి ధన్యురాలైంది. ఆయన ఏలాగో సావకాశం చేసుకొని రోం నగరంలో సిస్టన్ దేవాలయం, పీటర్ దేవళంలో క్రీస్తు శిలువనూ దర్శించినాడు. తరువాత కొంతసేపటికి గాంధీజీ దేశాయితో "శిలువను చూస్తే కళ్ళమ్మట నీళ్ళు ఆపుకోలేము" అని పలికినాడు. దర్బానులో పోలక్ సతీమణి ఇలా రాసింది: "గాంధీజీ ఫ్రేము కట్టించుకొన్న ఏసు శిరసు గోడనే వేలాడుతూ ఉంటుంది. ఆ పటము నాకు తరుచు ప్రత్యక్షమయ్యేది తలెత్తి చూచినప్పుడు."

నిజంగా మహాత్మునికి మానవ వ్యథా విషాదమూ కారుణ్యమూ బాగా తెలుసును, హిందూధర్మంలో లేకపోయినా. హిందూధర్మంలో ఆయన త్యాగశీలము గ్రహించినా, దానికి వ్యాఖ్యచేసి పేదల కుపకారం చేయడం, అస్పృశ్యతా నివారణమే త్యాగమన్నాడు. సనాతన భారతతత్త్వంలో జగత్తుకు అధిష్టాన సత్త పరబ్రహ్మ. మహాత్ముడు క్రైస్తవులకు ఈశ్వర విశ్వాసం. పరమకారుణ్యాన్ని జ్ఞాపకం చేసినాడు. గాంధీజీ అభిమతాన్ని బట్టి పాశ్చాత్య ప్రపంచంలో ఈశ్వర విశ్వాసం స్థానే అధికార జాడ్యం తాండవిస్తున్నది. అధికారమే, శక్తిసంపాదనమే బైబిలులో వారు ప్రస్తుతం గ్రహించింది.

భారతదేశ నివాసముందు క్రైస్తవ మిషనరీగా కొన్నాళ్లు దక్షిణాఫ్రికాలో (గాంధీజీ ఉన్నప్పుడు) పనిచేసిన సి. యఫ్.

ఇటు నెహ్రూ పండితుడు స్పెయిన్ ప్రజాస్వామికంపట్ల జెక్కుల పట్ల, రష్యాపట్ల సంపూర్ణ సానుభూతి కనబరిచినాడు. ఇట్టి క్లిష్టపరిస్థితిలో గాంధీకర్తవ్యం ఏమిటి ? ఏమిచేయాలి ? ఆయన జెక్కులకూ, యూదులకూ, భారతీయులకూ ఇచ్చే సలహాఏమిటి?

జాతీయ స్వాతంత్ర్య సంపాదనకు మహాత్ముడు బ్రిటీషు వారితో శాంతియుతంగానే సహాయ నిరాకరణం చేయవలసిందని భారతీయులకు సలహా ఇచ్చినాడు. అందుకు ప్రపంచం ఆయన పక్షాన్నే ఉంది. నాడు బ్రిటిష్ కార్మికపక్షం ( తరవాత అధికారం లోకి వస్తుంది ) మహాత్ముని పద్ధతి ఆమోదించింది. ఈ సందర్భంలో ఒకయేడు పార్టీ సమావేశంలో భారత దేశానికి సంబంధించిన తీర్మానం ప్రవేశపెట్టే గౌరవం నాకు లభించింది. అనక 1945 లో బ్లాక్‌పూలు సమావేశానికి అభ్యర్థిగా వెళ్ళి భారతీయ స్వాతంత్ర్య ప్రధాన విషయమై ప్రతిపాదితమైన బ్రిస్టల్ తీర్మానాన్ని గాఢండా సమర్థించాను. బోయరు యుద్ధ విషయంలో విముఖుడుగా వున్న విన్‌స్టన్ చర్చిల్ 1929 లో మహాత్ముని గూర్చి ఇలా వ్యాఖ్యానించాడు. " మిడిల్ టెంపులు లాయరైన గాంధీ నేడు ఫకీరుగా నటిస్తూ, అర్ధదిగంబర సన్యాసి రూపంలో ఒకవంక వైస్రాయి భవన సోపానాలు అధిరోహిస్తూ, వేరొకవంక రాజద్రోహ పూరితమైన అసహాయోద్యమ కార్యక్రమం జరిగిస్తూనే సమానహోదా ప్రాతిపదికగా రాజప్రతినిధితో సంధి సంప్రదింపులు నెరపబోవటం చూస్తే (నాకు) దిగులు వేస్తూంది, చీదర గొలుపుతోంది," ( మిస్టర్ చర్చిల్ పలుకులు సత్యదూరాలు. గాంధీజీ ఇన్నర్ టెంపులు న్యాయవాదేగాని,

మిడిల్ టెంపులు వకీలు కాదు, ఈ సందర్భంలో మిష్టర్ చర్చిలు చరిత్రను పరిశీలించమని సవాలు చేస్తున్నాం. అంతే కాదు, ఈ ఫకీరునే, యీ రాజద్రోహినే బ్రిటీషు సామ్రాజ్యం ప్రశంసిస్తూ షీల్డుమార్షల్ స్మట్సు, మెకంజీ కింగ్‌లకు బహూకరించిన 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' పతాకాన్ని గాంధీకి కూడా బహూకరించి గౌరవించిందనే సంగతి గుర్తుకు తెచ్చుకోమని, ఆనాటి తన స్థితిని మరిచిపోవద్దని మేము సలహా ఇవ్వటం అనుచితం కాదేమో ?" )

చర్చిల్ ప్రేలాపనంతా గాలిలో మిళితమైందేకాని, వినేవా డొక్కడూ లేకపోయాడు. వినేవాళ్లు ఉన్నా యేవగించు కొంటారు. అంత అసభ్యంగా అనౌచిత్యంగా వాగినాడు చర్చిల్. ముందుగా హిట్లర్, ముసోలినీలను ప్రశంసించింది ఎవరు? చర్చిలా, మహాత్ముడా ? తత్ఫలంగా ప్రపంచకల్లోలం ప్రారంభం కాగానే శాంతి స్థాపనకని రెండుమార్లు హిట్లరుతో అవస్థ పడిన వారెవరు ? చర్చిలేకదా ? యీ సత్యాన్ని ఆయన ఇక్కడ కాదన్నా భగవంతుని న్యాయస్థానంలో కాదనలేడు. ఆయనే తన యుద్ధోన్మాదాన్ని వెళ్ళగ్రక్కినాడు. మహాత్ముడు ఒక్కడే యుద్ధానికిస్వస్తిచెప్పి అహింసాసందేశం లోకానికి వినిపించినాడు.

ఐనా గాంధీజీ చేసిందీ చేస్తున్నదీ సవ్యంగా వుందా? అదే మహా సమస్య. సత్యాహింసలకు త్యాగప్రబోధం జతపర్చి సహాయ నిరాకరణోద్యమం నడిపినాడు. సత్యాహింసలు ఆచరణ యోగ్యాలని సాధనద్వారా ఫలితం సాధించి చూపినాడు. ఇదే గాంధేయమత సమాధానం-యావత్ ప్రపంచానికీ, చాలదా ?

యుద్ధసమాప్తికి యుద్ధం. హింసకు ప్రతిహింస, ద్వేషానికి ప్రతిద్వేషం ఈపరంపరకు అవసానం ఉందా? ఇదేనా విజ్ఞానం?

ఛెమ్సుఫర్డు మహాత్ముని సిద్ధాంతం ఉద్యమమూ "అత్యంతమూ అవివేకం" అని పలికినాడు, రెండు శతాబ్దాలనుంచీ పాతుకున్న బ్రిటీషు సామ్రాజ్యాన్ని కూలదోయడానికి భారతీయు లుద్యమించి నప్పుడు ఇది అవివేకమా? వివేకావివేకమా? అనగా వివేకుల అవివేకమా? కళ్ళారా చూస్తూవుంటే యదార్థంగా బ్రిటీషు రాజ్యం అస్తమించింది మహాత్ముని అహింసా శక్తి వల్ల. తృతీయ మహా సంగ్రామం ముంచుకొస్తున్నది. మహాత్ముని విధానంకన్న రాజనీతివేత్తలు అతితెలివితేటలతో తెలివైన పద్ధతి అవలంబిస్తారు కాబోలు!! సామ్రాజ్య సందేశం నుంచి నిరంకుశుల యుగం అవతరిస్తుంది క్రూరంగా, నవీనంగా.

1942 మార్చి నెలలో సర్ స్టాఫర్డు క్రిప్సు భారతదేశం వచ్చినాడు. ఆయన అర్పించబోయే కాన్కు చూచి మహాత్ముడు వెంటనే ఆయనను తిరుగు విమానంలో లండను వెళ్ళమని సలహా ఇచ్చినాడు. క్రిప్సుగారి స్వాతంత్ర ప్రతిపాదనలో ముసల్మానుల హక్కులకు అల్పసంఖ్యాకుల హక్కులకూ రక్షణ వుండటమే కాకుండా రాజప్రతినిధికి కూడా కొన్ని అధికారా లుంటవి. ఇదివరకే ఇట్టి అధికారాలతో భారతదేశం చాలా కష్టాలుపడింది. దానిమీద భారతదేశం ఇచ్చిన సమాధానం 'క్విట్ ఇండియా,' వర్ధాలో వర్కింగు కమిటిచే బ్రిటీషువారిని పైతొలగిపొమ్మనే 'క్విట్ ఇండియా' తీర్మానం ఆమోదింపబడింది, 1942 ఆగష్టు 9 వ తేదీన మహాత్ముడు బంధితుడైనాడు. పూర్వంవలె జైలులో కాక, ఆయనను గౌరవ పూర్వకంగా పూనా ఆగాఖాన్ రాజమందిరంలో ప్రభుత్వం

నిర్బంధించింది. 6 మే 1944 లో బేషరతుగా మహాత్ముడు విముక్తుడయినాడు. అదే సమయంలో బహుశా ఫిబ్రవరి 13 వ తేదీన అనుకుంటాను, మహాత్ముడు విఖ్యాత క్వాకరైన కారల్ హీత్ మహాశయునికి ఇలా లేఖ వ్రాశాడు: "ప్రియ మిత్రమా! నేడే నీ స్వాగత వచనాలతో ఉత్తరం అందుకొన్నాను. ప్రస్తుతం నేను చెలరేగే తుఫాన్ మధ్యలో ఉన్నాను. 'పరమేశ్వరా నీలో నన్ను దాగనీ!' అని జపిస్తున్నాను. నీ విశ్వాసపాత్రుడు, మో. క. గాంధీ"

1946 లో కార్మికపక్షం అధికారంలోకి వచ్చింది, దాని వల్ల అమాత్య రాయభారవర్గం భారతదేశానికి వచ్చింది— తాత్కాలిక రాజ్యాంగ రచనకై, ఆపోహలు పారవోలడానికై. 1947 లో అమాత్య రాయభారవర్గం తీర్మానించిన విధంగా మౌంట్ బాటన్ ప్రభువు ఇండియా రాజప్రతినిధిగా నియమితుడైనాడు. బ్రిటీషువారు వైదొలగిపోతామని నిర్ణయించారు. స్వరాజ్యం సిద్ధించింది. రాజప్రతినిధిగా ఆయన వెళ్ళేముందు నేను చూచినాను. జనకోలాహలం. బ్రిటీషు నిర్ణయం వినేందుకు సంతోషంగా తండోప తండాలుగా ఒకటే జనం! నెహ్రూ కీజై, మహాత్మా గాంధీకీ జై అనే జయజయ నినాదాలు మిన్నుముట్టినై. ఆ కోలాహలం వొళ్లు తెలియక జనం కిక్కిరిసినప్పుడు తన మోటారుకింద ఒక భారతీయ బాలుడు నలిగిపోయే ప్రమాద స్థితినుంచి రాజప్రతినిధి తప్పించినాడు. అంతేకాదు, ఆ బాలుణ్ణి రాజప్రతినిధి ఎత్తుకొనేసరికి ప్రజలంతా మురిసిపోయినారు. మౌంట్‌బాటన్ పిల్లవాణ్ణి ముద్దుగా చూచినాడు. ఇదొక

అద్భుతమే! రాజదర్పం లక్ష్యంచేయక మరిచిపోయి ఆయన కుర్రవాణ్ణి తనకూ నెహ్రూకూ పక్కనే కూర్చోపెట్టుకున్నాడు. భారతదేశ విజయం అహింసా సత్యాగ్రహ ఫలం; మహాత్ముని సత్యనిష్ఠకు ఫలం; చరిత్రలో శాశ్వత స్వర్ణాక్షర లిఖితం!

తుది దృశ్యం స్మరించకుండా ఏమీ నిర్ధారణగా చెప్ప లేము. భారతదేశం స్వతంత్రమైంది. ముసల్మానులు వారి హక్కులకై పాకిస్థానం అడుగు తున్నారు. అందుమీదనే పంజాబులో హిందూముసల్మానులు కత్తులు దూసుకొన్నారు. దేశంలో రక్తపాతం, హత్యాకాండలు పెరిగిపోయినై, అంత ర్యుద్ధాగ్నిజ్వాలల్లో భారతం ఏమైపోతుందో అనే భీతి ఆందోళనా బయలుదేరినై. నవకాళీలో, బీహారులో హత్యలు మితిమీరి పోయినై. మానవత్వం మంటకలిసిందా అన్నట్లు—కలకత్తాలో కుత్తుక లుత్తరించుకొన్నారు. అప్పుడు ఎనభైయేళ్ళ వృద్ధుడు మహాత్మా గాంధీ తన ముసల్మాను మిత్రులతోనూ, ప్రధాని అయిన సుహ్రావర్దీతోనూ తూర్పు బంగాళం సంచారం చేసినాడు. ఆనక కలకత్తాలో ఇద్దరూ ఒకే కుటీరంలో కూర్చున్నారు. హిందువులు గుంపులై ఉద్రేకపూరితులై గాంధీని వెనుకకు వెళ్ళమన్నారు. "మాదే దోషమా? ముసల్మానులు కిరాతులై హత్యాకాండ జరుపుతూవుంటే మాదే తప్పుగా ఎంచుతారేం? వాళ్ళ దోషాలు ఎంచరేమి?" అని నిలదీసి అడిగినారు. దానికి మహాత్ముని ప్రతివచనం: "నా అభిమతం మార్చలేరు. నన్ను చంపవలెననుకొంటే చంపివేయండి." అంత ఆవేశంతో వున్న యువకమూకా కిక్కురుమనక వెనుదిరిగి పోయింది—గాంధీ

వాక్కు వినగానే, తరవాత మహాత్ముడు చాలామంది అనాథ స్త్రీల కన్నీరు తుడిచినాడు. వారి రోదనం ఆయన గుండెల్ని కరిగించింది. ఐనా సత్యాహింసలే ఆయన సందేశం.

బెంగాల్ ద్వేషజంయూ తరంగార్భటి శమించింది. ఉద్రేక సాంద్రము ఉపశమించింది. కాని తూర్పు బంగాళంలో మానవత్వం మారణహోమం అవుతున్నప్పుడు తత్ప్రతీకారంగా పంజాబులో, ఢిల్లీలో, సంయుక్తప్రాంతాల్లో ప్రజలు తలలు నరుక్కోటం ఆరంభించారు. రక్తస్రవంతులమధ్య పీనుగులు పొర్లాడసాగినాయి. తక్షణం మహాత్ముడు ఢిల్లీ బయలుదేరినాడు. లాహోరు అమృతసరాల్లో ద్వేషాగ్ని అప్పటికే బలిసిపోయింది. అల్పసంఖ్యాకులైన ముసల్మానులు, తూర్పు పంజాబు శరణార్థులూ ఢిల్లీ ఎర్రకోటలో తలదాచుకొన్నారు. సింధులో హిందువులు అల్పసంఖ్యాకులు కనుక అత్యధికంగా ముసల్మానుల క్రౌర్యానికి ఆహుతి అయినారు. కొందరు చావు తప్పి సర్వస్వం కిరాతుల కర్పించి, ఆలుబిడ్డల్ని, అన్నదమ్ముల్ని, తల్లిదండ్రుల్ని వీరువారూ అనేమిటి బంధువర్గమంతా గూండాలచే శిలదగ్ధులయ్యో, శీర్షఖండితులయ్యో మడియగా మిగిలిన అభాగ్యులు హిందూస్తాన్ శరణార్థులై వచ్చారు, తండోపతండాలుగా.

ఆ విధంగా ఉభయ మతగ్రాహకుల హృదయాలలో అనిర్వచనీయ ద్వేషానలం కట్టలుతెగి ప్రవహిస్తున్న వాతావరణమప్పుడు మహాత్ముడు, ఎనభైయేళ్ళ బడుగుదేహి వృద్ధు ఎర్రకోటలో ప్రవేశించ దలచుకొన్నాడు. ప్రవేశించాడు ఒంటరిగా. ఎంత తెగువ; ఎంత ధైర్యశాలి! ఎవరలా తెగించేవారు; ఎవరికా గుండెలుంటాయ్! ఆయనమీదకు ఎవరూ కత్తులు

దూయలేదు, పొడిచి చంపనూలేదు. కామ్రేడ్ స్టాలిన్, మోలటోవ్‌లవలె విపరీత పోలీసు రక్షణ మహాత్మునికి అనవసరం. ఆయనకు 'బుల్లెట్ ప్రూఫ్ కారు' అంతకన్నా అవసరంలేదు. ఆయన ఆ విధంగానే ప్రస్తుతించబడ్డాడు. ఆయన అభాగ్య శరణార్థులను మానవులగనే గుర్తించాడుగాని, ఏ అమానుష ఫాసిస్టులుగనో, మతావేశ రేచులుగానో, ముసల్మాను హత్యాకారులుగానో లేక హిందూ విద్రోహులు గానో చూడలేదు. ఆయన వారిలో మానవత్వాన్నే సందర్శించి నాడుగాని పైశాచిక పశుత్వాన్ని కాదు. దయాదాతృత్వాల ద్వారానే నాటి ద్వేషాగ్నికీల చల్లార్ప సమకట్టినాడు మహాత్ముడు. హిందూ-ముస్లిం ఐక్యతకై జీవితాన్నే పణంగాపెట్టి పాటు పడుతున్న ఏకైక మానవమూర్తిని నిర్వాసితులు గాంచి పులకాంకితులై యావన్మందీ మనసా 'మహాత్మా గాంధీకీ జై' అని ముక్తకంఠంతో నినాదం చేశారు.

ఇక్కడ ఈ విషయాన్ని అల్పమైనదిగా పరిగణించ రాదు. గాంధీజీ అత్యంత సంతృప్తికరంగా సమస్యకు సమాధానం ఇస్తాడా? ఇస్తాడనే (పై సంఘటనద్వారా) స్పష్టపడుతోంది; నేటి నాగరకత నాలుగు కాలాలపాటు నిలిచేందుకు అవకాశం కానవస్తోంది. అదే ఆశయంతో; సమస్యా పరిష్కారంకోసమే నా భారత యాత్ర ప్రారంభించ బడింది.

# అధ్యాయం 44

మహాత్ముని నాయకత్వ ఫలితంగా దేశానికంతటికీ స్వరాజ్యం లభ్యమైంది. నా చేతిలో ఉన్న పుస్తకం 'హింద్ స్వరాజ్య' లో మహాత్ముని ఆదర్శములూ, విశ్వాసములూ నిక్షిప్తాలు. 1908 లో దక్షిణాఫ్రికా జీవితకాలమప్పుడు మహాత్ము డీ గ్రంధరచన చేసినాడు. గాంధీజీ భారతదేశానికి వెళ్ళినతరువాత హింద్ స్వరాజ్యంలో ఉల్లేఖించిన ఉద్దేశ్యాలూ విశ్వాసాలు మార్చు కొంటాడని గోపాలకృష్ణ గోఖలే పలికినాడు. కాని గ్రంధస్థము లైన మూల సిద్ధాంతము లేమాత్రం మహాత్ముడు మార్చుకో లేదు. 1921 లో గాంధీ ఒక సందర్భంలో రాస్తూ—"నా విశ్వా సాలు మునుపటికంటే నేడు మరింతా దృఢమవుతున్న" వన్నాడు. ఈ హింద్ స్వరాజ్య అనే గ్రంధనామంతోటే రాజకీయోద్యమం భారతదేశంలో పుట్టిపెరిగింది. రాజకీయ నైతిక విశ్వాసాలకు, ధర్మాలకు ఆ పుస్తకమే ప్రామాణిక మైంది. ఆ పుస్తకమే సెయింట్ ఇగ్నేషియా లయోలా 'ఆధ్యాత్మిక సాధన' వంటిది. అంతేకాని 'హింద్ స్వరాజ్య' రాజకీయ కరపత్రం వంటి స్వల్పమైనది కాదు.

గ్రంధంలో ఛణుకులు మహాత్ముడు ఎలా విసిరినాడో గమనించవచ్చును. "నాగరకత కుదరని రోగంకాదు" అంటూ

ఆయన వాదంలో సారం విప్పి చెప్పినాడు. శాంతియుత ప్రతి ఘటనవల్ల స్వరాజ్య సంపాదనము; అహింసా సిద్ధాంతంవల్ల న్యాయధర్మార్జనము; త్యాగమువల్ల మానవహృదయ పరివర్తన మున్ను మహాత్ముని సిద్ధాంత సారము. ఇదే ఆచరణ. సత్యాగ్రహి ఎటువంటివాడై ఉండవలెను? అహింసాత్మక సహాయ నిరాకరణం చేసేవాడై ఉండవలెను. ఉదాసీనుడు కాక శాంత్యహింసల వల్ల తేజస్సూ శక్తీ సంపాదించినవాడుగా ఉండవలెను. మహాత్ముని సిద్ధాంతం యావత్తూ, నెహ్రూ పండితుడు కూడా విమర్శిస్తూ అందరూ అనుష్ఠించలేరన్నాడు.

"చాలా అనుభవం గడించిన అనక నాకేమి తోస్తుందంటే సత్యాగ్రహులయ్యే దేశసేవకులు పరిశుద్ధజీవనులై, దారిద్ర్యము వరించి, సత్యవ్రతులై నిర్భయులై ఉండక తప్పదు.........మనసు దృఢతరం కావడానికి పారిశుధ్యమే ఘనమైన సాధనల్లో ఒకటి.........సతీపతులు కామము పరస్పరం తృప్తిచేసుకోడం మాత్రమే పాశవ భోగము. ఆ భోగవృత్తి ప్రజాభివృద్ధికి తప్పితే అన్యంగా నిషేధించితీరాలి. ప్రజననమూ వంశాభివృద్ధి వాంఛను కూడా సత్యాగ్రహి మనసునుంచి పారదోలి, కామోపభోగము విసర్జించాలి."

క్రైస్తవంలో పూర్వం ఆగస్టయిన్, పాల్‌వంటి భక్తుల వచనాలకూ మహాత్ముని వాక్యాలకూ ఎంత దగ్గరి చుట్టరికం! మహాత్ముని నుడివిరీత్యా పరిశుద్ధత, పరిణయము ఎలావుండాలో క్రైస్తవ భక్తులు కూడా అదేరీతిగా ప్రవచించినారు. నేను లోగడ మనవిచేసిన సాలగ్రామార్చన తాంత్రికయోగాల మాటేమిటి?

సెయింటు పాల్ అయినట్లయితే ఈ అర్చనర విషయంలో ఇస్లాం విగ్రహధ్వంసకుల కంఠంతో తీవ్రంగా నిరసించేవాడేమో! కాని ఇది స్థూలదృష్టే అవుతుంది. కారణం తాంత్రికయోగంలో ఉద్దేశ్యం కూడా శక్తి సంపాదనమే, కామనిగ్రహం కోసమే. ఈ యోగంలో ముఖ్యంగా వామాచారం ఎంత గర్హనీయమయినా అల్పమయినా, ఉదాత్త యోగసాధనవల్ల మనిషి జితేంద్రియుడు కాగలడు. కనుక ఈ సాధనకూ మహాత్ముని సాధనకూ మధ్య వైరుధ్యం లేదు. మనోవైజ్ఞానికవేత్తలు ఏది ఎలా నిర్వచిస్తు న్నప్పటికీ యోగం చెప్పిన రీతిగా మహాత్ముడు కూడా చిత్తవృత్తి నిరోధమే, మనోనిగ్రహమే ప్రబోధిస్తూ ఉన్నాడు. మహాత్ము డింత కఠిన సాధనసంపత్తి సత్యాగ్రహి అవలంబించవలెనని నిర్దేశించుటకు కారణం దేశంలో దుస్తంత్రం పెరిగిపోవడం వల్లనే కావచ్చు. సిరియా మతాల దుర్వివాదం మధ్య విసిగి ఆనక సెయింట్ పాల్ మనసు కూడా మహాత్ముని వలెనే అయినది.

మహాత్ముడే తన ఇంద్రియాలను జయించవలెనని యదార్థము చెప్పినాడు. యంగ్ ఇండియా పత్రికలో జూన్ 1924 లో ఇలా ఆయన ఉల్లేఖించినాడు: "స్వప్నంలో కూడా ఎవడు అకామహతుడో వాడు పూజనీయుడు. వాడే జితేంద్రి యుడు. వాడే క్రైస్తవం ప్రకారంగా కూడా భగవత్సామ్రాజ్యం చేరగలడు. పరమేశ్వర సాయుజ్యం పొందగలడు....దంపతులు ఇంద్రియ సంయమం అలవాటు చేసుకొని జీవితం గడప వచ్చును."

మహాత్ములయినవారు ఒకప్పుడు అజ్ఞానులై తాము చేసిన తప్పిదములు స్వీయచరిత్రల్లో ఉద్ఘాటన చేస్తారు. కొందరు తమ

దోషా లుగ్గడించలేరు. గాంధీజీ స్వీయచరిత్రలో నిజదోషాలు ఉల్లేఖించ గలిగినాడు. ఆత్మోన్నతికి స్వీయ గుణదోష వివేచన అత్యవసరం. అటువంటి వివేచనగల సాధకుడే ఆత్మోన్నతి పొందగలడు. అతడే సంపూర్ణంగా నిజజీవితమును మహోన్నత లక్ష్యానికి అంకితం చేయగలడు.

"స్త్రీ పురుషుల మధ్యఉండే రాగాత్మకవృత్తి మహా ఆకర్షణీయము. సోదరీ సోదరులమధ్య ఈ వృత్తి సోదర భావంగా, మాతాసుతుల యెడల వాత్సల్యరూపంగా ఉంటుంది. ఈ ఆకర్షణీయ చిత్తవృత్తి అతిసహజమై లోకపు సృష్టికి ఆధారమైంది. నా కర్మయోగం సార్థకం కావడానికి స్త్రీలను అక్కచెల్లెండ్రవలె చూస్తాను. స్త్రీ లోకం యావత్తూ నాకు సోదరీ మయము, మాతాసుతమయము. కామాతిరేక దృష్టితో స్త్రీ లోకంతో వ్యవహరిస్తే సర్వనాశనం తప్పదు."

ఈ విచక్షణగల వ్యక్తి భారతదేశంలోనే కాక ప్రపంచంలో కూడా సార్థకంగా ఉన్నవాడు మహాత్ముడు ఒక్కడే. సెయింట్ పాల్ వచనామృతం మహాత్ముని బోధామృతం సమంగా ఉంటవి ! పై వాక్యాలు మంచివేనా, కావా ?

గాంధీజీ బ్రహ్మచర్యాన్ని ఉద్దేశించి చెప్పినాడు : సనాతన ధర్మంలో బ్రహ్మచర్యం ఆశ్రమాల్లో విద్యాభ్యాసంచేసే శిష్యుల సాధన. బాల్య వివాహాలను నిషేధించే సాధన అది. గురుకులం వదలి విద్యార్థి గార్హస్థ్య జీవనం చేస్తాడు. సంతానం కలుగుతుంది. ఇది రెండో భూమిక. యాభై యేళ్లు నిండిన తరువాత గృహస్థాశ్రమం త్యజించి వానప్రస్థుడౌతాడు. తదనంతరం ముముక్షుడై

తురీయాశ్రమం స్వీకరిస్తారు. మహిమోపేతులైన భారతీయులు ఆశ్రమ ధర్మాలు అనుష్ఠిస్తారు, సాధన చేస్తారు. కాని గాంధీజీ సన్యాసి కాడు. ఆయనకు భార్యాబిడ్డ లున్నప్పటికీ ఆయన గృహస్థు కాడు. ఆయన ఒక విశిష్టమైన రీతిలో బ్రహ్మచర్యం నడుపుతున్నాడు. ఆయన దృష్టిలో బ్రహ్మచర్యం విశేషార్థం గలది.

"బ్రహ్మచర్యం కేవలం యాంత్రికమైన నిగ్రహం కాదు. సంపూర్ణమైన జితేంద్రియత్వం, మనో వాక్కాయ కర్మల్లో కూడా అకామం బ్రహ్మచర్యమవుతుంది. ఆ బ్రహ్మచర్యమే ఆత్మావబోధనకి, బ్రహ్మానుభవానికి సాధన. (యంగ్ ఇండియా ఏప్రిలు 1926) "బ్రహ్మచర్యం విశాలమైన అర్థవత్తలో విచారణ చేసినాను. సామాన్యార్థంలో త్రికరణములను వశం చేసుకోవడం బ్రహ్మచర్యం. బ్రహ్మచారి, బ్రహ్మచారిణిగా జీవించే వ్యక్తులు అకామహతులు. వారు పరమేశ్వర సాన్నిధ్యంలో సారూప్యం పొందుతారు." అటువంటి మహనీయుడే శ్రీ రామకృష్ణ పరమహంస!

మన సమాధాన మేమిటి? పాశ్చాత్యుల దృష్టికి సాలగ్రామార్చన హేయంగా కనబడుతుంది. పోనీ సెయింట్ పాల్ నిరూపించిన బ్రహ్మచర్యం అంగీకరిస్తామా? అగస్టయిన్ భక్తుని అభిమతం అంగీకరిద్దామా? పాపమంటే అర్థం—? కామం నిగ్రహించుకొన్న మాత్రాన సర్వపాపాలకు అతీతుడా మానవుడు? ఎంతవరకూ ఈ కామనిగ్రహం? ఈ సమస్యలన్నీ పాశ్చాత్యుడు యోచించక ఎగరకొట్టేస్తాడు. కాని పాల్, అగస్టయిన్, కిర్కెగార్డ్ వంటి మహనీయులు అంత చులకనగా

తోసిపారేయలేదు. సత్యంకోసం కాళీ హనుమాన్ దేవాలయంలో అన్వేషిద్దామా? లేక యోగుల వైరాగ్యసాధనతో ఏకీభవిద్దామా?

ఇలా మనం అనవచ్చును. సహజమైన ఇంద్రియ ప్రవృత్తిని నిగ్రహించినప్పుడు మానవ ప్రకృతి కష్టాలకు లోను కావచ్చును. సహజమైన కామవాంఛలు ఈడేరే సావకాశంలేక మానవుని నడవడి వక్రం కావచ్చును. సాలగ్రామార్చనలో కూడా అతృప్తమయిన వాంఛసఫలత లేకపోలేదు. ప్రతీకాల ద్వారా ఇంద్రియ తృప్తి ఘటిల్లవచ్చును. కాని కాళీపూజలు, శాక్తేయ వామాచారాలు మానవుని ఘోరప్రవృత్తి, కేవలం పాశవం. ఈ వృత్తిని ఆల్డస్ హక్స్లీ పరిశీలనచేసి తన 'పెరినియల్ ఫిలాసఫీ' అన్న గ్రంథంలో సమాధానం వ్రాసినాడు—మహాత్ముడే ఆధ్యాత్మిక సాధనాంతంలో చక్కని కుసుమమని.

విషయాకర్షణ మూలంగా మానవప్రేమ అంగీకరించక తప్పదు. ఈ విషయ సంగమం సాంకేతికంగా ప్రపంచంలో గోచరిస్తుంది. జర్మన్ కవిచక్రవర్తి గేటే రచించిన 'ఫాస్టు' నాటకంలో ఒక రంగంలో ఇదే కానవస్తుంది. ఫాస్టు కథా నాయకుడు విషయసంగమానికి దూరమైపోవాలని యత్నిస్తాడు. కాని మానవప్రేమ విషయవాసనల నతిక్రమించి వికాసం పొందలేకపోతే అది సంపూర్ణ మానవప్రేమకన్న అల్పం. అర్చనలో ప్రతీకాన్ని దాటిపోకపోయినా నిష్ఫలమే. సంపూర్ణంగా మానవీయం కాని దానికి ప్రాముఖ్యమేలేదు.

అర్చనలో తామసికారాధకులు వొళ్ళుతెలియక చిందులు తొక్కడం మూర్ఖత్వం. వామాచారపరుల పాశవ ప్రకృతి

ఆరాధన వేళ తాండవించి మానవతా గౌరవాన్ని మంటకలుపు తుంది. ఇంత కన్న క్రైస్తవం అద్వైతవేదాంత ధాటికి నిలిచి సమన్వయమయితే మంచిది.

బుద్ధదేవుని 'నేఽతి నేఽతి' వాక్యాలు, ఆచరణ యోగ్యమయిన వుపదేశాలవలె, గాంధీమహాత్ముడు శాస్త్రీయానికీ తాంత్రికానికీ అతివిరుద్ధంగా కేవల బ్రహ్మచర్యమే గృహస్థులు కూడా అనుష్ఠించవలెనని తన వారలకు ఆదేశించినాడు. తాంత్రిక కర్మ కలాప వైముఖ్యమే ఆయన దృష్టిలో గోచరిస్తుంది.

ఏమైనకాని మన సమస్యనుంచి అవలీలగా తప్పించుకో లేము. జీవితాలు మహా సమస్యలకు అంకితం చేసిన పరార్థ జీవులు జీవితాలు యుగాలతరబడి చూస్తూవస్తే, వారు కఠిన సాధన అవలంభించి ఇల్లూ వాకిలీ ప్రమేయం లేకుండా వుండే వారని స్పష్టం. శరీరాత్మల పోరాటంలో శరీరేంద్రియా కర్షణాభిమానాలు వదిలిపోవడమే కష్టం. ఈ సందర్భంలో ఆండ్రూ గిడ్ అనే ఫ్రెంచి రచయిత చాలా మధనపడినాడు. అలాగే గేటే కవి శరీరాత్మల పోరాటం అనుభవించాడు. ఆనక కొంత వయసు ముదరగానే అతడు వివాహం చేసుకొన్నాడు.

కాని మహాత్ముడు బ్రహ్మచర్యం అత్యవసరంగా సత్యాగ్రహి అనుష్టించాలని వక్కాణించినాడు. పాల్ భక్తాగ్రణి కూడా బ్రహ్మచర్య నిష్ఠ ముఖ్యమన్నాడు. "నా శరీరంతోనే నిన్ను అర్చన చేస్తాను." "ఒకే స్త్రీ రూపంలో సర్వస్త్రీ ప్రపంచాన్ని ఆరాధిస్తాను." ఈ విధముగా ఆచరించటం మహా ఘనవిషయం!

# అధ్యాయం 45

ఆఖరి అధ్యాయంలో చెప్పిన విషయం సవిస్తరంగా నేనిక్కడ విపులీకరించదలచాను. మహాత్ముని 'పరిశుద్ధతా సాధన' వల్ల మనము బంగారు పడితే, లోకమే బంగారుపడితే మనం ముందుగానే పడదాం. తాంత్రిక యోగాచారాలకు అతి విరుద్ధంగా మహాత్ముడు జీవన పారిశుద్ధ్యత వుపదేశిస్తాడు. ఏమిటిలా వుపదేశిస్తాడని నీరసంగా చూస్తారేమో ప్రజలు! భారతదేశంలో జనాభా ఎక్కువైంది. అదే భారతాభ్యుదయానికి శాపం. చైనా భారతదేశాల విపరీత ప్రజాభివృద్ధి చూడగా ఆయా దేశాలకు ప్రపంచాధిపత్యం వుపపాదిద్దామనే జిజ్ఞాసతో పందెంకట్టి పరుగు తీస్తున్నట్టుంది. కాని ఎందుకీ జనాభా? కడుపునిండా తినతిండీ, వంటినిండా కట్టగుడ్డాలేక అల్లలాడే అస్థిపంజరాలేకదా ఈ జన మూక! అందుకే ఈ జనాభా భారం తగ్గించటంకోసమే గాంధీజీ అన్ని సాధనలకంటే ఆత్మసంయమ మార్గమే పరమోత్కృష్ట మైనదని గృహస్థులకు వుద్బోధించాడు. ఈ సృష్టికామన నిగ్రహించి మరో వుదాత్త విషయాన్ని సాధించడానికి బుద్ధిని మరల్చమని ఉపదేశించినాడు.

మహాత్ముని వుపదేశం కేవలం సాంఘిక ప్రయోజనంతో చెప్పిందికాదు. వేదాంత తత్త్వంలో వేదాంతి మాయాతీత పర బ్రహ్మను సంధానం చేస్తాడు. సదసత్తులకు, పుణ్యపాపాలకు అతీతుడు అవుతాడు బ్రహ్మవేత్త. మహాత్ముడు క్రైస్తవ సన్యాసులవలె ఆంతరంగిక సంస్కరణ చేసుకోమని హితోప దేశం చేస్తాడు.

మానవుడికి క్షుధ వుండనే వుంది. ఆ క్షుధ తీర్చుకోవద్దా? కొందరిది విచిత్రమైన ఆకలి: వారు తాగుతుకూ, ఇరుగు పొరుగు వాళ్ళను హతమార్చడానికీ అలవాటుపడతారు. లోక మంతా ఇటువంటి ఆకలితో రెచ్చిపోతే ప్రజలు పశుప్రాయులే కాదా! రాక్షసులేకదా! స్వర్గమనే తోటలో సృష్టికి ఆరంభంలో వున్న పాపం ఎంత సహజమో, పుణ్యంకూడా అంత సహజమేకదా?

సంభోగం సహేతుకమేనా? ధర్మమేనా? హేతువాది అంతరాత్మ అందుకు ఆమోదిస్తుందా? కాకపోతే, ఏ బౌద్ధుడో తెగించి మానవజాతి ప్రవాహం ఇంకిపొయ్యినాసరే సంభోగం కూడదంటాడు. లేక ఏ అవివేకో మానవజాతి సంఖ్యలో అభివృద్ధి అయేటందుకే సంభోగ క్రతువు యేర్పడిందంటాడు. "ప్రజాతంతుం మా వ్యవత్సేత్సీః" అని శ్రుతి ఘోష. ఐతే ఆ క్రతువు కొనసాగిస్తూ ఆత్మీయత అభివృద్ధి చేసుకోగలమా? ఏది ప్రమాణం? ఎంతవరకు? ఎవరికి? క్రతువుతో నిమిత్తం లేకుండా పరివర్తన చెందుదామా?

భోగలాలసనూ, ఇంద్రియ సంయమమునూ ఒకేగతిలో వుండలేవు. యదార్థమయిన బ్రహ్మచారి ఎవడు? అతని జీవిత

ప్రమాణం ఏమిటి? మాతాపితల ధర్మం కూడా నశింపు చేయడమా? కామ ప్రపంచాన్నే కంటగించడమా?

మానవకోటికి ప్రణయమూ కామమూ కావాలి. మానవ కోటికి అవి అత్యంత ప్రీతిదాయకాలు. లోకంలో ప్రేమ, విరహం, ప్రణయం, కామం, భోగం లేనప్పుడు ఎలా వుంటుంది? — ఏ సన్యాస మఠంవలెనో — వల్లకాడుగనో ఉంటుందిలోకం. అంతేనా?

నిస్సంగు డైనవాడికీ నిర్లిప్తు డైనవాడికీ మహాత్ముడు చెప్పే సిద్ధాంతం సరిపోతుంది. ఆయన దారి సరియైనదనే నేను అనుకొంటున్నాను. ఈ సందర్భంలో పాశ్చాత్యలోకం నుంచి వచ్చిన నేను ఆయన పరిష్కారాన్ని కేవలం విశ్వాసంతో కాక హేతువుకూడా వుపయోగించి తులన చేశాను. మహాత్ముని సిద్ధాంతంతో కేవల అరవింద, రామకృష్ణులేకాక చాలామంది పాశ్చాత్యులు కూడా ఏకీభవించారు. ఎపిక్టటస్ కూడా వివాహం చేసుకొనేవారికి 'వార్నింగ్' ఇచ్చినాడు!

నేనొక డ్రాయింగ్ రూములో మహాత్ముని దర్శనం చేశాను. కేనా పెళ్ళివిందుకు క్రీస్తువెళ్ళినాడు. గాంధీకానీ, ఏసుక్రీస్తుకానీ డ్రాయింగు రూములో గోష్ఠికి పనికివస్తారని ఎవరూ అనుకోరాదు. ఈశ్వరుడంతవాడు మన గదిలోనా?

లౌకికుడు, అభిరుచికలవాడు అకస్మాత్తుగా తన గదిలో మహాత్ముణ్ణి (పోనీ ఏ లెనిన్‌గారినో కలిస్తే హఠాత్తుగా) దర్శిస్తే? లండన్ గౌర్‌వీధిలో ఒకబసలో మహాత్ముని దర్శనం చేసినాను. ఎలెన్ విల్కిన్‌సన్ ఆతిధ్యం ఇచ్చిన వనిత— ఏమిటి చేస్తుంది? హఠాత్తుగా మహాత్ముని చూచి తబ్బిబ్బు

పడుతుందా? రాజకీయవాదులకూ, లౌకికులకూ ఈ తత్తరపాటూ హడావిడీ తెలియవు. వారిని ఎవరయినా ఉద్ధరించారా, ఏ సాల్వేషన్ ఆర్మీలోవారయినా? అని మనం అడగవచ్చును.

నేను గేటే కవీంద్రుని మెచ్చుకొనే రసికుణ్ణిగా భారత దేశం పరిపక్వదశలో వచ్చాను. గేటే నాకు 'విశ్వమానవుడు' మహాత్ముడు క్రైస్తవతత్త్వం మూర్తీభవించిన వ్యక్తి. 'మంచికో చెడుకో క్రైస్తవునివలె అనాసక్తితో జీవితం అంకితం చేసినవాడు మహాత్ముడు. గేటే అగ్రవీక్షణలో క్రైస్తవులై వినయంగా వున్న వారిమాటే మరిచిపోయినాడు. గాంధీ, గేటేలలో ఎవరిదిధర్మం? ఇదే నాగరకతా సమస్య, ఆధునికుడు ఎదుర్కొనేది?

రసికు డెరుగును, చైనావాడికీ తెలుసును—ఆకలితో అటమటిస్తున్నదాన్ని ప్రదర్శించకూడదని.

హడావిడిగా బాధ్యతల నిర్వహించి తిరిగేవాడికి తాగుడు చాలామంచిది, కాని అతిగా తాగడం, తరుచుగా తాగడం మంచిది కాదు. మానవుడు బాధ్యతలు గ్రహించినకొద్దీ నిగ్రహం అలవరచు కొంటాడు. సామాన్యంగా సోల్జరూ, రాజనీతివేత్త కాస్తోకూస్తో శృంగార పురుషులే. అయినా వారి శృంగారం మితిమీరదు. అవసరం వచ్చినప్పుడు స్వధర్మం నిర్వహించవలెను గనుక సంయమం కొంతవరకు ఉండక తప్పదు.

సంస్కారం బాగా వున్నవాడు ఇంద్రియాలను విశృంఖలంగా పోనివ్వడు, అతనికి జీవితం కళగా చేసుకోడం తెలుసు గనక సంయమం అలవరచు కొంటాడు. అవసరమయితే దీర్ఘ కాలం కూడా బ్రహ్మచర్యం చేయగలడు. స్త్రీ ప్రసంగం

రానీయక పోవడం, స్త్రీ పరిచయం లేకపోవడం, మంచికానీ చెడుకానీ అదొక అద్భుతమేమీ కాదు. స్త్రీసంగ పరిత్యాగం ఒక వ్యక్తిలో ఏకారణంచేత వచ్చిందో అదే ముఖ్యం. అది భయం వల్లనే అయితే అల్పకారణం. మహోన్నతాదర్శ సాధనకై స్త్రీ సంగమం వర్జించినాడంటే అది ఘనకారణం.

ఆధ్యాత్మిక సాధకుడు ఆత్మోన్నతికి కృషి చేస్తున్నా లేక ఒకరికి శిష్యుడుగానో, మిత్రుడుగానో, ఆచార్యుడుగానో ఉన్నప్పటికీ ప్రేమానురాగాలు, మానవ సౌహార్ధత సౌజన్యాలు తెలిసినవాడై ఉండడంచేత రూప, భావ తత్త్వ సౌందర్యం ఆరాధిస్తాడు. అయితే అందరూ అలాగే ఉండరు. మహా మహి మోపేతులు 'డాంటే' కవీశ్వరుని వంటివారు వేరొక తీరుగా ఉంటారు. డాంటే కవి తన మహాకావ్యంలో ఇలా చెప్పినాడు: "నా ప్రథమ ప్రణయం తరువాత నేను జగదీశ్వరుని కుమారినే వలచినాను, తదీయ సౌందర్యంవల్ల ముగ్ధుణ్ణి అయినాను. ఆ కుమారినే పైతాగరసు తత్త్వవేత్త 'ఫిలాసఫీ' అంటాడు." కేవలం మహా విజ్ఞాన దురంధరుని వచనామృత మిది!

స్వీయచరిత్రలో మహాత్ముడు తాను కాముక భర్తగా, భార్యయెడ విశ్వాసపాత్రుడుగ రచన చేసినాడు. ఆగస్టయిన్ భక్తునివలె యథార్థానుభవాలు చెప్పడంలో తటపటాయించ లేదు గాంధీజీ! నేను బ్రహ్మచర్యంలో ఉన్నా సందేహంతో జిజ్ఞాస తోనే మహాత్ముని సమీపమునకు వచ్చాను. పాశ్చాత్యు లెవరూ ఇలా రానేరారు, ఆందోళన చెందనే చెందరు.

ఈ యుగంలో సామరస్యస్థాయి రావాలి, నేటి చైనీయ నాగరకతలకూ, సామాన్య విశిష్టతకూ, మహా జనులకూ సామాన్యులకూ, నవీన నాగరికులకూ ప్రాచీన గ్రామీణులకూ మధ్య పొత్తు కుదరాలి. క్రైస్తవ, కమ్యూనిజ, టాల్‌స్టాయ్, గాంధేయ తత్త్వాల్లోని సాధుత్వం, కాఠిన్యం, భయం, తీవ్రత, పారిశుధ్యం. ఆదర్శాలకు జీవితాంకితాల మధ్య సామ్యావస్థ రావాలి. ( సంపూర్ణ శాంత్యాభ్యుదయకర కళామయ జీవనం కావాలి )

మహాపరిత్యాగాలకూ, సర్వ సమర్పణలకూ సంసిద్ధులు కానివారు జీవితంలో విషాదాంశలు గ్రహించలేరు. అట్టివారు మహాత్మునివలె నిరశనవ్రతాలు చేసి, నిరంతర తపముచేసి బాధల కోర్వలేరు. అట్టివారు లౌకికులు నాగరకులేకాని, తపోధనులు కాలేరు. మహాత్మునివలె ప్రవక్తలు అటువంటివారు కానేకాలేరు.

# అధ్యాయం 46

హింద్ స్వరాజ్యలో కొన్ని పంక్తులు పునరుశ్చరణ చేస్తున్నాను ఆలకించండి :

"పవిత్రత ఎంత అవసరమో, దారిద్ర్యమూ అంత అవసరమే. ధనాశ, సాత్త్విక నిరోధమూ సమంగా వుండవు. ఆలాగని ధనికులను సొమ్ము పారవేసుకోమనం. కానీ, వారు ధనవిషయంలో నిర్లక్ష్యంగా నిర్లిప్తంగా ఉండాలి."

మహాత్ముడు స్వీయ జీవితకథలో ఇలా రాసినాడు : "అపరిగ్రహము, సమభావమువంటి శబ్దాలు నా దృష్టిని ఆకర్షించినవి. సమభావం కలుగచేసుకోడమూ, సమదృష్టితో చూడటమూ ఎలాగని ప్రశ్న. నీచుల్ని, దగాఖోరులనూ, లంచగొండి ఉద్యోగుల్ని సమదృష్టితో ఎలా చూడడం? తన సర్వస్వం త్యజించడం ఎలాగ? నా పుస్తకాల అలమారులు పగులకొట్టవలసిందేనా?....నాసర్వస్వం త్యజించి పరమేశ్వరుణ్ణి అనుసరించవలసిందేనా? 'సర్వ ధర్మాన్ పరిత్యజ్యం మాం ఏకం శరణం వ్రజ' అని గీతావచనం. వెంటనే సమాధానం వచ్చింది- సర్వధర్మ త్యాగం చేస్తేనేగాని ఆయనను అనుసరించలేనవి. ఆంగ్ల న్యాయశాస్త్రజ్ఞానం నాకు తోడయింది....ధర్మకర్త 'ట్రస్టీ'

అనే మాటకు అర్ధధ్వని గీతావచనంవల్ల నాకు బాగా బోధపడింది. ఈ నిర్ణయం వల్ల ఆచరణ చేయగలిగినాను." మహాత్ముడు తన స్వల్పాదాయం దక్షిణాఫ్రికా భారతీయ కుటుంబాల ఉపయోగార్థం జాగ్రత్తచేయ దలచినాడు."

మహాత్ముని స్థితి (ధర్మకర్తృత్వ ప్రతిపాదన) ప్రాచీన క్రైస్తవ కాథలిక్ సిద్ధాంతానికి అనుగుణంగా వుంది. ఒక వ్యక్తి స్వార్జితము పరార్థం వినియోగించడం సాంఘికంగా నైతికంగా మహా ఘనమైన బాధ్యత. మహాత్ముని తత్త్వం జాన్ క్రిసోస్టం, మిలన్‌లో సెయింట్ ఆంబ్రోస్‌ల క్రైస్తవ సిద్ధాంతంవలె వుంది. "సామాన్యంగా యావన్మందిదీ, ప్రత్యేకంగా తనదేనని అనుకో కూడదు." ప్రాచీన చర్చిమతంలో మధ్యకాలీన క్రైస్తవంలో భావాలకూ మహాత్ముని వచనాలకూ సాదృశ్యం కనబడు తున్నది.

ఈనాటి పాశ్చాత్యలోకం దారిద్ర్యం పుణ్యంగా పరిగణించ గలదా? సెయింట్ ఫ్రాన్సిస్ కాలంనాటిమాట మాత్రమే అది. నవీనప్రపంచం ధనవిషయంలో నిర్లక్ష్యంగా వుంటుందా? బెర్నార్డుషా చెప్పినట్టు దరిద్రుడు కావడం పాపఫలమట! మనం ఆయన మాట అంగీకరిస్తామా?

బ్రిటనులో 'పబ్లిక్ రిలేషన్' ఆఫీసరుగా పెద్దజీతం పుచ్చుకొంటున్న మెల్‌బోరన్ వేదాంతి మాటలు వినండి: "ఏ మానవ కూటంతోనైనా మనం సమావేశం కావాలంటే వారేస్థితిలో వుంటే అలా వుండగానే కలవాలి. ఇది అత్యవసరం అన్ని జాతులకూ." మానవుడు దారిద్ర్యమంటే పిరికి పడతాడు; విలవిలా విలపిస్తాడు-వణకిపోతాడు. దారిద్ర్యంనుంచి తప్పించు

కోవాలనే తహతహ మానవులకు అధికమని గంటాపథంగా చెప్పవచ్చు. నిజంగా మానవ జీవితం నీచం క్రూరం అల్పం, ఒక రకంగా ఆలోచిస్తే. ఏది నీచం? దారిద్ర్యమా లేక అస్వాతంత్ర్యమా? నీచమంటే అర్థం?

మహాత్ముడు దారిద్ర్యాన్ని ప్రశంసించడంవల్ల ఆయన యోచనకూ సమకాలీన పాశ్చాత్యధనాఢ్యుల దారిద్ర్యానికీ మధ్యభేదం ఏర్పడుతున్నది. ఎన్నిచెప్పినా పాశ్చాత్యలోకం ధనదేవతార్చన చేస్తుంది. అంటే బిల్లులు చెల్లించే పద్ధతి కాదు. భౌతిక జీవన ప్రమాణము పెరుగుదలకు దారితీస్తుంది. భారతీయుడు భిక్షాపాత్రతో పిడికెడు బియ్యంగింజలకు ఎదురు చూస్తూ వుంటాడు. ఈ దారిద్ర్యానికి పాశ్చాత్య భౌతిక జీవన ప్రమాణం చుక్కెదురు. ధనికసంఘంలో జీవన ప్రమాణాభివృద్ధి పోటీదారుల, స్త్రీల, కుటుంబదృష్టిలో విజయమే, అభ్యుదయమే. పురుషార్థములు సాపేక్ష్యములుగా వుంటవి. కాని విజయము ధృవం. అందరికీ మంచివాడయితే వాడు విజేత. మంచితనం కన్న విజయం స్థిరపరిచేది ప్రజాదృష్టిలో ధనం. అంటే మానవుని ఘనత ఐహిక సంపదను బట్టి కొలుస్తున్నది లోకం. మహాత్ముని లక్ష్యం మతైక్యత. పాశ్చాత్యుల్లో రెండువర్గాలు ధనవంతులు, నిర్ధనులు. ప్రయోజకులు ధనవంతులు, అప్రయోజకులు నిర్ధనులు. యూరోపులో ఈ ప్రయోజకులుగా, విజేతలుగా, చరిత్ర ప్రసిద్ధులుగా చెప్పుకో తగినవారు స్టాలిన్, హిట్లర్, నెపోలియనులు.

అయితే దరిద్రుని కోరికలు ఎలా సఫలమవుతవి? వేగంగా వెళ్ళే యంత్రాలనో, పలుకుబడినో వుపయోగించుకోగలడా? అవి అతడికి అలభ్యాలు, తీరని కోరికలు. మరి

ఏస్థితిలో వున్న వారు ఆ స్థితిలోనే వుంటే దరిద్రులు దరిద్రులు గానే వుంటారు. అలాటప్పుడు దారిద్ర్య ప్రశస్తి చేయటం ప్రజాస్వామికాభ్యుదయం కాజాలదు. పూర్తిగా ప్రజాధిపటికి అది విరుద్ధం; ప్రజాసౌఖ్యం పెరగడం వుండదు. కొత్తవేమీ కనిపెట్టలేరు. దారిద్ర్యంలో నిర్మాణశక్తి లోపమవుతుంది, ప్రోత్సాహంలేక.

అమెరికా మాన్‌హాటన్ నగరంవంటి నగరంలో పెద్ద భవన గోపురం మీద నిజంగా మానవుడు నిలబడి క్రింది ప్రపంచం చూస్తే సంతృప్తి కలుగుతుంది, శక్తిసంపదవల్ల—సౌందర్యంవల్ల. ఆ తృప్తి ఇంచుమించు సంభోగతృప్తితో సమానం అలా తృప్తిచెందేవాడు అతడు హిట్లరే అయితే నాయకుడై తృప్తి పొందుతాడు. ఇంకా ప్రయోజకుడైనవాడు రక్తనాళాల్లో అణువణువులో తృప్తిపొందుతాడు. ఆత్మవిశ్వాసంతో జీవితానికి సన్నిహితుడై సుఖంగా వుంటాడు. అప్రయోజకుడు, ఏ విజయం సాధించనివాడు మృత్యుసన్నిహితంలో ఉంటాడు.

ఈ సందర్భంలో మహాత్ముని ప్రవచనాలు అవధరించండి : "ఎవడు నిజమైన యుద్ధభటుడు ?—మృత్యువును ప్రియ మిత్రముగా చూచేవాడా ? ఇతరుల మృత్యువును వశం చేసుకొనేవాడా ? ..........మృత్యువనే వుపధానం మీద ఏజాతి తన శిరస్సుంచుకొంటుందో అదే గొప్పజాతి. మృత్యువును తిరస్కరించే వారు సదా భయముక్తులు." ఈ సిద్ధాంతం ఏయువతీ యువకులకు, నవదంపతులకు, నూతనంగా జీవయాత్ర సలిపేవారికి నచ్చుతుంది ? ఎవరు సుఖరహిత సిద్ధాంతం జోలికి వెడతారు ?

లూసిఫర్ వున్నతమైన సింహాసనం అధిష్ఠించాడు. భూలోక రాజ్యాలు ఆయనకు గౌరవార్చనలు సలిపినవి. ఇప్పుడు లూసిఫర్ అంటే అర్థం విజయం. లూసిఫర్ మరోపేర పిలవబడినాడు. ఆ మరోపేరు జీవితం. అయితే బహుశా ఆభాస,—జీవితాభాస కావచ్చునది.

అందరూ సుఖపడవలె ననుకొంటారు. ఇది సహజం. పదిమంది పాడయితే ఒకడు సుఖపడతాడు. విజయం నిశ్రేణి వంటిది. కొందరు ఎక్కుతున్నవాళ్ళను తోసివేసి నిచ్చెన ఎక్కిపోతారు. కాని మహాత్ముని దృష్టిలో 'విజయం' అటువంటిది కాదు భావనతో కూడిన సేవాధర్మమే మహాత్ముని అభిమతంలో 'గెలుపు.' కొంచెం ముందుకు పోగలిగే స్వభావం వున్న మాత్రాన 'గెలుపు' కాదు. అందరి మీద ఆధిపత్యంవల్ల సుఖం అంటే అందర్నీ అణగతొక్కి ఎవడో ఒకడు బాగు పడడం. సహజ సుఖానుభూతిని కోరడం ధర్మంకాదా?........ ధర్మజీవనం నిజంగా విశిష్ట సజీవ జీవితం. 'దర్జాగా ప్రభువు' లాగ జీవిస్తున్నాడు అని అనేవారికి ఎన్నటికీ మహాత్ముడు ప్రోత్సాహ మీయడు. బుద్ధునిలాగ, క్రీస్తులాగ జీవించగలిగితే మహాత్ముడు కాదంటాడా? ఆయన అటువంటివారి జీవితమే కోరేది.

దరిద్రులు, దౌర్భాగ్యులు, నిరుత్సాహులు, నిర్బలురు, నిరాధారులు ఎన్నటికయినా ధనవంతు లవుతారా? ఆలోచించండి. వారందరికన్నా ధనాఢ్యు లవుతారా? ఎన్నటికీకారు-అసందర్భం కూడాను. పోనీ ఈ నిరాధార నిర్ధనప్రజ తృప్తికోసం, ధనం కోసం, పనికోసం కమ్యూనిజంకేసి మొగ్గుతే?— కోరికలు

సాఫల్యం అవుతవా ? ఆదిభౌతిక సామ్యవాదీయులు తమ నియంతృత్వ సాధనద్వారా ధన నిర్ధనత్వాలను రూపుమాపి ఆర్థిక సమానత్వం, అది ఆర్థిక సమృద్ధి కలగచేయగలరా అంటే, అశాస్త్రీయ ఆదర్శవాదంగానే గోచరమైంది. ఇక మహాత్ముని దృష్టిలో అందరూ బ్రహ్మచారులు కావచ్చును. అలాచేయడంవల్ల అందరిజీవితాలూ విశిష్టములు కావచ్చును. వారు సాధకులై లోకాన్ని ఒక గతిలో నడిపించ వచ్చును. పనీపాటా లేనివాళ్లు, కర్మయోగమే లేనివాళ్లు పెళ్ళిమాని బ్రహ్మచారులై దారిద్ర్యాన్ని వరించి నిర్లిప్తులై ఉండవచ్చును.

గాంధీజీ లోకంలో ఉన్నవారంతా సన్యాసులే అవుతారని ఊహించగలరా ? అందరూ కర్మసన్యాసం చేయగలరా ? చేయ గలరు. దానికి కారణం మహాత్ముడు వర్ణాశ్రమాచారాల్లోనే మొదటనించీ పెరిగినవాడు. కొందరికి బ్రహ్మచర్యం, కొందరికి భక్తియోగం, మరికొందరికి నాయకత్వంమీదా ప్రీతి వుండ వచ్చును. కొందరు నిర్ధనులై వుండికూడా సంపూర్ణత్వం సంపాదించడానికి వుద్యుక్తులు కావచ్చును.

ఎలాగయినా అందరూ వినయశీలురు కావచ్చును. తిన్నగా జీవించడం వినయం యొక్క బాహ్యావ్యక్తీకరణమే. నవనాగరిక సంఘంలో మనుష్యులయెడ గాంధీ గేహే వ్యతిరేకి. సముద్రం మీద ప్రయాణంచేసి జీవించే ఒక ఆంగ్లేయుడు ఆంగ్లేయరీతిలో ఇలా అన్నాడు: "గాంధీ—అవును ఆయన గొప్పవాడు. ఆయన వినయశీలుడు. ఆయన పుట్టినప్పటినుంచీ కూడా అంతే."



# అధ్యాయం 47

ఇచ్ఛాపూర్వక దారిద్ర్యవరణం సిద్ధాంతరీత్యా అందంగానే ఉంటుంది కాని, హృదయానికి సంతృప్తి కలిగిస్తుందా? సర్వ సంగ పరిత్యాగం చేయమని కాదు మహాత్ముని వుద్దేశ్యము. విషయాలయందు నిర్లిప్తతభావము వుండవలెననే ఆయన అభిమతం. అంటే సరళ జీవితం గడుపుతూ కొద్దిపాటి ఆదాయంతో తృప్తి పడవలసిందనేనా సిద్ధాంతం? బ్రహ్మ చారులు అలా జీవితం గడపగలరు. అదే తక్కినవారికి కూడా ప్రమాణమా?

నాగరికత జీవన ప్రమాణాభివృద్ధి మీదనేకదా నిర్మిత మవుతూ వచ్చింది? ధనాఢ్యులు కూడా జీవనప్రమాణం వృద్ధి చేసుకొంటూ భోగలాలసులుగా వుంటారు. ఏ ధనరాసులూ లేకపోతే రాజాప్రాసాదాలు, మహామందిరాలు, పిరమిడ్లు, 1365 అడుగుల మహోన్నతమైన మాస్కో ప్రభుత్వ భవనం (అంతటివే అమెరికా ఎంపైర్ స్టేట్, క్రిష్టర్ భవనాలు కూడా) ఎలా నిర్మితమవుతవి? పోతే దరిద్రులకు ఏమికావాలి? — వేదాంతమూ కాదు, సానుభూతీకాదు. వారికి తక్షణం కావలసినది పరివర్తనము. అంటే దరిద్రులు ధనికులు కావలెననా? లేక అత్యంత భేదం లేకుండా, పరస్పర సహానుభూతి కలవాళ్ళు

కొద్దిపాటి ఆదాయ భేదంతో స్వీయ వృత్తులు ఆచరిస్తూ, సమతాసూత్రం మీద సంఘ నిర్మాణం కావలెనా?

ఈ సందర్భంలో నా రష్యామిత్రుడు, మానవతత్త్వ శాస్త్ర వేత్తఅయిన బ్రొనిస్లావ్ మాలినోవిస్కీతో చేసిన గోష్ఠి గుర్తుకు వస్తున్నది. ఆధునిక మానవ జీవితం వ్యాపారదృష్టితో కొలవ బడుతున్నదని ఆయన మహా తీవ్రంగా ఘాటుగా విమర్శ చేశాడు. కేవలం మోసంద్వారానో, మాయద్వారానో, యుక్తి ద్వారానో కనకకాంచనాలు పెరిగి, సంపాదనపెరిగి తత్ద్వారా విజయం కూడా సిద్ధించవచ్చు. కాని ఆ విజయం శ్రేయోదాయకం కాదు. అట్టి ఆర్థిక విజయంవల్ల మానవుని ఆధ్యాత్మిక, మానసిక, సంస్కృతిక జీవనం క్రమేణా సంకుచితమై సర్వ నాశనంకేసి పురోగమిస్తున్నది.

గాంధీజీ ఇలా రాస్తున్నారు: "నాగరికత అనివార్య రోగంకాదు........మీ పాశ్చాత్యలోకం మెచ్చుకొనే నాగరికత మా నాగరికతకు పూర్తిగా వ్యతిరేకం. మా నాగరికత మీ దాని కన్న ఎన్నోరెట్లు విశిష్టమైంది" అని. మిత్రుడు మాలినోవిస్కీ ఉద్దేశం, గాంధీజీ అభిప్రాయం ఒకటే—పాశ్చాత్య నాగరికతా విమర్శ చేసే సందర్భంలో. పాశ్చాత్య నాగరికత విపణి వ్యాపార ప్రధానమే కావచ్చు కాని, ఇంద్రియలోలుడై వినోదం కోసం బజారులో ఎగబడే కొనుగోలుదారుని నడతకు పూచీ ఎవరిది? వ్యాపారిదేనా?

ఏమిటి వ్యాపారుల దోషం? కళ్ళముందు కాంచనాన్నో, భోగవస్తువునో పడేసి స్వేచ్ఛగా ధనం ఆర్జించటం తప్పేనా?

మోసమేనా ? మనం మహా మహిమోపేతులమా, సన్యాసులమా ఉప్పుకారాలను చవిచూడకుండా మడికట్టుకు కూర్చోటానికి ?— ఇంద్రియోద్వేగాలకు కళ్ళెం వేయటానికి ? వేదాంతులలో హ్యూమను నక్టేవుంచి, ముఖ్యంగా స్పైనోజా తాత్త్వికవేత్తనే చూడండి—వారంతా ఒకటే ఘోష, మనం ఇంద్రియోద్వేగాలను నిగ్రహించుకోవాలట, హేతువు నాశ్రయించి. గాంధీజీ ఇలా వచిస్తున్నాడు : "ఇంద్రియ సంచలనంవల్ల వుద్రిక్తుడైన వాడు సత్యం తెలుసుకోలేడు." ఈ వేదాంతవేత్తల సుభాషితాలు యదార్థాలేనా ? ప్లేటో కూడా అంతే - అలాగే అంటాడు. ఐతే ఈనాటి భౌతిక సత్తావాదుల వాదమేమిటి, వారూ అలాగే అంటారా ? ఏమిటీ పాడు—కొందరు అవునంటారు, కొందరు కాదంటారు. కిర్క్‌గార్డ్ ఔనంటే, సార్త్రి కాదంటాడు.

మార్క్సుపక్షీయ కమ్యూనిస్టుల దృష్టిలో మహాత్మా గాంధీ వ్యక్తుల నైతికాంతరాత్మకు చేసే ప్రబోధం కేవల హేయము, జుగుప్సాకరము ! మరైతే సోవియట్ కార్మిక కర్షకలోకం కమ్యూనిస్టు రష్యా కార్మిక – నియంతృత్వ ప్రభుత్వంలో సుఖపడుతూందా అంటే అదీలేదు, కాగా మహా హీనజీవనం గడుపుతున్నారు. రాజ్యం గొడ్డుపోనూలేదు, మాయమవనూలేదు. మరి కారణం : అక్కడ పాలకవర్గీయులు హాయిగా అధికారంలో ఆనందం అనుభవిస్తూ వుంటారు. సేనను, మారణ యంత్రాలను అభివృద్ధిచేయటం ఇక తప్పనిసరి.

"ధనాఢ్యుల పాపాలు, దోషాలూ వారి ఆస్తిపాస్తులు లాగివేయడంతో పోతవి." నిజానికి ఇంగ్లండు ఫ్రెంచి

విప్లవంతో నిమిత్తం లేకుండానే ఫ్రాన్సుకంటె యాభైయేళ్ల ముందు ప్రజాతంత్రంలో అభ్యుదయం పొందగలిగింది. ధనిక వాదంలో లోపాలు రాజ్యాంగరీత్యా వ్యవహరిస్తే నయంకావు. ఒకవేళ నివారించబడినా మోటుపని చేసే కార్మికుల వేతనాల కన్న పదిరెట్లు అధికంగా మేనేజర్లు పుచ్చుకొంటారు. అసంతృప్తితో వుండే కార్మికుడు ఆహారపు కార్డు పోగొట్టుకొంటాడు. కాయకష్టం చేసే వాళ్ళ బిడ్డలు ఆఫీసుల్లో మానేజిమెంటు చేస్తారు, మేనేజర్లు కుమాళ్లు వీళ్ళను తీసివేసేదాకా. "బ్రతకడంలో నేర్పు అభ్యుదయ కూటంలో ఉండటం. అభ్యుదయ వర్గం సాధారణంగా సొమ్ము లెఖ చూచుకొంటుంది. గాంధీజీకి ధనికుల్లో స్నేహితులులేరా ? సాహసాధికార వాసనలవల్ల కాముక భోగతృప్తి, వ్యాపారంలో ధనార్జనానుభవ తృప్తినీ, ఇంతకన్న ఘనమైంది మహాత్ముడు ఏమి ఇవ్వగలడు? ప్రధానంగా జీవితంలో విజయం సాధించడం విషయంలో ఫేసిస్టులూ, బోల్షివిక్కులూ ఘనులని చెప్పకూడదా ? నాగరకత కూడా వీరినిబట్టి ఉండదూ ?"

ఘనమైనది సాధించడం సహకారంవల్ల కొంతవరకు సాధ్యమనిన మనకేమి వుపయోగం ? ప్రశ్న ప్రశ్నగానే వుంది. సహకరించడం ఎవరితో, ఎందుకని ? గాంధీజీ బార్నం ఇరువురూ సహకరిస్తారా ? కమ్యూనిస్టులూ, ఫాసిస్టులూ నెయ్యమొందుతారా ? ఇదెప్పటికీ జరగనిమాట.

అసలు సమస్యే ఇది—నడవడిపై ప్రభావంగల నిరపేక్ష్యమైన పురుషార్థా లున్నవా ? పురుషార్థాలకు వ్యాపార లాభాలతో, సామ్రాజ్యాధికారంతో సంబంధం లేదు.

"దోషదూషితమైనది పలుకుబడి సంపాదిస్తుంది. అందరూ చెప్పుకొంటారు. చాలామందికి ఇష్టమైనది ప్రజాస్వామికమైనది కాదూ? ఎక్కువమందికి హితవు కనుక ఎక్కువమంది సమ్యక్ బుద్ధి యోచనీయు లన్నమాటేనా? బహుజనాంగీకృతం మంచి దన్నమాటేనా? ప్రజలు విద్యనేర్వడం పురుషార్థాలకోసమేనా? అదేనా అవసరం? జన్మతః పురుషార్థాల మీద హక్కుకలిగి వుండటం ధర్మమేనా?" ఫ్రెంచి రచయిత రూసో ఇలా రచించినాడు: "ప్రజాహమాన్యేచ్ఛ ఎప్పుడూ సమంజసంగానే ఉంటుంది. కాని ప్రజాసామాన్య తీర్పు మాత్రం ఎప్పుడూ విజ్ఞతాపూర్వకంగా ఉండదు."

పురుషార్థాలతో నిమిత్తమే లేకపోతే చదువులు నేర్చు కోడం నేర్పడమూ వృత్తఅవివేకం, వృధాప్రయాసానూ. పురుషార్థములు సాధ్యములై వుండగా కొందరికి పురుషార్థ యోచన స్పష్టంగా వున్నప్పుడు వారు శక్తిగనవారికి విద్యాదానం చేస్తారు. కేవలం వస్తు సంచయం బస్తాలమీద బస్తాలు పేర్చటం మనం మెచ్చుకోలేము. వస్తుసంచయ సంరక్షణ సహేతుకంగా ఆస్తిహక్కు, ఏదుపరి యోగమున్నా అని చెప్పవచ్చు.

పురుషార్థాల్లో ధనేషణ విషయం చూడండి. నేను ప్రపం చంలో మహా ఇదిగా చెప్పుకొంటున్నా కుబేరులనూ, కోటీశ్వరు లనూ కలిశాను. ప్రాక్ప్రతీచీ ఖండాల్లో కూడా కొంతవరకూ గౌరవప్రతిష్టలు అమిత ధనార్జనమీదనే ఆధారపడి వున్నవని గుర్తించాను. ఆ అత్యధిక ధన సంచయంవల్ల సుఖభోగాలు, అవకాశాలు, ప్రయాణ సౌకర్యాలు, చాలన సౌకర్యాలు, శక్తి,

పలుకుబడీ ధనాఢ్యులకు విస్తారంగా వున్నవి. దీనికి నేను పూర్తిగా వ్యతిరేకిని. నా సలహా ఏమంటే మితిమీరిన ధన సంచయేచ్ఛ క్రమంగా అమానుషమే అవుతుంది. మానవతా గౌరవం ఏ మాత్ర మిగలదు. ఈ అత్యధిక సంపదవల్ల ప్రాదుర్భావితమైన శక్తి విపరీతమై మానవత్వానికే మోసం కలిగిస్తుంది. అమిత సంపదగలవాడు సుందర సుకుమారాలైన వాటిని సమకూర్చుకోవచ్చు. వారా వస్తువులకు హక్కుదారులు కాబట్టి వారికి సంతోషం వుండవచ్చు. ఐతే ఆ వస్తుసంచయం రానురాను విపరీతమై సరళ జీవనానికి ప్రతిబంధకహేతువే అవుతుంది, కనుక ఇలాంటి అమిత ఆడంబర భోగజీవనంకన్న నిరాడంబర సరళ జీవనమే మాధుర్యమైనదని, సుందరమైనదని స్పష్టపడుతోంది.

నా మటుకు నేను ఒక డాబాగదిలో కిటికీలు తెరచుకొని, చక్కని వెలుగూ గాలీ రానిస్తూ హాయిగా నివాసం చేస్తున్నాను. మహారాజుల, మహామంత్రుల మహామందిరా లెంత సుఖ మిస్తాయో అంతసుఖం నాకీ గదిలోనే లభ్యమవుతున్నది. వారి వలె నేనూ నాగరిక జీవనమే చేస్తున్నాను. ఇంతకంటే ఇంకా అపూర్వమైనవి, అందమైనవి ఏ రసికునికో అర్పిస్తే? ప్రేమ సమర్పణ చేస్తే—ఏ ప్రతీకాలూ అవసరంలేకుండా? అయితే మహాత్ముడు ప్రేమతో తీయతీయని మాటలుచెప్పి భారత దేశంలో కార్మికులను మోసం చేశాడా?

భారతదేశం దారిద్ర్యంలో ఉంది. ఇది ఇచ్ఛాపూర్వక దారిద్ర్యం కాదు. మానవుల్ని పీల్చిపిప్పిచేసే అనిచ్ఛాపూర్వక దారిద్ర్యం. దరిద్రులు కాటకంలో కుములుతున్నారు. కోటీశ్వరులు

సంపదతో తులతూగుతున్నారు. హిందూధర్మం త్యాగవైభవం ప్రశంసిస్తుంది. తిరువాన్కూరులో మహాత్ముడు హిందువులకు, క్రైస్తవులకు, ముస్లింలకు త్యాగవైభవం గురించి ఉపనిషత్తులో భావం వివరించినాడు. "తన సర్వస్వం పరమేశ్వరునికి అర్పణ చేసి అన్యధనం కోరవద్దు" 'మాగృధాః కస్యచిత్ ధనం, తేన త్యక్తేన భుంజీథాః' అంటే త్యాగంవల్లనే ఆత్మానందం పొందవచ్చును. ధనికులకీ వుపదేశం అవసరం. త్యాగంలేని విత్తమునకు శోభలేదు. దరిద్రుడు మహాప్రాసాదాలకై తపింపకూడదు. కోటీశ్వరుడు చింకిపాతలు కోరకూడదు. ఇదేనా మహాత్ముని ఆర్థిక విజ్ఞానం ?

క్షణం నిదానించి చూడండి. మనమంతా కోటీశ్వరులు కావలెనని మహాత్ముని సలహా కానేకాదు. ఆయన సంపద, ధన సంచయం, భోగవిలాసాలను ప్రోత్సహిస్తాడా ? ఈ సందర్భంలో ప్లేటో అన్నట్టు కోరకూడనిదాన్ని కోరనేకూడదు. అలా కోరితే మహాదోషం. అలా మహాత్ము డుపదేశించాడని కొందరికి కోపమా ? కనీసం మానవులకు కావలసిన ఇహసుఖాలు మహాత్ముడు అంగీకరించాడా ? వాటికోసం ఆయన ప్రయత్నించడా ? మరైతే వ్యవసాయాభివృద్ధికీ, గ్రామీణ పరిశ్రమల కోసం రాట్నపరిశ్రమ ప్రోత్సహిస్తున్నాడేమి ? సేవాధర్మమే తెలసి సంపదను గుర్తించని వాడా మహాత్ముడు ?

గాంధీజీకి దేశము పారిశ్రామికం కావడం, పట్టణాలు పెరగడం, వర్గకలహం, ఫాక్టరీలు వృద్ధికావడమూ ఇష్టం లేదా? మోటారుకారు, రేడియో, ఐస్‌క్రీమ్‌దాకా సత్వరజీవన ప్రమాణాభివృద్ధి మహాత్ముడు కోరడా ? అధునాతనమైన భారీ

పరిశ్రమలు ఆయనకు కిట్టకపోయినా ఆయన ప్రజలతో సహకరిస్తాడు. ఆయన అహింసా సిద్ధాంతం వర్గసంక్షోభం—వేతనాల కోసం హింసాకాండ అంగీకరించదు. అందుచేత మహాత్ముడు పరివర్తనం కోరనివాడా? మహాత్ముడు విపరీత హఠాత్పరివర్తన కోరనిమాట వాస్తవం. ఆయన రస్కిన్, మార్క్స్‌లవంటి సామ్యవాది. జయప్రకాశ్ నారాయణ్ వాదంతో ఆయన ఏకీభవించక పోవచ్చును.

మహాత్ముని అభిమతాన్ని బట్టి యాంత్రికమైనది నాగరకత కానేరదు. అది నేటికాలానికి హితవుగా తోచక పొరపాటనిపించ వచ్చును. అదే మన సమస్య. సంపద, దారిద్ర్య సమస్యలపై ఆయన ఉద్దేశాలు ప్లేటో సనాతన ఉద్దేశాలవలె వుంటవి. ఎంతపాతవైనా ప్లేటో నాటి ఊహాపోహలు, భావాలూ ఏమీ తప్పుకావు. ఆ భావాలు స్వతంత్రాలు. 'కమీసారు' కు ఇచ్చే వేతనం యోగికి లేకపోవచ్చును. ఇదేమయ్యా అంటే యోగి ప్రభుత్వానికి పనికిరాడు కనుక అని కొందరు సమాధాన మిస్తారు. ఏమైనకాని, మానవులకు కావలసిన కనీస సదుపాయాలు తీర్చడానికి తగిన వేతనాలుండవలెననే మహాత్ముని దృఢాభిప్రాయమని చెప్పవచ్చు.

# అధ్యాయం 1[illegible]

మహాత్ముని 'హింద్ స్వరాజ్' గ్రంథంలో అహింసా సిద్ధాంతంలో మూడోసూత్రం ధైర్యం. "సాత్త్విక విరోధం ధైర్యం చేతనే ఆచరణ సాధ్యము."

ఇది ముమ్మాటికీ యదార్థము. దీనిని మిథ్యగా అతిశయోక్తిగా తోసేయటానికి వీలులేదు. కన్ఫ్యూషియన్ అనే చైనా శాస్త్రవేత్త ఇలా వివరించాడు: "బందిపోటులు, విశృంఖలంగా నీతిరహితంగా వ్యవహరించే వారు తెగువ చూపుతారు. అలాగే బోల్షివిక్కులు, నాజీలు, ఫాసిస్టులు, ఆయా పక్షస్థులూ దేశభక్తులూ కూడా సాహసం చూపుతారు. ఇక్కడ ఒక మహాలక్ష్యసాధనకోసం నైతికంగా చూపబడే సాహసమే ఘనమైంది గాని, నీచకార్యాలకోసం వుద్దేశించబడిన ధైర్యం మాత్రం కాదు. అంటే కొందరు స్వార్థపరులైన మానవులు దుష్టప్రయోజనాలు సాధించుకోటానికి, అమిత శక్తి సంపాదన కోసం పోరాటం చేస్తారే అది సాహసం కాజాలదు ఎన్నటికీ, అది నిష్ప్రయోజనం. ధైర్యమనేది ప్రశంసార్హమే కాని, మహాత్ముని అభిమతంలో ధైర్యమేది?

సుశిక్షితమైన జీవితానికి శారీరక ధైర్యము అత్యవసరమే కాని, మహాత్ముడు నైతిక ధైర్యసాహసాలకే ప్రాముఖ్య మిచ్చినాడు. పీడితులూ బాధితులూ పోరాటం నిమిత్తం తరచు శారీరక ధైర్యం సాహసమే చూపుతారు. వారికి నైతిక ధైర్యం ఉండదేమి ?

నైతికధైర్యం లేకపోవడానికి కారణం నైతిక విచారణ లేకపోవడమే. చాలామంది నైతికమంటే పూర్వాచార సంప్రదాయాలు అనుసరించడమని తలుస్తారు. బూజుపట్టిన సంప్రదాయంగా దానిని చూస్తారు, ఐతే అహంకారులకూ, ప్రదర్శన కోరేవారికీ ధైర్యం వుంటుంది. కాని అది 'నైతికం' కాదు. వారు ధర్మగ్లానిని పోగొట్టే నిమిత్తం సాత్త్విక నిరోధం చేయలేరు, నైతిక శౌర్యం చూపలేరని దృఢంగా చెప్పవచ్చు.

తిరిగి మనం బ్రహ్మచర్య సిద్ధాంతం జోలికే వెడుతున్నాము. కొత్తగా పెళ్ళాడినవాడు, పెళ్ళి చేసుకోదలచినవాడు వాగ్దానాలు చేస్తారు (నియమాలకు దాసులవుతారు,) అక్కడీ నుంచి ప్రమాదాలు వస్తాయేమోనని సాహసంగా ఏ పనీ చేయలేరు. కుటుంబానికో తన వుద్యోగానికో నష్టం వస్తుందేమోనని భయపడతారు. అతను ఇంచుమించు పిరికివాడనవచ్చు. ముఖ్యంగా బీదవాణ్ణి అవుతానేమోనని అతనికి భయం మెండు. అందుచేతనే కామోసు ధనంమీద ఆధారపడడమూ, కుటుంబ సంప్రదాయంకు దాసోహం కావడమూ అతను మాని విజయం, కార్యసిద్ధి యోచింపలేడు—యోచించకూడదు. ఇతరునివలె, బ్రహ్మచారునివలె.

ఆచరణ అన్నివిషయాల్లో తోవ చూపుతుంది. అందు చేతనే మహాత్ముడు తన జీవితకధకు 'నా సత్యసాధన' అని పేరు పెట్టినాడు. యీ సందర్భంలో ఒక సంఘటన చూడండి. పూర్వమొకప్పుడు గాంధీజీ పెద్దన్నగారి సలహామీద స్థానిక బ్రిటీషు వుద్యోగిదగ్గరికి గుజరాత్‌లో అన్నగారికోసం దయార్ధనకై వెళ్ళినాడు. తత్ఫలితంగా వుపకారం జరగలేదు సరికదా, జీవితంలో మరువరాని పరాభవం కలిగింది. ఆనాటి నుంచీ ఆయనలో ఎంత సహనభావం సమరసభావం వున్నా, స్వీయప్రయోజనానికై మహాత్ముడు ఎవరినీ అర్థించలేదు. నైతికపోరాటం చేసేనిమిత్తం ఆయన ఎప్పుడూ వీరుడే, ఎప్పుడూ సంసిద్ధుడే!

దక్షిణాఫ్రికా మహాత్ముడు వెళ్ళేటప్పుడు కుటుంబాన్ని వెంటతీసుకొని వెళ్ళలేదు. కొన్ని మాసాలపాటు ఆయన నెటాలు భారతీయుల నాయకుడై వుద్యమం నడుపుతూ కుటుంబాన్ని పిలిపించలేదు. కుటుంబం ఆఫ్రికా రేవులో దిగినప్పుడు వేలాది జనం పోగయినారు. పోలీసు కమీషనరే లేకపోయినట్లయితే జనంలో కొందరు చనిపోయేవారు. గాంధీజీకి వురిశిక్ష ప్రాప్తమయ్యేదేమో! ఆఫ్రికాలో గాంధీ ఏకైక నాయకుడై హింసాకాండనూ, సామాన్యుల అపోహలనూ ఎదుర్కోవలసి వచ్చింది. అక్కడ వున్నంతకాలమూ ప్లీడరీ వల్ల వచ్చే కొద్దిపాటి డబ్బుతో జీవిస్తూ తన సేవకు ప్రతిఫలం కోరక, దక్షిణాఫ్రికా భారతీయుల రాజకీయ, పారిశ్రామిక హక్కులకై మహోద్యమం నడిపినాడు గాంధీజీ. ఎంత త్యాగశీలుడు కాకపోతే 907 లో ఆఫ్రికా విడిచి భారతదేశం పయనమయ్యే సమయంలో ప్రజలు కృతజ్ఞత చూపుతూ

ఆయన సేవకు నగలూనాణ్యాలూ, వెండిబంగారాలూ పారితోషికం ఇస్తారు? ఆ కానుకలను ఆయన వెంటనే పుచ్చుకొని ఆఫ్రికా భారతీయుల నిధికి ఇచ్చి, ప్రజోపయోగార్థం వినియోగించ వలసిందని ట్రస్టువారికి చెప్పినాడు. ఇదీ నైతిక శౌర్యమంటేను! స్వీయకుటుంబ పోషణకు ధనం అవసరం ఉన్నా కానీకూడా పుచ్చుకోక గాంధీజీ జనాన్ని ఆశ్చర్యంలో పడవేసినాడు, స్వార్థం వీసమంతయినాలేని మహానుభావుడు, మహితాత్ముడు మహాత్మాగాంధీ! 'నిస్వార్థత' 'నైతిక శౌర్యం' ఆయన సొత్తు.

ఆయన వెర్రిచూచి భార్య ఎదురు మాటాడవలసి రావడం ఏమంత అసహజం కాదు. మహాత్ముని వెర్రికాకపోతే చివరకు కుమాళ్ళ చదువులు కూడా పోగొట్టి దేశసేవాపరాయణుడైనాడంటే అర్థం ఏమిటి? కస్తూరీబాయి కొంత స్వార్థంతో ధనేషణ విషయంలో ఆయనకు నచ్చచెప్ప సాహసించింది. కూతురు పుట్టితే పుట్టెడు ఖర్చుచేసి పెంచి పెళ్ళిచేయాలని, కట్నాలివ్వాలనీ కానుకలివ్వాలనీ మొరపెట్టుకొంది. అదేమీ ఆయన వినలేదు,

ఏమిటీ ధైర్యం? ఏమిటీ అహంకారం? పెళ్ళి చేసుకొన్నప్పుడు భర్త కుటుంబభారం నెత్తిన వేసుకోవద్దూ? పిల్లలకు కావలసింది ఏర్పాటు చేయవద్దూ? అయినప్పటికీ కూడా ప్రజాసేవ నిమిత్తం ఏర్పడిన కార్యం నెరవేర్చడంలో ఆయన ముందూ వెనుకా తీయక, స్వార్థప్రయోజనం అధికంచేసి, ప్రజాసేవ అల్పం చేయనేలేదు. ప్రజాసేవ చేస్తూ తన సంపాదనలో వచ్చే కొద్దిపాటి ఆదాయంతో జీవితం నిర్వహిస్తూ ఆదర్శం సాధించిన ధీరుడు....మహాత్మాగాంధీ?

మహాత్ముడు ఆచరణద్వారా సోక్రటీసులవలె అంతరాత్మను అవసరం వచ్చినప్పుడు, తుల్యాబల విరోధాల క్లిష్ట పరిస్థితిలో, సహేతుకంగా శోధించమన్నాడు. పూర్వాచారాలను పూర్వ విశ్వాసాలను విమర్శించాలన్నాడు, శోధనతో. ఆయన అహంవాది కావడంకోసం ఇలాంటి ఆత్మశోధన చేయమనే ఉపదేశించలేదు. ఆత్మశోధన ఆచరించేవారివల్ల సంస్కర్తలతో కూడిన నవీనసంఘ మొకటి నిర్మాణమవుతుందని గాంధీజీ ఆశ. ప్లేటో మనీషి చెప్పినట్లే మహాత్ముడూ చెప్పినాడు....వ్యష్టి సముద్ధరణతో సమష్టిగా సంఘాభ్యుదయం జరుగుతుందని, వ్యష్టి చేయవలసిన విధి ధర్మము. సమిష్టిగా ధార్మికమైన, ఆదర్శమైన సమాజం ఏర్పడుతుంది. వ్యక్తి నైతికాభివృద్ధివల్ల, సంస్కారం వల్లనే సంఘం వికాసం చెందుతుంది ఈ లక్ష్యం కొంత భారతీయమూ కొంత ప్లేటో సిద్ధాంతంగానూ కనబడుతుంది. నిజమైన గురువును వెతుక్కొని ఆయన ఉపదేశమును విని ఆచరించడంవల్లనూ, ప్రాచీనకాలంలో యవనుడైన డయోజినిస్‌వలె అంతరాత్మ అనే దీపికతో హృదయ పరిశోధన చేయడమూ ఇదే యదార్థమైన ధైర్యమూ సాహసమునూ.

కేవల సిద్ధాంతం నూరిపోసిన మాత్రాన, మాటలు చెప్పినంతనే ఉపయోగం లేదు. సిద్ధాంతం ఆచరణలోకి తెచ్చినవాడే ధీరుడు. ఆచరణ చేసేవాడే యోద్ధ. సత్యాగ్రహి జీవితానికి ధైర్యమే పట్టుకొమ్మ. మార్క్సు పక్షీయులు ఆచరణ ఎంత అవసరమంటారో, అలాగే త్యాగశీలంతో విశ్వాసంతో ఆచరించి జీవితం నడుపుకోవలె.

# అధ్యాయం 49

'హింద్ స్వరాజ్' లో ప్రతిపాదింపబడిన నాలుగో ధర్మ సూత్రం అహింస. ఇది సత్యాగ్రహానికి మూలం. పాశ్చాత్య మతాల్లో పారిశుద్ధ్యము, దారిద్ర్యము, వినయమూ జీవితాచరణ సూత్రాలు, మహాత్ముడు సత్యనిష్ఠకే, జీవితాన్ని సత్యానికి అంకితం చేయడానికే ప్రాధాన్యం ఇచ్చినాడు. సత్యనిష్ఠకు 'నైతిక శౌర్యం' ఆధారం. సత్యాగ్రహి త్రికరణశుద్ధిగా సత్య వ్రతం చేయాలి.

"సాత్త్వికి నిరోధమును సత్యంవల్ల ఉద్భవించిన శక్తిగా వ్యాఖ్యానం చేశాను. ఏ పరిస్థితుల్లోనైనా సత్యపాలన తప్పదు. భ్రమ ప్రమాదాలనుండి రక్షించుకొనే నిమిత్తం సత్యవ్రతం అవసరం." అంతేకాని వీలున్నప్పుడు సత్యానుష్ఠానం, వీలు లేనప్పుడు తప్పించుకోడం కూడదు, మన సదుపాయాన్ని బట్టి సిద్ధాంతాన్ని వక్రించకూడదు.

సత్యం మంచిదేనా? అది విధిపూర్వకంగా అనాసక్తితో ఆచరణీయమా? ఏమిటి దీని ప్రయోజనం? మొదలైన అనేక ప్రశ్నలు పుట్టుకొనివస్తాయి. సత్యంలో కొంత భాగం ప్రకృతి విజయం. మిగతా కొంత భాగమూ మానవుని విశ్వాసం. పరిశుద్ధేచ్ఛ శీలసౌందర్యములేనని చెప్పవచ్చును.

మానవుడు చెప్పేది చేసేది ఒకటే కానప్పుడు అతనితో ఇతరులకు పరిచయం ఎలా ఏర్పడడం? అతన్ని విశ్వసించే వారెవరు? శీలవంతుడైతే చెప్పిందే చేస్తాడు—త్రికరణశుద్ధి కలవాడు కనుక. ఇతర్లు అతణ్ణి విశ్వసిస్తారు. శీలానికీ, నైతిక శౌర్యానికీ, సత్యసౌందర్యాలకూ విడతీయరాని ఘనిష్టమైన అంతరాంతర బాంధవ్యం ఉంది.

వీలుకాని సమయాల్లో కూడా సత్యపాలన సాగించవలసిందేనా? "వారిజాక్షులందు వైవాహికములందు, ప్రాణ విత్త మానభంగమందు" ఇత్యాది పరిస్థితుల్లోనైనా సత్య వ్రతమేనా?

ఈ కాలంలో కూడా 'సత్యం ఘనమైందే' అంటున్నారు కానీ, సొంత సదుపాయాన్ని బట్టి సత్యపాలన ఎగవేస్తున్నారు. ఒక సోవియట్ రచయిత ఏమని రాస్తున్నాడో చూడండి. "యుద్ధకాలంలో లౌకికమైన 'సత్య' పాలన ద్రోహకరం." అని సెలవిచ్చాడు. ఇక్కడ ప్రభుత్వ చట్టానికీ, సాంఘికావసరాలకూ లొంగిపోయింది సత్యం.

సత్య ధర్మనిష్ఠలు మంచివి కావూ? మన అవసరానుగుణ్యంగా, మన స్వార్థానుగుణ్యంగా సత్య ధర్మానుష్ఠానం ఉంటుందా? అనుష్ఠానం శీలాన్ని బట్టి నైతిక జీవితాన్ని బట్టి ఉంటుంది. మహాత్ముడు నైతికానికే ప్రాధాన్యం ఇస్తాడు, అనాసక్తి యోగంతో సత్యనిష్ఠ సాగించాలి, ధర్మం నిర్వహించాలి. క్లిష్ట సమయాల్లో అంతరాత్మే సమస్యా పరిష్కారం చేస్తుంది.

మహాత్ముని సిద్ధాంతంలో సత్యమే ప్రముఖంగా, పరమార్థపారంగా ఏల చెప్పబడుతోంది? సత్యానికీ, వ్యక్తి సాంఘిక

సదుపాయాలకూ సంబంధం గాంధీజీ ఎంతమాత్రం అంగీక రించడు. ఆయన వ్యక్తిగత లేక సాంఘిక ప్రయోజనాలకోసం ఇతరులవలె సత్యాన్ని ఖూనీ చేయడు. తక్కువపరచడు. చివరికి భారతదేశ స్వాతంత్ర్యం కూడా ఆయన దృష్టిలో సత్యనిష్ఠ ముందు అల్పమైనదే. చూడండి ఆయన దృఢ నిశ్చయం—“ దేశస్వాతంత్ర్యానికే నా జీవితం అంకితమైంది. కానీ, ఆ స్వాతంత్ర్యం హింసమూలంగా సిద్ధిస్తే నా కక్కర లేదు ; నేను స్వీకరించను. ” అని వుద్ఘాటించాడు. ఐతే దీనికి పూర్తిగా విరుద్ధపక్షం కూడా ఒకటి లోకంలో లేకపోలేదు. అదే చూడండి, కమ్యూనిష్టులను ఒకానొక సందర్భంలో లూయీ ఫిషర్ ఏమన్నాడో—“ కమ్యూనిష్టు వర్గీయులకు దుర్మార్గ—సన్మార్గ భేదాలు, సత్యాసత్య భేదం అంతగా వున్నట్టు తోచదు-వారి హావభావాలు బట్టి చూస్తే. ” [1]

మహాత్ముని తత్త్వం వినయశీలునికోసం కొంతవరకు ప్రత్యేకించబడింది. సత్యపాలన మానవుని విధికృత్యం. మనోవాక్కాయ కర్మలలో కూడా సత్యం ప్రతిష్ఠితం కావాలి. పరమేశ్వరుడు సద్రూపుడు. సత్యం స్వార్థాన్ని అతిక్రమించింది. అల్ప ప్రయోజనాలతో దానికి నిమిత్తం లేదు. పరిశుద్ధమైన వాక్కులో పరమేశ్వరుడు ప్రతిఫలిస్తాడు: పరిశుద్ధ సాత్త్వికాంతః కరణంలో పరమేశ్వర బింబం ప్రతిఫలిస్తుంది. మనోదర్పణం నిర్మలమైతే చిత్బింబ గ్రహణయోగ్య మవుతుంది.

---

[1] లూయీ ఫిషర్ విరచిత ‘ గాంధీ అండ్ స్టాలిన్ ’ గ్రంథం 38 పేజీలో.

అపరిశుద్ధమైన వాక్కులో మలినాంతఃకరణంలో పరమే శ్వర ప్రతిబింబం ఛిన్నాభిన్నముగా వుంటుంది. మానవుని సర్వ శక్తీ ప్రత్యశా ఆత్మశక్తి మీద ఆధారపడతవి. సమస్త ప్రాపంచిక విషయాలయందు బౌద్ధులన్నట్టు 'వుపేక్ష' 'దోషదృష్టి' కలిగించుకోవాలని మహాత్ముని బోధలో సారాంశం.

మహాత్ముని ఆధ్యాత్మిక దృష్టి, తత్వమూ తెలియడానికి ముందు ఆయన వచనాలు ఆలించండి: "నేను అస్పృశ్యుణ్ణి. నేను ముసల్మానును, క్రైస్తవుణ్ణి, యూదుణ్ణి. బౌద్ధుణ్ణి." "ప్రాపంచిక దేహాదీంద్రియ విషయాలు నిత్యములు కావు, 'సత్' రూపమయిన పరమేశ్వరు డొక్కడే నిత్యుడు, అక్షయుడు. మనకు దృశ్యమై పరిణమించేవీ, షడ్భావ వికా రాత్మక వస్తుజాతం యావత్తూ క్షణికం అనిత్యం. నిత్య స్వరూపుడు ఇంద్రియ గోచరుడుకాక జగత్తులో అంతర్హితుడై ఉన్నాడు. స్వస్వరూపం గోచరమయితే సర్వబంధ ముక్తి లభ్యమవుతుంది. సత్యాన్వేషణమే జీవిత పరమార్ధమూ లక్ష్యమున్నూ." "నేనాయనను దర్శించలేదు. నేనాయనను ఎరుగనైనా ఎరుగను. అకుంఠిత విశ్వాసంలో పరమేశ్వర స్వరూప దర్శనం కావాలి. అదే అనుభవం. విశ్వాసమని అనడంవల్ల సత్పదార్ధాన్ని విచ్ఛిన్నం చేయడం కాదు; సరిగా చెప్పగలిగితే పరమేశ్వరునిపట్ల ప్రణిధాన చిత్తము కావాలి."

# అధ్యాయం 50

మహాత్ముని తత్త్వసిద్ధాంతం అమెరికావారి నాగరకతనూ, సోవియట్ సమాజాన్ని కూడా సవాల్ చేస్తుంది. కార్మిక నియంతృత్వంతో శక్తిసముపార్జనా ప్రధానమైన సోవియట్ విధానాన్ని గాంధీ తత్త్వం ధిక్కరిస్తూనే వుంది. యావత్పాశ్చాత్య నాగరికతనే ఆయన తత్త్వం ఢీకొంటున్నది. చూడ దుర్బలుడైన ఈ యోగి అటు సోవియట్ 'కమీసారు'నూ ఎదుర్కొంటున్నాడు. ఇటు పాశ్చాత్యుల్లో ధనార్జనతో తీరుబడిలేనివాణ్ణీ, మెదడులేని భోగినీ కూడా ధిక్కరిస్తున్నాడు. కమ్యూనిష్టుల ఆర్థికమతం కన్న ఆర్థిక స్వార్థాన్ని యోగి సహించలేకపోతున్నాడు. మొత్తానికి మహాత్ముడు శక్తిసంపాదనా లాలసనే (అది నిర్మాణాత్మకమైనా సరే కాక పోయినా సరేగాని) తెగనాడుతున్నాడు.

"ఏజాతి శీర్షము మృత్యు ప్రధానము మీద వున్నట్టు భావిస్తుందో ఆజాతే గొప్పది." ఒకరి భోగం ఇతరులకు అసందర్భం అసంగతంగా వుండవచ్చును. అందుచేతనే సుఖం మానవుని లక్ష్యప్రధానం కాదు. కాబట్టి బుద్ధుడు నుడివినట్లు "అష్టాంగమార్గమే" లక్ష్యమవుతుంది. ఇదే మహాత్ముని సందేశం.

దానివల్ల, మతానుభూతివల్ల మనశ్శాంతి కలుగుతుందనేది స్పష్టం. పోతే శక్తి సంచయ లాలసలో మనశ్శాంతి అలభ్యం. నక్షత్రరాసులను జయించాలనీ, అమానుష సాహసోపేత కార్యములు చేయాలనీ, కొందరు పూనుకోడానికి కారణం శక్తి సంపాదనా లాలసవల్లనే. కాని శోచనీయం ఏమంటే వస్తువుల మీదకన్న ఆ శక్తి మానవకోటిమీదనే వీరవిహారం చేస్తున్నది.

అందుకే మహాత్ముడు శక్తిసంపాదనా వ్యామోహితులై జీవితం గడిపేవారిని తీవ్రంగా విమర్శిస్తాడు, వారితో ఏకీభవించడు. అంతేకాక, ఆయన జీవిత లక్ష్యాలు లేనివాళ్ళనూ, కేవల భోగపరాయణులనూ దిక్కరిస్తాడు. మహాత్మునికి అందు చేతనే పాశ్చాత్యనాగరకతా, సోవియట్ విధానమూ, ధనాఢ్య విధానమూ గిట్టవు.

మహాత్ముడు పాశ్చాత్య నాగరికతను ఇంత ఇదిగా సవాలు చేయటానికి కారణ ప్రోద్బలం ఎక్కువ టాల్‌స్టాయ్ వల్లనే వచ్చినట్టు తోస్తుంది. అంతేకాని ప్రోద్బలకారకులు ఎడ్వర్డు కార్పెంటరుగాని, జె. జె. రూసోగాని కాదు. స్థితి పరుడైన టాలుస్టాయి కర్షక సరళ జీవితమే మహాత్ముడు వరించాడు. అందుకే పాశ్చాత్యులు మిస్టర్ చర్చిల్‌వలె వెగటుగా ముఖం ముడుచుకొని తరుచు మహాత్ముణ్ణి "ఆసియా ఫకీరు - అర్ధదిగంబర" ని వాగుతూ వుంటారు. థామస్ మాన్ అభిమతానుసారం టాల్‌స్టాయి భోగపరాయణుడై ఆనక విరక్తిజెంది తపస్విత్వంలోకి వచ్చినాడు. ఈ విరక్తి థామస్ మాన్‌కు అట్టే నచ్చలేదు. కాని మహాత్ముడు మొదట్నించీ సమగ్రంగా శీలం తీర్చిదిద్దుకొని 'సహజమైన క్రైస్తవుని" గా

పరిణమించినాడు. క్రైస్తవం పూర్ణస్థితి యదార్థంగా గాంధీజీలోనే కానవస్తుంది. టాలుస్టాయి పురాతన జీవనమార్గం అనుసరిస్తే, మహాత్ముడు సరళ జీవితవిధానం అవలంభించినాడు. అందుకే ఆయన్ని ప్రాక్ప్రతీచీ ఖండాల్లో సిసలైన ప్రవక్తగా మహాత్మునిగా వాకొనటం.

గ్రామజీవనం వరించిన వారిలో గాంధీజీ ఒకడు. అంతే కాని విశిష్ఠుడు కాడు. ఆయన భావాలు పాశ్చాత్యు లుద్ఘాటించినవే ఆయాకాలాల్లో, వివిధ పరిస్థితుల్లోనూ. ఆధునిక పట్టణవాసం మితిమీరిన జనంతో కిక్కిరిసిపోవడం, పల్లెలు జనసూన్యమై పాడవటం మంఫర్డువలె గాంధీజీ కూడా అంగీకరించడు. భారీ పరిశ్రమలు అంగీకరించక కుటీరపరిశ్రమలు ఆయన ఆల్డస్ హక్స్లీ, గిల్, ముర్రేలవలె ప్రోత్సహిస్తాడు. దేశం విపరీత పారిశ్రమిక మవడం, పనివాళ్ళకు తిండి లేకపోవడం ఈ మొదలైన 'బ్లేక్' మహాకవి భావాలనే ఆయన అనుసరిస్తున్నాడు. ఈ సిద్ధాంతాలూ భావాలమాట కేమిగాని భారతదేశోద్ధరణ అంటే దాని ప్రాచీన సంస్కృతి కానుగుణ్యంగా నవీనరీతుల్లో దేశాన్ని నడపడమే గాంధీజీ ప్రధానోద్దేశం. అంతేగాని పాశ్చాత్యుల 'పొగగొట్టపు ఘూంకార' నాగరకత, యాంత్రిక నాగరకతా, ఆధునిక సౌలభ్యాలూ సౌక్యాలూ వీటన్నిటినీ మహాత్మా గాంధీ సమర్థించడు.

పాశ్చాత్య జీవితంలో గాయపడిన తావునే మహాత్ముడు యేలెత్తి చూపినాడు. విలియమ్ జేమ్సు అనే తత్త్వవేత్త చెప్పినట్టు 'విజయ దేవత ఊరకుక్క' విజయమే-శక్తి సంపాదనా విజయమే పాశ్చాత్య జీవితంలో పెద్దగాయం! ఆత్మవిశ్వాసం,

పరమేశ్వర విశ్వాసంలేక నేడు శక్తిసంపాదనా లాలసల్లో మానవుడు పతితు డవుతున్నాడు. ఇట్టి సమయంలో మానవకోటి శ్రేయస్సుకై వర్గరహిత పోరాటం నడిపినవాడే యోధుడు. ఆ యోధుని హృదయంలో వర్గాలే ఉండవు. అతడే మహాత్మా గాంధీ!

గాంధీతత్త్వం మానవుని ధీరోదాత్తుని చేస్తుంది. మానవుని అహంకారం, స్వార్థం, శక్తి వ్యామోహం పటాపంచలు చేస్తుంది. అది మానవునికి శాంతినిస్తుంది, వినయంతో వున్న మానవుడు పాదం మెట్టితే, బలిష్ఠుడు బలిచక్రవర్తి వంటివాడు కూడా అధఃపతితుడు అవుతాడు. వినయ త్యాగశీలములు యధార్థంగా శక్తివంతములు. శక్తివంత మనగా ఆధ్యాత్మిక శక్తివంతం.

# అధ్యాయం 51

భారతీయ మహాపురుషుడై గాంధీజీ సామాన్య కర్షకుని యెడల సానుభూతి చూపినాడు; తానే కర్షకునివలె సరళజీవనం చేస్తున్నాడు, ఆయనకు వర్ణాశ్రమాచారాలతో సంకుచితమైన సనాతన హిందూధర్మమంటే ఇష్టంలేదు. కర్మకలాపాలంటే, క్రతువులంటే, రక్తబలిదానమంటే మహాత్ముడు సహించడు.

అందుకే బుద్ధదేవునివలె ఆయన సర్వమాన శ్రేయోమార్గము సత్యాన్వేషణద్వారా చూపినాడు. ఈపంథా అవలంభించడానికి హేతువు ఏమిటి? టాలుస్టాయివల్ల, పాశ్చాత్య భావ ప్రాబల్యంవల్ల ఆయనలో ఈ భావపరివర్తనం యౌవనంలోనే వచ్చిందని చెప్పవచ్చు.

అంతే గాంధీజీ ఐహికాన్ని విడిచి నిర్లిప్తుడైనాడని అర్థంకాదు. ఆయన రాజకీయరంగంలో లౌకికవ్యాపారాల్లో ఉంటూనే సత్యాన్వేషణ చేసినాడు. కాని సమకాలంలో వున్న సామాన్య భావాలు మహోన్నతు లెప్పుడూ సహించలేరు. బుద్ధుడు వలెనే మహాత్ముడు కూడా సమకాలీన సంకుచిత భావాల యెడ తిరుగుబాటు చేసినాడు, బుద్ధుడు బ్రాహ్మణ హిందూ మతాచారాలపట్ల విప్లవం లేవగొట్టినాడు, గాంధీజీ

వర్ణాశ్రమాచారాల విషయంలోనూ, సామాన్య మతానుష్ఠానం లోని అవకతవకల్ని కూడా ఢీకొన్నాడు. సామాన్య ధర్మంలో పాలు సహించలేక పోయినాడు.

ఆయన స్వీయచరిత్రవల్ల మన కీ విషయం విదిత మవుతుంది. 'ప్యూరిటన్' మతంవంటి బ్రాహ్మసమాజం మహాత్మునికి ప్రీతిపాత్రమైంది. ఆ మతం ఆయనను బాగా ఆకర్షించింది. సంప్రదాయరీత్యా మహాత్ముడు గుజరాతీ వైష్ణవంలోవాడు. ఒకనాడు ఆయన రక్తసిక్తమైన కాళికోపాశన చూచి ఉద్విగ్న మనస్కుడైనాడు. "మేము కాళికాలయానికి వెళ్ళినాము. రక్తపు ఏరులు మమ్మల్ని ఆహ్వానిస్తున్నవి. ఆ దృశ్యం చూసి సహించలేక పోయాను, నిలువలేక పోయాను. నిశ్చేష్టుడ నైనాను. కర్తవ్యం తోచినా నేనేమి చేయగలను? ఆనాటి అభిప్రాయమే నేడూ నాలో నిలిచేవుంది. నా శక్తికిమించినదీ సమస్య. నా నిరంతర ధ్యానం ఇదే—ఏ మహితాత్ముడో, ఏ పరమేశ్వర స్వరూపిణియో జన్మమెత్తి కాళికాలయాలలో ఈ ఘృణితమైన దారుణ హింసాకాండ నిరోధించి పరిశుద్ధం చేస్తే బాగుండును. ధర్మభీరులు, ఆత్మజ్ఞానులు, మహా త్యాగ సంపన్నులూ, సహనశీలులూ అని గర్వించే నా దేశీయులు ఈ కసాయికృత్యాన్ని చూస్తూ ఎలా సహిస్తున్నారు? ఇంత కంటె దారుణం ఏముంది—పవిత్ర మతంపేరిట భయంకర బలిదానమా కాళీమాయికి? ఆ సమయంలో బుద్ధదేవుని గాథ నా స్మృతిపథానికి వచ్చింది."

"భక్తితో పుణ్యక్షేత్ర సందర్శనం చేయాలని నాకు ఆలోచనే లేదు... ....క్షేత్రాల్లో సాధువులు సుఖానుభవంకోసం ఉన్నట్టు కనపడతారు; జీవనానందం కావాలి వారికి."

" భగవంతుని ప్రేమను శంకించేవారుంటే వాళ్లు తప్పక ఈ పవిత్ర క్షేత్రాలు చూడాలి. భగవంతుని పేరుచెప్పి సాధు మహారాజులు అకార్యములు చేస్తున్నారు! చేసుకొన్నవారికి చేసుకొన్నంత - కర్మానుభవం తప్పదు మానవునికి."

వార్ధా సేవాగ్రామంలో మహాత్ముని ఆశ్రమంలో ఆచార్య భన్సాలీ అనే వేదాంతి వున్నాడు. ఆయనకు మననమూ నిది ధ్యాసమూ మహా ప్రీతికరం. పుదుచ్చేరిలో అరవిందయోగుల వలె. ఆయన దైనందిన కర్మలందు విరక్తుడై వుండటం గాంచి మహాత్ముడు పలికిన సుభాషితాలు కొంచెం ఆలించండి— " మనన నిధిధ్యాసలు ఇనుపపెట్టిలో గుప్తంచేయబడిన ఏదో నగకట్టు కాదు. ఆ ధ్యానతత్పరత సర్వేసర్వత్రా కనపడాలి, సందర్శించాలి." తిలక్ మహాశయుని గీతా వ్యాఖ్యలో పరమార్థభావం కూడా అంతే — ధ్యానం కర్మయోగానికి దారితీయాలి.

నేను గాంధీజీని టాలుస్టాయితో పోల్చినాను మహాత్ముడు టాలుస్టాయికన్న ఆధ్యాత్మికంగా సనాతనుడు. ఏమైనా ఆయన భారతీయులకు పాశ్చాత్య ప్రవక్త పాశ్చాత్య లోకానికి అంటే బిస్మార్కు, మార్క్సు లేక హిట్లర్, స్టాలిన్‌ల పాశ్చాత్య లోకానికి కాదు. క్రీస్తు, పీటర్ లేక పాల్, మోసెస్ జన్మించిన పాశ్చాత్య లోకానికి ఆయన ప్రాగ్దేశపు మహా ప్రవక్త - శాంతిదూత! " ఏసుక్రీస్తు మా ప్రాగ్దేశీయుడేస " ని మహాత్ముడు ఎప్పుడూ వాక్రుంటూ వుంటాడు. వాస్తవానికి గాంధీజీ భారతీయ నాగరికతావతారం. ఆయన ఐక్యాను సంధాయకుడు, భాష్యకారుడు. పిల్లపిల్ల పర్యంతం విశ్వవిఖ్యాతుడు. కేవలం ఆయన భారతీయుడై పరిమితుడుకాడు.

ఒకవిధంగా ఆలోచిస్తే ఆయన సజీవుడైన మహోన్నత క్రైస్తవుడు; సోక్రటీస్‌కంటె కూడా గాంధీజీ విశిష్ట క్రైస్తవుడు! క్రైస్తవుడయినా ఆయన హిందువుడు. కారణం దశావతారవాదం విశ్వసిస్తాడు కనుక.

పాశ్చాత్య హేతువాదికి ఇదంతా వాగ్యుద్ధంగా తోచ వచ్చును. పరమేశ్వరుడు అవతారమెత్తి అనేక తీరులుగా మానవకోటిలోకి రావడమేమిటని ఈ హేతువాది నమ్మడు; మిధ్యగా కొట్టిపారేస్తాడు. కాని పరమాస్తికునికి మాత్రం ఇది ముఖ్యమైన విషయమే, యదార్థవిషయమే. "నిజానికి క్రీస్తు భగవంతుడా?" పాశ్చాత్యదేశీయులు పరతత్త్వంలో మానవత దర్శిస్తారు. కాని ప్రాగ్దేశీయులు మానవునిలో దైవాంశం దర్శిస్తారు. ఇదే ప్రాక్ప్రతీచీల మధ్యవున్న భేదం.

మహాత్ముడు కేవల భారతీయునివలె, క్రైస్తవునివలె బ్రహ్మచర్యం అవలంబించమని వుపదేశిస్తాడు. ఆయన నైతిక సాధనం. ప్రణాళికలు భారతీయము కావు. ఆయన సాంఘిక దృష్టి, సంస్కరణ పరాయణత్వం పాశ్చాత్య ప్రభావ ఫలితమే. ఆయన సాత్త్విక శాంతివిధానం క్రైస్తవం, బౌద్ధం లేక జైనం కావచ్చునేకాని హైందవం కాదు. కారణం హైందవ ధర్మంలో 'అహింస' కే ప్రాధాన్యం ఇవ్వడంవల్ల. అదే హైందవధర్మమని ఆయన సాహసంగా వాఖ్యానించడంవల్లనూ, సనాతన హైందవ ధర్మం సాత్త్విక భావం వర్ణాశ్రమ ధార్మికదృష్టిగా తలుస్తారు కొందరు.

మహాత్ముడు విశ్వజనీన పురుషుడు. ఆయన ఉపదేశం పాశ్చాత్యలోకానికి ఎలా కనపడుతుంది? దారిద్ర్యం, పారిశుద్ధ్యం,

సత్యపాలనం, సాత్త్వికనిరోధం, గ్రామోద్ధరణ........అన్నీ ఎంత నీరసమని!—సగం రూసో సిద్ధాంతంలాగ; సగం సాల్వేషనిజంలాగా! "పాశ్చాత్యుల శక్తివ్యామోహ కాంక్షను, ప్రవృత్తిని అణిచివేసేది ఏమైనా వుందా? కన్ఫ్యూషియనుగాని, లాయోట్సెగాని పాశ్చాత్య ప్రవృత్తి మార్చగలరా?

నాగరకతా మూలసమస్య అత్యంత ప్రాచీనం. స్థిరమై, పరివర్తనశీలన మయినదానికీ, సనాతన అధునాతనానికీ సామరస్యం కలగాలి. ఋతుసంహారం, నాగరకతజీవనం, గేథే సామరస్య జీవిక ప్రాచీన ప్రశాంతి ఎంత బాగుంటాయి? కాని నేడు మనం నిర్దయాత్మక నిరంకుశ క్రౌర్య యుగంలో నివశిస్తున్నాము. భారతదేశీయుల ఆకలిమంటలు, యూరోపులో కమ్యూనిష్టుల తీవ్రత, ఫాసిస్టుల ప్రజాపీడనను సంస్కృతి అని కబుర్లు చెప్పుకొంటూ వుపేక్షించి కూర్చోటానికి వీలులేదు.

ప్రాచీన సంస్కృతి సంపద బహురూపాల వ్యక్తమవుతున్నది, ప్రవహిస్తున్నది. కాబట్టి కాలక్రమేణా అదే నిలుస్తోంది, అసంతృప్తిని దాటిపోయి. పోతే పాశ్చాత్యుల్లో గేథే కవీంద్రుని రసికత, ఉదయశంకరుని భారతీయ నాట్య భంగిమలు, రామగోపాల్ నృత్యకళలుగానీ ప్రస్తుత క్లిష్ట సమస్యలకు తగిన సమాధానాలు ఇవ్వలేవు. అలాగే టాలుస్టాయ్ రసికత్వంలో విరక్తీ, నిష్ఠుర నిశిత నైతిక భావంకూడా ప్రస్తుత సమయంలో మనం అలవర్చుకోలేము. 'సంఘ సంస్కారుల' యాంత్రిక దృక్పథమువల్లనూ కూడా సమస్యా పరిష్కారం కాదు-కాజాలదు. మరి ఏది పరిష్కారమార్గం?

అదే 'గాంధీజీ అడుగు జాడలు' అనుసరించడమే పరిష్కార మార్గం. వార్ధా సేవాగ్రామాశ్రమంలో బక్కచిక్కిన దరిద్ర నారాయణ నాయకుడు, మకుటంలేని భారత మహీపతి అమరసందేశం మానవకోటిలో మూడొంతులు ఆలకిస్తోంది. కర్షకులకూ కార్మికులకూ ఆచరణలో అదెంత సరళమైనా కఠినమైనా సందేశంలో సారం చక్కగానే అర్థమవుతోంది. దారిద్ర్యం, పారిశుధ్యం, పవిత్రత, సత్యం పసిపిల్లవాడికయినా తెలిసే తీరులో ఆయన బోధిస్తాడు. కాని అత్యంత నైతికశక్తి పరుడే ఆయన సందేశాన్ని ఆచరణలో పెట్టగలడు. సరళ జీవనం గడపదలచిన వారంతా ఆయన అడుగు జాడలనే అనుసరిస్తున్నారు. అందుకే ఆయనకు లక్షలూ కోట్లకొద్దీ ప్రజానీకం భక్తిపురస్కారాల వందనాలు కావిస్తోంది. వారందరికీ ఆయన మహా మహితాత్ముడు, మహాత్ముడు! ఎంత ప్రజ్ఞాన్వితులకైనా, ఎంత సూక్ష్మ బుద్ధిశాలురకైనా, ఆయన ప్రాచీన ధర్మోపదేశం చక్కగానే నచ్చుతోంది! సత్యాన్వేషణం కోసం సాహసంగా పురోగమించాలి, అతి ధైర్య శౌర్యాలతో దాన్ని అనుసరించే శాశ్విత శాంతాభ్యుదయాలతో కూడిన నవ ప్రపంచాన్ని ప్రతిష్ఠించాలి. కాని లోకంలో వర్గకలహాలకూ, అభివృద్ధి నిరోధకులూ అమానుష భయంకర మార్క్స్ అనుయాయుల లౌకిక దృష్టికీ గాంధీజీ సందేశం చుక్కెదురు. ఆ సందేశాన్ని సమగ్రంగా ఆకళించుకొంటే శాస్త్రీయమైన మహత్తరవాదం మనకి దానిలో గోచరిస్తుంది. ప్రధానంగా ఆ సందేశం ఆధునికి శాస్త్రజ్ఞుణ్ణి మానవ మనోవిజ్ఞానం సవరించుకోమనీ, రాజనీతివేత్తను తన నిర్ణయాలను

పునరాలోచించమనీ హెచ్చరిస్తోంది; వ్యక్తులంతా తిరిగి సంస్కారం పొందమని చెబుతోంది.

మానవ సంస్కృతి ఆధారం పురుషార్థాలకు మూల్యము ఇవ్వడం. భౌతికవాదంనుంచి హింసాకాండవైపు శరవేగంగా పరుగుతీస్తున్న లోకానికి, మానవతా గౌరవమే మంటకలుస్తున్నప్పుడు, పరమ పురుషార్థాలను లక్ష్యం చేయనప్పుడు ఒక్క మహాత్ముని దివ్యసందేశం తప్ప ఫాసిస్టు తాత్త్వికుడు నీషే సిద్ధాంతంకాని, మార్క్స్ పక్షీయ కమ్యూనిష్టు బూజుపట్టిన కార్మిక నియంతృత్వ విధానంగాని మార్గదర్శికాలు కావని లూయీ ఫిషర్ తన 'గాంధీ అండ్ స్టాలిన్' గ్రంథంలో చేసిన వాదంతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. త్యాగవైభవములో అకుంఠిత విశ్వాసమే గాంధీజీ సందేశంలోని సారాంశం.

నేటి కల్లోల ప్రపంచంలో మహాత్మా గాంధీ ఆధ్యాత్మిక వ్యక్తిత్వం అమోఘమైంది. ఆయన తత్త్వసిద్ధాంతం తుప్పుపట్టిన సనాతన క్రైస్తవానికీ, సనాతన హిందూధర్మానికీ, సనాతన సోషలిజం—మార్క్సిజాలకూ చుక్కెదురు. అంతేకాదు. చారిత్రకంగా కూడా మహాత్ముని అహింసాతత్త్వ సిద్ధాంతమూ, తదాచరణమూ అపూర్వము విశిష్టమున్నూ. భూగోళం స్టాలినీయ, హిట్లరీయ రక్కస—రాక్షసత్వ రక్తపాతంవల్ల కొంత తడిసినా, మానవ రుధిరంతో అతిగా తడిసిపోకుండా, అసలు మానవ లోకమే మట్టికొట్టుకు పోకుండా రక్షించబడిన దీ అహింసా సిద్ధాంతాచరణవల్లనే, ప్రభావంవల్లనే? తిరుగులేని సత్యమిది.

# అధ్యాయం 52

మహాత్ముని నిశిత మేధాదృష్టి రీత్యా పాశ్చాత్య నాగరకత శక్తి సముపార్జనా మోహంవల్ల ధ్వంసం అయిపోతున్నది. రాను రాను ఈ నాగరకత మరింతా వ్యాపారలోలుపమై యాంత్రికమై హేయమై పోతున్నది. గోఖలే మహాత్ముని 'హింద్ స్వరాజ్' లో దృక్పథాన్ని విమర్శించినాడు. రైల్లో ప్రయాణం చేస్తూ, కత్తితో క్షురకర్మ చేయించుకొంటూ, కళ్ళజోడు ధరిస్తూ మహాత్ముడు యంత్రాలు పనికిరావు నాగరకతకని అంటే ఏమన్న మాట ?

యీ సందర్భంలో మహాత్మునికి మనమిచ్చే సమాధానం రూసోకు వాల్టర్ మహాశయుడిచ్చిన సమాధానం రీతిగా వుండవలెనేమో! ఆయన—గాంధీజీ అంటాడు కదా: "నా అభిమతాన్నిబట్టి భారతదేశం 'ఆధునిక నాగరకతా' వ్యామోహాన్ని వెలివేయాలి. ఆలా చేస్తేనే దేశానికి లాభం చేకూరుతుంది. లేకుంటే సర్వనాశనం తప్పదు" అని. ఆ ఉద్వేగంతోనే మహాత్ముడు తీవ్ర జాతీయవాదిగా విదేశ వస్త్రదహనం ఆమోదించాడు, స్వయంగా చేశాడు, చేయించాడు కూడానూ. ఆ పద్ధతి రవీంద్రనాథుడు అంగీకరించలేదు. పోనీ ఇక్కడ సావనరోలా సంస్కరణవలె గాంధీజీ సంస్కరణ కూడా ఉందని అనుకుందాము.

కాని ఆయన అంటాడే " ఆధునిక నాగరకత "—దాని విషయంలో ఆయన అభిమతం ఏమిటి—ఆచరించేదేమిటి? బెలిన్లే బరన్స్ అన్నట్టు " అలవాట్లో పొరపాటు" అనుకోవాలా?—ఆయన ఆచరణతో దోషాన్ని. ఒక్కొక్కప్పుడు ప్లేటో మహాశయునివలె గాంధీజీ మాటలాడుతాడు.

"ప్లీడర్లు సన్మార్గులుకారు; వారు తగాదాలు పెంచి జీవన యాత్ర చేస్తారు కనుక." అలాగే "సహజమైన ప్రకృతికి విపరీతంగా మందులూ మాకులూ ఇచ్చి వైద్యులు మానవులకు కృత్రిమ జీవితం అలవాటు చేస్తారు, ఫీజు పుష్కలంగా గుంజు కోటానికి." "రైలుమార్గాలు మానవుల దుష్ట స్వభావాలను ద్విగుణీకృతం చేస్తున్నవి. త్వరగా దుష్టులు తమ క్రౌర్య కార్యక్రమాలకోసం త్వరితంగా ప్రయాణం చేస్తారు, సందేశాలు తీసుకుపోతారు." యంత్రపరికరాలు మంచివికావు. చివరకు ఆంగ్లేయ గ్రామాల్లోకూడా యంత్రాలు చాలా తక్కువ. వారంతా యంత్రా లుపయోగించరు. ఐనా భారతదేశంలో వస్తువులు జర్మనీలో తయారయినవే. "అమెరికా రాక్ఫెల్లర్ కన్న భారతీయ రాక్ఫెల్లర్ మంచివా డనుకోకూడదు. దారిద్ర్యదేవతా నిలయమైన భారతదేశం భాగ్యంతో తులతూగడం ఇప్పటిమాట కాదు. నా భయం ఏమంటే ఇప్పటికీ ధనాఢ్యులే బ్రిటీషు ప్రభుత్వానికి అండగా ఉన్నారని." "ఆదర్శరీత్యా నేను చెప్పేది యాంత్రిక నాగరకత పనికిమాలినదని. చివరకు నాశరీరయంత్రమే పనికిమాలినది. మోక్షానికి సహాయకారి కాదు కనుక."

ఈ భావసూక్తులన్నీ కలుపుతే మంచి వ్యాసం అవుతుంది. రస్కిన్ టాలుస్టాయ్ తత్త్వం జీర్ణించుకొని, పోటీకి రాసే రచనవలె వుంది. ఏమైనాకాని మహాత్ముడే చెప్పవలె ఆయన ప్రధానోద్దేశ్యం ఏమిటో. కాబట్టి చూడండి ఆయనేమి అంటున్నాడో—

“చివరకీ శరీరం కూడా నాజూకైన ఒక యంత్రమేనని తెలుసుకొన్న నేను యంత్రాలను ఎందుకు అంగీకరించను? అలాగైతే నా రాట్నము మొదలు పండ్లుకుట్టుకునే పిన్నీసు వరకూ యంత్రాలేకదా? నేననేది యంత్రమోహం కూడదనే గాని, యంత్రాలు అసలేవద్దని కాదు. కేవలం శ్రమను, కూలీని తగ్గించే యంత్రాలని చెప్పుతారే వాటిని (భారీయంత్రాలను) నేనెంత మాత్రం ఆమోదించను. ఆ వెఱ్ఱివ్యామోహం దుష్ఫలితాలు ఎలాంటివంటే, అధిక మానవబలం అవసరం లేకుండానే అధికోత్పత్తి కొనసాగుతుంది యంత్రావల్ల. తత్ఫలితంగా కార్మికులు అట్టే అవసరంలేదు. దానిమీద వేలాది, లక్షలాది కార్మికుల తిండిపడిపోతుంది, నిరుద్యోగులసంఖ్య పెచ్చుపెరిగిపోతాది. వీధుల్లో దరిద్రులపాలిటి క్షేమదేవతా స్వైరవిహారం అధికమవుతుంది. యీ అభాగ్య కార్మిక సోదర ప్రజానీకం చివరికి తిండికే ముఖమాచిపోతారు. ఆకలితో అలమటించి నడివీధుల్లో అసువులే బాసిపోతారు. కాబట్టి నా కోరిక ఏమంటే సర్వులకూ, మానవకోటి యావత్తుకూ శ్రేయస్సు కావాలి, అంతేకాని ఏ కొద్దిమందో సుఖపడితే కాదు? కొద్దిమంది చేతుల్లోనే ధనం పుష్కలంగా వుంటే లాభం లేదు. అంటే సంపాదనా, సంపదా కేంద్రీకృత విధానానికి నేను బద్ధవైరిని.

నేను కోరేది సంపద వికేంద్రీకృత విధానమే. కాని నేటి భారీ యంత్రయుగంలో సంపాదన యావత్తూ కేంద్రీకృతమే అవుతూంది. కొద్దిమంది మాత్రమే కుబేరులవుతున్నారు. ఆ అల్ప సంఖ్యాక వర్గమే అధిక సంఖ్యాక వర్గంమీద అధికారం చెలాయిస్తోంది. ఈ భారీయంత్ర పరిశ్రమలద్వారా, మానవబలం తగ్గటంద్వారా, అధికోత్పత్తి పెరగటంద్వారా సర్వజనహితేచ్ఛ శూన్యం సరికదా, యంత్రాలయ యజమానుల ధనార్జన దురాశ దుస్పృహమై పోతుంది. ఇదే కూడదని, అందుకే యంత్రాలు వలదనీ బోధిస్తున్నాను: నా శక్తికొద్దీ ప్రతిఘటిస్తున్నాను.... యంత్రం మానవ యంత్రాన్ని తుప్పుపట్టేలాగ చేయకూడదు.... విద్యుత్ చాలిత యంత్రాలన్నీ జాతీయం కావలసిందే, అంటే ప్రభుత్వ యాజమాన్యంలోనే ఉండాలి........అన్నింటికన్నా అత్యంతమూ మానవుడే - మానవత్వమే ప్రధానం."

మహాత్ముని దృష్టి యావత్తూ దేశంలో కొద్దిగావున్న పట్టణాలమీదకాక ఏడులక్షల గ్రామాలమీదనే కేంద్రీకరించాడు. గ్రామోద్ధరణకోసమే అధికంగా కృషి కొనసాగించాడు. గ్రామ పరిశ్రమాభివృద్ధి పుద్ధరించేందుకు ముందు ఇంటింటా చరకా అవసరమని వుద్ఘాటించాడు. దీని అంతరార్థం, విశిష్టత అర్థం చేసుకోలేని కొందరు మహానుభావులు ఇది అభ్యుదయ పద్ధతి కాదనుకొన్నారు. కాని ఆయన (గాంధీజీ) ఏమంటున్నాడో పరిశీలించండి—"ప్రతీగ్రామం, ఇంటింటా విద్యుత్ సర్వరా అయినప్పటికీ గ్రామీణుల యంత్రమానవులుగా మారటం నా కిష్టంలేదు ; నేను కోరను కూడా. ఐనప్పటికీ గ్రామీణుల్లూ, ప్రభుత్వం పుటలాటంకొద్దీ యీ విధానాన్నే. విద్యుత్

సహాయంతో పనిపాట్లు నిర్వహించటానికే కృతనిశ్చయమై కృతకృత్యం కావచ్చునే అనుకోండి. పోతే యీ విద్యుత్తు, యంత్రపరికరాలూ లభ్యంకాని గ్రామం సంచతి, నిరుద్యోగులయే గ్రామీణుల సంగతీ ఏమికాను? యంత్రమానవుడు గాని, ప్రభుత్వం గాని వీరి పోషణభారం వహిస్తారా; పని వేరువేరు పన్లు కల్పిస్తారా? విశ్వమానవశ్రేయస్సుకోసం వుద్దిష్టం కాబడే ఆధునిక శాస్త్రపరిశోధనలకు నేనెంతమాత్రం వ్యతిరేకిని కాను. అట్టివాటిని నేను పూర్తిగా సమర్థిస్తాను, ప్రశంసిస్తాను. కానీ, ఈశాస్త్ర పరిశోధన మానవ మారణహోమానికే; సమూల వినాశనానికే కారణభూతాలైన విషవాయువూ (ఏటం, హైడ్రోజన్ ఇంకా దాని అబ్బ బాంబులూ) వగైరా వుత్పత్తికే వుపయోగపడేటప్పుడు దానిపాలిటి నేను శత్రువుగానే పరిణమిస్తాను. యదార్థంగా మానవ శ్రమను తగ్గించి, శ్రేయస్సునే వాంఛించే పెద్ద యంత్రపరిశ్రమ; విద్యుత్‌చ్చాలితాలయినవి వ్యక్తుల పరంకాక ప్రభుత్వమే యాజమాన్యం వహించి నడపాలి."

రాట్నంగురించి మహాత్ము డేమంటున్నాడో వినండి—"భారతదేశంలో గ్రామీణ ప్రజానీకం దాదాపు ఆరుమాసాలు పనీపాట్లు లేక గోళ్లతునుముకొంటూ అరుగులు విరిగేలాగ కూర్చోకుండా, తక్షణం చరకామీద దారం తీయడం నేర్చుకొన్నప్పుడు (ఇది ఎవరికైనా అతి సులభసాధ్యమైన పరిశ్రమ) గ్రామీణ సమస్యల్లో—దేశ సమస్యల్లో ఒక క్లిష్టసమస్య పరిష్కరింపబడుతుంది. వ్యయసాయ వృత్తికి అనుబంధంగా నూలువడికే యీ పరిశ్రమవల్ల గ్రామీణుల్లో పనీపాటా లేనప్పటి

సోమరితనం పోవటం, తిండి లభ్యంకావటమే కాక, కట్టు
కోటానికి కావలసిన బట్టకూడా దొరుకుతోంది."

మహాత్ముడు పాతపానీయాన్నే కొత్తసీసాల్లో పోసి
నాగరకతను చూపుతున్నాడు. అంటే ప్రాచీన గ్రామ సంబంధ
మయిన నాగరకతను నవీన సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా
చేస్తున్నాడన్నమాట. భారీపరిశ్రమ — రాక్షసివలె బ్రహ్మాండ
మయిన ఫాక్టరీ, తదీయ సాంఘికవ్యవస్థ మహాత్ముని దృష్టిలో
ప్రధానం కావు. కేవలం ఆయన వ్యవసాయం, నేత, చేపల
పరిశ్రమ, చేతిపనులకే ప్రాధాన్యం ఇస్తున్నాడు. నాగరకత
యంత్రంకాదు. గుజరాతీ భాషలో నాగరకతను అనువదిస్తే
'సుశీలము' అని, ఆ శీలమే మూర్తీభవించగా మోహనదాస
కరంచంద్ గాంధీ అయినాడు.

మహాత్ముని నాగరకతా విషయక దృక్పథం అతి
శయోక్తిగా, అతి చిత్రంగా, విపరీతంగా కొందరికి కనబడ
వచ్చును. రవీంద్రునివంటి మహా విశ్వజనీనవ్యక్తి కూడా ఈ
గాంధేయ పద్ధతి అర్థంకాక తబ్బిబ్బులైనాడు. అయినా
మహాత్ముడు మాత్రం విశ్వజనీనుడై, భారతీయుడై గోచ
రిస్తున్నాడు. గాంధీజీ దృక్పథం నాగరకతా సమస్య. కేవలం
యంత్రం మంచిదనీ చెడ్డదనీ అనడానికేమీ లేదు. శాక్తేయుల
వామాచార సంబంధ ప్రతీకాలెంత ఘోరమో, యంత్రం కూడా
అమానుషానికీ రాక్షసత్వానికీ చిహ్నం. యంత్రం శక్తి సము
పార్జనకు సంకేతం. అదే నవీననాగరకతా చిహ్నం.

ప్రకృతి విజయం నవీనుడు సాధిస్తున్నాడు యంత్రశక్తి
వల్ల. ఈ విజయంవల్ల, మానవత్వహాని కలుగుతున్నది.

శాస్త్రీయ విజ్ఞానం పెంపొందుతున్నది. పృథివ్యాపస్తేజో వాయురాకాశ రంగాల్లో మానవుని మేధాశక్తివల్ల ప్రకృతి విజయం సాగుతున్నది. ఇది మానవ శ్రేయస్సుకోసం అయితే మంచిదే. ఇంతకన్న మహాత్ముడు మహాకారుణ్యానికీ హృదయానికీ పురుషార్థాలకూ విపరీత ప్రాధాన్యం ఇస్తున్నాడు.

ఆయన సందేశసారంలో గమనార్హం ఇదే: త్యాగం అహింసలు యంత్రాలకన్న గొప్పవి. లక్ష్యం సాధించే సాధనాలు లక్ష్యంవలెనే ఉదాత్తంగా ఉండాలి. సాధనాలు నీచాలు కూడనే కూడదు. మానవతారహితమయిన శక్తి రాక్షసంగా పరిణమించక తప్పదు.

# అధ్యాయం 53

ఏమిటీ అహింస? వర్గహింస, జాతీయ హింసకూ ప్రతికూలమయిన కేవల సాత్త్విక నిరోధమా? ఇదేనా గాంధీజీ సిద్ధాంతం? సాధకుడైన సత్యాగ్రహ దీక్షితుని అంతఃకరణ ప్రవృత్తి సత్య నిష్ఠమై త్యాగరూపంగా వ్యక్తమైనప్పుడు అదే అహింస: భౌతిక సుఖాపేక్షతో దానికి ప్రసక్తేలేదు. అది తత్త్వజన్యం. పరమ భక్తుని మతాచరణమే అది. అతడు హింసా రాగద్వేషాలకు అతీతుడై, సర్వసముడై, అహింసాచరణ చేస్తాడు.

హింస హింసకే దారితీస్తుంది; ద్వేషానికీ వైరానికీ దారి తీస్తుంది, అమానుషంగా పరిణమిస్తుంది. మానవుడు తత్ఫలితంగా రాక్షసు డవుతాడు. మానవుడు మానవుణ్ణీ హింసిస్తాడు. మహాత్ముని సిద్ధాంతం స్టాలినీయ కమ్యూనిజాన్నీ, మార్క్స్ కమ్యూనిజాన్ని ఆధ్యాత్మికంగా ధిక్కరిస్తున్నది. హెగెల్ తత్త్వవేత్తవల్ల ప్రతిపాదితమయిన "గతితార్కిక భౌతిక వాదానికీ" అహింసా వాదానికీ చుక్కెదురు. మార్క్స్ పక్షీయులు "వర్గపోరాటం" ముఖ్య సూత్రంగా ప్రతిపాదిస్తారు. కాని గాంధీతత్త్వం ఆ సూత్రాన్ని నిరాసం చేసింది. ఫాసిజమ్ అంతర్యుద్ధాలు అవసరమంటుంది. గాంధీవాదం యుద్ధకాండకే స్వస్తి చెబుతున్నది.

అహింసా శబ్దం వుపనిషత్తుల్లో గోచరిస్తుంది. కాని మహాత్ముడు దార్శనికుల తీరుగా కాక స్వతంత్రంగా అర్థాన్ని వ్యాఖ్యానించినాడు. ఇంకో విషయం, భారతీయ దర్శనాల్లోకన్న టాలుస్టాయి రచనల్లోనే అహింస అధికంగా కానిపిస్తోందని నా అనుమానం. అందుచేత మహాత్ముడు సనాతన హైందవధర్మాన్ని ఆశ్రయించాడని అనడానికి అంతగా వీలుండదు. ఆచార్యులు గీతకు వ్యాఖ్యానం రచించినట్లే, మహాత్ముడు కూడా గీతమీద అనాశక్తి యోగమనే వ్యాఖ్య రాసినాడు. యుద్ధం చేయడానికి ఉద్యుక్తుడు కాలేక అర్జునుడు కురుక్షేత్రంలో నిజస్యందనంలో కన్నీరుకారుస్తూ గాండీవం విడిచిపెడతాడు. అప్పుడు కృష్ణుడు అర్జనుణ్ణి కర్మయోగానికి పురికొల్పుతాడు. మహాత్ముడు కురుక్షేత్రం హృదయరంగంగానూ, కురుపాండవ సేనల పోరాటం తామస సాత్త్విక ప్రవృత్తుల సంఘర్షణంగానూ, మిగతా గీత యావత్తు రూపకాతిశయోక్తి (Allegory) గానూ వాఖ్య చేశాడు. అందరూ ఆయన వాఖ్య అంగీకరించ లేదు. కర్మ యోగాన్ని అంగీకరించి, బ్రిటీషు శత్రువును పారదోలడానికి గీత ప్రామాణికమైంది.

చూడండి గీతలో కృష్ణస్వామి ప్రబోధ వచన పరంపర ఎలా ఉందో—

హతో వా ప్రాప్స్యసే స్వర్గం, జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయా! యుద్ధాయ కృతనిశ్చయః.
సుఖదుఃఖే సమే కృత్వా, లాభాలాభౌ జయాజయౌ,
త తో యుద్ధాయ యుజ్యస్వ, నైవం పాప మవాప్స్యసి.

అంటే, "రణంలో మరణమే సిద్ధమైతే స్వర్గమే ప్రాప్తిస్తుంది. విజయమే వరించునా తులలేని రాజ్యభోగాలే లభ్యపడతాయి. కాబట్టి కౌంతేయా! లెమ్ము! సంగరమునకు సిద్ధంకమ్ము!"—"సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు సమపాయిగా గ్రహించి సంగరమునకు సంసిద్ధుడ వగుము. అప్పుడు పాపాలేవీ నిన్నంటవు." అని అర్థం.

సర్వసంశయ నివృత్తికి కృష్ణభగవానుని అంత్య సందేశమిదేనని చెప్పవచ్చును. అయినా, గీతాబోధ మహత్తు ఎంత ఘనమైనదైనా ప్రథమ విశ్వసంగ్రామ సమయంలో టాలుస్టాయ్ శాంతికాముక తత్త్వంకేసే మొగ్గింది నా మనసు అలాగే మహాత్ముని సిద్ధాంతం, అంటే మానవతా సంరక్షణం, జీవన గౌరవం అనే వుపదేశంలో గీతకంటే జైన, క్రైస్తవ ప్రభావమే హెచ్చుగా కానవస్తోంది. ఆల్బర్టు స్విట్జర్, లాంబరేన్ దార్మికుల తత్త్వ సిద్ధాంతాలు మహాత్మాగాంధీ తత్త్వవాదానికి బహు సామీప్యాలు. అంతేకాని సనాతన హైందవ ధర్మంతో ప్రశక్తిలేదు. అంటే ఇక్కడ గాంధేయం గీతాకారుడైన కృష్ణస్వామితో ఏకీభవించదు.

మహాత్ముని ద్వారా క్రైస్తవం విరివిగా భారతభూమిలో వ్యాప్తమయింది; క్రైస్తవ జ్ఞానధార ప్రస్రుత మైంది. గీత—"అద్వేష్టా సర్వభూతానాం—మైత్రం కరుణ ఏవ చ, నిర్మమో నిరహంకార-సమదుఃఖ సుఖః క్షమీ... ....యో మద్భక్త స్స మే ప్రియః." అని ప్రఖరముగా శాసిస్తూవుంటే మహాత్ముని ఆదరాలమీదుగా—"పావన చరిత్రుడైనవాడు దైవకృపాపాత్రుడగును. పవిత్రాంతకరణ గలవాడు పరమేశ్వరుని దర్శించగలడు.

ఆతడే యథార్థమైన శాంతిదూత—ఈశ్వరుని అనుంగు బిడ్డ." అని 'సెర్మన్ ఆన్ ది మౌంట్' లో వాక్యాలు సున్నితంగా స్పష్టంగా వెలువడుతూ వుంటాయి.

పాశ్చాత్య శాంతివాదులవలె మహాత్ముడు యుద్ధాలు దోషంగా, శక్తిసంపాదనము తప్పుగా ఎప్పుడూ చెప్పలేదు. ఆయన 'హింద్ స్వరాజ్' గ్రంథం చదువుతున్నప్పుడు నాకు సందేహాలు చాలా తోచినవి. కేవల విశ్వాసంతో ఆయన బోధ వినడంమాట ఆలావుంచి, యోచించి అంగీకరించేందుకు ఆయన భావాలు కొన్ని సందేహాస్పదాలుగా ఉన్నవి. అధర్మం, పాపం పెరిగినప్పుడు దాన్ని తోసివేసే ధర్మం అవసరం. ధర్మం, న్యాయం ఎలా నిర్ణయం చేయడం? నిర్వహించడం ఎలాగ? అధర్మాన్ని అన్యాయాన్ని తొలగించేందుకు సత్యాగ్రహం. అవసరమైతే హింస కూడా వుపయోగించ వచ్చునా? అవసరం వచ్చినప్పుడు హింసను ప్రతిహింసతో ఎదుర్కోవలసివస్తుంది.

పాపాన్ని నిర్ణయించడం, పాపం తోసివేయడానికి సత్యాగ్రహం కావాలి. 'అంతా వెయ్యేళ్ళల్లో సమానులు' అవుతారని ఆయన భ్రమపడడు, ఆయన నైతిక శౌర్యమే నొక్కివక్కాణిస్తాడు. పాపి ముక్తుడు కాడనీ, తీవ్రదండన వాడికి మహాత్ముడు ఎప్పుడూ విధించడు.

ఐతే ఎవడు ధర్మనిర్వాహకుడు? అధర్మాన్ని ఖండించేవాడెవడు? పాపి పాశ్చాత్తాపం ఎవరివల్ల పొందగలడు? హింస ప్రతిహింసకు దారితీస్తుంది కాబట్టి, నిష్క్రోధులై నిష్పాక్షికులై హింసను ఎవరాపగలరు? శక్తిసంపాదనా వ్యామోహానికి అతీతు

లెవరు ? అర్జునుడివలె గీతాధర్మం ఆచరించేవా రెవరు ! జాలిస తనం యుద్ధంవల్ల పోవచ్చును. అందుకని శేషించిన ఆఖరి శత్రువును కూడా హతమార్చడమేనా ? అంతకన్న మంచి ఉపాయం, పరిష్కార మార్గం మరేమీ లేదా ? ఈ ప్రశ్న పరం వరకు సమాధానం కావాలి—అందుకే ప్రయత్నిస్తున్నాను.

# అధ్యాయం 54

చరిత్రాత్మకమైన వారంలో, శుక్రవారంనాడు నేను ఢిల్లీ చేరినాను. బర్మా అడ్మిరల్ యుద్ధకాలంలో ఆగ్నేయాసియా నౌకాదళాధిపతి, చక్రవర్తి దాయాదీ అయిన లార్డు మౌంట్‌బాటన్ ఇండియా కొత్త రాజప్రతినిధిగా నియమితుడై అనాడే ఢిల్లీ విమానాశ్రయంలో దిగినాడు. అనక ఆ మరుసటి సోమవారం వైస్‌రాయ్ అఖిలాసియా మహాసభ ప్రతినిధులకు సన్మానం చేస్తున్నప్పుడు నన్ను కూడా ఆహ్వానించినారు.

ఈ మార్చి మాసంలో ఢిల్లీ భారతీయ సౌందర్యంతో ఉట్టిపడుతోంది. ఎర్రవిగా పెద్దవిగా వున్న 'కన్నా' కుసుమాలు సొగసు కులుకుతున్నవి. పైడి మొహరు వృక్షాలు శోభలు వెలారుస్తున్నవి. ఢిల్లీ వాతావరణంలో ఇంకా వేసవి ప్రవేశించలేదు. వీధుల్లో శుభ్ర వస్త్రధారులు—తెల్లని దోవతలూ కుర్తాలూ ధరించిన భారతీయ పురుషులు, రంగురంగుల చుక్కచుక్కల పువ్వుపువ్వుల చీరలు సింగారించుకొన్న మహిళలు కిక్కిరిసి ఉన్నారు. ఆ సమయంలో భారతీయ భాస్కరుని అరుణారుణ కిరణాలు కాంతిలో మహోన్నత కట్టడాలు ఢిల్లీ పాతకొత్తల ప్రతిభా సౌందర్యాలూ ప్రస్ఫుటమవుతున్నవి. ఢిల్లీ భారతీయ రోమువలె వుంది.

వైస్‌రాయ్ దర్బారు హాలులో ప్రవేశించాడు. ఆయన రాకను తెలియచేస్తూ బిగులు ఊదినారు. గౌరవార్థం సభ్యులంతా లేచి నిలపడ్డారు. అదే ప్రథమం లార్డు మౌంట్‌బాటెన్‌ను నేను వీక్షించడం. ఆయన యధోచితంగా ప్రమాణం చేసి, వైస్రాయ్ సింహాసనం అధిష్టించినాక ముక్తసరిగా వుపన్యసించినాడు. అదైనా ఎంత నిరాడంబరం! రాజప్రతినిధిగా తాను రావటం యధాపూర్వకం కాదనీ, బ్రిటిష్ ప్రభుత్వం 1948 జూన్ నాటికి రాజ్యాధికార ప్రదానం చేస్తాదనీ, తాను కేవలం ప్రజాసేవకోసమే భారతదేశంలో పాదం పెట్టినాననీ, భారతదేశ సేవయే తన విధికృత్యమనీ, ముందుగా రాసుకొచ్చిన వుపన్యాసం చదివి సభికులకు వినిపించాడు. ఆ విధంగా ఆయన రాజనీతి వ్యక్తపరిచాడు.

దర్బారు మహలు ప్రాచీనాలంకారంతో అత్యంత శోభాస్పదమై, నవీనరీతిలో విద్యుద్దీపికాలంకృతమై, సభాసదులతో విరాజిల్లింది. ద్వారపాలకులు చిత్రవర్ణ శబలితములయిన వేత్రములు ధరించినారు. దర్బారుమందిరం యావత్తూ దీపోద్భాసితమైంది. వైస్రాయీ వైస్రాయిణీ ఆడవలసిన నాటకానికి అనుకూలంగానే వున్నారు. సభ్యులు వారివారి సంప్రదాయరీతిలో శ్వేతవస్త్రములు ధరించినారు. ఎర్ర వల్వెట్, వంగుపండు రంగులతో, తెల్లని నౌకాసంబంధమయిన వేషములతో వుద్యోగులున్నారు. హాలీవుడ్ కూడా ఈ రంగాలంకరణం ఇంతిదిగా తీర్చిదిద్దలేదేమో!

కొత్త ఢిల్లీ ద్వారతోరణం దాటి, రాజప్రతినిధి మందిర సోపాన పరంపర అధిరోహించి దర్బారు హాలులో ప్రవేశించాను. న్యూఢిల్లీ నిర్మాత, శిల్పికారుడు అయిన సర్ ఎడ్విన్ లాటియన్

కట్టడాలలో యెన్నికైన ప్రభుత్వ కార్యాలయంలో ఒక దగ్గర 1 నవంబరు 1858 లో విక్టోరియా మహారాణీ ప్రకటనలో చెక్కబడివున్న కొన్ని సూక్తులు చదివాను. " వారి అభ్యుదయమే మనకు పెట్టనికోట ; వారి సంతుష్టిలోనే మనకు శ్రేయం; వారి కృతజ్ఞతే మనకు మహద్భాగ్యం. " ఇంకో ఘనమయిన సూక్తి: " స్వేచ్ఛ ప్రజలకై అవతరించదు. ప్రజలే స్వాతంత్ర్యాభిముఖులై పురోగమించాలి. అనుభవానికి పూర్వం స్వేచ్ఛాసాధనమే ఎంతో మహద్భాగ్యము వంటిది. " బ్రిటీషు వారు తమ పరిపాలనపై స్వయంగా చేసిన వాఖ్యాన మిది. నేడు పై వచనాలు అక్షరాలా క్రియారూపంలోకి వచ్చినవి. స్వేచ్ఛకోసం భారతీయులు అనవరతమైన సాధన చేశారు. ఈ సాధన స్వాతంత్ర్యానందం అనుభవించడానికి పూర్వమే.

దర్బార్ లో సాఫీగా కొనసాగిపోతున్నా క్రతువు తిలకించే వారంతా ప్రసన్నులుగా లేరు; చరిత్ర శరవేగ పురోగమనాన్ని గుర్తించినవారిగా కానరావడం లేదు. హాలులో వున్నవారిలో సగానికి సగంమంది బ్రిటీషు అధికారులూ, వారి సతీమణులూ ఉపవిష్టులై వున్నారు. బ్రిటీషువారేదో తప్పిదం చేస్తున్నట్లు భావించే వేధనా చిహ్నాలు స్పష్టంగా వారి వదనాలలో గోచరించాయి. పోతే భారతీయులున్నారే వారు ఇప్పుడే కాదు ఎప్పుడూ ప్రసన్నులే; వినయశీలురే. అధికార దత్తానంతరం బ్రిటీషు వారంతా దేశంనించి లాడీ బీడీ సర్దుకు పోటానికి సిద్ధపడుతున్నారు. కాని భారతీయులు వారిని తమదేశంలోనే వుండాలని కోరుతున్నారు. అక్కడికి వచ్చినవారిలో ముగ్గురు మహారాజులు కూడా వున్నారు. వారిలో ఒకరు ధోల్పూరు మహారాజు,

ఆయన అల్లుడు నాభా సంస్థానాధిపతి వున్నారు. మిగతా ఇరువురు రాజులూ వైస్రాయి చిరపరిచితులు — హాలులో ఒక చోట వున్నత సైనికోద్యోగుల హోదాసూచిత పరిపూర్ణ దుకూలాలలో మహా వొంకంగా కూర్చొని వున్నారు.

వైస్రాయ్, ఆయన ప్రక్కనే వైస్రాయిణి. ఆవిడకు పక్కనే పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్, లియాకత్ ఆలీఖాన్ వరుసగా కూర్చున్నారు. నాకు ఈ భారతీయ ప్రముఖుల తీవ్రేచ్ఛను బట్టి అధికార ప్రదానాంతరం కామన్‌వెల్తు సంబంధబాంధవ్యాలు తెగతెంపులు చేసుకుంటారనే నాకు తోచింది. కాని కొంతకాలానికి, అంటే నేను మళ్ళీ భారత దేశం వచ్చిననాటికి ఆ వాతావరణం మారిపోయింది. కామన్ వెల్తులోనే వుండటానికి ఉభయ పక్షాలూ ఆమోదించినాయి. ఇది ప్రపంచేతిహాసంలో చెప్పుకోతగ్గ మహత్తర నిర్ణయం. (దీనికి కారణం గాంధీజీ ప్రభావమే.)

మూడు రోజుల తర్వాత నేను మరో ఉత్సవంలో కూడా పాల్గొన్నాను. ఇది లోగడదానికన్న ఇంకా శోభస్కరంగానూ, సందడిగానూ వుంది. అక్కడ ఆవేళ అతిథులతోపాటు అధికార వర్గం కూడా గుమికూడినారు. ప్రభుత్వ భవనం విద్యుద్దీపికా పంక్తులతో కళకళ లాడుతోంది. మందిరారామ వాటిక విద్యుత్కాంతిలో శోభాయమానంగా వుంది. ద్వారపాలకులు విగ్రహాలమల్లే నిలబడి వున్నారు. అలంకృతమైన మేజాబల్లల మీద వివిధ రుచికర పానీయాలు సిద్ధం చేయబడినవి. భారతీయులు, హిందూ ముస్లమానులకు ప్రీతిదాయకమైనవే ఆ పానీయాలన్నీ.

యీ విందులో పాల్గొన్న అతిధివర్గాని కంతటికీ అలంకార ప్రాయంగానూ అత్యద్భుతంగానూ గోచరించినవారు ప్రాచీన దేశమైన టిబెట్‌నించి విచ్చేసిన లామా బౌద్ధ సమూహమేనని చెప్పాలి.

ఆహ్వానం ముగిసింది. వుత్సవానంతరం రాజప్రతినిధి సతీమణి నన్ను అందంగా అభినందించింది, సామాజికమైన కలుపుకోరుతనం నేర్పుగా ప్రకటించింది. అనక తోటలో ఇతర అతిధులను కలసినాను. ఆ దృశ్యం 'థౌజండ్ అండ్ ఒన్ నైట్సు' లోని కథాఘట్టంవలె వుంది. ఆ అతిధుల్లో రంగు రంగుల దుస్తులలో సాంప్రదాయరీత్యా అలంకృతులైన బర్మీయులు, భూటానీలు, పాశ్చాత్య వేషధారణలో వున్న చైనీయులు, స్వర్ణఖచిత శిరోవేష్టణధారులైన టిబెట్ బౌద్ధులు, వారివారి దేశాలవారీగా ముస్తాబైన ఈజిప్షియనులు, పరిష్యనులు పార్థియనులు, ఎలమైట్లు, రష్యా వుజ్ బెక్‌స్థానీయులు, ఆఫ్ఘనులు, సింహాళీయులు, ఇండోనీసియనులు, ఫిలిపైన్లు వీరువారనేమిటి యావత్తు ఆశియా నాడు అక్కడే సాక్షాత్కారమైంది నా కంటికి.

రాజభవనం మీద యూనియన్ జాక్ వేలాడుతున్నది. బ్యాండ్ వాయిస్తున్నారు జాతీయగీతం, మౌంట్‌బాటన్ దంపతులు తోటలో కృత్రిమ సరోవరం పక్కనే నిలిచినారు. నానాభాషలు మాటలాడే ఆయన మిత్రబృందం అక్కడే ఉంది, రెండు శతబ్దాలయిన పిదప యూనియన్ జాక్ కిందికి దింపి వేసినారు. దాని స్థానే త్రివర్ణపతాకం అశోకధర్మచక్రంతో ఉన్న జాతీయ పతాకాన్ని ఆరోహించినారు. ఈ వింతఘట్టాన్ని ఊహించి నేనేకాదు ఇంకా ఎంతమంది ఆశ్చర్యపోయినారో కదా!

1948 ఫిబ్రవరి 28వ తేదీన పదిగంటలు కాకపూర్వమే శనివారం వుదయం చిట్టచివరి సామ్రాజ్య సేనాదళం మేజరు గ్రిఫిట్స్ నాయకత్వం క్రింద ఇంగ్లండు ప్రయాణ మయినది. బ్రిటీషు భారతీయ సేనలు పరస్పరం ఆయుధాలు ఇచ్చిపుచ్చుకొన్నారు. 'వందేమాతరం' సైనికగానం చేశారు. 'జయ్ హింద్' నినాదాలు బొంబాయి రేవులో మారుమోగినవి. ఓడ కదిలింది. అంతే నాటితో బ్రిటీషువారి ఘనమైన అధ్యాయం అంతమైంది. భారతంలో నవశకం ప్రారంభమైంది.

# అధ్యాయం ౮౮

మాసం గడిచిన తరువాత నేను వుత్తర హిందుస్థానము తిరిగి వచ్చినప్పుడు, రాజప్రతినిధిగా వున్న మౌంట్ బాటన్ ప్రభువు నన్ను సాదరంగా తన మందిరానికి ఆహ్వానించినాడు. గొప్ప వారితో వుండడమూ వారి ఆతిథ్యం స్వీకరిస్తు, తదితరుల వంద నాలు అందుకొంటూ భవన ప్రవేశం చేయడమూ హృదయాహ్లాద కరంగానే వుంటుంది. వుద్యోగ సంబంధమైన హోదా వుండ వలసిందే, అది వుచితంకూడాను. అదే అధికార సంతృప్తి అయిన పక్షాన, పాపంగానే పరిగణించాలి. ఇక్కడ రాజప్రతినిధి మందిరంలో వున్న అధికార దర్పమంతా సాంప్రదాయకం. అధికార లేశం దొరికినట్టు తోస్తే సంతోషంకలిగితే, ఆ అధికార వ్యామోహమే విషప్రాయమై మానవ హృదయం మీద తన ప్రభావం చూపుతుంది. అధికార కాంక్షాసారమే సీజరు. అతని అభ్యుదయ పతనాలకు అదే కారణం.

మహాత్ముని సిద్ధాంతం యదార్థంగా స్తవనీయం. అది సహేతుకం. అత్యధికార వాంఛా సంతృప్తి విషప్రాయం, పాప పూరితం. అనాశక్తితో కర్మకలాపాలు సాగించే సామాన్యులను చూచినప్పుడు, అధికార వాంఛా ప్రమత్తులకు రోత కలుగుతుంది.

సామాన్య సరళ జీవితం వారు గడపలేరు. అధికార దర్పం కావలసిన వారు ఐశ్వర్యం, ఆధిపత్యం, ప్రభావం కోరుతారు. విషయాలకు వారి మనసు దూరమై నిర్లేపం కాదు, నిస్సంగం కాదు. మహాత్ముడు విషయసంగము కూడదని బోధిస్తాడు. కర్మ యోగంలో మానవుడు ఉంటున్నప్పటికీ నిస్సంగుడు కావాలి. అధికార వాంఛాపరాయణుడికీ, శక్తిసంపాదనా విమోహితుడికీ మహాత్ముని తత్త్వం హితవుగా తోచదు. ఈ నవీనకాలంలో నిస్సంగులకూ సన్యాసులకూ గౌరవం తక్కువ. నిజంఆలోచిస్తే తత్త్వవేత్తలు బ్రహ్మనిష్ఠలు, భక్తులు, పండితులు, శాస్త్రకారులు గొప్పవారయినా, రాజకీయ తారల ఆకర్షణమే లోకంలో విప రీతంగా ఉంది. రాజనీతివేత్త కన్న మానవ జీవనవిధానం సరి దిద్దగలిగే తాత్త్వికుడే ఉపయోగకరం. మానవ సౌభ్రాతృత్వం, సమానత్వం, మానవత్వం, మానవ పురుషార్థాలకు మూల్యం బోధించేవాడే లోకానికి మార్గదర్శి. లక్ష్యసాధనకు ఉదాత్త సాధన అవలంబించమని బోధించేవాడే నేడు లోకానికి కావాలి. మహాత్ముడు ఉదాత్తసాధన అవలంబించమనీ, ఉత్కృష్ట లక్ష్యానికి ఉత్కృష్ట సాధన అవసరమనీ చెప్పినాడు.

ఎ. వి. అలెగ్జాండర్ బస (వైస్రాయి మందిరంలో) నాకు ఏర్పాటయింది. ఆయన బ్రిటిష్ రక్షణ శాఖామాత్యులు, నేను అత్యవసరమయిన పనిమీద రావడం నాకు చాలా ఆనందంగా వుంది.

నేను పెకింగునుండి తిరిగి కలకత్తా చేరినప్పుడు యధా ప్రకారంగా శరచ్చంద్రబోసుకు అతిథిని. హిందూ మహమ్మ

దీయులు ఒక అంగీకారానికి వచ్చి బంగాళా దేశైక్యతకు తగిన రాజ్యాంగరచన చేసుకోడానికి రాయ్, సుహ్రావర్దీలు బోస్ మందిరంలో సమావేశ మవుతారన్న విషయం నాకు అంతకు ముందేమీ తెలియదు. ఈ విధంగా హిందూ మహమ్మదీయ మైత్రీసంపాదనకు కాంగ్రెసు అధికారవర్గం, లీగువారూ పరస్పరం సమాధానపడితే అంతకన్న కావలసిం దేముంది ?

నాలుగేళ్ళనాడు లండన్‌లో రాజ్యాంగరచనా సంబంధ మయిన పత్రం రచన చేయడానికి నేను కారకుడను. ఆ పత్రం మీద చాలామంది భారతీయులు, పార్లమెంటు సభ్యులూ ఒక మంత్రీ చేవ్రాలుచేశారు. అట్లాంటిక్ ఛార్టరు విషయంలో మేము తీవ్రంగా యోచించి వాగ్దానాలు చేశాము; ప్రాగ్దేశీయుల కీవిషయం అంతగా పట్టలేదు. భారతదేశంలో నాకు ఏతద్విష యంలో ఖ్యాతివచ్చింది; భారతీయులు, జాతీయవాదులు నన్ను విశ్వసించినారు. నా పత్రం నకలు కలకత్తా విశ్వవిద్యాలయ భాండాగారంలో అధికారులు భద్రంచేసి వుంచారు.

ఆ పత్రంలో పొందుపరిచిన విశేషాలివి—

"ఫాసిజం, ఇంపీరియలిజాలను ప్రతిఘటిస్తూ జరిగే యుద్ధంలో భారతదేశం కూడా సంపూర్ణంగా స్వేచ్ఛగా సహక రించాలంటే ముందు దాని విదేశ దాస్యశృంఖలాలు విచ్ఛిన్నం కావాలి. అంటే ఏనాడైతే భారతదేశానికి స్వాతంత్ర్యం లభ్యమై విదేశీయాధిపత్యంలేకనే తన భవితవ్యాన్ని తాను రూపొందించు కొంటుందో, తదితర ప్రజాస్వామిక దేశాలవలె తానూ

స్వాతంత్ర్యమై ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం; సమాన ప్రాతినిధ్యం కలిగి వుంటుందో, ఆనాడే అది మిత్రరాజ్యాల పక్షంగా పోరాటం సలుపుతుంది."

"దేశంలో భారతజాతీయ కాంగ్రెసు అనేదే సుశిక్షితమై సుప్రసిద్ధ కార్యప్రణాళికాబద్ధమై స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న మహాసంస్థ. ఈ సందర్భంలో దేశాన్నంతటినీ కూడ గట్టుకు రావటంలో కాంగ్రెస్ వహించిన పాత్ర నిజంగా చరిత్రాత్మకమైనది. ఆ మహాసంస్థలో దేశంలో వివిధ జాతుల వివిధ భాషీయుల ప్రతినిధులూ సభ్యత్వం కలిగివున్నారు. అంతేకాదు, దేశంలోవున్న నానాజాతులకూ ప్రాతినిధ్యం వహించే మహాసంస్థ ఒక్కటే కాంగ్రెసే."

దేశంలోగల అల్పసంఖ్యాక వర్గాలవారి మత, రాజకీయ, వాక్స్వాతంత్ర్యాది హక్కులన్నీ పరిక్షించబడతాయని అ.భా.జా. కాంగ్రెసు హామీనిస్తోంది. పోతే భారతీయుల్లో వివాధాలేమైనా వుంటే సామాన్య ప్రజాస్వామిక విధానానుసారం పరిష్కరించవచ్చును. ఇంకా అవసరమైతే ప్రజావాక్యం 'ప్లెబిసైట్' ద్వారా తగాదా పరిష్కారం కావించవచ్చును. కాబట్టి అఖిల భారత జాతీయ కాంగ్రెసు మహాసభ కోరే హక్కులన్నీ తక్షణం బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించడమే కాక ఐక్యరాజ్య సమితి కూడా గౌరవించి తీరాలి."

"భారత జాతీయ కాంగ్రెస్ కోరికలన్నీ ఆమోదించేమేము, అనగా ఈ కౌన్సిల్‌వారము బ్రిటీషు ప్రభుత్వాన్ని అడిగేదేమంటే, భారతదేశంలో తమ పరిపాలన ఇంకా ఎంత

కాలమో ఒక గడువు నిర్ణయించాలి. ఈ లోగా అంటే కాల నిర్ణయం చేయబడినప్పటి నుంచీ భారతదేశంమీద అధికారం ఆదిపత్యం బ్రిటన్ వదులుకోవాలి."

"సామ్రాజ్యవాద వ్యతిరేకులై, ఫాసిస్టు నిరోధకులై, బడుగు దేశాలను పెద్ద రాజ్యాలవల్ల కబళింపబడడం అంగీక రించక, జాపాన్ మొదలైన దురాక్రమణాపూరిత దుష్టశక్తుల బారినించి ఆసియాను పరిరక్షించాలనే ఆతృతతో భారతీయులు విముక్తికై తమ హక్కు, స్వాతంత్ర్యహక్కు తక్షణం ఇమ్మని కోరుతున్నారు."

"స్వలాభాపేక్షతో, బ్రిటన్ ఆర్థికలాభం నిమిత్తం ఒక దేశంమీద అధికారం చలాయిస్తూ, విజేతపొందే అవకాశాలు చూరగొంటూ వుండటం, ఆ అవకాశాలు జారవిడవటానికి ఇష్ట పడక ఏవో అర్థవిహీనమైన సాకులు చెప్పుతూ అధికారం ఇంకా కొనసాగించటానికే కృతనిశ్చయం కావటం, నిజంగా ప్రజా తంత్ర రాజనీతికే, ధర్మానికే, మానవత్వానికే మోసం, విరుద్ధ విధానం. బ్రిటీషర్లు అమూల్యమైన మానవ హక్కులను చక్రవర్తి కిరీటాలంకారాలుగా పరిగణించటం అత్యంత శోచనీయం, అది కేవలం గర్హనీయ నిరంకుశ సామ్రాజ్యవాదం! ఇలా పూర్వం చేయటం వల్లనే అమెరికా వలసరాజ్యాల ప్రజలు తిరుగుబాటు చేశారు. అలాగే మళ్ళీ ఘనమైన సంస్కృతిగల యీ గొప్ప దేశం ( ఇండియా ) పట్ల చరిత్రలో జరిగిన నాటి పొరపాటే చేయరాదని బ్రిటన్ ప్రభుత్వాన్ని, రాజరికాన్ని హెచ్చ రిస్తున్నాము."

"అంతేకాక ఈ కౌన్సిలువారు మానవ మహా సౌభ్రాతృత్వం దృష్టిలో, ఐక్యరాజ్య సమితిలో సోదర సభ్యరాజ్యాలైన అమెరికా సంయుక్త రాష్ట్రాలు, సుప్రీము సోవియట్ సభవారు, చైనా దేశీయ శాసనసభలవారు తదితర రాజ్యాలూ సమైక్యంగా భారతదేశ విముక్తికై కృషి కొనసాగించి, బ్రిటన్ మీద తమ పలుకుబడి ద్వారా స్వాతంత్ర్య ప్రధానానికి తగు గడువు తక్షణం నిర్ణయించేటట్లు చేయవలెను. అప్పుడు భారత దేశం రిపబ్లిక్‌గా అవతరించి, ఐక్యరాజ్య సమితిలో అన్ని ప్రజాస్వామిక రాజ్యాలవలె సభ్యురాలై తానూ అంతర్జాతీయ బాధ్యతల నిర్వాహణకు పూనుకొంటుంది. తన ప్రాచీన సాంస్కృతిక పాత్రద్వారా నేటి క్లిష్టసమస్యల పరిష్కారానికి తోవ చూపుతుంది; ఘనంగా పాటుపడుతుంది."

"ఈ కౌన్సిలువారు, ఈ సందర్భంలో మిత్రరాజ్యసమితి తక్షణ కార్యాచరణకు పూనుకొనమనీ, యుద్ధావసరాలను గుర్తించి పరిస్థితులను గమనించమనీ అర్థిస్తోన్నారు."

ఈ పత్రం సందర్భంలో శరత్‌చంద్ర బోసు నన్ను ఆదివారం రాత్రి పిలిచి—"సుహ్రావర్దీ-రాయ్ బెంగాల్ ఐక్యరాష్ట్రావతరణ చర్చలకోసం ఇక్కడ సమావేశం అవుతారు. మీ పత్రం మీద చర్చ కొనసాగిస్తారు. ప్రస్తుతం యీ పత్రంలో విషయాలు హిందూ మహమ్మదీయులు అంగీకరించారనే మీరు చెప్పకోరుచున్నాను. ఇక భవిష్యత్తులో బెంగాల్ విషయమే సమస్య. రాజప్రతినిధి మిమ్మల్ని ఢిల్లీ రమ్మని ఆహ్వానించాడు. కాబట్టి

మీరు వెంటనే ఆయనను కలుసుకొని యీ పత్రం విషయం ఆయనకు నచ్చచెప్పండి." అని శలవిచ్చాడు. ఈ సందర్భంలో నేను అవకాశం పురస్కరించుకొని భారతదేశానికి తన రాజ్యాంగచట్టం సవరణకు, మానవుని ప్రాథమిక హక్కుల పరిరక్షణకు విస్తృతాధికారాలుకల బలిష్టమైన సుప్రీం కోర్టు ఉండాలని, అల్ప సంఖ్యాక వర్గాల రక్షణకు తగు హామీలు ఇవ్వబడాలని కూడా ప్రతిపాదించాను.

# అధ్యాయం 58

వైస్రాయ్ ఇండియాకు వచ్చిన ఆరురోజులలోనే నేను ఆయనతో రెండు గంటలపాటు గోష్ఠిచేయటం సంభవించింది. ఆయనతో గడిపిన కొద్దికాలంలోనే నా పూర్వానుభవాన్ని బలపరుచుకొనేందుకు వీలుచిక్కింది. ఫ్రాంక్లిన్ డెలానో రూజ్వెల్టుకున్న అద్భుత గుణసంపదలు ఈ రాజప్రతినిధిలో కూడా వున్నాయి— ఆ అందం, సద్యస్ఫురణ, ఓజస్సూ, సంశయ విపర్యాందోళనా రాహిత్యం, సద్యోనిర్ణయం, ఠీవి ఇవన్నీ కూడా మౌంట్ బాటన్‌లో మూర్తీభవించి వుండటం నేను చక్కగా గుర్తించాను. ఇంకా ఆయనలో ప్రజాసేవా పరాయణత, ప్రజాశ్రేయోచింతన మొదలైన విశిష్ట గుణాలు కూడా వున్నవి. చక్రవర్తికి దాయాది, విశాల హృదయుడు. రూపంలో హాలీవుడ్ తారలను వెక్కిరించేవాడు. అతి క్లిష్టమైన, సున్నితమైన సమయంలో ఆయన ప్రదర్శించిన అద్వితీయ ఉపజ్ఞ భారతదేశంలో ఆయనకు అనన్య ఖ్యాతిని గడించి పెట్టింది; ప్రశంసాపాత్రుడైనాడు. ఆయన పూర్వులైన వారెన్ హేస్టింగ్సు, డల్హౌసీ, కర్జన్ ప్రభువులు సహితం లార్డు మౌంట్‌బాటన్‌కు సాటికారు.

మార్చినెలలో నే నొకనాడు ఆయనతో గోష్ఠి చేస్తున్నప్పుడు, ప్రస్తుత సమయంలో తనకు నేను చాలా ఆశావాదిగా కానవస్తున్నట్లు ఆయన వక్కాణించాడు. కాని ఒక మాసం గడిచిన తర్వాత మా ఇద్దరిలో ఆయనే నాకన్నా ఆశావాది అయినాడు. ప్రజావాంఛితానుగుణంగా, రాజకీయ నాయకుల సమ్మతిమీద ఇండియా ఆయన చేతులమీదనే హిందూస్థాన్, పాకిస్థాన్ అను రెండు స్వాతంత్ర్య డొమినియన్లుగ రూపొందుతున్న సమయమది. ఆనాడు ఆయన కనబరిచిన రాజనైతిక ఔదర్యాలు ప్రాచీన బ్రిటీషు సుసాంప్రదాయాలను ప్రతిబింబింపనిస్తున్నాయ్; లార్డు కానింగ్సు కాలంనాటి బ్రిటీషు రాజనీతిని గుర్తుకు తెస్తున్నాయి. మనం ఆశియా జాతీయత అభివృద్ధి పొందేటందుకు దోహదం చేస్తూ వుండేవారం; దక్షిణాశియా పరిపాలన చేస్తూ ప్రపంచం సమత్వంలో తీసికొచ్చి నిలబెట్టాము.

ఇండియాలో బ్రిటీష్ హైకమీషనర్‌గా నియమితుడై విచ్చేసిన సర్ టెరెన్సు షోన్‌తోనూ, ఆయన అందాలబరిణి అయిన భార్యతోనూ ఆవచ్చిననాటి రాత్రే విందారగించాను. నేను చైనా నాన్‌కింగ్‌లో విమానమెక్కి, షాంఘైనుంచి కలకత్తామీదుగా ఇండియా రాజకీయ స్థితిగతులు తెలుసుకొని ఆవశ్యకమైన చర్చలు కొనసాగించటానికి న్యూఢిల్లీ వచ్చినాను. అప్పుడే రెండు రాత్రులు అదృశ్యమై పోయాయి. వైస్రాయి భవనంలో క్వాయిదే అజం జిన్నాతోను, ఆయన చెల్లెలు శ్రీమతి ఫాతేమా జిన్నాతోనూ కలిసి భోజనం చేశాను. ఆ విందులోనే పాటియాలా ప్రభువు కూడా పాల్గొన్నాడు. సిక్కుల్లో పాటియాలా ప్రభువు

నిజంగా తిరుగులేని ప్రజ్ఞాధురీణుడనే చెప్పాలి. ఆ సమయం ఎలాంటిదంటే ముస్లింలకూ సిక్కులకూ పొత్తుకుదరకపోవటం మాట దేవుడెరుగు; ఉభయ పక్షాలమధ్య పచ్చగడ్డివేస్తే, భగ్గు మంటుంది. ఒకరినొకరు విచక్షణా రహితంగా నిర్దాక్షిణ్యంగా నరుక్కుంటున్నారు. పంజాబు యావత్తూ ఘోర అరాజకమై పోయింది, రాక్షసత్వంలో రాటుతేరిపోయింది! ఇట్టి ఉద్రిక్త వాతావరణంలో మహారాజా పటియాలా, జిన్నాసాహెబ్ వీరుభయులూ ఒకేచోట సుహృద్భావంతో చర్చలు జరపటానికి సమావేశ మయినారంటే, దానికంతకీ కారణం రాజప్రతినిధి లార్డు మౌంట్‌బాటనే; ఆయన సునిశిత రాజనీతి చతురతే!

విందులో వివిధ నవీన ద్రాక్షాపానీయాలు మొదలు సామాన్య ఫలహారాలవరకూ అమర్చబడినాయి. జిన్నా చాలా మితాహారి. ఆయన మద్యం ముట్టడు. యీ విందుకంటే విందులో మౌంట్‌బాటన్ సతీమణి సత్కరణ, మధుర భాషణమే అందరికీ ఆహ్లాదం కలిగించినట్లు నాకు తోచింది. జిన్నా బక్కపలచగా, పొడుగ్గా వుంటాడు. ఆయన తెల్లని సుర్వా, నలుపు సిల్కెన్ శేర్వానీ ధరించినాడు. పటియాలా జిన్నాలమధ్య సంభాషణ కొనసాగుతూనే వుంది.

విందు అనంతరం అతిథులమంతా లేచి మరో గదిలోకి వెళ్ళినాము. నేను అక్కడ శ్రీమతి ఫతేమాతో మళ్ళా సంభాషణ కొనసాగించాను. ఆమె మంచి మాటకారిణి, గాంభీర్యంగల వనిత. కొంచెం దూరంలో పటియాలా జిన్నాలు ఒక సోఫాలో ఆసీనులై సంభాషణలు కొనసాగిస్తూనే వున్నారు. వారి సంప్ర

దింపుల పర్యవసానం కొంచెం ఆశాజనకంగానే కనిపించటంవల్ల మౌంట్ బాటన్ వదనంలో సంతృప్తి చిందులు తొక్కుతూంది.

మరునాడు భారతీయుల జగద్విఖ్యాత కళాఖండమైన 'తాజ్ మహల్' చూసివచ్చేటందుకు నాకు కారు ఏర్పాటు చేసినాడు వైస్రాయి మౌంట్ బాటన్ ప్రభువు. ఆయన నాపట్ల ఇంత సుహృద్భావాన్ని కనపరిచి కారు ఏర్పాటు చేసినా నేను ఢిల్లీ కదిలి వెళ్ళేందుకు వీలయింది కాదు. సతతం మానవ సమస్యల పరిష్కారంలో నూతన భావాన్వేషణం చేయటం నాకు ప్రీతి అధికం. అందుచేతనే ఆగ్రా ప్రయాణం ఆగిపోయ్యింది.

సంవత్సరాలు తరబడి పాశ్చాత్య రాజకీయాల్లో మెలుగుతూ సముపార్జించిన అనుభవంద్వారా నాలో కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఏర్పడినాయి. క్లిష్టపరిస్థితుల్లో సామాన్యుల అభిప్రాయాలు, వారి నైతిక నిర్ణయాలు, మానవత్వము అంటేనూ నాకు చాలా గౌరవం; ఆదరణ అమితం. ఏవో కొన్ని వుత్కృష్ట రాజకీయ నిర్ణయాలు చేస్తూ సామాన్య ప్రజాభిప్రాయం, నైతిక నిర్ణయం నిర్లక్ష్యం చేయడం నేనెంతమాత్రం అంగీకరించను; అలా నిర్లక్ష్యం చేస్తే రాజకీయవేత్తల కౌటిల్యం తేటతెల్ల మవుతోంది; దురాశా ప్రకటిత మవుతాది.

గాంధీజీ మాత్రం అటువంటి రాజనీతివేత్త కాదు. దురాశా వాది, మోసగాడు కాదు. నిర్లిప్తుడు, వ్యక్తిగతంగా ఎటువంటి ఆశలూ లేనివాడు. మహాత్మా గాంధీ ఆత్మీయతను దర్శించి గ్రహించినట్లు జిన్నాసాహెబ్‌ను అసంఖ్యాక పరివారం మధ్య పచ్చని దుస్తుల్లో వుండగా గ్రహించలేక పోయినాను

ఆయన ఆంతర్య మేమిటో! జిన్నా ముతావారు, యువకులు సిమ్లా పర్వతాగ్రాన వైస్రాయి విడిది భవనం ముందునుంచే "పాకిస్తాన్ కత్తితో సాధిస్తాం; రక్తం ప్రవహింప చేస్తా" మంటూ వున్మత్తులవలె నినాదాలు చేస్తూ వెళ్ళినారు. పాకిస్తాన్ జిన్నాసాహెబ్ కాంచిన ఒక సుందరమైన స్వప్నం. మానవత్వం స్థాపితమై, మానవ సంబంధంతో పాకిస్తాన్ హిందూస్తాన్‌తో ఎంతకాలం సంబంధం వుంచుకొంటుందో మరి. ఏమైనాకానీ పాకిస్తాన్ భవితవ్యం ఇండియాతోని సంబంధ భాందవ్యాల మీదనే చాలావరకు ఆధారపడి వుంటుంది.

ఈ ఐదురోజుల్లో చివరిసారిగా రాజప్రతినిధి మందిరంలో అదే—పటియాలా జిన్నాలు కూర్చొని చర్చించిన సోఫాలోనే నేనూ లేడీ మౌంట్‌బాటన్ ఆసీనులమై అనేక విషయాలు మాట్లాడుకొన్నాము. ఆవిడ బలవంతంమీద భారతదేశ విషయంలో నా దృక్పధాన్ని విశదపరిచాను. తదనంతరం మౌంట్‌బాటన్‌తో నేను గోష్ఠి జరిపినప్పుడు ఆయనకు భావి భారత స్వరూపం 'ఐక్యభారతం' గా వుండాలని సూచించాను, లిఖితపూర్వకంగా. నా మోస్తరుగానే మరికొందరు కూడా ఇలాగే సలహా ఇచ్చి వుంటారనటంలో సందేహం లేదు. ప్రకృత విపరీత విపత్కర పరిస్థితులలో కూడా భావి భారతాభ్యుదయం పట్ల అమితోత్సాహంతోనూ, ఆశతోనూ తొణకని కుండవలె గంభీరంగా వున్న రాజప్రతినిధిని చూస్తూవుంటే ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు గుర్తుకు వొస్తాడు. ఈ సమయంలో భారతావనికి మౌంట్‌బాటన్ నిజంగా రూజ్వెల్టే!

# అధ్యాయం 57

న్యూఢిల్లీలో సమావేశమైన అఖిలాశియా మహాసభ కార్య క్రమం నిర్ణీతమైన రెండువారాల్లోనూ ముగింపు కావస్తోంది. ఇంత చక్కగా సమర్థవంతంగా కార్యక్రమం కొనసాగటం ప్రశంసా పాత్రమైన ఘన విషయం. ఈ సభా దిగ్విజయానికి మూలకారణం జవహర్‌లాల్ నెహ్రూయే. అఖిలాసియా నెహ్రూపండితుని సుందర స్వప్నం! అది నేటికీ సభారూపంలో యథార్థమైంది. భారతదేశంలో భవిష్యత్తులో ఇలాంటి సభలు ఎన్నయినా జేగీయ మానంగా జరుగుతవనడానికి ఈ మహాసభే సాక్ష్యం. దీని కిదే సాటి ఆశియా చరిత్రలో!

ఈ సభా సందర్భంలో బర్మా, సయాందేశాల ప్రతి నిధులతో, సిలోన్ ఆరోగ్యశాఖా మంత్రితో, ఇండోనీషియా ప్రధాని డాక్టర్ షారియర్‌తోనూ గోష్ఠిచేసే అపూర్వ అవకాశం నాకు లభించింది. మంగోలియా రిపబ్లిక్ ప్రతినిధివర్గాలతో కలిసి కూర్చొన్నాను. వారి రాజకీయాలూ భావాలూ ఆంగ్లాను వాదం చేయటంవల్ల చక్కగా ఆకలించుకో గలిగాను.

టిబెట్ ప్రతినిధివర్గం అందరికీ వుత్సాహం కలిగించింది. వారి ఆంగ్లభాష తమాషాగా వుంది. వారు అమెరికా ఎర్ర

ఇండియనులు మోస్తరుగా వున్నారు. నాకు ఆశ్చర్యం కలిగిస్తూ అద్భుతంగా ఒక టిబెట్ దేశీయుడు ఆంగ్లంలో మాట్లాడినాడు. ఆయన రగ్బీ పాఠశాల్లో లండన్‌లో చదువుకొన్నాడట. లాసా వెళ్ళేపక్షంలో వారు చాలా సన్మానం చేస్తామన్నారు. జడల బర్రెమీద పదమూడు రోజులపాటు కాలీపాంగ్‌నుంచి లాసాకు ప్రయాణం చేయాలని విన్నాను. వెడదామనే అనుకొన్నాను మనసులో.

ఈ స్థితిలో నన్ను ఆలీఘరు విద్యాపీఠంవారు ఆహ్వానించినారు వుపన్యసించమని. అది ముసల్మానులు విశ్వవిద్యాలయం. నన్ను అపరిమితాదరంగా వారు చూచినారు. అక్కడ నుంచి అలహాబాదు వెళ్ళినాను. ప్రయాగలో వుండగానే మహాత్ముని దగ్గర్నుంచి ఇలా తంతి వచ్చింది—

"ఆదివారం ఉదయం ఢిల్లీ వెడుతున్నాను. అక్కడ నాలుగు రోజులపాటు, మళ్ళీ వెనక్కు రావడం. ఎక్కడో అక్కడ నన్ను కలవండి.

"గాంధీ"

గాంధీజీ పాట్నానుంచి ఢిల్లీ వస్తున్నాడు. నేను విమానం ఏర్పాటు చేసుకొని కొత్తఢిల్లీకి మరలుదామని నిర్ణయించుకొన్నాను. ఒక భారతీయ ప్రయాణీకుని ఆదరంవల్ల గౌరవంవల్ల నాకు తరుణం ముందు లభ్యంకాగా సకాలంలో ఢిల్లీ వెళ్ళ కలిగినాను.

ఢిల్లీ పాతకోటలో సమావేశం ఏర్పాటయింది. సభాధ్యక్షురాలు శ్రీమతి సరోజనీదేవి పలుకులు విన్నాను. నా జీవితంలో

ఎప్పుడూ వినని ఆలంకారిక శైలిలో అద్భుతంగా ఆంగ్లంలో ఆమె ప్రసంగించింది. ఆ భారతీయ కవయిత్రి అర్ధగంటలో అసాధరణంగా, అనర్గళ గంగాప్రవాహంగా ఆంగ్లభాషలో ఉపన్యసించింది. సభ్యులను సమ్మోహితులను చేసింది.

ఈ పాతకోట చారిత్రక విభాతవేళలు చూచింది తొలి దినాల్లో. ఇక్కడే హుమయూన్ నివసించాడు. ఆయన చక్రవర్తి; విఖ్యాత ఖగోళశాస్త్రవేత్త. నవీన భారతచరిత్ర వికాసం పొందబోతున్నది మళ్ళీ ఇక్కడనే. అఖిలాసియా ఏకగ్రీవంగా ఐక్యతను ప్రకటించి; ప్రపంచంలోని అన్యాయం, దోపిడీ, అన్యఖండం ఆధిపత్యం సహించమని వుద్ఘోషించింది; శాంతి కావాలన్నది. పిరికితనంవల్ల, దానిసతనంవల్ల, విరక్తి వల్ల వచ్చే శాంతి అవసరం లేదన్నది; మానవహృదయంలో ఆధ్యాత్మిక శాంతి అవసరమన్నది. అందుకే ఢిల్లీలో ఈ సమావేశం జరుగుతున్నది.

ఎవరికి కావాలీ ఏకసంస్కృతి? భిన్నత్వంలో ఐక్యత, హృదయైక్యత, వివిధ సంస్కృతులు—అది వుద్దేశ్యం. ఆశియా హృదయం ఏకైకం; దేశాలమధ్య ఏవోకొన్ని పర్వతశ్రేణులు అడ్డువచ్చినంత మాత్రాన ఆ ఐక్యత విచ్ఛిన్నం కాలేదు; ఖండం విభక్తం కాలేదు, కాదు కూడానూ. ఎన్నటికీ అఖిలాశియా హృదయం ఒక్కటే! నేటి కల్లోల ప్రపంచానికి మనమిచ్చే సందేశమేమిటి? మనం కాసేకలలు ఏమిటి? మన అచంచల ఆత్మవిశ్వాసం, మననైతికాధ్యాత్మిక శాంతి కామన చావలేదని నేటి ఈ సమావేశంద్వారా రుజువు పరిచాము. మరి నవప్రపంచ నిర్మాణంకు సన్నద్ధులమవుదాం—లేవండి; సాయుధలమై హింసా

ద్వేషాల ద్వారా కాక, శాంతి సైనికులవలె ప్రయాణించి శాంతి ప్రేమల ద్వారానే మానవలోకాన్ని పునర్నిర్మిద్దాం. 'ఆ విధంగానే విజయం చూరగొనాలి. అందుకు అవసరమైతే నక్షత్ర మండలానికన్నా ప్రయాణిద్దాం; చంద్రుడినైనా తెంపుకొద్దాం' అని అంటూ ఆమె—సరోజనీదేవి దిమ్మరించిన వాగామృతం సాగరగాంభీర్యాన్ని 'ఛీ' కొట్టుతోంది. ఆమె ఝకివేగ మహోన్నతోపన్యాసంలో నవభారత వాణి — అఖిలాశియా ఐక్యకంఠం నయాగరా జలపాతం వలె ప్రతిధ్వనించింది.

నేను మళ్ళీ పాతకోటలో ప్రవేశించాను. రంగురంగుల ఆసియా వాసులను చూచాను. రకరకాల వేషధారణం! వివిధ దేశ ప్రతినిధులు వుపన్యసిస్తున్నారు వేదికమీద. ఆసియా ఏకమై మహోన్నతం కానున్నదని అందరికీ తెలుసును. నెహ్రూ మహోత్సాహిగా వున్నాడు. అఖిలాసియా స్వరూపం సరిదిద్దే శిల్పి నెహ్రూ పండితుడు అక్కడే వున్నాడు. భారతదేశ భాగ్యవిధాత, గావంచాకట్టుకొన్న బోసినవ్వులవాడు మహాత్ముడు కోటలో కాలు పెట్టే సరికి సభాముఖం ఆనందోజ్వలమైంది.

జిన్నాసాహెబ్ ప్రసంగంవలె తనవారిపాలిట దేవతగా మహాత్ముడు ప్రసంగించలేదు. ముదుసలిగా మెల్లగా నిరాడంబరంగా మాట్లాడినాడు. ఆయన గుమికూడిన సభను ఉద్దేశించి, "ఆసియా ప్రపంచాన్ని ప్రేమతోను, ధర్మసందేశంతోనూ జయించాల" ని వుద్బోధించినాడు. ఇంకా ఆయన ఉపన్యసిస్తూ- "ఢిల్లీ చూచి అదే భారతదేశం అనుకోవద్దనీ, పల్లెటూళ్ళలో—. 7 లక్షల గ్రామాలలో పూరిగుడిసెలలో నివసించే గ్రామీణుల

లోనే యదార్థమైన భారత నాగరకత వుందనీ అక్కడ జీవితం సరళంగా వుంటుందనీ" సభాసదులను హెచ్చరిస్తూ ఉద్ఘాటించినాడు. ఆయన టాల్‌స్టాయ్‌వలె మాట్లాడినాడు. రస్కిన్ ప్రభావం ఆయనలో స్పష్టమైంది. టాలుస్టాయి రస్కినుల ప్రభావం ఆయన మీద బాగా ప్రసరించినట్లు గాంధీజీయే తన ఆత్మకథలో రాసుకొన్నాడు.

నేను అధికార హోదాలోవున్న హిట్లర్, ముసోలినీ, స్టాలినులను చూచాను. వారివలె రాజసుడు, మొనగాడూ కాడు గాంధీజీ. ఆయన భారతీయాత్మ ఆవిష్కరించాలనీ ఉద్ధరించాలనీ పట్టుదలతో సాధనచేస్తున్న మహాసీయుడు. మారణహోమంలో మాడిపోతున్న మానవలోకాన్ని కాపాడేందుకు తపిస్తున్న మహా మనీషి! యూదీయ ప్రవక్తలవలె ఆయన ప్రజల నైతిక జీవితాన్ని నిశితంగా పరీక్షిస్తాడు, అవినీతి సహించలేడు.

సరోజనీదేవి మళ్లీ ఉపన్యాసం ఆరంభించినప్పుడు నేనా ప్రదేశం విడిచిపెట్టాను. ఆ మహాసభా కోలాహలంలో నాకు మహాత్ముని దర్శనం లభ్యంకావడం చాలా కఠినమైన విషయం. ఢిల్లీలో టెలిఫోనులు సరిగా పనిచేయటం లేదు. సభా కార్యదర్శి ప్రధాని గాంధీజీ బసతాలూకు టెలిఫోను నెంబరు తప్పు ఇవ్వటం వల్ల మాట్లాడలేక పోయాను. ఇక గత్యంతరంలేక రాత్రి వేచి వుండి, మర్నాడు ఉదయం టాక్సీలో నా అంతట నేనే గాంధీజీని సందర్శించటానికి బయలుదేరాను. ముందు టాక్సీ డ్రైవర్ దారి తప్పి ఢిల్లీ సందుగొందులు తిప్పి తిప్పి చివరికి ఎలాగైతే

గమ్యానికి చేరవేశాడు. అది 'భంగీ కాలనీ' (మాలపేట) మహాత్ముని మకాం ఇక్కడనే. తెల్లని సున్నం పూయబడి పరిశుభ్రంగా వున్న భంగీపేటలో ఇండ్లమధ్య చిన్న డాబా ఇంట్లో మకుటంలేని భారత చక్రవర్తి, లోకైక పూజనీయుడు మహాత్మా గాంధీ నివాసం!

# అధ్యాయం 52

1946 లో సిమ్లాలో హిమాలయాల కభిముఖంగా కానిపిస్తున్న ప్రాసాదాగ్రభాగాన మహాత్ముణ్ణి, సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను కలుసుకొన్నాను. అక్కడ. ఢిల్లీలోనూ మహాత్ముని ప్రార్థనా సమావేశాలకు వెళ్ళినాను. నేను కూడా సిమ్లా ప్రాసాద మధిరోహించినాను, రాజకుమారి అమృతకౌర్, అగాథా హారిసన్‌లతోపాటు, ఆనక భారత పిత మహాత్మా గాంధీని నేను కొన్ని ప్రశ్నలు అడిగినాను.

మానవులకు సంబంధించిన విషయాలపై మహాత్ముని దృక్పథం ఏమిటి? మిత్రరాజ్య సమితి శక్తివంతంగా మనగలదా? దీనివల్ల ప్రపంచానికి పోలీసు సిబ్బంది ప్రత్యేకంగా ఏర్పడవలసి వస్తుందా? నెహ్రూ, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, శరత్‌చంద్ర బోస్‌లతో సమగ్రంగా చర్చించిన తర్వాత తిరిగి మహాత్ముణ్ణి భారతరాజ్యాంగానికి సంబంధించిన సమస్యల మీద చర్చించి ఇబ్బంది కలగచేయటం కాదు నేను కోరేది. కేవలం నాకు కావలసింది యావత్తు మానవకోటి యొక్క సమస్యా పరిష్కారం. తత్ సంబంధీకమైన మహోన్నత విషయాలపై ఆయన దృష్టి గ్రహించే నిమిత్తం కొన్ని ప్రశ్నలు వేయదలచినాను.

సమాధానాలు ప్రయత్నం లేకుండా, ఖచ్చితంగా సంశయ రహితంగా, సూటిగా మహాత్ముడు చెప్పినాడు. ఆయన వచనాలివి : "మనం ఎప్పుడూ ధర్మసూత్ర బద్ధులమై వుండాలి. అన్నింటిలో అత్యంత ప్రముఖమైన ధర్మం అహింస. ఏది హింసో, ఏది కాదో నిర్ణయం చేసే న్యాయమూర్తులం మనం ఎలా అవుతాము ?" నా మనసులో యోచన రేగింది. బ్రిటీషు వారు, ఫ్రెంచివారు కలిసి జర్మనీపై యుద్ధం ప్రకటిస్తే జర్మనీ హింసకు కారణ మవుతుందా ? ఆఁ—పోలండ్ మీద జర్మనీ ముందు కత్తిదూసింది కాబట్టి, జర్మనీదే హింసాకారణము. అలాగైతే సోవియట్ దేశీయులు హింసాకారకులు కారా ? ఏమిటి హింస ? ఏదో సమాధానానికి సవ్యంగా రాక పోవడమేనా ?

నేను జిజ్ఞాస సాగిస్తూనే ఉన్నాను. "ఉభయపక్షాలకూ నిష్పాక్షికమైన విచారణ సంఘం ఏర్పాటయినప్పుడో ? రాజీకి సమాధానానికి అంగీకరించనివాడు హింసాకారకుడు, పీడాకారకు డవుతాడు........"

మహాత్ముని ప్రత్యుత్తరం : "శక్తిని నిష్పాక్షికంగా విని యోగపరచే విజ్ఞానం ప్రజలకు కలిగినప్పుడు, వారికి అహింసా విధానంలో విద్యానుభవం కావాలి."

ఇది యదార్థమేనా అని ఆశ్చర్యం వేసింది. నిజమే. హింసాకారకులు పీడాకారులూ అహింసా శిక్షణ ఎలాపొందడం ? అంటే ట్రిబ్యునలు ఏర్పాటు చేసేలోగానే ప్రజలు విజ్ఞానవంతులు కావాలి. హింసాకారకులూ, యుద్ధప్రేరేపకులూ విజ్ఞానవంతులు కావాలి ! బ్రిటీషు రాజకీయ వాదులకు నచ్చని రీతిగా

మహాత్ముడు—"నిష్పాక్షికమైన విచారణ సంఘం లభ్యమయితే అప్పుడు ప్రపంచానికి కావలసిన రక్షకభటవర్గాన్ని ఆహ్వానించ వచ్చును" అని వ్యక్తపరిచాడు.

నిజానికి మహాత్ముడు ఆస్తికుడు, పాపభీతి కలవాడు. నవీన రాజనీతివేత్తలు ఆస్తికులతో వ్యవహరించడం ఎరగరు. రాజనీతివేత్తల ఆదర్శాలు, ఆచరణలో ఆదర్శ రాహిత్యం మహాత్ముడు అంగీకరించడు; వారిని నమ్మనే నమ్మలేడు. ఎందుకంటే ఆధ్యాత్మిక జ్ఞానంలేని కేవల రాజకీయవాదులు టక్కరులు, మోసగాళ్లు, దుస్తంత్ర ప్రవీణులు.

ఆయన తన స్వీయచరిత్రలో రాజీవిధానం గురించి ఇలా వ్రాసినాడు: "నా సత్యవ్రత దీక్షవల్ల జీవితంలో ఎప్పుడూ భిన్నపక్షాల మధ్య సమాధానం కుదర్చవలెననే యత్నిస్తూ ఉంటాను. సత్యంవల్ల సామరస్య సౌందర్యం గ్రహించినాను. భిన్న పరిస్థితుల్లో విభిన్న దృక్పథాల్లో రాజీపడడం అవసరమని ఇతరులను విశ్వసింప చేశాను."

"నూతన పరిస్థితు లేర్పడుతున్నప్పుడు ఉచితంగా పరివర్తించడం భగవదానుగ్రముంటే చాలు. పరమేశ్వరుడే అప్పుడు దారి చూపుతాడు." మహాత్ముడు ఎన్నెన్ని పక్షాల మధ్యనో రాజీ కుదిర్చిన అనుభవశాలి. ఆయన ముఖ్యసూత్రం సత్యం. "సత్యం వజ్రాదపి కఠినం, కుసుమంవలె మృదులం." అని ఆయన ఉద్ఘాటించాడు.

ఢిల్లీలో భంగీ నివాసంలో మహాత్ముణ్ణి దర్శించాను సంవత్సరం కిందట. ఆయన మనస్సు రాజీచేసే ధోరణిలో లేదు.

చాలా ఉల్లాసంగా వుంది. ముందు తెలియపరచకుండానే వెళ్ళి నాను. నా పరిస్థితి మీరాబెన్‌కు తెలియ చేశాను. మీరాబెన్ అసలు పేరు 'మిస్ స్లేడ్' ఆమె లండన్ ఊర్ధ్వశాస్త్ర పాఠశాల డైరెక్టరు మేనగోడలు. ఆమె నాకు తంతి ఇచ్చింది కాని, అది నా కందకముందే బయలుదేరి విమానంలో ఢిల్లీ వచ్చాను. ఆ నాటి ఉదయం ఆశియా సభా ప్రతినిధుల రాయభారాలతో మహాత్ముడు హడావిడిగా ఉన్నాడు. "టిబెట్ ప్రతినిధివర్గం ఆయన దగ్గిరికి వచ్చి సంప్రదింపులు చేసి, కొన్ని కానుకలు సమర్పించవలసి వున్నది. అంతేకాక సర్ సర్వేపల్లి రాధా కృష్ణయ్య మహాత్ముని దర్శనార్థం వస్తారట....అయినా తప్పక మహాత్ముడు మిమ్మల్ని చూస్తారు." అని నాకు వార్త చెవిని పడేసింది మీరాబెన్. మహాత్ముడు ఉదయం నైమిత్తిక కర్మల్లో నిమగ్నుడై వున్నాడు.

రోజంతా నేను ఆశ్రమం చూస్తూ ఆశ్రమ వాసులను పలకరిస్తూ కాలం గడిపాను. ఆ కుటీరాలు ఆర్భాటంగాలేవు. నిరాడంబరంగా ఉన్నవి. కుటీరాలముందు గోడలు లేవు. వాటికి యెదురు పడక లున్నాయి. వాల్మీకి మందిరం కుటీరాల వెనకనే వుంది. తస్కరుడైన వాల్మీకి కొంత కాలానికి పాశ్చాత్తాప తప్తుడై, అయన పవిత్రుడైనాడు రాబిన్ హుడ్‌వలె. పరమ పాపి దారులుకొట్టి, సాధువుల్ని హింసించి, ఋషుల్ని పీడించిన వాడు చివరికి పశ్చాత్తాపంతో వేగిపోయినాడు. ధౌతనిర్ధూత కల్మషుడైనాడు, పూతచరితుడైనాడు. దారుమబ్బులో కూడా మెరుపుతీగె వుంటుంది. హాలాహలంలో అమృతమూ వుంటుంది. క్రౌర్య దౌష్ట్యాల వెనుక దయాదాతృత్వాలు దాగి వుంట వన

టంలో ఈ కథాఘట్టమే సాక్ష్యం. పాపి హృదయాంతరాళం లోనూ పవిత్ర దైవాంశ మెరుపుతీగెవలె తళతళ మంటుంది. వాల్మీకి క్రమేణా మహర్షి అయినాడు. రామనామ జపంతో అతడు ముక్తపురుషుడైనాడు. తపస్సులో ధ్యాననిష్ఠలో ఆయన చుట్టూ వాల్మీకం పెరిగిపోయింది. అప్పటికీ 'రామనామ' జపం చేస్తూనే వున్నాడు........ఆయన ఋషి, అనంతరం కవియై రామకథామృతం "శ్రీమద్రామాయణం" గా సంతరించినాడు. క్రాంతదర్శియై, కవికోకిలయై రామ కథాగానం చేసినాడు, అలా చరిత్ర ప్రసిద్ధుడైన ఆ వాల్మీకే భంగీలకు ఆదర్శపురుషుడు!

ఒక ఆశ్రమవాసితో చేసిన ప్రసంగంవల్ల వాల్మీకి చరిత్ర గ్రహించాను. ఇంతలో టిబెట్ ప్రతినిధివర్గం వచ్చేదాకా నన్ను వేచి ఉండవలసిందని కబురువచ్చింది. కాగా మహాత్ముడు నన్ను ఏకాంతంలో చూడదలచినట్టు కూడా తెలిసింది. ఆయన స్నానం చేసే సమయంలో మాట్లాడితే? జరిగింది కూడా అంతే. మా సంభాషణ ఒక కార్యదర్శి గ్రంథస్థంచేసినాడు-భవిష్యత్తులో ఉపయోగంకోసం.

# అధ్యాయం 59

ఆనక కొంత సేపటికి మహాత్ముణ్ణి నేను చూచినప్పుడు స్నానంలో వున్నాడు. నన్నాహ్వానిస్తూ గాంధీజీ పలికిన వచనాలివి—"మీలో ఎంతో విశ్వాసం వుందండి రండి!" ఆయన స్నానానంతరం దుస్తులు వేసుకొనేలోగా మేము సంభాషణ జరపవలెనని అనుకొన్నాము. నవ్వుతూ మహాత్ముడు ఆయనదే సప్రమాణ మైన ఆఖరువాక్యం అన్నాడు.

లౌకిక విషయాలను గురించి, భారతదేశంలో క్రైస్తవం, గోవాలో వచ్చిన మార్పులను గురించీ కొంత సేపు మాట్లాడు కొన్నాము. వెండల్ విల్కీ రాసిన 'ఒన్ వరల్డ్'—ఏక ప్రపంచం అన్న గ్రంధాన్ని గురించి, ఆయన ఆదర్శాల విషయం ప్రసంగించుకొన్నాము. విల్కీ నిధి విషయంలో మహాత్ముని సాహాయ్యం కోరి ఆయనను ఒక లేఖ వ్రాసి ఇవ్వమని కోరినాను. తరువాత గాంధీజీ నా కోరిక మన్నించి లేఖ రాసిచ్చినాడు.

సిమ్లాలో జరిగిన మా ఇద్దరి సంభాషణ జ్ఞాపకం చేసు కొన్నాము. "మానవుడు త్యాగబుద్ధి అలవరచుకొని నూతన సంస్కారం పొందినప్పుడు యుద్ధ ప్రసక్తి వుండదు" అని ఆయన సమాధానం.

లోకంలో సత్యాన్ని గౌరవించే దేశాలున్నప్పుడు 'ఏక ప్రపంచం' ఆవిర్భవించటం సులభమే. కాని ప్రస్తుత పరిస్థితుల్లో, అంతర్జాతీయ రాజకీయ వ్యవహారాల్లో మోసమూ కుట్రా స్పష్టంగా కానవస్తోంది. ఐనా కూడా ఏ రాజ్యాన్ని కారాజ్యమే ధర్మబద్ధంగా వుంటున్నామనే అంటుంది. సతతం పరస్పర ద్వేషదూషణతోనూ, భయాందోళనతోనూ లోకం సతమత మవుతున్నది. కాబట్టి ప్రపంచైక్యత లేక 'ఏకప్రపంచం' లోకానికి సత్యాహింసల పట్ల గౌరవాదరణ లున్నప్పుడే ఏర్పడుతుంది. సంశయభీతులను నిర్జించేది ఒక్క అహింసావ్రతమే, అహింసవల్ల శ్రేయస్సేగాని ప్రమాదం ఎవరికీలేదు.

అలా మహాత్ముడు సమాధానం చెప్పడానికి పూర్వరంగం నాకు తెలుసు. యుద్ధకాలంలో నెహ్రూకు గాంధీజీ వాఖ్యాన పూర్వకంగా ఇలా చెప్పినాడు: (8 ఆగస్టు 194. లో) "నేటి విశ్వనేత్రాలు రక్తరంజితాలైనా మనం మాత్రం శాంతమైన నిర్మల దృష్టితోనే లోకాన్ని వీక్షిద్దాము."[1] మొదటి ప్రపంచ యుద్ధం రావడానికే సరియైన కారణం మహాత్మునికి కనపడలేదు. ఇక రెండవ యుద్ధం మాట చెప్పడానికి ఏమున్నది? 'ధర్మ యుద్ధం' అనేది ఎప్పుడూ ఉండడానికే వీలులేదని కాంట్ తత్త్వవేత్త హెచ్చరించినాడు. "స్వవిషయంలో తీర్పు ఎవరూ చెప్పుకోలేరు." కాని న్యాయబుద్ధి ప్రతివారికీ ఉండవచ్చును. అయితే ఆ న్యాయం కోర్టులు తీర్చే న్యాయం మాత్రం కాదు. మహాత్ముడు నుడివినట్లు "అహింస ఎవరికీ ప్రమాదం కలిగించ"

[1] పండిట్ నెహ్రూ—"డిస్కవరీ ఆఫ్ ఇండియా" లో పుట 20 లో

దనేది ఎంతవరకు విశ్వసించాలి? తుపాకీతో ఎవడైనా దుండగీడు నా మీద తిరగబడితే నేను ఎదిరించక, ఏమీ చేయక, వాడు పెట్టే హింస అనుభవించాలా? లేక చేయవలసిన పనిచేసి వాణ్ణి తరుమ గొట్టాలా? అప్పుడు అహింస అవలంబిస్తే ఏమీ 'ప్రమాదం' లేదు అన్న మాట నిజమేనా? న్యాయబద్ధంగా హింస అంటూ వుండదా? ధైర్యంగా కర్మాచరణం చేయడం అవసరం కాదా? పోనీ అంగీకరించుదాము 'సత్యాగ్రహం' పిరికితనానికి వ్యతిరేక పదం. అతిహింస న్యాయసమ్మతం కాదు. ఇక్కడే వుంది గాంధేయ మతంలో కీలకం.

మహాత్ముడు స్నానానంతరం బట్టలు ధరించి, 'రెడ్డిగము' వేసుకొని ఆసీనుడై పాలూ, గంజి తాగే సమయమని గ్రహించి నేను కొంతసేపు ఆయనను విడిచిపెట్టినాను. టిబెట్ ప్రతినిధివర్గం వారు వస్తారని ఎదురు చూస్తున్నారు ఆశ్రమ వాసులు. అనక మహాత్మునికి పోపు మహాశయుడు కానుకగా ఇచ్చిన ప్రార్థనా పత్రం నేను సమర్పించినాను. ఆ కానుక ఆయనకు అపరిమితానందం కలిగించింది.

టిబెట్ ప్రతినిధులు వచ్చినారు. నేలమీదనే ఆసీనులయినారు. వారు వారి నౌకర్లను పిలిచి బట్టల మూటలూ సొమ్ములూ లోపలికి తీసుకొని రమ్మన్నారు. సిల్కుతానులవి. ఆ తానుల మీద సాలంకారమైన బుద్ధుని రూపాలున్నవి. వాటి మీద వున్న చిన్న బొమ్మలు టిబెట్ జాతీయ వస్త్రధారణను తెలియ చేస్తున్నాయి. అధికార సిరా వేయబడిన ఒక కాగితం మీద దలైలామా మహాత్మా గాంధీకి సందేశం రాసి పంపినాడు.

నేనా దృశ్యాన్ని మరచి పోలేను. టిబెట్ ప్రతినిధివర్గం రకరకాల రంగుల దుస్తులు వేసుకొని వింతవింత బంగారు నగలతో మహాత్ముని సమీపాన వుండగా, మహాత్ముడు కేవలం చిన్న అంగవస్త్రం కట్టుకొని, బోసినవ్వుతో అతిథుల్ని ఆదరించి మాట్లాడే సమయం తాను పాలూ గంజీ పుచ్చుకొనే టప్పుడని అంటున్నాడు. ద్విభాషిగా వున్న ఒకవ్యక్తి ఆంగ్లభాషలో మహాత్మునికి చెబుతున్నాడు ప్రతినిధుల తరపున.

మహాత్ముడు వచ్చిన అతిథుల్ని తేలిగ్గా వదిలిపెట్టేవాడు కాడు. ఆ టిబెట్ ప్రతినిధివర్గం తెచ్చిన సిల్కు భారతదేశంలో తయారీ అయినదేనని ధృవపరచుకొన్నాక—"బిర్లా యంత్రాలయాల్లో తయారయ్యే కృత్రిమ సిల్కు కాదా ?" అని తదితర వస్తువులు కూడా పరికించి గాంధీజీ మళ్ళీ ఇలా వచించాడు—"అనుకరణం మానేయండి, ఆడంబరం విసర్జించండి మీ ఘనుడైన లామాతో, మీ చిన్నవాడైన లామాతో చెప్పండి. నేను 'చిన్నవాడు' ఎందుకన్నానంటే ఆయన నా మనుమడంత పిన్న వయస్కుడు, ఆయన అధికార రీత్యా ఘనుడు — బుద్ధ భగవానుణ్ణి అనుకరించటం వల్ల కూడా ఘనుడే! బుద్ధుడు బీదవాడై వినయశీలంతో పాదచారియై అర్ధదిగంబరుడుగా దేశాటనం చేశాడు. ఆయన సదా నిరాడంబరుడే గాని, ఆడంబరుడు కాదు. ఆయన ఇలాంటి 'ఇమిటేషన్' దుస్తులు వేసుకొన్నవాడు కాడు. కాబట్టి, మీ దలైలామాతో చెప్పండి—బుద్ధదేవుణ్ణి అక్షరాల అనుకరించమనీ, ఆడంబరాన్నీ అనుకరణనూ సమూలంగా వర్జించమనీ."

ఇలా సంభాషణ సాగుతూంటే కానుకలమీద ఒక బొమ్మను నేను చూశాను. ఆ బొమ్మ ఒక పిల్లవాడు పన్నెండో పదమూడో వయస్సు వుంటాడి, తనకు పేదరాసి పెద్దమ్మ కథ చెప్పమన్నట్టు ఎదురు చూస్తున్నాడు. అచైనా పిల్లవాడు రంగురంగుల బట్టలు వేసుకొన్నాడు. లేదా ఆ వేషం టిబెట్ వేషమే కావచ్చును. ఆ బొమ్మ ఎవరో పిల్లవానిది కాదు దలైలామాదేనట! ఆ రాజ్యం చూదామని సరదా కలిగింది. నదీనదాలు, కొండలు, అడవులు, సాంద్రాలు తరించినా మన ఆత్మ స్వభావం మారదు. ఎక్కడికి వెళ్ళినా ఈ స్వభావం మోసుకొని పోతాము. దేశాటనం పండిత మిత్ర సమాగమం కోసం చేయాలి. ప్లేటో అన్నట్లు యాత్రోద్దేశ్యం విజ్ఞానఘనులను దర్శించి తెలుసుకోడమే ముఖ్య ప్రయోజనం.

మహాత్ముని గది విడిచిపెట్టినాను, అప్పటికింకా ఆయన ప్రతినిధివర్గంతో సంభాషిస్తూనే వున్నాడు. అదే ఆఖరిసారి నే నాయన దర్శనం చేయడం. బైట వాకిలిలో ఒక బెంచిమీద సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు మహాత్ముని దర్శనార్థం ఆసీనులై వున్నారు. ఆయనకు వందనం చేసి కారు యెక్కినాను, అనక కాశీ, కలకత్తా బయలు దేరినాను,

# అధ్యాయం ౬౦

గాంధీజీతో గోష్ఠిచేసి వచ్చేశాను. నా మనసు మటుకు ఆలోచనా మగ్నమైంది భావపరంపరతో. ఆలోచన లన్నింటిలో ప్రధాన మైనది శాంతివాదంవల్ల వచ్చే లాభాలాభాలు. న్యాయధర్మ సమ్మతంగా, త్యాగబుద్ధితో జీవితం గడిపే విధానం ఏమిటనేదే నా ప్రకృత సమస్య.

బెర్ట్రండ్ రస్సెలు మహాశయుడు ఈ మధ్యనే రాసిన "యుద్ధనివారణ" అన్న వ్యాసంలో ఇలా వుద్ఘాటించినాడు; "కేవల శాంతివాది ఇలా చెప్పవచ్చును: 'రష్యాతో శాంతి నిరంతరం సాగించవచ్చును—రష్యావారి ఆదేశాలన్నీ శిరసావ హిస్తే' అని." ఇలాంటి ఆదేశాలను శిరసావహించడం అంత మంచి పద్ధతి కాదు. ఎంతకాలం ఇతరులను సంతృప్తిపరచడం, మనం పిరికివాళ్ళం కావడం? ఈ విధానం దేశోపద్రవకరం. బలిష్ఠమైనదేశాన్ని తృప్తిచేయబోతే మన జీవితం అస్వాతంత్ర్య మవుతుంది; బలవంతులను మెప్పించలేము.

ఈ సందర్భంలో అదే, గాంధేయ సిద్ధాంతం అనుసర ణీయమా? హిట్లర్ సిద్ధాంతము నిరోధించ వలసిందేనా; పాశ్చాత్యలోకం ఒక్కతీరుగా దీనికిలా సమాధానం ఇస్తుంది—

"హిట్లర్‌ని నిరోధించవలసిందే. నిరంకుశ క్రౌర్యాన్ని నిరోధించడంవల్ల మానవతా గౌరవం వస్తుంది: మానవత్వం స్థాపితమవుతుంది. అంతేగాని గాంధేయ సిద్ధాంతరీత్యా అహింసా విధానం ద్వారా శత్రుహృదయం పరివర్తన చెందుతుందనేది ఆచరణీయం కాదూ కాబోదు కూడా" అని. నవీన ప్రపంచదృష్టి ఈ రీతుగా వాస్తవికంగా ఉంది-రస్సెలు వ్యాఖ్యానాల పద్ధతిలో.

అన్యదేశాల్లో క్రౌర్యం హింసాత్మకంగా వున్నప్పుడు, ప్రజలు పిరికిపడినప్పుడు మనం నిర్లిప్తులమై ఉండడం ధర్మమా? అప్పుడు మన రాజనీతి నిర్లిప్తతయేనా? టాలిరాండ్ చేసిన వాఖ్యానం ఈ సందర్భంలో నాకు జ్ఞాపకం వస్తున్నది. దీని జోలికి పోకపోవడం అనగా 'నిర్లిప్తత' రాజకీయంగా ఆధ్యాత్మికంగా ఉపయోగపడే శబ్దం జోలిక అన్నమాట అధర్మమూ హింసా స్వదేశంలో చెలరేగినప్పుడు కలుగచేసుకొని దేశోద్ధరణకై యత్నించడమా? లేక అన్యదేశాల్లో అధర్మం చెలరేగినా ఊరుకోడమా? న్యాయధర్మాలు తీర్చిదిద్దడమంటూ వుంటే స్వదేశమూ పరదేశమనే తారతమ్యం ఉండవలెనా?

అమెరికా సంయుక్త రాష్ట్రములు, సోవియట్ రిపబ్లిక్ చేయలేనిది అంతర్జాతీయ రక్షకభటశాఖ చేయకలుగుతుందేమో? రష్యా అందుకు అంగీకరిస్తుందేమో, దీనివల్ల ఎంతవరకు ప్రపంచంలో అక్రమ హింసా, అశాంతీ అరికట్టబడుతుందో హెన్రీ వాలెస్ పరిశోధన చేశాడా? పాశ్చాత్య శాంతివాదులు కొందరనుకొన్నారు-అంతర్జాతీయ రక్షకభటశాఖ సాయుధ సేనవంటిది

కాదని. పోతే సామాన్యంగా పట్టణాల్లో ప్రశాంత వాతావరణం ఏర్పాటుకావడానికి శక్తి వుపయోగించవలసి వచ్చినట్టు అంత ర్జాతీయ శాంతికి సాయుధశక్తి అవసరంలేదని మరికొందరి శాంతి వాదుల మతం. ఏది ఎలావున్నా పాశ్చాత్య శాంతివాది ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు: అపరాధి చేసే హింసాత్మక శక్తికీ, ధర్మ రక్షణార్థం వినియోగించే శక్తికీ భేదమేమిటి?

స్టాలిన్ హిట్లరుల లక్షలాది ప్రజలు తిండిలేక క్రౌర్యానికి ఆహుతి అయినారు. అప్పుడు నియంతల క్రౌర్యమును ఎదు ర్కోడం మన మానవ కర్తవ్యం. హిట్లర్ విజృంభణకు కారకులెవరు? కారల్ జాస్పెర్ అనే జర్మన్ తాత్త్వికుడు నుడివినట్లు బ్రిటీషు, ఫ్రెంచి, అమెరికావారే! ఆరంభంలోనే హిట్లరు తలెత్తకుండా చేస్తే జర్మనీ పరిస్థితి బాగుండేది. మనమే హింసాధర్మాలకు పాల్పడి తక్కినవారు చేసేది అధర్మమంటూ పెద్దమాటలు చెప్పడం కూడా అవివేకం. స్వార్థం కొండ లవుతున్నప్పుడు, మిత్రదేశాలనే మోసగించడం, చిన్నరాజ్యాలను తొక్కివేయడం సంభవిస్తుంది.

నా ఇచ్ఛానుసారం బెర్ట్రాండ్ రస్సెల్ చెప్పిందే అనుస రిస్తాను. ఎన్నిచెప్పినా శాంతి ప్రబోధం చాలా అవసరం లోకంలో. అది విద్యావిధానమై నూతన సంస్కారం తెచ్చి పెట్టాలి. దానికి విద్యాశిక్షణ కావాలి. మనసు మానవ శ్రేయస్సుకు మొగ్గడం విద్యలక్ష్యం. అందుకు తగిన శిక్షణ విద్యార్థులకు ఇవ్వవలెను. శాంతివాదం నూరిపోసినా, హింసా కాండ తలెత్తుతున్నప్పుడు, బ్రౌన్ ఆర్మీ, రెడ్ ఆర్మీ, గెస్టపో వేటినైనాసరే హింసాత్మక శక్తితోనే ప్రతిఘటించక తప్పదు.

అధిక సభ్యుల ఆమోదంతో అంతర్జాతీయ శాంతిస్థాపనా లక్ష్యంతో రక్షకవర్గం కృషిచేయాలి. నా అభిమతం సరియైనదేనా?

జర్మనీలో హిట్లరీయ నిరంకుశత్వం సమాప్తమయిన తరువాత స్టాలినీయ నిరంకుశత్వం తాండవించ వచ్చును. ఆ తరువాత? ఐక్యరాజ్యసమితి అధికసంఖ్యాకుల ఆమోదంతో చేయదలిస్తే నిరంకుశత పోగొట్టవచ్చును. ధర్మసంస్థాపన చేయ వచ్చును దాని నియమిత రక్షకదళంద్వారా. అవసరం వచ్చి నప్పుడు అన్యాయం అణిచివేనే సందర్భంలో హింసాత్మక శక్తి ప్రయోగించాలి. ఇది సముచితమేనా?

సామ్రాజ్యశక్తి రాక్షసంగా తాండవిస్తున్నప్పుడు ఆ శక్తిని సముదాయిస్తూ కూర్చోడం లేదా నిర్లిప్తంగా ఉండడం మంచిదా? వారితప్పు వారికే తెలుస్తుందని నియంతలు చేసే ఘోరకృత్యా లను సహించడమా? ఐక్యరాజ్య సమితిలో బాధ్యతగల పెద్ద పదవిలోవున్న నా మిత్రు డొకాయన ఇలా అన్నాడు: "సకా లంలో ఉద్ధృతంగా ఉన్న జాతిని సముదాయించడం మంచిది— వైరంకన్న" ఇది వామపక్షీయ ఛాంబర్లేన్ మతం అన్నమాట.

మహాత్ముని మనసులో ఒకటి, నా మనసులో మరొకటి ఉన్నవి—"ధర్మాత్ముడైనవాడి నడవడి ఎలావుండాలి?" అని గాంధీ సమస్య. నా సమస్య "అధర్మవర్తనుల బారినుండి సామాన్య ప్రజానీకరక్షణ ఎలాగ?" అని. ఇదే సమస్యాభేదం.

# అధ్యాయం 61

గీతాధ్యయనం చేసిన తదుపరి నాలో ఒక నిశ్చితాభిప్రాయం ఏర్పడింది. కాని ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో నా బుద్ధి ఇంత వికసితమైనది కాదు. భగవద్గీత పఠనానంతరం జర్మన్ తత్త్వవేత్త 'కాంట్' ఉపదేశంవలె అనాశక్తితో, ఫలాభిసంధి విడిచి స్వధర్మం నిర్వహించవలెనని గ్రహించాను. యుద్ధ సమయంలో కూడా తన విధికృత్యం మానవుడు నిర్వర్తించాలి. టాలుస్టాయికి సమాధానం చెప్పేవీలు నాకు చిక్కింది. దీనిమీద నేను మహాత్మా గాంధీకి నా సందేహం తెలియచేశాను పరిష్కారం కోసం. వెంటనే సమాధానం అప్పుడు ఆయన దగ్గరనుంచి రాలేదు. కారణం మహాత్ముడు టాలుస్టాయి రస్కినుల ప్రభావంలో ఉండడంవల్లనే. అయితే ఆయన గీతాధ్యయనం నిత్యం చేసి గీతా సందేశం అనుష్ఠిస్తున్నాడు కదా!

గీతార్థం బహురీతుల్లో భిన్నమతాలవారు వ్యాఖ్యానించినారు. యుద్ధం చేయడమనేది అర్జునుని మహా సమస్య కాదు. తన బంధుమిత్రాదులను ఎలా చంపుదునా అనే ఆయనకు శోకమోహాదులు కలిగినవి. బంధుమిత్రాదులను వధించి క్షత్రియధర్మం నెరవేర్చడం ఎలాగ? స్వధర్మ నిర్వాహణంలో తన వారలను

వధించడమా అనేది సమస్య. నాకీ సమస్య అంతముఖ్యంగా గీతా రూపకంలో తోచలేదు. యుద్ధంచేయడం ధర్మమా? అవసరంవస్తే తన వారితో కూడా యుద్ధం చేయవలసిందేనా? మానవ మహాకారుణ్యం యుద్ధానికి అడ్డువస్తుందే? మానవత్వానికూ, నిష్ఠురకర్మ నిర్వహణకూ నిత్య సంఘర్షణమే. గ్రీకు నాటకం, సోఫికిల్సు రచించిన 'ఆంటిగోన్' లో ఇటువంటి తుల్యబల విరోధమే వస్తుంది.

కృష్ణోపదేశాన్ని బట్టి స్వకర్మనిర్వహణ సందర్భంలో మానవుడు నిత్యానిత్య వస్తువివేక జ్ఞానవంతుడై వుండాలి. చంపేవాడు చంపబడేది, గెలిచేవాడు గెలవబడేది అన్నీ మోహకల్పితాలు, మాయాకల్పితాలనే గుర్తించవలె.

"స్వధర్మ నిర్వహణం యెడల నిష్ఠకలవాడు క్రమంగా పూర్ణపురుషు డవుతాడు... ...."

"అహంకార విమోహితుడవై నీవు 'నేను యుద్ధం చేయను' అంటున్నావు. వివేకములేక పరమప్రయోజనం గుర్తించని వాడివి." "అర్జునా, పరమేశ్వరుడు సర్వ దేహాంతర్వర్తి. కులాలుడు కులాలచక్రం తిప్పుతూ ఘటాలు తయారు చేస్తున్నట్లు, కృత్తివాసుడు మాయా యంత్రారూఢుడై జగద్వ్యాపారం నడుపుతూ వుంటాడు... ...."

యుద్ధమే కర్తవ్యం కాదని కొందరు గీతావ్యాఖ్య ఇలా చేస్తున్నారు: "సమస్తమూ అఖండ సచ్చిదానందాత్మక తత్త్వమే అయితే 'నేను' 'నీవ' నే ప్రత్యయభేదమే లేదు. నాకు హింస యదార్థంగా నీకూ హింసే." గీత సాధుత్వము, మంచితనమూ బోధిస్తే ఎవరికి?

మహాత్మునివంటి మనీషులకు, మహాత్ముడు గీతను రూపకాతిశయోక్తిగా వ్యాఖ్య చేశాడు. అది ఆధ్యాత్మిక రూపకాతిశయోక్తి. అర్జునుడు కురుక్షేత్ర యుద్ధంలో వున్నప్పటికీ అంతరంగ యుద్ధంలోనే వున్నాడు. ఆధ్యాత్మిక శక్తికీ ప్రకృతికీ అతని హృదయం సంగ్రామక్షేత్ర మయింది. అతడు ప్రకృతిని జయించక తప్పదు. ప్రకృతి తనలో భాగమే కనుక తన ప్రకృతిని తాను జయించాలి కృష్ణోపదేశం రీత్యా.

యుద్ధం కర్తవ్యం కాదన్నదీ, మహాత్ముని రూపకాతిశయోక్తి వ్యాఖ్యానమూ నాకు సంతృప్తి నివ్వలేదు. భారతీయులు అందరూ ఈ వ్యాఖ్యానం అంగీకరిస్తారని కూడా నేను భావించను. బేలూరు మఠంలో యోగులు ఈ పద్ధతి గీతావ్యాఖ్యను అంగీకరించ లేదు. ప్లేటో 'రిపబ్లిక్' వలె న్యాయధర్మోపదేశ వ్యాఖ్యానం విచారిణీయం. స్వధర్మం ప్రకారం యుద్ధం చేయవలసిందే. ఈ సందర్భంలో గీతావాదం హేత్వాభాసమైనదన్నా వాక్ఛలమన్నా, మరెవరేమన్నా సరే యుద్ధం చేయాలి—తప్పదు.

గీతవల్ల బయలుదేరే హైందవ దార్శనిక సిద్ధాంతం విషయంలోనే సందేహాలు వస్తవి. స్వధర్మ నిర్వహణమంటే ఏమిటి? ధర్మం పరిస్థితులనుబట్టి, ఆచరించేవాడి స్వభావాన్ని బట్టి వుంటుంది; అంతేనా లేక వర్ణాశ్రమాచారముల ననుసరించి ఉందే ధర్మమా? లేకపోతే మానవప్రకృతి సిద్ధమైన ధర్మమా?

మానవతాధర్మం మనం అతిక్రమించడం ఎందుకనీ? మానవతాధర్మం కూడా చివరికి 'మాయ' గానే నిర్వర్తించడమా? పురుషార్థాలు ఏవీకూడా ప్రధానం కావా? 'అహం

బ్రహ్మోఽస్మి" అనడం మాత్రం "మాయ" కాదా గీతా వాదన దృష్టిలో? ఈ పక్షంలో గీత మార్గదర్శికత్వం కాదనీ, దాని అశక్తతకూ, దాని వాదంలో హేత్వాభాసకు యీ విదర్శనం చాలుననీ తలవనివా రెవరు? దీన్నిబట్టి సత్యాన్వేషికి గీత శాపంవంటిదే కదా? బుద్ధదేవుని ప్రబోధము, నిర్యాణమార్గము సత్యసమీపం కాదూ? శాంతి, మానవత్వం, త్యాగం, ధర్మం కోసమే కదూ ధర్మం ఆచరించడం?

అలాంటప్పుడు గీతనే సప్రామాణికంగా స్వీకరిస్తే మన సమస్యలు తెమలవు. గీతావ్యాఖ్య హేతుదృక్పథంకు చుక్కెదురు. సమాధానం, నిర్దుష్ట సమాధానం అలభ్యమేమో. సరియైన వ్యాఖ్య చేస్తే గీతా ప్రబోధం స్పష్టమయినా సమాధానం...? స్థూలంగా చూస్తే "ది బుక్ ఆఫ్ జాబ్" వలె గీత ఆధ్యాత్మ నైతిక గ్రంథం. గాంధీజీ ఎసిసీ ఫ్రాన్సిస్ భక్తునివలె దయామయుడు—నిష్కాపటి.

కానీ, మహాత్ముని గీతావ్యాఖ్య సరికాదు. తాత్కాలిక విషయ సంబంధాలు తెగతెంపులు చేసుకొని స్వధర్మ నిర్వహణకై సన్నద్ధం కమ్మని గీత ఉద్ఘాటిస్తోంది. కానీ, ఎందుకీ ధర్మాచరణకు మానవుడు సంసిద్ధుడు కావాలో సకారణంగా స్పష్టంగా విశదపర్చదు. అలాగే మహాత్ముని వ్యాఖ్యానం కూడా వుంది కనుక, రెండూ తప్పేనా?—ఈ నిర్వచనను అనుష్టించే సన్యాసులు లేరు. అయినా కొందరు మహాత్ముని మతం అంగీకరించి అనుష్టిస్తున్నారనే చెప్పాలి.

# అధ్యాయం ౧౨

భౌతికమైన శాంతివిధానం ఆలోచన చేయడం సనాతన మతాభిమత విరుద్ధం కాదా? అలా వ్యాఖ్యానం చేస్తే పౌరుషంతో మానవుడు సనాతన దృక్పథం అంగీకరించనేలేడు.

ఇలా చెప్పడం మాత్రం పొరపాటని అనవలసి వస్తుంది. పాశ్చాత్య శాంతిప్రియులవలె మహాత్ముడు బలవంతుణ్ణి సంతృప్తి పరచడు. నిరంకుశుల క్రౌర్యాన్ని సముదాయించడు మహాత్ముడు. నిరంకుశత్వాన్ని నిరోధించే నవీనపథం ఆయన వెతుకనే వెతకడు. ఆయన దృష్టిలో శాంతి కేవలం భౌతికం కాదు. శాంతిస్థాపన కేవల భౌతికశ్రేయం కాదు. తత్సాధనకై మానవుడు మహావీరుడై అహింసాపద్ధతిలో పోరాటం సాగించవచ్చును. అలా జీవితం శాంతికై అంకితంచేసి మహాత్ముడు దీర్ఘకాలం కారాగార వాసం అనుభవించాడు. ఆయన జీవితకథ జైల్లోనే స్వాతంత్ర్య పోరాటం జరిగేకాలంలో లిఖితమైంది. శాంతిస్థాపనకై చేసేకృషిలో మరణానికి పాల్పడడం సంభవిస్తోంది.

మహాత్ముని దృష్టిలో శాంతి త్యాగశక్తి మూలకం. ఏదీకూడా ప్రపంచంలో నైతికంగా ముఖ్యంకాదు, కాని పాల్ భక్తుడన్నట్లు త్యాగం అత్యంత విలువైనది. యుద్ధకర్మలో

త్యాగానికి విరోధంగా ద్వేషం ప్రవర్తిస్తుందంటాడు మిస్టర్ రెక్సీ స్టౌట్.

అందుకే మహాత్ముడు భారతీయ దాస్యకారకులయిన బ్రిటీషువారిని కూడా ద్వేషించలేదు; ప్రేమించినాడు. యుద్ధంలో ధర్మహాని లేకుండా చూడడం కష్టం. ద్వేషంలేకుండా, వైరం లేకుండా యుద్ధం రాదు. అటువంటి సమయంలో వైరమే లేకపోతే యుద్ధావకాశం లేదు. బ్రిటీషు సామ్రాజ్యతత్త్వం హేయం కావచ్చును, రష్యావారి కమ్యూనిజం లేక రష్యా గూఢచారి రక్షకదళ నిరంకుశత, జనరలిసిమో స్టాలిన్ నిరంకుశ నాయకత్వం దోషదూషితం కావచ్చును. నాజీజంవారిని, బ్రిటీషువారిని, రష్యావారిని ద్వేషించడంవల్ల భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తుందా? బ్రిటీషువారిని సమతా సిద్ధాంత కపట నాటకం ద్వేషిస్తే మనకు (ఇండియాకు) స్వాతంత్ర్యం లభ్యమవుతుందా? బోల్షివిజం, నాజీజం, క్యాపిటలిజం వీటిని ద్వేషిస్తూ కూర్చుంటే మన సమస్యలు — శాంతి స్థాపన, సమైక్య జర్మనీ, యూరోపు పునరుద్ధరణ పరిష్కార సాధ్యమా? అలాగే హిందూ ముస్లిం ద్వేషానలం పంజాబ్ కల్లోలాన్ని రూపుమాపలేదు కదా!

మానవుని సుస్వభావం శాంతివల్ల ప్రకటమవుతుంది. అంతేకాక పురుషార్థ సాధనకు శాంతి మహోపయోగం. యుద్ధ ప్రసక్తి వున్నంతకాలం వ్యక్తిగతంగా స్వేచ్ఛకానీ, సంఘంలో ఆర్థికంగా న్యాయధర్మాలూ వుండడానికి వీలులేదు. ఈ సందర్భంలో మార్క్సు పక్షీయులు, బోల్షివిక్ కూటంవారు పొరపడుతున్నారు. శాంతికి భంగంకలిగించే అరాజిక విధానాలవల్ల

అభ్యుదయ వినాశం ఏర్పడుతుంది. న్యాయధర్మాలు, వ్యక్తి స్వాతంత్ర్యం, సాంఘిక శ్రేయం సమకూడని శాంతి నిరుపయోగం. ఈ లక్ష్యాలతో ప్రపంచం అభ్యుదయ విధానం అవలంబించి శాంతిస్థాపన చేయాలి. అంతర్జాతీయంగా ధర్మ సంరక్షణ చేయవలసినప్పుడు కపటరీతుల్లో స్వార్థచింతనతో చట్టాలను వ్యాఖ్యానించకూడదు. నైతిక దృష్టితో అధికసంఖ్యాకుల నిర్ణయం చేసినదాన్ని ఆచరణలో వుంచాలి. రాజనీతివేత్తల్లో నైతికదృష్టి లోపించిననాడు ప్రపంచంలో శాంతి స్థాపన గగనకుసుమం !

శాంతివిధానం అవలంబించి భారతదేశం స్వాతంత్ర్య యుద్ధం చేస్తున్నప్పుడు, భారతదేశంలోనే నేను వున్నాను. ఆ మహా సమరంతో మహాత్ముడు యదార్థవాదిగా రాజకీయవేత్తగా కృతకృత్యుడైనాడు. ఆయన జాతీయ స్వాతంత్ర్యం కంటే కూడా ప్రజానీకానికి శాంతి ఆలోచించినాడు. సామాన్య ప్రజలు కష్టనష్టాలకు గురికాకుండా వుండడం ముఖ్యం. బ్రిటీషు వారిది ఒకమోస్తరుగా ప్రజాతంత్ర రాజ్యం కనుక, వారికి ఇంకా అంతరాత్మ ప్రేరేపణమంటూ కాస్తోకూస్తో వుండడంవల్ల మహాత్ముని స్వాతంత్ర్యసాధన నెరవేరింది. మహాత్ముడు బ్రిటీషువారి అంతరాత్మకు ప్రబోధంచేసి విజయం సాధించాడు.

ఇక్కడ సమాధానం ఏమిచెప్పవలెనో? దక్షిణాఫ్రికా ఇండియాల్లో సత్యాగ్రహం సులభమైనది. అలాగే జర్మనీలో, నేటి రష్యాలో కూడా సులభసాధ్యమేమో? పారిశ్రామిక సంక్షోభం. సమస్యలూ సత్యాగ్రహంవల్ల సులభంగా పరిష్కారం అవుతయేమో? మహాత్ముడు సత్యాగ్రహ విధానంవల్ల, వ్యక్తిగత

ప్రభావంవల్ల కృతకృత్యుడైనా జనసామాన్యానికి రాజనైతిక చైతన్యం కలగలేదు. జనసామాన్యంలో రాజకీయ చేతనా వికాసంతో, జాతీయ స్వాతంత్ర్య సంపాదనకు అనుకూలించే ఉద్యమంగా ఏర్పడలేదు. సుశిక్షితులయిన సత్యాగ్రహులకూ, సామాన్య ప్రజకూ మధ్య అఖాతం పూడలేదు. మానవుడు ఇతర మానవునికి సన్నిహితుడు కాలేదు. సామాన్య ప్రజానీకానికి మహాత్ముని శాంతివాదం పూర్తిగా తెలియక పోయినా, ఆయన అహింసా సిద్ధాంతం అందరికీ అవగతం కాకపోయినా, ఆయన ఆచరించే నిష్ఠుర నైతిక జీవితవిధానం అందరూ అవలంబించ లేకపోయినా మహాత్ముడు విజయం సాధించడంలో ప్రత్యేకత కానవస్తుంది; సత్యాగ్రహం అహింసాయుత పోరాటం సిద్ధి పొందింది. ఆయన స్వీయ జీవితంలో అనుభవపూర్వకంగా అహింసాధర్మ మనే సిద్ధాంతాన్ని లోకానికి ప్రదర్శించినాడు. ఆయన జీవితమే లోకానికి మార్గదర్శకమైంది. అందుచేతనే మహాత్మాగాంధీ తత్త్వవేత్తకన్నా ఘనుడు, రాజనీతివేత్తకన్నా మతాచార్యుడు—మహా ప్రవక్త!

జపానీయుల దురాక్రమణను నిరోధించే సందర్భంలో మహాత్ముని సిద్ధాంతం ఎంతవరకు ఆచరణీయమో గ్రహించవలెనని కొందరు గాంధీజీని ప్రశ్నించినారు. అహింసా విధానంలో పూర్ణవిశ్వాసం కలవాళ్లు దృఢమనస్కులు కొద్దిమంది చాలునన్నాడు మహాత్ముడు. పూర్వులు కొందరు చెప్పినట్లు గాంధీజీ కూడా మానవులు నిత్యమూ 'మృత్యుసన్నిహితులు' గా వుండి మృత్యువును గడ్డిపరకవలె చూడగలితే తప్ప కృతార్థులవుతారన్నాడు. పశ్చిమోత్తర భారతదేశంలో కల్లోలాలు

శాంతించే ఉపాయం ఆయన సూచించినాడు. అక్కడ ప్రజలు దారిలో పరుండాలి—శత్రుపక్షపు అశ్వదళం తమ గుండెలమీద సవారీ చేసినా సరే! పంజాబులో, కాశ్మీరంలో ప్రబలిన హిందూ ముసల్మాను ఇండో—పాకిస్థాన్‌ల మధ్య వైరాగ్ని శాంతించే ఉపాయం ఇదే. ఆయన పద్ధతిలో మానవుడు ఏమైనాసరే హతుడైపోవాలి, హత్య చేయకూడదు."

డాక్టర్ అమియా చక్రవర్తికి మహాత్ముడు రాసిన అంతరంగిక లేఖలో ఇలా ఉన్నది. (21 జనవరి 1941)—"అహింస వల్ల మానవుడు ఎంతటి దుఃఖానినైనా సహించగలడు. ఆత్మ అవినాశి అని సత్యాగ్రహికి తీవ్రమై అచంచలమైన విశ్వాసం ఉంటుంది కనుక శత్రువులను వధించే పద్ధతి అన్వేషించక, చిరునవ్వుతో చనిపోవడానికి సిద్ధపడాలి." ఇతరత్రా గాంధీజీ ఇంకా ఇలా అన్నారు: మృత్యువు ఎప్పుడయినా శ్రేయమే. సత్యాగ్రహికి ద్విగుణీకృతంగా మృత్యువు శ్రేయోదాయకం. ఎందుచేతనంటే అతడు మహోత్కృష్టమైన సత్యధర్మంకోసం శరీరం చాలిస్తున్నాడు కాబట్టి. మత్యువు భీకరమైన రాక్షసికాదు. మత్యువు మిత్రము. అది బాధలకు విరుగుడు. అది నిద్రవలె మధురం. అయినప్పటికీ ఎవరయినా మిత్రుడు చనిపోతే దుఃఖిస్తాము ఆచార మాత్రంగా. మహాకారణం నిమిత్తం, మహా లక్ష్యంకోసం గతించిన మహావ్యక్తికై శోకించడం తగదు."

గ్రాహం పోలక్ సతీమణీ తాను రచించిన 'గాంధీ ది మాన్' అన్న గ్రంథంలో తన కక్షిదారులకు ఆయనిచ్చిన సమాధానం చక్కగా రచించింది. దొంగతనం చేసిన తన కక్షిదారులలో

ఒక భారతీయునితో సంభాషిస్తూ గాంధీజీ ఇలా ప్రశ్నించారు: "అయితే నీవెందుకు దొంగతనం చెయ్యడం?" అని మళ్ళీ ఇలా అన్నారు—"నీవు చేసేపని నీకు తెలుసును. దోషదండన ఎరుగుదువు. ఎరిగివుండీ కూడా తప్పుచేయడం ఎందుకు? ఆ వ్యక్తి ఇలా చెప్పినాడు సమాధాన పూర్వకంగా "నేను జీవించాలి కనుక." మహాత్ముడు మృదువుగా "నీవు జీవించాలి కనుకనా?" అని పునరుక్తి చేశాడు. "ఎందుకు?" అని ఆయన ప్రశ్నించాడు. దీనిని బట్టి మహాత్ముని జీవిత దృక్పథం తెలుస్తుంది. ధీరులు తిరిగి జన్మ ఎత్తవలసిందే. చనిపోతే మాత్రం భావం, ఆనక ఏ ఉద్దేశ్యం కోసం మరణించాడో ఆ లక్ష్యం, ఆత్మ ఎందుకు నశిస్తాయి? నశించవు. భౌతిక శరీరాన్నే అంటిపెట్టుకొని, తినడంకోసం జీవించేవాళ్ళు, అసలు వాళ్ళు జీవించి ప్రయోజన మేమిటి?

"నీ శాత్రువులను ప్రేమించు. నిన్ను దూషించినవాళ్ళను క్షమించి ఆశీర్వదించు."

"నీ స్నేహితులకన్న ఎక్కువగా ప్రేమించగలవా వాళ్ళను?" "కలవు. నీ యదార్ధ మిత్రులు గ్రహిస్తారు. అవును. అహింసాత్మక మయిన నీ అనుభవాన్ని బట్టి వారి దోషం చూపించు. కష్టమయిన త్యాగజీవితం అలవర్చుకో. ఎక్కడ అసాధ్యమో దాన్ని సాధించు."

"ఇలా చిన్నవాళ్ళకు శిక్షణ ఇస్తే ఎంత బాగుంటుంది మానవజాతి!"

"అన్యుల దోషాలెంచకు. నీ దోషాలు అన్యులు ఎంచుతారు........ధర్మం న్యాయం అంటే ఏమిటి? వాటిని

ఎవరు ఆచరించేవారు? తీర్పులు నీవు తీర్చేటప్పుడు ముందు వెనుకలూ, గతానుగతాలూ విచారించు. దోషాచరణ చేస్తే తన్నివారణ అవసరం కాదూ? అన్యుల భావం గ్రహించి అర్థం చేసుకోడమంటే వారిని క్షమించడమే. పాపులను క్షమించు. పాపాన్ని సానుభూతిగా క్షమించు."

పాపాచరణం ఏదో సరిగా తెలుసుకొని నయంచేయ గలమా వైద్యుడిలాగా? మహాత్ముని అభిమతాన్ని బట్టి వైద్యపద్ధతిగా నయం చేయగలం. ఇందులో సందేహంలేదు నాకు.

మనం యుద్ధాన్ని గురించీ, ప్రజలకూ యుద్ధానికీ గల సంబంధం మీదా చర్చ కొనసాగిస్తున్నాము. ఈ విషయంలో మహాత్ముడు 'వాస్తవిక రాజకీయవాది' అవుతాడా? ఇక్కడ అమెరికా అధ్యక్షుడయిన రూజ్వెల్టు వుద్దేశ్యం గ్రహించడం ప్రయోజనకరంగా వుంటుంది. రూజ్వెల్టు కేవల వాస్తవిక పరిపాలనా నిపుణుడు. మహాత్ముని నిర్ణయాలూ, అధ్యక్షుల నిర్ణయాలూ ఒకే తీరుగా వుంటవి. చార్లెస్ ఆస్టిన్ బెర్డు రాసిన 'అమెరికా విదేశ రాజనీతి—వికాసారంభం' అన్న గ్రంథంలో రూజ్వెల్టు వాక్యాలు పరిశీలనార్హములు. "అమెరికా సంయుక్త రాష్ట్రాలవారి ప్రధానోద్దేశాన్ని బట్టి యుద్ధంలోకి అనవసరంగా రాదు" (1935). సహకారం గురించి మాట్లాడుతూ— "సహకారమనేది పరస్పరంగానూ శాంతియుతంగానూ వుండాలి. అంతేకాని లకలుకలుగా వుండకూడదు, చిక్కుల్లోకి పోకూడదు." అని అదే సమయంలో ఇథియోపియా మీద ఇటలీ సామ్రాజ్య దురాక్రమణ చర్యను నిరోధించేందుకు నానాజాతి సమితి

సమావేశమైనప్పుడు రూజ్వెల్టు వచనాలివి : "నేను నా ప్రజాభిమతాన్ని, నా ప్రభుత్వ విధానాన్నే చెప్పుతున్నాను. ప్రపంచంలో రాజ్యాలన్నీ పరస్పర స్నేహ సద్భావాలు ఇతోధికంగా పెంపొందించుకోవటం చాలా అవసరం. అప్పుడే శాంతియుత పరిష్కారానికి, శాంతి స్థాపనకూ అవకాశం ఏర్పడుతుంది "........" నా ప్రభుత్వం (అమెరికా ప్రభుత్వం) ప్రస్తుతకల్లోలంలో కాలుపెట్టకుండా వుండటానికే కృతనిశ్చయమై, శాంతి పునస్థాపనకు తన ఆతృతను ప్రకటిస్తూ, అందుకు శాయశక్తులా పాటుపడుతుంది."

రాజకీయ విమర్శాగ్రేసుల సిద్ధాంతానుసారం రూజ్వెల్టు మాటలు వేరు, చేతలు వేరట. ఆయనలో అన్యాయ మధికమట. కాగా ఆయన ఎన్నికల్లో నెగ్గేటందుకు విలియం రాండాల్ఫు హెర్ట్సుకు ఎన్నెన్నో వాగ్దానాలు చేశాడట. కాని ఒక్కటీ చెల్లించుకోక నమ్మకద్రోహం చేశాడట. ఈ విధంగా ప్రెసిడెంట్ రూజ్వెల్టు రాజనీతిని విమర్శించడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. విమర్శకుల మాటలుబట్టి గాంధీ—రూజ్వెల్టులు ఎవరేమి చెప్పినా, ధార్మికులూ శాంతిప్రియులు!

# అధ్యాయం 63

ఒక సమస్యా పరిష్కారం నిమిత్తం నేను భారతదేశం వచ్చి నాను. ఆ సమస్య మానవకోటి యావత్తుకూ సంబధించిన మహా సమస్య. ప్రపంచానికి ఆచరణీయమైన, సులభసాధ్యమైన, నవీనమైన సందేశం మహాత్ముడిచ్చినాడా ?

ఆయన సందేశంలో ఘనమైనది అహింస. అది అవశ్యము ఆచరించవలసిన విధికృత్యం. ఆదర్శ నిర్వహణము నిరపేక్ష్యము. ఈ సిద్ధాంతానికి సీమలు ఏర్పాటు చేసుకొంటే రాజనీతిలో న్యాయపాలనలో నాకు అంగీకారమే. అప్పుడా సిద్ధాంతం మానవ సంస్కారమునకు వుపయోగించే విద్యా సంబంధమైన సిద్ధాంతం అవుతుంది కూడానూ. సిద్ధాంతానికి అవధులు కల్పించక అన్నింటికీ ప్రయోగించి చూస్తే ఏమవుతుందో ?

మొదట ఆలోచించవలసిన విషయం — ఆ సిద్ధాంతం సామాన్య ప్రజకూ, ప్రపంచానికీ, ప్రతి వ్యక్తికీ వుపయోగపడు తుందా ? అలా వుపయోగపడితే అది అసంగతమని నా ఉద్దేశం. కేవల శాంతివాదం, నిరపేక్ష్యమైన శాంతివాదం అసంగతం. బేలూరులో మఠాయతనంలో సన్యాసుల గీతావ్యాఖ్య సుసంగతం.

మర్త్యమానవుడు ఎవ్వడూ ఇదమిత్థమని సిద్ధాంతం చేయలేడు. ఆ తీర్పు తీర్చవలసినవాడు పరమేశ్వరుడు ఒక్కడే. కాని మరికొందరి ప్రబుద్ధుల దృష్టిలో చరిత్ర తీర్పు తీరుస్తుందట—చరిత్ర కనీసం అయోమయమైన సాక్షిగా వుంటుందట. తీర్పు తీర్చే న్యాయమూర్తులు కూడా, దోషదండన విధించే సందర్భంలో తమ నిర్ణయంకన్న పరమేశ్వరునియెడ వినయంతో నిజాంతఃకరణ ప్రమాణం పరిశీలన చేసుకొంటారు. తీర్పు తీర్చడం విధాయక కృత్యం.

న్యాయనిర్ణయం చేయడంలో అన్యాయం తగ్గించాలి. అన్యాయం తగ్గించే సందర్భంలో త్యాగబుద్ధి ఎన్నితోవలయినా వెతుకుతుంది. ఉదహరణకు చూడండి, అజ్ఞానులకు చిత్త సంస్కారం కలిగించాలి. అప్పుడతని హృదయం కరిగిపోవాలి. అన్యాయం ఏదో తెలియాలి. మనస్సు ఉద్దీప్తంకావాలి. ద్వేష ప్రశంసలకు త్యాగబుద్ధి తోడుకాదు. త్యాగంవల్ల జీవితం నశించదు. త్యాగంకన్న అన్యంగా మానవబుద్ధి. జీవితాన్ని దిద్దడానికి, వెతకగలిగితే? త్యాగంవల్ల జీవితానికి వైభవం, త్యాగం, దయ జీవితానికి కానుకలు.

ఆదికాలంలో కోతిబుద్ధిగల అవివేక మానవుడు పతితుడై క్రమక్రమంగా హేతువాదిగా పరిణమించినాడు. పరమేశ్వరానుగ్రహంవల్ల మానవుడు పరిణితి చెందినాడు, ద్వేషాహంకారములనూ, యుద్ధ ప్రియత్వమునూ నిగ్రహించడం ఎంత అద్భుతం; ఎంత కఠినమైనపని! త్యాగము హింసాప్రవృత్తికన్న ఎంత ఘనమైనది? శక్తిసంపాదనాకాంక్ష పాపప్రవృత్తికి మూలం.

విజ్ఞానసంపన్నులు ప్రబోధం చేయాలి, అనుష్ఠించి మార్గదర్శకులు కావాలి. ప్రజానీకానికి నడవడినేర్పి తోవ చూపేవారై ఉండవలె, పిచ్చాసుపత్రిలో వెర్రివాడితో వైద్యుడు పెనగులాడడం వంటిదికాదు సంస్కారం వ్యాపింపచేయడం.

అధికార విమోహితాత్ములూ రాజనీతివేత్తలూ పరిపాలనాదక్షులూ కలిసి కమీసారులు, ధనాఢ్యులు, కమ్యూనిస్టులు వారు చేయు పాపాలనూ ఘోరాలనూ అహింసా విధానంద్వారానే ఎదుర్కొనాలి. మహాత్ముడిదే సందేశమిస్తున్నాడు లోకానికి.

# అధ్యాయం 64

1948 జనవరి 16 తేదీ లండన్ 'డైలీ టెలిగ్రాఫ్' పత్రికలో యుద్ధశాఖకు వ్యవహర్తగాఉన్న సర్ జేమ్సు గ్రిగ్ మహాత్ముణ్ణి ఇలా వర్ణించినాడు: "మహాత్మునిలో వింతయైన ప్రకృతి సమ్మేళనం ఉంది. ఆయన సామ్యావస్థలో ఉండడు. అందువల్ల ప్రకృతిలో వైపరీత్యం ఆయనలోనే వుంది. ఆయన మహాప్రస్థానం అయిన తరువాత సమస్యా పరిష్కారం కావచ్చును" చాలా దారుణంగా రాయనివాడు రాసినాడు.

యల్. యస్. అమెరీ, (కన్సర్వేటీవుల కాలంలో ఇండియా సెక్రటరీ) లండన్ 'సండే క్రానికల్' 1 ఫిబ్రవరి 1948 లో ఇలా రాశాడు: "కాంగ్రెసు రాజనీతివేత్తగా బాహ్యప్రపంచానికి గాంధీ విషయం అంతగా సంబంధం లేదు. ఆయన ఆత్మశక్తి ఆత్మీయత అన్యదేశాల నాకర్షించింది. నవీనయుగంలో సాంఘికాభ్యుదయం కోసం భౌతికంగా నిర్మాణ కార్యక్రమాలు బయలుదేరు తున్నవి. యుద్ధ విరమణకై యంత్రపరికరాలు నిర్మింపబడుతున్నవి. లేదా యుద్ధ విరమణకై యుద్ధాలు సాగిస్తారు మానవులు." ఎన్నెన్ని యత్నాలుచేసినా మనం 'ఏటం బాంబు' ధాటికి నిలవగలమా? రక్షించుకోగలమా?

అనే సందేహం ఎక్కువగా ఉంది. శాంతీ సంతృప్తీ మనకు లభిస్తవా ? శాంతికి అవకాశమే లేదా ?

"సంఘసంస్కర్తవలె మానవులకు సరళజీవిత విధానం, అస్పృశ్య' మానవగౌరవమూ ప్రబోధంచేసే పద్ధతి సరియైనది కాదేమో ; బ్రిటీషు రాజనీతికి వ్యతిరేకియై బ్రిటీషు ప్రజానీకాన్ని ప్రేమించే తీరుకూడా సరియైనది కాదేమో ; హిందూ ధర్మం గ్రహించి క్రైస్తవ ఇస్లాంధర్మాల సమన్వయంచేసే విధానమూ లాభంలేదేమో ? శాంతిప్రియుడై యుద్ధవిద్వేషం నుంచి మానవులను విముఖులనుచేసి, వారి అంతరంగ పరివర్తనం చేసేమార్గం కూడా విఫలమేనా ?"

అహింసా విధానంతో తీవ్ర హింసాకాండను ఎదుర్కోవచ్చునని మహాత్ముని అభిమతం. అహింస విజ్ఞానులయిన కొద్దిమందికే పూర్తిగా బోధపడుతుంది. వారికే ఆచరణ సాధ్యం. బోధపడనివాళ్లు పిరికివాళ్ళయి పారిపోయి, బుద్ధికి తోచినట్టు రక్షించుకోడమో, నిగ్రహించడమో చేస్తారు.

"స్వీయగౌరవం రక్షించుకొనే సందర్భంలో ఏమానవుడూ పిరికిపంద కాకూడదు. పిరికివాడై పోవడం కన్నా, చేతకానితనం కన్నా హింస అవలంబించి, ఆయుధాలు ధరించి ఆత్మరక్షణం చేసుకోవచ్చును. మనం రక్షణ చేసుకోడం తెలియనప్పుడు మన కుటుంబగౌరవం అహింసాపద్ధతిగా నిలవబెట్టలేనప్పుడు, యుద్ధం చేయవలసినదే !"

ఈ సందర్భంలో మహాత్ముడు మోసకారిగా మాట్లాడుతున్నాడని భ్రమపడకూడదు, ఏయే పరిస్థితులకు వ్యక్తుల

ఆత్మీయ వికాసమూ బలమునూ అనుసరించి అహింస అవలంబించాలో మహాత్ముడు తెలియచేశాడు, అందరూ అహింసా విధానం అన్ని పరిస్థితుల్లో అవలంబించమనడం అవివేకం కనుక, విశేషంగా ఆత్మసాధన చేసినవాడికి అహింసా పద్ధతి అనువుగా ఉంటుంది.

1922 లో మహాత్ముడు హింసావిధానం అవలంబించవద్దనీ. కుత్తుక ఉత్తరించుకోవద్దనీ చెప్పినా ప్రజలు, కొందరు నాయకులూ వినలేదు. ఆయన అంతరంగం బాధపడింది. ఆ కారణంగానే అహమ్మదాబాదులో మహాత్ముడు నిరశనవ్రతం అవలంబించినాడు. తన హితోపదేశం ప్రజలు పెడచెవిని పెట్టే సరికి అందరి తప్పులూ మహాత్ముడే భరించదలచినాడు. నిరశన వ్రత సందర్భంలో మహాత్ముని వచనాలివి: "వైజ్ఞానిక మహాశయుడయిన అడ్వొకేటు-జనరలు తప్పు నా నెత్తినే వేసినాడు. బొంబాయి, మదరాసు, చౌరీచౌరాలో దురంతాలకు నేనే బాధ్యుడనట. అందువల్ల నేనే సమస్తపాపాల్ని భరిస్తాను. నేనవలంబించిన విధానం ఒక శిక్షణతో ప్రయుక్తమైనది. ఆ విధానంవల్ల ప్రజలకు హాని ఎలా కలిగిందో, ప్రజల వెర్రి ఆవేశం, క్రోధోన్మత్తత ఎందుకు హెచ్చిపోయినవో నాకు తెలియదు. యథార్థం నా నోట వస్తే వారు గ్రహించకపోరు."

మహాత్ముడు నిజానికి మహాజాతీయ నాయకుడు. అయినా ఆయన తన జీవిత చరిత్రలో బోయరు యుద్ధంనాడు బ్రిటీషువారి యెడ తనవైఖరి ఇలా వర్ణించినాడు: "బ్రిటీషు వారి యెడల నా రాజభక్తి నన్ను బోయరు యుద్ధంలో

పాల్గొనమని ప్రోద్బలం కలిగించింది. బ్రిటీషు పౌరునివలె నేను కనీసపు హక్కులు కోరినప్పుడు, ఆ కోరికే నన్ను బ్రిటీషు సామ్రాజ్య రక్షణకు ప్రోత్సాహం కలిగించింది. అప్పుడు నా ఉద్దేశ్యం సామ్రాజ్యంలో వుంటూనే భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యం పొందగలుగుతుందని." ఆ ఉద్దేశ్యంతోనే ఆయన నెటాలులో వైద్య సేవాదళాన్ని ఏర్పాటు చేశారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామం అయిన తరువాత బ్రిటీషు వారు భారతీయులను మోసం చేశారనీ, నమ్మించి ద్రోహం చేశారనీ మహాత్ముడు తలచి పూర్వపు వుద్దేశ్యం మార్చుకొన్నాడు. యుద్ధకాలంలో భారతీయులు రాజభక్తితో చేసిన సేవకు ప్రత్యుపకారం చేస్తామని బ్రిటీషు ప్రభుత్వం ఘోషించి మాట చెల్లించుకోలేక పోయింది. తత్ఫలితంగా దేశంలో ప్రజల్లో నిరాశ పెరిగి పోయింది. ప్రభుత్వం ప్రజల స్వాతంత్ర్య కాంక్ష అణిచివేయ యత్నించింది. చట్టాలు అమలు జరపదలచింది. రౌలటు చట్టం అమలులోకి వచ్చింది. పంజాబులో అల్లరులు చెలరేగినవి. డయ్యర్ సేనాని జలియనువాలాబాగులో ప్రజలను కాల్పించినాడు.

తక్కిన పాలకులవలె కాక మహాత్ముని పరిపాలనా నైపుణిలో ప్రత్యేకత ఉంది. ఆయన విశిష్ట రాజ్యాంగవేత్త. జాతీయ నాయకుడై ఖ్యాతి సంపాదించినాడు. మాజినీ చూపిన నైపుణ్యం, ప్రజ్ఞ మహాత్ముడు రాజనీతిలో కనబరచినాడు.

అఖిలాసియా వికాసోన్ముఖ మవుతున్నప్పుడు గాంధీజీ మజినీవలె కేవల విశిష్ట రాజకీయవేత్తగానే కాక, ఎంతటి వ్యతిరేకశక్తులు విజృంభించినా ఆయనలో రెండు అనన్య ప్రభావ

శక్తులు సిహితమై వున్నవి. ఆయన ఎంత జాతీయవాదో అంత. అంతర్జాతీయవాది, అలాగే ఇండియాకు ఆయన జాతీయ నాయకుడు అంతేకాక ప్రపంచ పౌరుడు, విశ్వజనీనుడు.

మహాత్ముని ఘనత ఇందులోనే వుంది. కేవలం నెపోలియన్, స్టాలిన్, హిట్లరులు మాత్రం ఆయనతో పోలికకు రాగలరు. కాని ఈ పోలికలో విపరీతమైన ఘోరవ్యత్యాసం కనపడుతుంది. భారతేతిహాసం రాయవలసినప్పుడు మహాత్ముని చరిత్రే తప్పక రాయవలసి వుంటుంది. అదే మహాత్ముని ఘనత. పైగా భారతదేశానికే కాక ఆయన సందేశం విశ్వానికంతకూ నిర్దేశింప బడింది. జగత్తుకూ, మానవ నాగరకతా మనుగడకే ఉద్దేశింప బడిన ఘనతర సందేశమది! ప్రపంచంలో వున్న పాపహింసల నిరోధము సులభంగా చేసే అహింసా విధానం ఆచరణీయమైనదేనని ఏభై అరవై ఏళ్ల అవిరళ సాధనద్వారా, ప్రబోధంద్వారా మహాత్మునిచే నిరూపితం కాబడిన దివ్య సందేశమది—సత్యాహింసల సిద్ధాంతం!

మహాత్మునికి స్మారక చిహ్నంగా వుచితరీతిలో నెహ్రూ పండితుడు ఢిల్లీలో మరొక మహా సమావేశం ఏర్పాటు చేయాలి. అప్పుడు సోవియట్ ప్రతినిధులు కూడా హాజరుకావాలి లోగడ సభలకు వచ్చినట్టు. ఈ సమావేశాన్ని చూచి సనాతన ముసల్మానులు తమ వాళ్ళందరినీ కూటంగాచేర్చి భావోద్రిక్తులనుగా రాజనీతిపరులుగా చేయడానికి మార్గం వెతకవచ్చును.

# అధ్యాయం 6వ

మహాత్ముని నవీనమైన అహింసా సందేశం నేను బోధపరుచు కొన్న పక్షాన "అది ప్రాచీన మత ప్రోక్తమయిన త్యాగ సందేశమూ, మనోవిజ్ఞాన దృష్టితో బోధించే సుశిక్షిత పరస్పర సహకార సందేశమూ అవుతున్నది. ఆయన మహోపదేష్ట, మహోపాధ్యాయుడు!" అని వుద్ఘాటిస్తాను.

జీవిత లక్ష్యానికై అర్పించదలచిన సుశిక్షితులయిన ఉపాధ్యాయులను చేర్చి, నిష్ఠురమైన నైతిక సాధనచేసి తన సందేశం వ్యాపింపచేయ మన్నాడు. సాధుగుణములు, మానవాభ్యుదయ కాంక్ష కలిగిన కొలదిమంది మహోదారులు కొరు. వారి ఆత్మా ర్పణమే సందేశవ్యాప్తి చేయదలచిన కారణం, తాను కృషి చేయదలచినది విశ్వసించిన పక్షంలో అతడు అహింసాత్మక సహాయ నిరాకరణం, రాగద్వేష విముక్తమయిన సాత్త్వికనిరోధము అవలంబించి సత్యాగ్రహికాక తప్పదు.

మహాత్ముని సిద్ధాంతం సహేతుకంగా విశ్వసించినవాణ్ణి నేను. ఆయన సిద్ధాంతంలో మూలసూత్రం యెడల నాకు అచంచల విశ్వాసం వుంది.

కాని ఆయన సిద్ధాంతంలో కొన్ని సందేహాలు నివృత్తి కాలేదు. సిమ్లాలోనూ ఢిల్లీలోనూ మహాత్ముని దర్శించాను. ఆయన సిద్ధాంతం బోధపడని వాళ్లు హింసాపద్ధతి అవలంబించవచ్చును. మహాత్ముడందులకు అంగీకరించినాడు. నా సందేహాలకు సమాధానాలు కావాలని ఆయన కార్యదర్శినిగావున్న (ప్రస్తుతం కేంద్ర భారత ఆరోగ్యశాఖా మంత్రిణి) శ్రీమతి రాజకుమారి అమృతకౌర్‌కు ఉత్తరం రాశాను. మొదటి సమాధాన ప్రకారం మహాత్ముడు ఎప్పుడూ హింసావిధానం అంగీకరించని శాంతివాది-

"(అ) సాయుధ సంపత్తి కావలెనని మహాత్ముడు ఎప్పుడూ చెప్పడు. అదే ఆయన ఆదర్శం. పత్రికా వ్యాఖ్యానాల్లో, వార్తల్లో ప్రచురిత మయ్యేవి ఊహాపోహలు..........

"(ఆ) ఈ ప్రశ్నకు సమాధానం నిశ్చితంగా ఉన్నది. అహింసా పద్ధతిలో తీవ్రవిశ్వాస మున్నవాడు యుద్ధానుకూలంగా సహకరించడు. అట్టివాడు అహింసా పద్ధతిగానే తన ప్రభుత్వాన్ని సహకరించడు.

"(ఇ) ఇది గడ్డు ప్రశ్న. సహేతుకంగా విమర్శిస్తే అహింసయందు విశ్వాసము గలవాడు ఏ కాలాల్లోనూ ఏపరిస్థితుల్లోనూ ఏరూపంలో హింసాప్రవృత్తివున్నా అంగీకరించడు. విప్లవకారులు నిరంకుశ ప్రభుత్వాన్ని ఎదిరించినట్లు. ప్రపంచ ప్రభుత్వము, శాసనరహితంగా అధర్మం అన్యాయం అక్రమం సాగించే శక్తులతో సహాయనిరాకరణం చేయాలి. అయితే ధర్మాన్ని ప్రవేశపెట్టేటప్పుడు అధర్మం పోగొట్టే సమయంలో కొంతవరకు హింస ఉపయోగించాలి. మన ప్రపంచానికి

విశ్వసంరక్షణకు పోలీసు దళం కావలసి వుండవచ్చును. అధర్మా చరణకు దండన విధించేటప్పుడు హింస లేకపోలేదు. కనుక అహింసపద్ధతి పూర్తిగా నెరవేరని పక్షంలో ప్రపంచ పోలీసు దళంవారు హింసాపద్ధతి అవలంబించక తప్పదు. అహింసా పద్ధతి ప్రయోగించే తీరులో నైతికబలం ఉన్నప్పుడు దానికి అపజయం ఉండదు."

తరువాత రాజకుమారి అమృతకౌర్ నుండి రెండో ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉంది :

"గాంధీజీతో మాట్లాడేందుకు పదినిముషాలు సావకాశం (నిన్ననే) దొరికింది నా అదృష్టవశాత్తు. మీ లేఖ బాపూజీకి చూపించాను. నా సమాధానాలు ఆయనకు చెప్పాను. ఆయన అంగీకరించినారు. మీ యూదో ప్రశ్న విషయంలో ఆయన మరీ పట్టుగా వున్నారు నా కన్నా. న్యాయవిరుద్ధంగా విజృంభించే దుష్టశక్తులను పరిమార్చే నిమిత్తం 'ప్రపంచ పోలీసు దళం' అవసరమనే అంగీకరించారు. అహింసాత్మక అసహాయోద్యమం కొన్ని విషయాల్లో అననుకూలమూ అస్పష్టమూ కనుక ఆచరణీయం అంతగా కాదు.

హడావిడితో, అభివందనాలు.

మీ విశ్వాసిని

అమృత్‌కౌర్"

ఈ లేఖ పఠించిన తరువాత నా యాత్ర సఫలమయిందని భావించాను. సామాన్యమైన శాంతివాదం కన్న మహాత్ముని సిద్ధాంతం ఆచరణీయమూ విశిష్టమైనదిన్నీ. ఈ సిద్ధాంతం

సహేతుకం ; ఈ సందేశంలో త్యాగమూ ధర్మమూ మిళిత మైనవి. మళ్ళీ భారతదేశ పర్యటనం చేసి మహాత్ముని సిద్ధాంతం మీదవ్యాఖ్యానం రచించేందుకు ప్రయత్నిస్తాను; సందేహాలు సమ గ్రంగా సమసిపోయిన తదుపరి విపులంగా వివరంగా వ్యాఖ్యానం చేసే అవకాశం ఉంటుంది.

ఆ సిద్ధాంతం అమలు జరపవలసిన అవశ్యకత ఎంతో ఉంది. "జీవాత్మలకు వర్కు షాపులు" ఆశ్రమాలే. ఆశ్రమ వాసులు శిక్షామయ జీవితం గడిపి, ఉన్నతాదర్శంకోసం జీవితాలు అర్పిస్తారు. ఈ సిద్ధాంతం రీత్యా మానవకోటికి పునస్సంస్కారం కలిగించాలి. పిల్లలకూ పెద్దలకూ యావన్మందికిన్నీ. క్రైస్తవం కాని దేశంనుంచి వచ్చిన సందేశం క్రీస్తుసందేశంతో సమరస పడింది. ప్రాక్పశ్చిమాలు ఏకమవుతవి మహాత్ముని సిద్ధాంతంవల్ల. విశ్వప్రేమలో ఐక్యానుసంధానం నిహితమై ఉంది.

ద్వేషానలం భీకరరూపం దాల్చింది. ముస్లింలు, హిందువులూ సిక్కులూ ధారుణ హత్యాకాండకు దిగి రక్తపుటేరులు పారింప చేశారు. చివరికి శరణార్థ మూకలను కూడా విడవకుండా విచక్షణా రహితంగా వధించారు. దానితో వుత్తరభారతం ఇంచుమించు (నాడు) మతవాదులైన కొద్దిమంది దుండగుల రక్కస రాకాసి శక్తులకు రణభూమి అయింది.

జనవరి 13 వ తేదీన జగాపురాలో మహాత్ముడు ప్రసంగిస్తూ—"హిందూ ముస్లింలమధ్య మైత్రి ఏర్పడాలంటే పరస్పరం మతధర్మాలను గౌరవించుకోవడం అత్యవసరం. మతాంతరులు కాగోరేవారిని స్వేచ్ఛగా చేరనీయండి; నిరోధించవద్దు." అని అన్నారు.

ఈ విధంగా గాంధీజీ ఒకేపు శాంతి ప్రబోధం చేస్తూ వుంటే మరోవేపు అమానుషంగా, యధేచ్ఛగా మతదౌష్ట్య వికృత పీడాశక్తి విలయ తాండవం చేస్తూనే వుంది; కత్తులు నూరుతూనే వుంది. "న్యాయం" "ధర్మం" "గౌరవం" "సత్కారం" ఒకవంక, ఇంకోవంక "కసి" "క్రౌర్యం" "ప్రతిహింస" "ఖూనీ" "విద్రోహం" ఇత్యాది ఆక్రోశాలు అసంఖ్యాకంగా వినవస్తున్నవి. ఐనాకూడా మహాత్మాగాంధీ ద్విగుణీకృతంగా తన సాధన కార్యక్రమంలో మగ్నమయినాడు; చలించలేదు. హిందూ మహాసభ యుద్ధ కర్తవ్యానికే సిద్ధమైంది. ముస్లింలు పరమతాలమీద కత్తికట్టి పవిత్ర యుద్ధం 'జిహాద్' ఇంకా కొనసాగించడానికే వుద్యుక్తులవుతున్నారు. సిక్కులు కూడా ఈ సందర్భంలో ఒకప్రక్క 'గ్రంథ సాహెబ్' వేరొక

ప్రక్క కృపాణంతో సిద్ధం. మతధర్మం విశ్వజనీనంగా గ్రహించలేని సంకుచిత హృదయాలు ఈ విధంగా మౌర్ఖ్యంతో దేశాన్ని రక్తప్లావితం చేయకోరుతున్నాయి. చేస్తున్నాయి.

మహాత్ముడీ పరిస్థితి చూచి సహించలేక, పాప ప్రాయశ్చిత్తంగా తపస్సు ఆరంభించినాడు. తపస్సే జన్మాంత నిరశన వ్రతం. క్లిష్ట పరిస్థితుల్లో మహాత్ముడు వుపవాస దీక్షలో అంతర్వాణి ప్రబోధం ఆలకించేవాడు. లోగడ చాలాసార్లు ఆయన అంతరంగ పరిశోధనకై సమస్యా పరిష్కారాల నిమిత్తం ఉపవాసాలు చేశాడు. నవకాళీ హత్యాకాండ అయిన తరువాత ఆఖరు సారిగా ఆయన ఈ వ్రతమే సాగించినాడు. ప్రజానీక హృదయం అహింసామయమై మార్పు చెందేనిమిత్తం ఆయన చేసే వుపవాసదీక్ష నిర్దేశితమైంది. కాని మహాత్ముని మరణం కోరేవాళ్ళు వారి ప్రయత్నాలువారు చేస్తున్నారు.

మానవప్రకృతి అకస్మాత్తుగా సంకుచితమై నీచమై పోతుంది. స్వార్థకలుషిత మవుతుంది. ఆశ్చర్య మేమంటే ఆ ప్రకృతే సంస్కారంవల్ల, మతధర్మానుష్ఠానంవల్ల, సాధన వల్ల పరమోత్కృష్టమై వుదాత్త గంభీర మవుతుంది. ఇదే నేను గ్రహించాను.

మానవతా పరిపూర్ణత ఆత్మోన్నతిలోనే వున్నది ; త్యాగ విశ్వాసాల్లోనే వున్నది. మానవతకు గౌరవాంజలి ఇవ్వని మానవ రాక్షసులను సముద్రంలో పారవేసినా దోషం లేదు. మహాత్ముని సారళ్యం తపస్సు, త్యాగ విశ్వాసాలు లోకంలో ఉండడానికి తావులేక పోయిందా? మానవ మహాకారుణ్యం

తెలియని వాళ్ళు 'ఇమిటేషన్ ఆఫ్ క్రీస్తు' చదవండి. దాని ద్వారా త్యాగధర్మం తెలియనివాళ్ళు తత్వం గ్రహించండి.

జనవరి 18 తేదీన మహాత్ముడు ఉపవాసదీక్ష విరమించినాడు. వివిధ మతాలవారి విఖ్యాత ప్రతినిధివర్గం ఒకటి ఇక వైరానికీ, హింసకూ చోటివ్వమని హామీలు ఇవ్వడంవల్లనే ఉపవాసం విరమించినాడు బాపూజీ. దానితో దేశంలో ముఖ్యంగా బొంబాయి, ఢిల్లీ, పంజాబులలో బెంగాలుకంటే 'అత్యద్భుతంగా' సామరస్యం సమకూరింది. మహాత్ముని మందిరంలో హిందూ, క్రైస్తవ, మహమ్మదీయ, సిక్కు పద్ధతులలో వుపాసనలు జరిగినవి. ముఖ్యంగా కార్డినల్ జాన్ హెన్రీ న్యూమాన్ యొక్క 'కారుణ్యమనే కాంతిపథంకేసి దారిచూపు ప్రభూ!' అనే పవిత్రగీతాలాపంతో మందిరం ప్రతిధ్వనించింది. అయిదు రోజులు ఉపవాసదీక్ష అలా ముగిసింది. మహాత్ముని పదిహేనవ ఉపవాసదీక్ష ( 1943 ఫిబ్రవరి మాసం, ఆగాఖాన్ మందిరంలో ) మాత్రం ఇరవైయొక్కరోజు పట్టింది.

జనవరి 27 తేదీన ఢిల్లీదగ్గర మెహరాలీలో మహమ్మదీయ యోగిపుంగవుడు 'హజరత్ ఖ్వాజా కుతుబుద్దీన్ భక్తియార్ కాకీ' దరగాలో ఆయన జయంతోత్సవం జరుగుతున్న సందర్భంలో అక్కడికి గాంధీజీ వెళ్ళాలని మనసు పుట్టింది. ఆ ముస్లిముల వుత్సవంనాడు ఎలాగో ఆయన వీలు చేసుకొని మెహరాలీ వెళ్ళి అక్కడ గుమికూడిన హిందూ మహమ్మదీయులకు శాంతి ధర్మ ప్రబోధం చేసినాడు. ఆయన ప్రబోధం ఆలించి, ఆయన దయార్ద్ర కరుణాపూరిత నయనాలను గాంచి

అక్కడవున్న ప్రజంతా విచలితమైంది; మనసులు కరిగి పోయాయి. ఈ వృద్ధ—78 ఏళ్ళ ముదసలి ఏ ఆవేదనతో వారం పదిరోజుల క్రితమే ప్రాణాలను సహితం అర్పించకోరి ఉపవసించాడో, ఆ వేదనా నివృత్తికి మతసామరస్య శాంతివాతావరణం దేశంలో పునఃస్థాపించేందుకు—యైక్యకంఠంతో హామీనిస్తూ కృషికి ద్విగుణీకృతోత్సాహంతో సిద్ధపడినారు. నాటినించి కల్లోల వాతావరణం సమసిపోయింది. ఉభయ మతాలమధ్య సామరస్య బంధం క్రమేణా బిగియ సాగింది. ఈ 'అత్యద్భుతం' గాంచి స్వదేశమూ స్వదేశీయులే కాదు, యావత్తు ప్రపంచం దిగ్భ్రమచెందింది. మహాత్మునిలో గల శక్తి—ప్రాచీన నైతికశక్తి ప్రపంచానికీ ప్రదర్శమైంది. విశ్వమంతా జోహారు లర్పించింది. ఆ మహా నైతికశక్తి ప్రాచీనమే. ఇలిజా, జాన్‌లు పాపులు పాపనివృత్తికి పూర్వం ఉపవాసమే అవలంబించారు. క్రీస్తుదేవుడుకూడా 'లెంట్' సమయంలో ఆత్మోన్నతి కోసం వుపవసించినవాడే! అలాగే తాపసోత్తముడూ మహా ప్రవక్తా అయిన మహాత్మాగాంధీ దేశం హింసా ప్రతిహింసానలంలో భస్మమవుతూ ఉండడం చూసి సహించలేక ప్రాయోపవేశం ఆరంభించాడు. దానితో దేశవ్యాప్తమై వున్న మతరక్కసి మానసం ఆయన—మహాత్ముని నైతిక ప్రభావానికి లొంగిపోయింది, హింసా ప్రతిహింసల దుష్టశక్తుల స్థానే శాంతీ సుహృద్భావమూ సిద్ధమైనాయి. మహాత్మునిలో ఆశజనించింది. ఆయన ఉల్లాసంగా ప్రసంగిస్తూ తను యీసారి మళ్లీ 125 ఏండ్లు జీవించాలనే తలుస్తున్నట్లు వచించాడు.

ఈ సమయంలోనే (జనవరి 27 న) లోగడనే గాంధీజీతో సలిపిన గోష్ఠి అనుభవాన్ని 'చరిత్రాన్వేషణలో' అనే గ్రంథ రచనద్వారా విఖ్యాతుడైన విన్‌సెంటు షీన్ 13 వ తారీఖున న్యూయార్కునించి బయలుదేరి వచ్చి మహాత్ముని సందర్శించినాడు. ఆయన జీవిత మతధర్మ సమస్యలు గూర్చి గాంధీజీని అడిగి సమాధానాలు పొంది సంతృప్తుడైనాడు. "నేను మొదట జీవితం అర్థహీనమైన కట్టుకథగా ఊహించాను. ఆనక (గాంధీ దర్శనానంతరం) నా అభిప్రాయం సరికాదని గుర్తించాను. నేను నాస్తికుణ్ణని పిలుచుకొన్నాను. ఐతే ఆ పదానికి అర్థం నాకు బోధపడిందికాదు." తర్వాత షీన్ మహాశయుడు గాంధీజీ అహింసా సిద్ధాంతం గీతా ప్రబోధమే కారణం కాదనీ, బహుశా అది తన హిందూసోదరులు వచిస్తున్నట్లు 'ది సెర్మన్ ఆన్ ది మౌంట్' యొక్క ప్రభావ కారణం కావచ్చుననీ తనతో ఆయన (గాంధీజీ) అన్నట్లు చెప్పినాడు. పోతే మహాత్ముని నమ్మికలో సత్యమే ఈశ్వరుడు "అది (సత్యమనే ఈశ్వరశక్తి) అభేద్యమూ అద్భుతమునూ, శాశ్వితమునూ అయినది. అది అనంత వ్యాప్తిమైనది. అదే సృష్టి స్థితి లయకారణం"[1] అని చెప్పినాక విన్సెంట్ షీన్ గాంధేయ సిద్ధాంతాలకు శతజోహారు లర్పించినాడు—తన రచనలో.

---

1 సి. యఫ్. ఆంద్రూస్—"మహాత్మా గాంధీజీస్ ఇండియా" అన్న గ్రంథం నించి షీన్—"గాంధీస్ రిలీజియస్ టీచింగ్స్" అన్న శీర్షికను 8 ఫిబ్రవరి 1948 న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూన్‌లో ప్రచురితమైన వ్యాసంలో ఉదహరిత వాక్యాలు.

ఆ వెనుక మూడురోజుల అనంతరం అంటే, జనవరి 30 తారీఖున మహాత్ముని యీ క్రింది వచనాల పరమార్థభావం ఏమిటో ప్రశ్నించి తెలుసుకుందామని నిశ్చయించు కొన్నాడు మిష్టర్ షీన్ పండితుడు. అవి 1924 నవంబరు 14 తేదీన మహాత్ముడు 'యంగ్ ఇండియాలో' వ్రాసిన వాక్యాలు—" మొదట తీవ్ర సత్యాన్వేషణమే కొనసాగించవలసినది, ఆనక శివం సుందరాలు వాటంతటవే లభ్యపడతవి........ఆ సత్య సౌందర్యం కోసం నేను తపిస్తాను, జీవిస్తున్నాను, అందుకే చనిపోతాను." కాని మహాత్ముని సమాధానం రాలేదు.

ఆ రోజునే మానవుడు 'గాంధీజీ అడుగు జాడలు' అనుసరించాలంటే అతని ప్రాధమిక చర్యలు ఏమిటి? అని ప్రశ్నిస్తూ నేను రాసుకొన్న లేఖను గాంధీజీకి శ్రీమతి అమృత కౌర్ చూపివున్నది. దానిమీద ఆమె ఫిబ్రవరి 3 వ తేదీన ఇలా నాకు సమాధానం రాసింది: "నాకు మీరు రాసిన లేఖను 'బాపు' కు చదివి వినిపించాను. ఆయన శ్రద్ధగా ఆసక్తితో మీ లేఖంతా విన్నారు. యదార్థమైన సైనికుడు ఎక్కడ ధర్మగ్లాని వుంటుందో అక్కడ పోరాటానికి సిద్ధం కావలసిందే గాని, అంతకు తప్ప అతనికి ప్రాధమికచర్య అంటూ ఏదీ లేదని తన వచనాలు మీకు అభివందన పూర్వకంగా అందచేయ మన్నారు."

('గాంధీజీ అడుగు జాడలు' లోకం అనుసరించి అభ్యుదయం, చిరశాంతి చూరగొనేందుకు మహాత్ముని భావాలలో ఇంకా పొంచివున్న సత్యార్థాలను ఆయన ఆశ్రమవాసులూ, ఆయన భక్తులూ అయిన శ్రీమతి మీరాబెన్, అగాథా హారిసన్,

హోరేస్ అలెగ్జాండర్, అగర్వాలా, పట్టాభి వగైరా ప్రముఖుల వ్యాఖ్యలూ వ్యాసాలూ చదివి ఆకలించుకోవాలి. అందుకు గాంధేయ భక్తులు ఇంకా విస్తారంగా గాంధేయ సిద్ధాంత సాహిత్యాన్ని లోకానికి సమర్పించాలని మా మనవి.)

మహాత్ముని వధించే నిమిత్తం కుట్రలు బయలుదేరుతున్నవి. వదంతులు దశదిశావ్యాప్తము లవుతున్నవి. జనవరి 20 తేదీన మహాత్ముని ప్రార్థనా సమయాన మధనలాల్ అనే పంజాబీ యువకుడు మహాత్ముని ఉద్దేశించి బాంబు వేసినాడు. కాని సరిగా అది పేలలేదు. విచారణచేశాక పోలీసులు మదనలాలును ప్రోత్సహించినవారు రాష్ట్రీయ స్వయంసేవక సంఘంవారని దృఢపరిచారు. కాని అది ఋజువు చేయడానికి మొదట్లో ఆధారాలు లేనందున కుట్రకు రాష్ట్రీయ స్వయం సేవకులు కేవలం కారణమేమోనని అపోహ కలిగింది. ఈ రాష్ట్రీయ స్వయం సేవక సంఘంవారు జెక్ 'సోకోలుల' వలె సనాతన జాతి మత విజ్ఞానోద్ధరణ చేసి, భారతదేశం అఖండభారతం కావాలని కృషి చేస్తున్నారు. నాజీ ఫాసిస్టులవలె హిందూరాజ్య స్థాపనే వారి ఉద్దేశ్యం. వారికీ హిందూమహా సభవారికీ ఘనిష్ట సంబంధం ఉంది. ఈ రెండు సంస్థలనూ అక్రమాలని ప్రకటించ వలసిందిగా జయప్రకాశ్ నారాయణ పట్టుపట్టి నెగ్గినాడు—కొంత కాలహరణ తర్వాత,

ఈలోగా మార్గరెట్ బార్కు-వైట్ మహాత్ముని దర్శనం చేసింది. పాశ్చాత్యుల్లో ఆమెదే ఆఖరి దర్శనం. మహాత్ముని ఆమె ఇలా ప్రశ్నించింది: "ఏటం బాంబు ప్రయోగించినప్పుడు

మీ అహింస ఏమిచేస్తుందో సెలవిస్తారా ?" "ప్రార్థనాపూర్వకంగా చేస్తుంది. బాంబులు పడవేసే విమాన చోదకుడు నాముఖం చూడనీ, తన యెడ ద్వేషభావంలేని నా ముఖం చూడనీ, నేను మైదానంలో వచ్చి నిలబడతాను." "ఆ ఎత్తునుండి నా ముఖం పైలట్ చూడలేడు. మమ్మల్ని నాశనం చేయడనీ, మమ్మల్ని చూస్తే ప్రాణం తీయడు మాలో చెలరేగే తీవ్రతపన పైలట్‌ను చేరుతుంది గనక. హిరోషిమాలో ప్రార్థనాశీలంతో మనుష్యులు చనిపోయినట్లయితే, అంటే బాహాటంగా వారు ప్రార్థనచేస్తూ బాంబుల్ని ఆహ్వానిస్తూ గతించిన పక్షంలో యుద్ధం అప్రతిష్ఠగా సమాప్తమయ్యేదికాదు."[1]

రాష్ట్రీయ స్వయం సేవకాధ్యక్షులు ఇలా సెలవిచ్చారు :

"ఈ పాతకానికి ఒడికట్టినవాడు దేశానికి అత్యంత హాని కలిగించినాడు." అంటూ మహాత్ముని కాల్చిన హంతకుని గూర్చి చెప్పినారు, ఈ హత్యా సందర్భంలో అళ్వారు మహారాజు, ఆయన దివాన్ ఖరే కుట్రదారులకు ప్రోత్సాహమిచ్చినట్లు ప్రభుత్వం అనుమానించి అళ్వారును తాత్కాలికంగా రాజ్య భ్రష్టుణ్ణి చేసింది. ఖరేమీద కొన్ని నిర్బంధ ఆజ్ఞలు అమలు పరిచింది.

మహాత్ముని కాల్చినవాడు విజ్ఞానీ సంస్కారీ కూడాను. అతడు పూనాలో 'హిందూ రాష్ట్ర' పత్రికా సంపాదకుడు. హిందూ మహాసభలో హిందువు. పేరు నాథూరాం వినాయక్ గోడ్సే. అతడు మహాత్ముని అంతమొందించడమే సత్యాగ్రహంగా తలచినాడు. తాను చేస్తున్నపని అధర్మంగా తోచలేదు. అతడు

---

[1] మార్చి 1948 'లైఫ్' వ్యాసంనుంచి. ఈ గోష్ఠి 30 జనవరిలో జరిగింది.

హిందువుల్లో అతివాది. ఈ మూఢుని ఏమని దూషించటం? ఏసు దేవునిపట్ల పెనుభూతమైన 'సైఫన్' తో పోల్చవచ్చును. "నేను చేసినదానికి నేనేమీ చింతించడం లేదు." అన్నటువంటి ఈ పలుకులు గోడ్సే వ్యాఖ్యానంలోనివి! అతడు దీన్నిబట్టి ఫాసిస్టుల్లో ఫాసిస్టుగా చెప్పవచ్చును. గోడ్సే హిందువైన మాత్రాన హిందువులనూ హిందూమహాసభ సభ్యులనూ నిందించడం న్యాయసమ్మతం కాదు.

మహాత్మునికి రాబోయే విపత్తు తెలుసునని అన్నారు కొందరు. ఆయన మార్గరెట్ బోర్క్-వైటుతో "పరిస్థితులు చూస్తూవుంటే జీవనోత్సాహం తగ్గిపోతున్నది" అని చెప్పినాడు. హత్యకు ముందురోజు రాత్రి మహాత్ముడు కొంత కులాసాగా, నవ్వులాటగా ఒక గుజరాతీ గీతం పాడినాడట, ఆ పాటలో భావం ఇది: "ఇది చిత్ర ప్రపంచం, ఎన్నాళ్లు నేనీ ఆట ఆడను?"

శుక్రవారంనాడు, జనవరి 30వ తేదీన మహాత్మునికి తోవలో సర్దారు పటేలు ఎదురుపడినాడు. మహాత్మునికి ప్రార్థన వేళ ఆలస్య మవుతున్నది. పటేలు పాకిస్తానుపట్ల అవలంబించ వలసిన కఠినాతి కఠిన విధానాలు మహాత్మునితో పలికినాడు, ఎలాగో పటేలును తప్పించుకొని మహాత్ముడు "నేను ప్రార్థనకు వెళ్ళిపోవాలి. వేళయింది" అంటూ బయలుదేరినాడు, సాయం కాలం ఢిల్లీ స్థానికవేళ సరిగా ఐదుగంటల పదినిమిషాలకు బిర్లాభవనం గాంధీజీ విడిచినాడు. ఆవా మనూల బుజాలమీద

చేతులువేసి ప్రార్థన సమావేశానికి తోటదారినే వెళుతున్నాడు. వచ్చేవారం వార్ధావెళ్ళి సేవగ్రాంలో శిష్యులతో ఉండాలని తలచినాడు. కాని........

కాకీనిక్కరు వేసుకొని, నీలిరుమాలు ముఖాన కట్టుకొని నాధూరాం మహాత్ముని సమీపిస్తున్నాడు. మహాత్ముడు ఉపవాస క్లేశంవల్ల నీరసంగా వుండి నెమ్మదిగా తోటలో ప్రార్థనావేదిక మెట్లు ఎక్కుతున్నాడు. "ఆలస్యంగా వచ్చారు" అన్నాడు నాధూరాం. అంటూనే తలవాల్చి మహాత్ముని పాదాలమీద ప్రణమిల్లుతున్నట్టున్నాడు. చుట్టు పక్కలవాళ్ల అలాగే తలచినారు. నాధూరామ్ మహాత్ముని పాదాలు స్పృశించబోతున్నాడని అంతా తలచినారు, తెల్ల శాలువ కప్పుకొన్న మహాత్ముడు చిరునవ్వుతో "అవును. కొంచెం ఆలస్యమే అయింది" అన్నాడు. పోలక్ సతి మహాత్ముని నేత్రాలు 'ప్రపంచంలో అత్యంత దయా రసార్ద్రములు' అని రాసింది—గాఢంగా పరిశీలించి చూసి. ఆ కరుణా పూరిత నేత్రాలే గోడ్సేను చూసి నవ్వినవి. గోడ్సే 'బిరెట్టా ఆటోమెటిక్' పిస్టలుతో సమీపంగా—అతిసమీపంగా ఉండి మూడుసార్లు గాంధీజీమీద పేల్చినాడు. లండన్ టైమ్సు పత్రిక ఇలా వ్యాఖ్యానం చేసింది మహాత్ముని మరణాన్ని గురించి, "గాంధీజీ తన రెండు చేతులెత్తి శిరసుమీద నుంచుకొని ప్రణామంచేస్తూ భూమిపై కొరిగినాడు—నిలబడినవాడు నిలబడి నట్లే" ప్రార్థనా భంగిమలోనే బాపూ మృత్యువును ఆహ్వానించి నాడు. పిస్టలుదెబ్బ తిన్న వెంటనే గాంధీజీ 'హే రామ్-హే రామ్' అని రామనామం ఉచ్చరించినాడు. వెంటనే బిర్లా మందిరం లోనికి తీసుకొని వెళ్ళినారు. ఆయన మంచినీరు అడిగినాడు కాని

నీరు గుటక వేయలేక పోయినాడు. "నేనుండడం ఇష్టంలేని పక్షాన నేను జీవించను." అని లోగడ మహాత్ముడు తీవ్ర వాదులతో అన్నాడు. క్షతితుడైన తర్వాత ఇరవైయెనిమిది నిమిషాలు మాత్రమే బాపూ ఇహలోకంలో జీవించినాడు. ఆవా గీతా పారాయణం చేస్తూ వుండగా ఆయన దేహం చాలించినాడు—ప్రశాంతంగా.

మహాత్ముని ఆశ్రమవాసి ఒకాయన బిర్లామందిరం వెలుపల అప్పుడే గుమికూడిన ప్రజానీకానికి రెండే మాటల్లో "మన బాపూజీ—గతించాడు." అని తెలియచేశాడు.

అంతే. మరుక్షణంలో ప్రజ తండోపతండాలుగా నేల యీనినట్టున్నారు. మందిరం వెలుపల శవం అందరికీ కనపడేందుకు వీలుగా అమర్చబడింది. విద్యుత్ దీపపు వెలుగు మృత శరీరంమీద ప్రసరిస్తున్నది. లండన్ పత్రికా విలేఖరి ఆంద్రూ మిల్లర్ ఆ దృశ్యాన్ని ఇలా వివరిస్తూ వ్రాసినాడు. "మహాత్ముడు మరణించినా, తెల్లని వస్త్రాల్లో ఆయన అమృతుని వలె గోచరిస్తున్నారు. ఆయన ముఖమండలం తేజోనిధానమై సుందరంగా ఉంది. ఆ ముఖంలో బాధాలేశము కూడా కనపడ లేదు." ఆయన శిరసువద్ద అయిదు ప్రమిదలు పంచభూత ప్రకృతిని నిర్దేశిస్తూ వెలిగించినారు. ఆ రాత్రి నెహ్రూ పండితుడు కట్టలుతెగిన దుఃఖోద్వేగ భావపరంపరలనించి తెప్పరిల్లి దేశాన్ని ఉద్దేశిస్తూ రేడియోలో చేసిన అభిభాషణం: "స్నేహితులారా, సోదరులారా! మన జీవనజ్యోతి ఆరిపోయింది. అంతటా అంధకారమే." పతిత విశ్వమానవకోటి ఉద్ధరణకై జీవితాన్ని అంకితం చేసి డభ్భై ఎనిమిదో యేట తొమ్మండుగుర కుట్ర

ఫలితంగా మాత్రమేకాక లోకంలో బలిసివున్న అధర్మ అన్యాయాలకు మహాత్ముడు బలైనాడు. భౌతిక కాయంమీద మృత్యువు విజయ ధ్వజం ఎత్తింది. కానీ ఆయన ఆత్మ శాశ్వతంగానే ప్రకాశిస్తోంది, ప్రజ్వరిల్లుతోంది.

ఈ హత్యా కారణంగా దేశంలో విస్తృత హింసాకాండ తలెత్తుతుందని అనుకొన్నారు. కాని తలెత్తలేదు. కొందరు రక్తం కావాలన్నారు. తరువాత ఊరుకొన్నారు. మానవ హృదయం భీషణ రాక్షసమూ, ఒక్కొక్కసారి కరుణాలింగితమూ అవుతుంది. మదనలాలు మహాత్మని మీద బాంబు వేసినప్పుడు మహాత్ముడు అతనిని పోలీసువారు బాధపెట్టవద్దని బతిమాలుకొన్నాడు. హత్యకు పూర్వరాత్రి మహాత్ముడు సెక్రటరీని పిలిచి "ముఖ్యమైన ఉత్తరాలు తెచ్చిపెట్టు వాటికి సమాధానాలు ఇప్పుడే రాయాలి; మళ్ళీ రేపటిపూట ఉంటానో ఉండనో" అన్నాడు.

యావత్ప్రపంచంనుండి సందేశాలు వచ్చినవి. మహాత్ముని మరణానికి సానుభూతి పురస్కారంగా వేలాది తంతులూ కేబుళ్లూ లక్షలాది లేఖలూ కుమ్మరిల్లినవి. బ్రిటీషు చక్రవర్తి, అమెరికా అధ్యక్షుడు, బ్రిటీషు ప్రధానీ, మంత్రులూ, కెనడా దక్షిణాఫ్రికా మంత్రులూ లేఖలు రాశారు.

1948 ఫిబ్రవరి 15 వ తేదీ హరిజన్ సంచికలో 'బాపూ' అనే శీర్షకను భారతప్రధాని నెహ్రూ పండితుడు వ్రాసిన వ్యాసం చిరస్మరణీయ మయినది. దాని పాఠం:

"ఆయన మరణంలో కూడా దివ్యాద్భుత సంపూర్ణ కళానైపుణ్య మున్నది. ఆయన జీవయాత్ర కనుకూలమైన ఉచిత

మైన స్థాయి చేకూరినదని అన్ని దృక్కోణములనుండి చూసి నిర్ణయించడమైనది. అది ఆయన జీవన సందేశమును ప్రదీప్తం చేసినది. సర్వతోముఖ శక్తి విజృంభించినపుడే, చనిపోవుట కిచ్చగించని సమయమున మహాత్ముడు తనువు చాలించినాడు; ప్రార్థనా సమయమున మరణమునకు పాల్పడినాడు. నిరంతర మానవైక్యనకై కృషిసాగించి, ముఖ్యంగా గత రెండు సంవత్స రములనుండి తీవ్రకృషి చేసి, ఆ మహాలక్ష్యమునకై శరీరమును కోల్పోయినాడు మహాత్ముడు. అందరూ తమ వార్ధక్యమున జీవింప ఇష్టపడని సమయమున, మహాత్ముడు తన వృద్ధాప్యంలో ఇంకా శరీరపాటవముండగా అకస్మాత్తుగా మరణించినాడు. ముదిమితో వచ్చే వళీపలితం, దీర్ఘరోగం, మరుపు మొదలైన లక్షణాలు గాంధీజీలో లేవు మొత్తానికి ఆయన వీరమరణమే పొందినాడు. ఆయన కోరినట్లే లక్ష్యసాధనలో అమరుడైనాడు. మరి మన మెందుకు దుఃఖింపవలెను? ఏ గురూత్తముని పాద విన్యాసమున జ్ఞానతేజం గమ్యాన్ని చూపునో, ఎవని సుందర శుభ్ర దరహాసం అకలంకమో, ఎవని నేత్రాంచలాలు హాస ప్రఫుల్లములో అవి మనకిక భౌతికంగా లభ్యపడవనే చింతి స్తున్నాం శారీరకంగా మానసికంగానైన మహాత్ము డింద్రియ శక్తులు కోల్పోలేదు. శరీరపాటవం శక్తులున్నత స్థాయిలో నున్నప్పుడే ఆయన మరణించినాడు. మన మనోవీధిలో ఆయ నకు ముదిమిని ఆపాదించం—ఆపాదించజాలం. ఆ నవాద్భుత వ్యక్తిత్వం మన మనసు వీడదు."

"ఆ దివ్యమూర్తి నన్నో కోల్పోము. అంతేకాదు మహా త్ముడు మన మానసికాధ్యాత్మిక జీవితంలో అవినాభావంగా

సంబంధ మేర్పరచుకొన్నాడు. మన జీవితముల పరివర్తనకు మన ఆత్మీయతకు మహాత్ముడే కారణమగుచున్నాడు. గాంధే యుల తరం పోతే పోవచ్చును కాని, భారతీయాంతరంగిక పరి ణామం, ఆధ్యాత్మిక వికాసం మహాత్ముని జీవితాంతం వరకు చేసిన కృషిఫలం—తరములు గతించినా మహాత్ముని ప్రభావం ముందుతరాలలో కూడా ప్రస్ఫుట మగుచునే వుంటాది. మహా త్ముడు భారతీయాత్మ ; భారత హృదయం. మన భారతీయాత్మ వికాసం క్షీణించుచున్న సమయంలో ఆయన మన కాధ్యాత్మిక శక్తి నొసంగుటకు అహోరాత్రములూ వత్సరములూ కృషి చేసినాడు. ఆయన కృషి మన జాతీయ వారసత్వం."

"భారతావనికి మహాత్ముని కృషి మహా మహోన్నతం. కేవల భారతమునకే కాక యావత్ప్రపంచానికీ బాపూజీ కృషి ఆధ్యాత్మికంగా మహిమోపేతం. ఇప్పుడు మనం ఆయన కార్య రంగంలో నిలిచి, తదీయ స్మరణ పీడక, యధాశక్తి కార్య శూరులమై అప్పుడప్పుడు మనం చేసిన శపధమును చెల్లించుకో వలెను."

మహాత్ముడు వినయశీలం కలవాడేకాని, నీచమైన సేవక భావం కలవాడు కాదు. తనశక్తి యెరిగి బాధ్యత గుర్తించినవాడు. అంతేకాని అందరినీ సంతోషపెట్టవలెననే భావ మాయనలో లేదు. పత్రికా విలేఖరులను అందరినే రంజింపచేయలేదు. తన్ను పోషించి ఆదరించిన వారిని ప్రశంసించి ."ఇంద్రుడనీ, చంద్రు డనీ" మెరమెచ్చులు పలుకలేదు. కొందరు వ్యాఖ్యాతలు

అన్నారు—" ఆయన సన్యాసయోగం మహా కఠినం; కఠిన మైనను యోగభోగ విపులం. ఆయన సాధన తీవ్రము, విపులమున్నూ " అని. తాను యోగానుభవం కలవాడని మహాత్ముడు ప్రదర్శన చేయలేదు. ఆయన మిత్రులకే తెలియదు.

అమెరికా సంయుక్త రాష్ట్రముల అధ్యక్షుడు మిస్టర్ ట్రూమన్ మహాత్ముని గూర్చి ఇలా వ్యాఖ్యచేసినాడు: "మానవ మహా సౌభ్రాతృత్వం కోసం శాంతి కోసం మరియొక మహా మహితాత్ముడు జీవితం అర్పించినాడు. మనం పట్టుదలతో మానవ సహకారానికై, పరస్పర విశ్వాసమునకై తీవ్రంగా కృషి చేయవలసి వుంది. ఏ లక్ష్యంకోసం మహాత్ముడు శరీరం అర్పించి నాడో ఆ లక్ష్యసాధనకై కృతనిశ్చయులమై కృషి చేద్దాం."

మహ్మదాలీ జిన్నా ఇలా వ్యాఖ్య చేసినాడు:—

" మృత్యుసన్నిధానంలో వివాదానికి వీలులేదు. మాలో రాజనీతిలో భేదాభిప్రాయా లున్నప్పటికీ హిందూ జాతిలో మహాత్మా గాంధీ ఉత్తమోత్తమ వ్యక్తి. హిందుస్థాన్‌కు ఆయన మరణంవల్ల తీరనిదెబ్బనే చెప్పాలి. ఈ క్షణంలో ఆయన లేకపోవడంవల్ల ఏర్పడిన అఖాతం పూడ్చడానికి సాధ్య పడనిది." లియాకత్ ఆలీఖాన్ "మనకాలంలో మహాత్ముని వంటి ఉత్తమోత్తమ వ్యక్తిని చూడబోము" అన్నాడు—క్లుప్తంలో క్లుప్తంగా. విన్‌స్టన్ చర్చిలు ఇలా అన్నాడు—" ఈ ఘోర దురంతానికి వణికి పోయాను."

పిమ్మట వెస్టు మినిస్టర్ ఎబేలో గాంధీ స్మారక చిహ్నంగా సర్ స్టాఫర్డు క్రిప్స్ ప్రార్థనాసమయంలో అభిభాషణ చేసినాడు.

జనవరి 31 వ తేదీన గాంధీజీని యమునా తీరంలో దహనం చేశారు. దహనానికి ముందు రేయినుంచే గ్రామసీమల నుండి లక్షలాది ప్రజలు కాలినడకను, సైకిళ్లమీద, నాటుబళ్లల్లో ప్రయాణించి ఢిల్లీ చేరుకొన్నారు. తెల్లవారేసరికి ఏ పాతిక లక్షలమందో ఉన్నారు ప్రజలు. ఎటువంటి వక్త, మాటకారి పోయినా అంతగా ప్రజ గుమికూడదు. 'దీవాదర్శైగా' అన్నట్టు మహాత్ముడు మాటకారి కాడు, కార్యవాదికాడు, ఆయనే ఒక మహాజీవితం! ఒకసారి బెంగాలీలో మహాత్ముడు స్వయంగానే రాశాడు—"నా జీవితమే నా సందేశం" అని.

మహాత్ముని శవవాహనం యమునా తీరంపైన పదిహేను అడుగుల ఎత్తులో ఉంది. వేదిక పన్నెండడుగుల చతురం ఉంటుంది. మంచిగంధపు చక్కలు వేదికమీద ఉన్నవి. పవిత్రతా చిహ్నమయిన శ్వేతం, ధీరతా చిహ్నంగా పచ్చరంగు సన్యసన చిహ్నంగా కషాయవర్ణమూ చల్లినారు. మహాత్ముడు సన్యాసిగా, సత్యాగ్రహిగా, అహింసోపాసకునిగా ఆ వర్ణాలు వ్యక్తం చేసినవి. వేదికకు నాలుగువైపుల పవిత్రమైన రావి కొమ్మలు కట్టినారు జవహరులాలు నెహ్రూ అక్కడే ఉన్నాడు. పటేలు మొదలయిన నాయకులూ ఉన్నారు. రాజప్రతినిధి అంగరక్షక దళం వెంటనంటి ఉండగా మహాత్ముని మృతదేహాన్ని వేదిక దగ్గరకు తెచ్చినారు. తక్కినవారందరితోపాటు అంగరక్షకులను దగ్గర ఉంచుకోకుండానే చక్రవర్తి సంబంధీకుడు, దాయాదీ అయిన లార్డు మౌంట్ బాటన్ భార్యా కుమార్తెలతో నేల పద్మాసీనుడయినాడు నేర్పుగా, రాజోచిత ఆచారాలన్నింటినీ



(ఫోటో : పాల్ హోమ్స్

ఆలిండియా రేడియో కేంద్రంనుంచి అమరుడైన
మహాత్ముని గురించి ప్రస్తావిస్తున్న లార్ మౌంట్‌బాటన్



( ఫొటో: కీస్టోన్.)

కిద్వాయ్, నెహ్రూ, సరోజని, ఆజాద్, పటేల్, కాట్జూలు అలహాబాదు స్టేషన్‌లో మహాత్ముని అస్థిశేషాలు త్రివేణిసంగమంలో నిమజ్జన చేయటానికి కొనివస్తున్న రైలుకోసం విషణ్ణవదనులై వేచియున్న దృశ్యం.





( ఫొటో : పి. ఎ. రూట

లండన్‌లో ఇండియా భవనంలో మహాత్మా గాంధీకి
శ్రద్ధాంజలి ఘటిస్తున్న గాంధేయ భక్తులు.

కూడా కాలరాచి. వాస్తవానికి మహాత్మా గాంధీకి రాజాధిరాజుల మధ్యనే, వారికంటే ఘనంగా కూడా దహనక్రియలు నిర్వర్తించినారు. ఆ వినయశీలుడు, దయార్ద్ర హృదయునికి తగినట్లే మహోన్నత గౌరవలాంఛనాలు జరిగినాయి.

'బాపూ' మృతశరీరం వేదికపైన చందనపు చక్కల మీద పొందికగా అమర్చినారు. లక్షలాది ప్రజానీకం ఒక్కసారిగా 'మహాత్మా గాంధీకీ జై' అని నినాదాలు చేశారు. మృతదేహం మీద రాసులురాసులుగా మల్లెమాలలు, కరవీర కుసుమాలు ప్రోగయినవి. వినువీధి నుంచి బాంబరు విమానదళం గుట్ల గుట్లగా గులాబీ రేకులు (బాంబులకు బదులుగా) మహాత్ముని శరీరంమీద కుమ్మరించింది. అంతే, సరిగ్గా (31 జనవరి 1948 శనివారం సాయంత్రం) నాలుగు గంటల నలభై ఐదు నిమిషాలు అవుతుంది—చితికి అగ్నిసంస్కారం చేయబడింది. మౌంట్ బాటన్ సతీమణి దుఃఖావేగ అశ్రుతప్త నయనాలతో చివ్వునలేచి నెహ్రూ పండితుని తన బాహువుతో పెనవేసుకొని నిలబడింది. ఆ దృశ్యం ఉన్నత చరిత్రాంతమునకు సంకేతం! మహాత్ముని కనిష్ట కుమారులైన దామదాస్ దేవదాస్ గాంధీలు ఇద్దరూ గంధపు చక్కలు చితిలో వేస్తున్నారు; ఎగతోస్తున్నారు. శోకవెల్లువై ముందుకు తోసుకొస్తున్న మహా జనసమూహాన్ని నిరోధించటానికి పోలీసులు లాఠీలతో సిద్ధంకావలసి వచ్చింది. ప్రజలు కన్నీరు మున్నీరుగా ఒకటే రోదన! మంచిగంధపు కమ్మని వాసనల్లోనుంచి హారతి కర్పూర దీపంవలె జ్వాలలు లేచినవి. చితి కణకణల్లో సాంధ్యకాలపు సూర్యగోళం వలె

కాన్పించినది. వైదిక మంత్ర పఠన ఉచ్చైస్స్వరంలో దశదిశలా వ్యాప్తమయినది. "మహాత్మా గాంధీ అమర్ హోగయే" అన్న ప్రజా నినాదంతో దిక్కులు పిక్కటిల్లినవి. అప్పటి కప్పుడే సుమారు పదిహేను అడుగుల ఎత్తుగా చితాగ్నిజ్వాలలు అంబరాని కెగసినవి.

మహాత్మా గాంధీ మహాప్రస్థానం సందర్భంలో నెహ్రూ శ్రద్ధాంజలి ఘటిస్తూ—"మన జీవనజ్యోతి అంతరించి పోయింది, అంతటా అంధకారమే...............ఆ అంతరించిన జ్యోతి సామాన్యమైన జ్యోతికాదు....అనేక సంవత్సరాల నుంచి ఈ దేశాన్ని తేజోవంతం చేస్తున్న ఆ దివ్యజ్యోతి ఇక ముందు కూడా ఈ దేశాన్ని తేజోవంతం చేస్తుంది. దశ శతాబ్దాల తర్వాత కూడా ఆ మహాజ్యోతి జ్వాజ్వల్యమానంగా ప్రజ్వరిల్లుతూనే వుంటుంది." అని అభిభాషించాడు.

ఆ రాత్రి ఆఖరు ఝాము వరకూ చితాగ్ని నెమ్మదిగా మండుతూనే వుంది. అదే మిగ్గిలింది; కొద్దిమంది బంధుజనం అక్కడ వున్నారు. రాగిపాత్రలో చితాభస్మం. అస్థికలు మిగిలినవి. నెహ్రూ పండితుడు మరల ప్రొద్దుటే (రాజఘాట్) వచ్చినాడు. తనలో తాను చితాభస్మరాసి ఎదుట నిలబడి ప్రార్థనచేసి, పూజాపుష్పాలు సమర్పించి—"బాపూజీ! ఇవే నా కడసారి పూజా కుసుమాలు! నీ అస్థిశకలాలకూ చితాభస్మానికీ పూజా కుసుమాలు అర్పించగలను, నేడు మాత్రమే. రేపటినుంచీ ఎక్కడ ఎవరికీ పూలు అర్పించేది—బాపూ?" అని పలికినాడు. ఆ పలుకుల్లో, ఆ వదనంలో లోకంలో శోకమంతా మూర్తీభవించినట్లు చూచినవారు వర్ణించారు.

గాంధీజీ అమరుడే. అయితే లోకానికి దూరమవుతాడా? భారతదేశంలో జాతిద్వేషాగ్నినీ, విశ్వవ్యాప్తంగా చలరేగివున్న వర్గసంక్షోభాన్నీ చల్లార్చదా ఆయన పవిత్రాత్మ? చితాభస్మాన్ని యాభై పాళ్ళుగా రాష్ట్రాలవారీగా దేశాలవారీగా పంచుకొన్నప్పుడు రెండువేల ఐదువందల సంవత్సరాలనాటి బుద్ధభగవానుని జీవితాంత గాధ స్మృతికి వస్తుంది. అస్థి అవశేషాలలో అధికభాగం ప్రయాగలో త్రివేణీసంగమ పవిత్ర తోయాలలోనే కలిపినారు. ఈ పవిత్ర క్షేత్రం నేను లోగడ దర్శించినాను. ఫిబ్రవరి 12 వ తేదీన త్రివేణీ పావనోదకాలలో అస్థినిమజ్జనం జరిగింది. (నాడుఅక్కడ) దాదాపు అర్ధకోటి ప్రజానీకం సంఘటితమై ఐక్యకంఠంతో 'హరేరామ, హరేరామ' 'గాంధీజీ అమర్ హోగయే' అనే స్తోత్ర నినాదాల మధ్య మహాత్మా గాంధీ అను మోహనదాస్ కరంచంద్ గాంధీ, భరతదేశ పిత, విశ్వ ప్రవక్త అస్థినిమజ్జనతో మహాప్రస్థాన కార్యక్రమం యావత్తూ ముగిసింది.

వాటికన్ నగర మందిరంనుంచి పోప్ పయిస్ చింతాక్రాంతుడై—"ఆధ్యాత్మిక గురుదేవుడు, ప్రజాబాంధవ్యుని భౌతిక కాయం మహాప్రస్థిత మయినందుకు దురిపిల్లుతున్నాను." అని సందేశ మంపినాడు.

ఆ సమయంలో నేను లగ్జెంబర్గులో జర్మనీ భవితవ్యం మీద, మిత్రరాజ్యాలతో అది చేసుకోవలసిన సంధిపత్రం మీద చర్చలు కొనసాగిస్తున్న జర్మనీ అఖిలపక్ష నాయకుల సమావేశంలో పాల్గొని వున్నాను. ఆ రాత్రి విందులో నా మిత్రుడూ స్పెయిన్ 'సివిల్ వార్' ఉద్యమ నేతా అయిన డాన్‌జాన్

అగ్రేసరి చెప్పిన మాటలుబట్టి మిత్రరాజ్యాలతో శాంతి సంధికి జర్మనీ క్రిష్టియన్ డెమోక్రాటిక్ పార్టీ అధినేత హేర్ ఆడినోవర్ సుముఖుడు అయినట్లు విన్నాను. తదుపరి ఫ్రాన్సు యమ్. ఆర్. పి. అధ్యక్షుడైన మారిస్ షూమన్‌తో గాంధీజీ గురించి ముచ్చటించాను.

మహాత్మునికై, శాంతిస్థాపనకై పారిస్ లండన్ నగర చర్చీలలో ప్రజలు ప్రార్థనలు జరిపినారు. "క్రీస్తువలె ఆయన జీవించినాడు. భాగవతోత్తముడై జీవించి జీవితం అర్పించినాడు. భగవానుని ఆశీస్సులు ఆయన (గాంధీజీ) మీద వర్షించుగాక!"[1]

'ది లైఫ్ డివైన్' అనే గ్రంథంలో శ్రీ అరవిందుడు ఇలా వాకొన్నాడు. ఆయన శీర్షిక ఫిట్టే తాత్త్వికుణ్ణి స్మరింపచేస్తోంది.

"యూరోపులోనూ, ఇండియాలోనూ జీవితానికి ప్రధానమైనవిగా వస్తుప్రపంచ నిరాసం, యౌగికవిషయ విరాగమూ చెప్పబడుతున్నవి. భారతవర్షంలో ఆముష్మిక చింతన, ఆత్మ చింతన నితాంతం. కానీ, ఐహిక వ్యావహారిక జీవనం దుర్భరమూ అధ్వాన్నమూ అయిపోయింది. అలాగే యూరోపులో ధన తృష్ణ, ప్రపంచాధిపత్యమూ శక్తిసముపార్జనలూ మిక్కిలిగా బలిసిపోవడంవల్ల అక్కడ ఆధ్యాత్మికశక్తి సమూలంగా దివాలా తీసింది. ద్రవ్యవాదంతో, ఐహికంతో సంతృప్తిపడి సర్వసమస్యలూ పరిష్కారం చేసుకొన్నారు పాశ్చాత్యులు."

---

1 'ఒస్సెర్వేటర్ రోమానో' 31 జనవరి 1948 నాటి వాటికన్ జర్నల్ నుండి.

మహాత్మా గాంధీ యదార్థ జీవితానుభవంలో త్యాగం చూపినాడు. యదార్థ జీవనమూ, ఐహిక జీవనమూ ఎలా ఉండవలెనో తన దీర్ఘానుభవం ద్వారా ప్రాగ్దేశాలకూ, యావత్తు ప్రపంచానికీ వ్యక్తపరచినాడు. కాని ఇంకా పాశ్చాత్యఖండం కేవల ధనోపాసన చేస్తూ, అధికార సంపాదనకే పాకులాడుతూ; కీచు లాడుతూ సర్వనాశనంకేసి పురోగమింప బోవడం చూస్తే విచార మేస్తోంది.

నా భారతయాత్ర ఇంచుమించు ముగిసింది. ఈ నా యాత్రా ఫలం ఏమిటి? నా కోరిన సమస్యా పరిష్కారం అయిందా? ఆఁ, సమస్యాపరిష్కారం అయింది. యదార్థ విశ్వశాంతి కావాలంటే మానవానీకం మహాత్మా "గాంధీజీ అడుగు జాడలు" అనుసరించట మొక్కటే గత్యంతరం. ఆయన అహింసా సిద్ధాంతం ఆత్మ విశ్వాసంతో, త్యాగనిరతితో, ధర్మబుద్ధితో కూడుకొనివున్న కఠిన సిద్ధాంతమే కాని, ప్రతి మానవునికి ఆచరణ సాధ్యమే. దానివల్ల ఆత్మసంతృప్తి, లోక శాంతీ లభ్యపడతవి.

మహాత్ముని వర్ణచిత్రాలు (నేడు) ఎన్ని సభాభవనాల్లోనో, ఎన్నెన్ని మందిరాల్లోనో, కుడ్యాలమీదనో భారతంలోనూ అఖిలాసియాలోనూ వేలాడుతున్నాయో చెప్పతరం కాదుకదా! భారత నవోదయానికి, ఆసియా జాగృతికి సంకేతం మహాత్ముని చిత్రం! ఆయన భారతవర్షానికి అఖిలాసియాకే కాక యావత్ప్రపంచానికీ ఉపదేష్ట: ఆయన భౌతికంగా మనలో నేడు లేకపోవచ్చు. ఐనా ఆయన ఆత్మోపదేశాలనే "అడుగు జాడలు" మన కెప్పుడూ సిద్ధమే! అదే చూడండి, సారనాథ

ధర్మచక్రం మళ్ళీ తిరుగుతోంది. విశ్వప్రేమకు అదే మహా సంకేతం! మహాత్ముని 'అడుగు జాడల'ను లోకం తప్పక అనుసరిస్తుం దనటానికి అదొక సంకేతం!

గాంధీజీయే అన్నారు: "భావి ప్రపంచం తప్పక అహింసాయుత సమాజం అయి తీరుతుంది. అది సుదూరమైన గమ్యంగా తోచవచ్చును, కేవలాదర్శంవలె అగుపించవచ్చును ప్రథమంలో. కాని అది అసాధ్యమైన గమ్యం కాదు మనం నేటినుంచీ కృషి కొనసాగించినట్లయితే, వ్యక్తి అహింసాయుత జీవితం గడపవచ్చును; పరిస్థితులను అనుకూలింప చేసుకోవచ్చును. అన్యులెవ్వరో వచ్చి మన స్థితిగతులను చక్కబరిచే దాకా గోళ్లు గిల్లుకొంటూ కూర్చోక వ్యక్తిగతంగానే అహింసాత్మక జీవనం గడపాలి, వ్యక్తిఅలా చేసినట్లయితే సమిష్టిగా సమాజం అహింసాత్మకం అయి తీరుతుంది. అలాగే ఒకదేశం అహింసాయుత సిద్ధాంతాన్ని ఆచరించిననాడు దేశదేశాలూ అహింసా విధానం అవలంబిస్తవి. ఉత్కృష్టమైన ఆదర్శం అలభ్యమని కొందరు పిరికిపడి తత్కార్యాచరణకే గడంగరు. ఎక్కడయినా ఆరంభంలోనే ఆదర్శం సఫలం అవుతుందా? 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' అన్న అనుభవనీయుల సుభాషితం విస్మరించ తగునా? ఆదర్శం యావత్తూ అలభ్యమనే, ఫలించదనే స్వభావం అభ్యుదయ నిరోధకం. అటువంటి అభివృద్ధి నిరోధక మనస్కులు అహింసా మార్గానికి పూర్తిగా వైదొలగి వుండడమే మంచిది........ప్రపంచంలో మానవునికి ఈశ్వర విశ్వాసం వుండాలి. ప్రాచీన కాలంకన్నా గాఢమై

అచంచలమైన విశ్వాసం ఉండడం అవసరం. ప్రపంచం ఉనికే మతైకలక్ష్యం మీద ఆధారపడి వుంది. అంటే ఈశ్వర సత్త మీదనే జగత్తు ఉనికి!"

అహింసయే ఆ మతైక మహాలక్ష్యం. ఆ అహింసా మూలక మహాశక్తే బెంగాలులో మత వైరాగ్నిని చల్లార్చింది. పంజాబు ఘోర హత్యాకాండను అరికట్టింది. జిహాదులు, శత్రులు దూయడం అహింసా ప్రభావం ముందు అణగారి పోయినవి. అలాగే ఆ మహాశక్తి అహింసా సిద్ధాంత ఆచరణముంటే ఏటం, హైడ్రోజన్ బాంబులు సహితం పనికిమాలినవిగా పాశ్చాత్యలోకం గుర్తించి మహాత్ముని "అడుగు జాడలు" అనుసరించడమే విశ్వశ్రేయో మార్గమని హెచ్చరిస్తున్నాము.

సర్ సర్వేపల్లి రాధాకృష్ణులు ఇలా రాస్తున్నారు: "మరల మరల సామాన్య మానవుల కతీతుడైన అపూర్వ వ్యక్తి పరమేశ్వరుణ్ణి ముఖాముఖి దర్శించి, పరమ ప్రయోజనం గుర్తించి ధీరుడై, ఈశ్వర ప్రణిధాన బుద్ధితో కార్యాచరణ చేస్తున్నాడు. విచలిత కల్లోల ప్రపంచంలో పరివేష్టితమై వున్న అంధకారం పటాపంచలు చేసేటందుకు ఆ మనీషి తేజస్సు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. ఆ వ్యక్తి ఆత్మీయత చిదాగ్ని సంభూతం."

గాంధీజీ చెప్పినట్లే మరొకచోట రాధాకృష్ణులు ఇలా పలికినారు: "అహింసా తత్త్వంలో నాకు అచంచల విశ్వాస మున్నది. దానిని నేను విశ్వసించినప్పుడు. నాకు శత్రువనేవా డెవడు? ఈ అమృతభావం నన్ను అతీతమైన ప్రపంచానికి

తీసుకుపోతోంది. ఈ తత్త్వంలో శత్రుత్వ భావనకు తావు లేనే లేదు. నాకు శత్రువు లేడు. నేను వాంఛించేది సత్యాహింసలు. నాకు మానవతీత శక్తు లున్నవని చెప్పను. నేనూ మానవ మాత్రుణ్ణే. అతి బలహీనులు ధరించే ఇంద్రియలోలమైన తనువే నేనూ ధరిస్తున్నాను. కాబట్టి నేను కూడా అందరి వలె దోషం ఆచరించే అవకాశం ఉంది."

భారతదేశ సంస్మరణ సందర్భంలో నా తుది స్మరణ— అనాడు మహాత్మా గాంధీ ఢిల్లీ మైదానంలో చేసిన ప్రార్థనా ప్రసంగం. ఆ దృశ్యం నా మనసు వీడదు. అద్భుతమైన దృశ్యమది. వేలాది జనం, హిందువులూ ముస్లింలూ, సిక్కులూ, క్రైస్తవులూ పిన్నా పెద్దా అందరూ వచ్చారు ఆ సభకు. ఒకేపు మొగలాయీల ఠీవీ హుందాలకూ సగర్వకారణమైనదిగా ఎర్రకోట గంభీరంగా వుంది. మరోవేపు ప్రాక్తన ఢిల్లీ కుడ్యాలూ, కాశ్మీరు గవనూ వున్నవి. ఒకానొక మసీదు గోపురం అరుణారుణమై దిక్చక్రం మీద గోచరిస్తోంది. "నన్ననుసరించు" అనే బైబిలులో గేయం ఆండ్రూస్‌తోపాటు మహాత్మా గాంధీ గానం చేసేవాడు. ఈనాడు అగీతం ఆలాపించలేదు. వేదిక మీద శ్వేతాంబరదారులూ అవకుంఠనలోనూ వున్న కొందరు కొరానులో కొన్ని చరణాలు గానం చేస్తున్నారు. వేదిక మధ్యలో మహాత్ముడు ఆసీనుడై వున్నాడు. ఆ పిమ్మట, అన్నికంఠాలు అవ్యక్త మధురిమలో కలియగా కరతాళములు వేస్తూ, క్షీణ హరిద్రాకాంతి మేఘశకలాలు భారతరాజ్యలక్ష్మి

నికేతనమైన ఢిల్లీనగరిని ఆవరిస్తూ ఉండగా, శ్రావ్యాతి శ్రావ్యంగా కొన్ని పవిత్ర గీతాశ్లోకాలు యావన్మందీ పఠించారు :—

" అద్వేష్టా సర్వ భూతానాం, మైత్రం కరుణ ఏవ చ—
నిర్మమో నిర్హంకారః, సమ దుఃఖ-సుఖ క్షమీ.
సంతుష్ట సతతం యోగీ, యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి, ర్యో మద్భక్తా స్స మే ప్రియః."
(గీత 12—13, 14)

" ఎవడు సర్వ ప్రాణులపట్ల ఈర్ష్యా రహితుడో, మిత్రుడో, దయాహృదయుడో, అనురాగ అహంకార విరక్తుడో, రమ్యారమ్య సమానుడో, క్షమావంతుడో, సంతుష్టుడో, యోగసక్తుడో, ఆత్మ సంయమముతో దృఢ నిశ్చయంతో తన బుద్ధినీ మనస్సునూ కూడా నాకోసమే తపింప చేస్తాడో ; అంకితం చేస్తాడో వాడే నా భక్తుడు ; నా కాప్యా యుడు !" అని భావం.

కలకత్తాలో నడిరేయి కావచ్చింది. డండం విమానాశ్ర యంలో వంగదేశీయ తారకల కాంతి మూగగా ఉంది, అంధ కారంగా ఉంది. విమానంలో దీపిక మాత్రం గంభీరంగా వెలుగుతోంది. ఆ దీపకాంతిలో విమానంలో గ్రీక్ అక్షరం ' ఫి ' వలె చీనా సంకేతాక్షరం కానవచ్చింది. అది ' చుంగ్‌కూ ' అని చదవాలట. నాకు చీనానుంచి ఆహ్వాన మొచ్చింది. నాన్ కింగ్‌లో కలుసుకోమని జనరలిసిమో చాంగ్—కై—షేక్ ఆహ్వా వించినాడు నన్ను.

నేను ఏ మహా సమస్యల పరిష్కారంకోసం భారత దేశాటన ప్రారంభించి అనేక విద్యా—వైజ్ఞానిక కేంద్రాలు చూసి, మహాత్ముని దర్శించిన తర్వాత ఆ సమస్యలు ఇంచుమించు పరిష్కారమైనవి. కొన్ని కాకపోయినా అవి ప్రస్తుతాలు కావు. కావలసినదాని సమాధానం చిక్కిన సంతృప్తితో విమాన మధిరోహించాను. మరికొన్ని క్షణాలకు విమానం ఆకాశాని కెగసి అతివేగంతో అస్సాం హిమాలయ పర్వతశ్రేణులు దాటి ఉషఃకాలానికి చీనా కున్ మింగ్ కు ప్రయాణించింది.



జై హింద్



ఆ వెనుక మూడురోజుల అనంతరం అంటే, జనవరి 30 తారీఖున మహాత్ముని యీ క్రింది వచనాల పరమార్థభావం ఏమిటో ప్రశ్నించి తెలుసుకుందామని నిశ్చయించు కొన్నాడు మిష్టర్ షీన్ పండితుడు. అవి 1924 నవంబరు 14 తేదీన మహాత్ముడు 'యంగ్ ఇండియాలో' వ్రాసిన వాక్యాలు—"మొదట తీవ్ర సత్యాన్వేషణమే కొనసాగించవలసినది, ఆనక శివం సుందరాలు వాటంతటవే లభ్యపడతవి.........ఆ సత్య సౌందర్యం కోసం నేను తపిస్తాను, జీవిస్తున్నాను, అందుకే చనిపోతాను." కాని మహాత్ముని సమాధానం రాలేదు.

ఆ రోజునే మానవుడు 'గాంధీజీ అడుగు జాడలు' అనుసరించాలంటే అతని ప్రాథమిక చర్యలు ఏమిటి? అని ప్రశ్నిస్తూ నేను రాసుకొన్న లేఖను గాంధీజీకి శ్రీమతి అమృత కౌర్ చూపివున్నది. దానిమీద ఆమె ఫిబ్రవరి 3 వ తేదీన ఇలా నాకు సమాధానం రాసింది: "నాకు మీరు రాసిన లేఖను 'బాపు' కు చదివి వినిపించాను. ఆయన శ్రద్ధగా ఆసక్తితో మీ లేఖంతా విన్నారు. యదార్థమైన సైనికుడు ఎక్కడ ధర్మగ్లాని వుంటుందో అక్కడ పోరాటానికి సిద్ధం కావలసిందే గాని, అంతకు తప్ప అతనికి ప్రాథమికచర్య అంటూ ఏదీ లేదని తన వచనాలు మీకు అభివందన పూర్వకంగా అందచేయ మన్నారు."

('గాంధీజీ అడుగు జాడలు' లోకం అనుసరించి అభ్యుదయం, చిరశాంతి చూరగొనేందుకు మహాత్ముని భావాలలో ఇంకా పొంచివున్న సత్యార్థాలను ఆయన ఆశ్రమవాసులూ, ఆయన భక్తులూ అయిన శ్రీమతి మీరాబెన్, ఆగాథా హారిసన్,